తెలుగులో పదకవిత :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం.

రచయిత :

డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,

ఆంధ్రోపన్యాసకులు, నాగార్జున విశ్వవిద్యాలయం,

నాగార్జుననగర్ – 522 510, గుంటూరు జిల్లా.



ప్రథమ ముద్రణ : ఆగస్టు 1983

ప్రతులు : 1000

ముఖపత్ర చిత్రణ : శ్రీ పి. నాగుల్, మంగళగిరి.

వెల : రూ. 30/-

ప్రతులకు :

శ్రీమతి ఎస్. పార్వతమ్మ,

శశి ప్రచురణలు,

సి–73, శ్రీనివాసనగర్, గుంటూరు–522 006

ముద్రణ : వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు–1. Phone : 25383

Paper has been made available by the Govt. of India at concessional rates (partly).

# విషయసూచిక

## 2.0 పదకవుల చరిత్ర 41 - 128



## 3.0 పదకవితా వైభవం. 129 - 186



## 4.0 భాషా విశేషాలు: 187 - 220

ఆచార్య తూమాటి దొణప్ప, నాగార్జున విశ్వవిద్యాలయం
పిఎచ్.డి., డి.లిట్., నాగార్జున నగర్
తెలుగుశాఖాధ్యక్షులు - కళాశాలాధ్యక్షులు ఆగస్టు 1, 1983.

# మేలిపలుకు

నృత్యసంగీతాది లలితకళలవలెనే కవితను మార్గ-దేశి విభేదాలతో విభాగించ విశ్లేషించడం విమర్శకలోకంలో మామూలు. అందులో దేశికవితా విభూతి నిబద్ధమనీ, అనిబద్ధమనీ రెండురీతులు. ఈ రెండురీతులను క్రమంగా శిష్టసాహిత్యమనీ, శిష్టేతరసాహిత్యమనీ కొందరు పెద్దలు ఉజ్జాయింపుగా వ్యవహరించడంకద్దు.

'కశ్శిష్టః' 'యోవేదవిదాన్ ।' వేదవిదులే శిష్టులని యిక్ష్వాకుల పూర్వపు నాటిమాట. 'వ్యాకరణ జ్ఞాః శిష్టాః' వ్యాకరణజ్ఞులే శిష్టులని ఒకనాటిమాట ఎవరి భాషావేషాదులు ఇతరులకు అనుకరణ యోగ్యాలవుతాయో వారు శిష్టులని యీనాటి మాట. శిష్టులు కానివారు శిష్టేతరులు. వీరిని గ్రామీణులనీ, జానపదులనీ, స్థూల దృష్టితో పరిభాషించడం పరిపాటి.

పాతకాలపు తెలుగుసాహిత్య పీఠులలో ఎదురుపడే పౌరులు - జానపదులు అన్న మాటలు కేవలం వారివారి నివాస ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని గురికి బారెడు దూరంగాచేసిన విభజనవల్ల మూర్తినందినట్టివి. జనావాసాలనుకాక, జనులభౌతిక, మానసిక ప్రవృత్తులతో ముడిపడిన జానపదుల నిసర్గస్వభావాన్ని 'జానపద' నిర్వచనానికి ముఖ్యమయిన మూలాంశంగా స్వీకరించడం శాస్త్రీయమని మా భావన.

జానపద స్వభావులయిన జనులు తమ ఆశల, ఆశయాల కనురూపంగా ఉత్సవాంకంగానో, ఉత్సాహాంకంగానో తరాలతరబడిగా, నుడుగుమీద నుడుగుగా పడుగుపేకలా అల్లుకుంటూరాగా రూపెత్తిన వాఙ్మయసర్వస్వం దేశికవితలో అనిబద్ధ రీతికి చెందుతుంది. తెలుగులోని పదకవిత నిబద్ధపద్ధతికి చేరుతుంది.

జానపదులబాణీ - భాష, భావం, ఛందస్సు, సంగీతంవగైరా-ని అనుసరిస్తూ జానపదకవితారసలోలుపులయిన వాగ్గేయకారులు నీతిభక్తి శృంగారవైరాగ్య

పారమ్యాలయిన విషయాలను ఎన్నికచేసి ధాతుమాతువులన్న చట్రంలో బిగించిన రచనావిశేషం 'పదకవిత' అని పదుగురాడుమాట.

జ్ఞానతీర్థం అనంతమూ; అగాధమూ. తీర్థికులు తమవ్యుత్పత్తినిబట్టీ, ప్రజ్ఞాసంపత్తినిబట్టీ, తత్త్వార్థప్రవృత్తినిబట్టీ యీతీర్థాన్ని బహువారాలుసేవించీ, భావించీ పృథక్ప్రకారులుగా ఆవిష్కరించడం సర్వసామాన్యం. 'వ్యాఖ్యాబుద్ధిబలాపేక్షా' అని ధీవృద్ధుల సుష్ఠునిర్ణయం.

తెలుగులో వివిధ సాహితీశాఖలకు సంబంధించిన డాక్టర్ శ్రీ రామప్పగారి గంగప్ప రచనలనేకం ఈవరకే విశేషవిదుల వాచవికెక్కిన విశేషవిధులు. పదకవితా సమీక్షాక్షేత్రంలో చాలాకాలంగా పరిశ్రమిస్తున్న వ్యవసాయికులలో డాక్టర్ గంగప్ప మొదటి మునుముకు చెందినవ్యక్తి.

చేపట్టిన విషయంపట్ల ఈ రచయితకుగల అవగాహనా, శాస్త్రీయవివేచనా, సాంకేతిక సంయోజనా ప్రస్తుతరచనలో పదేపదే ప్రస్ఫుటమవుతున్నాయి. విశిష్య, యీకృతి సాహిత్యఅకాడమీ వారి బహూకృతికి పాత్రమయింది. 'కర్షేఫలీ' అని నమ్మి ఆరుగాలమూ పాటుపడుతున్న యీకృషి పండితుని పంట 'బహుజన హితాయ – బహుజనసుఖాయ' అన్నట్లు ఉపకరించగలదని మా నమ్మిక.

(సం) తూమాటి దోణప్ప

ఆచార్య జి. ఎన్. రెడ్డి,
ఎం. ఏ, ఎం. లిట్., పిహెచ్. డి,
తెలుగు అధ్యయనశాఖ,

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి – 517502
10.8.1983.

# అభినందన

ప్రపంచంలో భాషలేని మానవ సమాజంలేదు భాషఉన్నపుడు సాహిత్యం ఏదో ఒకరూపంలో ఉండకతప్పదు కాబట్టి సాహిత్యంలేని భాషాసమాజం కూడ ఉండదు. అయితే మానవభాషల్ని సామాన్యదృష్టితో నాగరికభాషలని, అనాగరిక భాషలని వేరుచేసి చెప్పడం కద్దు. నాగరికభాషలంటే లిపి, గ్రంథరచనా సంప్రదాయం గల భాషలని, అనాగరిక భాషలకు అవి ఉండవని ఈవర్గీకరణలోని తాత్పర్యం. నాగరికత మాటకొస్తే కొన్ని విషయాల్లో అనాగరికులకులనబడే ఆటవిక జాతులవారే నాగరికులకన్నా నయం. అందువల్ల లిపిని ప్రధానంగాగ్రహించి భాషల్ని నాగరిక, అనాగరిక భేదంతో పేర్కొనడం సమంజసంకాదు

లిపిగల భాషావ్యవహర్తల్లో అక్షరాస్యతకు అవకాశంఉంటుంది. అదిలేని భాషాసమాజంలో అక్షరాస్యత ఉండదు. కాబట్టి భాషల్ని నాగరిక అనాగరిక భాషలని వేరుచేసి వ్యవహరించడంకన్న అక్షరభాషలు, నిరక్షరభాషలు అని పేర్కొనడం సమంజసం, సముచితం. ఈనాటికీ ప్రపంచంలో లిపిగల భాషలకన్న, లిపిలేని భాషల సంఖ్యే అధికం.

భాషలేని మానవసమాజం లేనట్లే, సాహిత్యంలేని సమాజాలుగాని, నిరక్షరభాషా సమాజాలుగాని, లోకంలోలేవు. అయితే సామాజికమైన ఆర్థికవ్యవస్థను ప్రజా జీవన విధానాన్నిబట్టి ఆయాభాషల్లోని సాహిత్యస్వరూపంలో, ప్రయోజనంలో భేదం కన్పిస్తుంది. సాహిత్యమంటే ఇతివృత్త సంభరితమైన గద్య, పద్య, నాటకాదిరచనలే అని భ్రమపడరాదు. నిరక్షరసమాజాల్లోని పాటలు, గేయాలు, ఆశుకథలు మొదలైనవికూడా ఆసమాజపు సాహిత్యమౌతుంది. నిజానికి భారతదేశంలో నిరక్షర ఆటవిక సమాజాలు వందలకొలది ఉన్నాయి. ఆ సమాజాల భాషలనుగురించి, కొందరు కొంతపరిశోధన గావించినారేగాని, ఆ భాషల్లోని సంగీత, సాహిత్యాల పరిశీలనకు పూనుకోలేదు. భారతదేశంలోని నిరక్షరాస్యులైన ఆటవికజాతులు అనాది

ప్రజలు. అందువల్ల ప్రాచీనమైన భారతీయ నాగరికభాష సాహిత్యాలలో అనాది ఆటవికజాతులకు సంబంధించిన నాగరికత, సంస్కృతి, సంగీతం, సాహిత్యం, మొదలైనవాటి లక్షణాలుఉండాలి. ఉన్నాయికూడా. పరిశోధకుల్ని ఆహ్వానిస్తున్న క్షేత్రమిది.

నాగరికభాషలనబడే అక్షరభాషా సమాజంలోగూడా అందరూ అక్షరాస్యులుకారు. గతయుగాల్లో అక్షరాస్యతఅతిస్వల్పం ఏనాగరిక భాషా సమాజంలో నైన, నిరక్షరాస్యులే ఎక్కువగా ఉండేవారు. మనదేశంలోని ప్రతిభాషా సమాజంలోను, నిరక్షరాస్యులసంఖ్యే ఈనాటికీ ఎక్కువ ఈసమాజాల్లోగూడ సాహిత్యం నిరక్షరదశలోనే పుట్టింది. అది మౌఖికం, అప్రయత్నసంభవం. ఆ భాషకు అక్షర దశ సిద్ధించినపుడు అక్షరాస్యులు సృష్టించిన సాహిత్యానికి తత్పూర్వపు నిరక్షర సాహిత్యమే ప్రధానాధారం. అక్షరకుక్షులు సృష్టించిన సాహిత్యం లిఖితం, ప్రయత్న పూర్వకం. అయితే ఈనాటికి గ్రంథరచన సాగుతున్న, అక్షరసమాజాల్లోగూడా నిరక్షరాస్యులసంఖ్య అధికంగా ఉండడంవల్ల, అక్షరాస్యుల లిఖితసాహిత్యంతోపాటు, నిరక్షరాస్యుల మౌఖికసాహిత్యంగూడా సహజీవనం చేస్తుంది మొదటిదాన్ని శిష్ట సాహిత్యమని, రెండవదాన్ని జానపద సాహిత్యమని మనం వ్యవహరించు కొంటున్నాం. నిజానికి జానపద, శిష్టసాహిత్యాలు పూర్వాపరక్రమంలో వెలసినవే. జానపద సాహిత్యలక్షణాలు శిష్ట సాహిత్యంలోఉన్నట్లు, శిష్టసాహిత్య లక్షణాలు జానపద సాహిత్యంలో ఉండకపోవచ్చు.

ఇటీవల అన్నిదేశాల్లో జానపద సాహిత్యపరిశీలనమీద సాహిత్యప్రియు లకు, పరిశోధకులకు మోజు హెచ్చింది. విశ్వవిద్యాలయాల్లోగూడా జానపదవిజ్ఞానానికి, జానపదసాహిత్యానికి ఇతరవిద్యలతోబాటు బంతికూడు—అంటే సహపంక్తి భోజన గౌరవం— లభించింది.

తెలుగు జానపద వాఙ్మయోద్ధారకుడుగా, పరిశోధకుడుగా సముచిత పరిశ్రమజేసి తెలుగునాట పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్న సాహిత్య మిత్రులు డా॥ గంగప్పగారు. పఠనపాఠ ప్రవచనాలతోపాటు రచనాదీక్షగల అధ్యాపకులు గంగప్ప బహుగ్రంథకర్త; విరామాన్ని పాటించని రచయిత.

తెలుగులో శిష్టసాహిత్యమని, జానపదసాహిత్యమని వేరుచేసి, విడివిడిగా కొందరు పరిశోధిస్తున్నారు. అయితే ఈరెండింటికీ వారధిలాంటిది ఒకటున్నది అదే పదకవిత. సంగీత, సాహిత్యాలకు కూడా అదొకసేతువు. వాగ్గేయకారులు మన కందించిన మహాసంపద పదకవిత. జానపదసాహిత్యమే పదకవితకు పుట్టిల్లు. శిష్ట సాహిత్యం మెట్టినిల్లు. ఇది ప్రధానంగా పదకవితలోని విశిష్టత. తెలుగులో శిష్ట,జానపదమనే రెండుసాహిత్య సంప్రదాయాలకు, కళల్లో సంగీత సాహిత్యాలనే రెండు లలితకళలకు సంబంధించి ఉభయమిత్రంగా, ఉభయకారకంగావున్న పదకవితా స్వరూపచరిత్రను తత్వాన్ని చక్కగాతేల్చే విమర్శగ్రంథాలు లేవు. ఈ లోపాన్ని గుర్తించి సాహిత్యఅకాడమీ నిర్వహించిన గ్రంథరచనపోటీలో నెగ్గిన రచన గంగప్పగారి "తెలుగులో పదకవిత"—తెలుగుపదకవితను ప్రమాణబుద్ధితో పరిశీలించి, పసందుగా నిర్వహించిన రచనఇది.

డా॥ గంగప్పగారి రచనలో చక్కని విషయవిశ్లేషణ, సముచితమైన ఆకరాల ప్రదర్శన, సరళమైనశైలి, పాఠకుల మెప్పుపొందే నూతనాంశాలకూర్పు ఉండడం ప్రశంసనీయం. ఈ గ్రంథరచనవల్ల గంగప్పగారిక్కి పదకవితా విమర్శకులలో అగ్రస్థానం కలగడం ఒకవిశేషం. అందువల్ల ఉత్తమ విమర్శకుడుగా, రచయితగా ఎదిగినట్టి సాహిత్యమిత్రుడు డా॥ గంగప్పను మనసారా అభినందిస్తున్నాను. విశ్వవిద్యాలయాల్లోని యువపరిశోధకుల్ని తెలుగు జానపదరంగంలోకి, ముఖ్యంగా పదకవితాశాఖలోకి ఆకర్షించగల చోదకగుణం గంగప్పగారి గ్రంథంలో ఉండడం గుర్తింపదగ్గ విషయం.

(సం) జి. యన్. రెడ్డి

ఆచార్య బి. రామరాజు,
ఎం. ఏ., పిహెచ్. డి.,
తెలుగు శాఖాధ్యక్షులు,

ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాద్ - 500007
27.7 1983

# ఆమోదం

తెలుగులో పద్యకవిత్వంవలెనే పదకవిత్వంకూడా చాలా ఉంది. నిజం విచారిస్తే పద్యకవిత్వానికంటె పదకవిత్వానికే సామాన్యులలో ఆదరం ఎక్కువ. పోతే పండితలోకంలో దీనికి సరియైనమన్నన లేనందువలన చాలాభాగం కాల గర్భంలో కలిసిపోయింది. దానితో మన దేశీయతాముద్రఉన్న గొప్ప సాహిత్యం మనం చాలా కోల్పోయినాము. ఉత్తమశ్రేణికి చెందిన కొందరి పదకవిత్వమూ, మహాభక్తులూ, గాయక శిఖామణులూ ఐన వారి పదకవిత్వమూ కొంతైనా పండితుల ఆదరణకూ, పాలకుల ఆదరణకూ పాత్రం కావటంచేత సంగీతమూలంగా కొంత, సాహిత్యమూలంగా కొంత పదకవిత్వం నేటికీ బ్రతికిఉంది కాని చాలాభాగం భక్తులవద్ద, భజనకూటాలవాళ్ళవద్ద, భిక్షుకులవద్ద, మేళాలవారివద్ద కొనఊపిరిలో ఉంది. అముద్రితంగా చాలా పదకవిత్వం తాళపత్ర ప్రతులలోను, పాతకాలపు కాగితప్రతు లోనుఉంది తంజావూరు, మధురరాజ్యాలకాలంలో పుట్టిన పదకవితలు, స్వదేశ సంస్థానాధీశుల ప్రోత్సాహంతో వెలువడిన పదకవితలు తాళపత్రగ్రంథాల్లో చాలా ఉన్నవి.

ఒకప్పుడు నావద్ద నూర్లకొది తాళపత్రగ్రంథాలు ఉండేవి. వాటిలో కొన్ని వేలపదాలు చూచినాను. పద్యప్రబంధాలలోను ఇతర శాస్త్రగ్రంథాలలోను కన్నాకుల మీదగాని, విడితాటాకులమీదగాని ఏవోపదాలు, కీర్తనలు, జావళీలుఉండేవి ఇటువంటి వాఙ్మయమంతా ప్రోగుచేస్తే బండ్లకెత్తవచ్చు. పోయినది పోగా మిగిలిందికూడా చాలానేఉంది. తాళ్ళపాక కవులు, రామదాసు, క్షేత్రయ్య, సారంగపాణి వంటివారి పద కవితలగూర్చి కొంత పరిశ్రమ పరిశోధనలుజరిగినవి. కాని అంటకముట్టకఉన్న పదసాహిత్యం ఇంకా చాలాఉన్నది ఈ పదకవితల వైశిష్ట్యం చాటటానికి వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, విస్సా అప్పారావు, భమిడిపాటి కామే శ్వరరావు, బాలాంత్రపు రజనీకాంతరావు, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, పుట్టపర్తి నారాయణాచార్యులు, నిడుదవోలు వెంకటరావు, ఆరుద్ర, వేటూరి ఆనందమూర్తి, గౌరి పెద్దిరామసుబ్బశర్మ వంటి పండితులు చాలా పరిశ్రమించినారు.

ప్రస్తుతం డాక్టర్ గంగప్పగారు కూడ ఈ అనాదృతవాఙ్మయాన్ని వెలుగులోనికి తేవటానికి కృషిచేస్తున్నందుకు వారు అభినంద్యులు. ఇంతకుపూర్వం ఈ రంగంలో వెలువడిన గ్రంథాల పరిధి ప్రయోజనంకంటె గంగప్పగారి ఈ రచన ఒక థీసిస్‌వలె ఉంది. గంగప్పగారు ఇందులోని వివిధ ప్రకరణాలలో పదకవితల ఆవిర్భావ వికాసాలు, పదకవులచరిత్ర, పదకవితా వైభవం, భాషావిశేషాలు, పదకవితలలోని వస్తువురసం మొదలైన విశేషాలతో ఒక సమగ్రత్వం సంపాదించినారు. ఇందులోని విషయ వైవిధ్యమూ, వింగడింపూ, విన్యాసమూ అన్ని ఒక ప్రణాళిక ప్రకారంగా ఉన్నాయి.

డా॥ గంగప్పగారు నిరంతరం సాహిత్య వ్యాసంగం, పరిశోధనచేస్తునే ఉంటారు. ఆయన సాహిత్యవ్రతం ఇట్లాగే కొనసాగవలెననీ పరాత్పరుడు ఆయనకు తగిన అవకాశాలు ప్రసాదించవలెననీ కోరుతున్నాను.

(సం) బి. రామరాజు

*Prof.* **D. V. K. RAGHAVACHARYULU,**
*M.A., Ph.D. (Andhra), Ph.D. (Penn).,*
Professor and Head, Dept. of English.

**Nagarjuna University,**
*Nagarjunanagar.*
8-8-1983

*CONGRATULATIONS*

The Pada literature in Telugu is a unique blend of the formal and folk traditions, often providing a mediating creative ground accessible to both the Marga and Desi modalities, and expressive of a wide range of themes and emotions stretching from the profane to the sacred and the secular to the religious. The Pada is a mechanism of sensibility which can absorb music, dance, oral nasrative, prayer, meditation and literary into a single frame of aesthetic reference and is also distinguished by the immediacy of response it can generate in the public audience to which it is addressed. From its original demotic and folk base it has developed over the centuries into a highly complex and sophisticated form competing with other lyric modes in the literary tradition. It has been a natural vehicle of communal art and humane literacy as well as a force for social change and continuity.

Dr. Gangappa has done well to turn his critical gifts to good purpose by presenting this rich Pada tradition in Telugu in its historical and evolutionary contexts, its fascinating taxonomy, in its many sided efflorescence of individual talent, in its fascinating verbal iconography, and in its social, cultural, linguistic and aesthetic values. Annamacharya, Tyagaraja, Kshetrajna, Sarangapani, Ramadas and Balamurali have all made significant and abiding contributions to the tradition and their work has been analysed and expounded with understanding, sensitivity and erudition. Dr. Gangappa, in this undertaking of a labour of love over the years, has done nothing short of salvaging the Pada Tradition from the quackery of uninformed criticism and providing it a viable and objective model of critical explication without denying it the attention of scholarly courtesy and authentic response. I have pleasure in congratulating Dr. Gangappa on his splendid contribution.

*(Sd.)* D. V. K. RAGHAVACHARYULU.

'నాదసుధార్ణవ'
శ్రీ అన్నవరపు రామస్వామి,
వాయులీన విద్వాంసులు,
ఆకాశవాణి,

శ్రీ రామకృష్ణ సదనం
సూర్యారావుపేట,
విజయవాడ — 520002
18-8-1983.

# అభినందనలు

తెలుగు వాగ్గేయకారుల గురించిన గ్రంథాలు ఎన్నో లేవు. కీ. శే. సుబ్బ రామదీక్షితులు, కీ. శే. ఆచార్య పి. సాంబమూర్తిగారు, కళాప్రపూర్ణ శ్రీబాలాంత్రపు రజనీకాంతరావుగారు మొదలైన పెద్దలు ఈ విషయమై కృషిచేసిన వారిలో పేర్కొన దగిన మహనీయులు.

ప్రస్తుతం 'తెలుగులో పదకవిత' అనే గ్రంథాన్ని సవిమర్శకంగా రచించి, ప్రకటించిన డా. ఎస్. గంగప్పగారు మన ప్రశంసకు పాత్రులు. వారు బహు గ్రంథకర్తలు కోలాచలం శ్రీనివాసరావు నాటకాలనుగూర్చి పరిశోధనచేసి పిహెచ్.డి. పట్టా పొందారు. వారి 'క్షేత్రయ్య పద సాహిత్యం' అనే గ్రంథం 1972-73సం లో ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ అవార్డుపొందింది. 'సారంగపాణి పదసాహిత్యం' అనే గ్రంథాన్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థికసహాయంతో ప్రకటించారు. హైద్రాబాద్ యువభారతి సంస్థవారు వీరి 'తెలుగువాగ్గేయకారులు' అనే గ్రంథాన్ని ఈమధ్యనే ప్రచురించారు. ఇంకా వీరు స్పృశించని సాహిత్య ప్రక్రియ లేదనుకొంటాను.

'తెలుగులో పదకవిత' అనే డా॥ గంగప్పగారి గ్రంథానికి రెండవసారి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు రావడం ఎంతైనా ముదావహం. డా॥ గంగప్ప అభినందనీయులు.

ఈ గ్రంథంలో గంగప్పగారు తెలుగులో పదకవిత ఆవిర్భావవికాసాలు, పదకవులచరిత్ర, పదకవితావైభవం, భాషావిశేషాలు, భక్తి, మధురభక్తి, శృంగారం, నీతి, వైరాగ్యాలు, సంగీతం, అభినయం, పదకవులసేవ — అనే విషయాలను సప్త ప్రకరణాల్లో సముచితరీతిని, తమ పరిశోధనాత్మకశక్తిని, సూక్ష్మపరిశీలనను ప్రక

టించి, ఈ రంగానికి సంబంధించిన ఉత్తమగ్రంథాన్ని అందించారు. ధాతుమాతువులకు అంటే సంగీతసాహిత్యాలకున్న ప్రాముఖ్యాన్ని చక్కగా, లలితంగా వర్ణించడం మాబోంట్లకు ఆనందదాయకం.

ఇలాంటి 'తెలుగులో పదకవిత' అనే ఉత్తమగ్రంథాన్ని, సంగీతవేత్త, సాహిత్యాభినివేశం గలవారు, సహృదయులు, బహుచమత్కారి అయిన మామిత్రులు శ్రీ కేశవులుగారు (రిటైర్డు అసిస్టెంటు ట్రాన్సుపోర్టు కమీషనర్), వీరి సద్గుణాలకు దోహదంచేసిన వీరి సతీమణి శ్రీమతి తాయారమ్మ దంపతులకు, డా॥ గంగప్పగారు అంకితం ఇవ్వడం మరీ మెచ్చుకోదగ్గ విషయం.

డా॥ గంగప్పగారు మరిన్ని ఉత్తమగ్రంథాలు రచించి తెలుగుజాతి ఖ్యాతిని తెలుగుసంస్కృతిని నిలబెట్టగలరని అభినందిస్తున్నాను.

(సం) అన్నవరపు రామస్వామి

# అంకితం



శ్రీ సి. కేశవులుగారు　　　　శ్రీమతి తాయారమ్మగారు

సీ. సంగీతగీతాల సమముగా నెరిగిన
　　సంపూర్ణ విజ్ఞాన సారమతులు,
సాహితీ క్షేత్రాన సరసహాస్య కలిత
　　సంభాషణాపూర్వ చతురమతులు,
బహుజన హితమును, బహుజన సుఖమును
　　తలచి, చేసిన బహుధర్మపనులు,
నిర్మలమనసును, నిష్కళంకహృదయ
　　కారుణ్యము చిలుకగాను వరలు,

తే. గీ. బావ! కేశవ నామ విభ్రాజిత వర!
　　అర్ధ్వారాలు తాయారమ్మ అక్కగారు!
　　తెలుగులో పదకవితా శోధిత ఫలితము
　　అందుకొను డంకితమ్ము విఖ్యాతిగలుగ!

డా॥ ఎస్. గంగప్ప

# కృతజ్ఞతలు

నన్ను యథారీతిని ఈ ఉత్తమ గ్రంథరచనకు ప్రోత్సహించి 'మేలిపలుకు' పలికిన నామీద అవ్యాజానురాగం గల పూజ్యులు ఆచార్య తూమాటి దోణప్పగారికీ,

నా పరిశోధనా సమయంనుంచి సదా హెచ్చరిస్తూ, ప్రోత్సాహమిచ్చి, 'అభినందన' తెలిపి, నామీద అత్యంత వాత్సల్యంగలిగిన పూజ్యులు ఆచార్య జి.ఎన్. రెడ్డిగారికీ,

నా గ్రంథాన్ని ఆసాంతం పరిశీలించి, సెబాసని మెచ్చుకొని, అడిగిందే తడవుగా తమ 'ఆమోదం' అందించిన పూజ్యులు ఆచార్య బిరుదురాజు రామ రాజుగారికీ,

నా నిరంతర సాహిత్య వ్యవసాయానికీ, తత్ఫలితాలకీ, నన్ను మెచ్చి ఆంగ్లంలో 'అభినందనలు' (Congratulations) తెలిపిన పూజ్యులు ఆచార్య డి.వి.కె. రాఘవాచార్యులు గారికీ,

అడిగిందేతడవుగా నన్ను అభినందించిన 'నాదసుధార్ణవ' బిరుదాంకితులైన మాన్యులు శ్రీ అన్నవరపు రామస్వామిగారికీ,

నామీది వాత్సల్యంతో నన్ను గౌరవించడానికే నా కృషిఫలితమైన "తెలుగులో పదకవిత"ను అంకితంగొన్న బావగారు పూజ్యులు శ్రీ సి. కేశవులుగారు, అక్కగారు శ్రీమతి తాయారమ్మ దంపతులకూ,

నా పరిశోధనలో ఎల్లవేళలా కంటికిరెప్పలా కాచుకొని, నాకు కొండంత అండగా నిలిచి సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి ఎస్. పార్వతమ్మకూ,

నాకృషినిమెచ్చి, నా గ్రంథాన్ని అత్యుత్తమమైనదిగాఎంచి అవార్డునొసగిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సంస్థకూ,

కీ.శే. సుబ్బారామదీక్షితులు, కీ.శే. ప్రొఫెసర్ పి. సాంబమూర్తిగారు, కళాప్రపూర్ణ శ్రీబాలాంత్రపురజనీకాంతరావు గారి గ్రంథాలు నా యీరచనకు ఎంతగానో ఉపకరించాయి. వారికందరికీ —

నా కృతజ్ఞతలు !

శుద్ధప్రతి తయారుచేసిన వర్ధిష్ణువులు శ్రీ గుమ్మా సాంబశివరావు (పరిశోధకవిద్యార్థి), శ్రీ కె. సత్యనారాయణప్రసాద్, (పరిశోధకవిద్యార్థి), శ్రీ గరికపాటి నాగేశ్వరరావు (పూర్వవిద్యార్థి)లకూ,

ముచ్చటగా ముఖపత్ర చిత్రణచేసి, బ్లాకులతయారీ, ముఖపత్రముద్రణలో సహకరించిన మిత్రులు శ్రీ పి. నాగుల్, (నాగుల్ఆర్ట్స్, మంగళగిరి)కీ,

ముద్దుగా ముద్రించిన వైష్ణవి ప్రింటర్స్ అధిపతి మిత్రులు శ్రీ భవిరిసెట్టి రాజేంద్రప్రసాద్‌కీ—

నా అభినందనలు.

డా॥ ఎస్ గంగప్ప

# ప్రస్తావన

0.1 పదసాహిత్యమన్నా, జానపదసాహిత్యమన్నా నాకు పక్కువ ఎక్కువ. కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాలను గూర్చి పరిశోధించి డాక్టరేటు పట్టాను పొందినా, సంప్రదాయసాహిత్యాన్ని గూర్చి అనేకవ్యాసాలు, గ్రంథాలు రచించినా ఈ పదసాహిత్యంపై గల మొగ్గు తగ్గలేదు. అనేక జానపదగేయాల్ని సేకరించి పలుపత్రికల్లో ఎన్నో వ్యాసాలు ప్రకటించాను. పదసాహిత్యంపై ప్రత్యేకకృషి సల్పనారంభించాను. తత్ఫలితమే క్షేత్రయ్య పదసాహిత్యం, సారంగపాణి పదసాహిత్యం, ప్రస్తుతం 'తెలుగులో పదకవిత' అనే గ్రంథాలు. ఇంతేగాక వైయక్తిక పరిశోధనకై ఈనాడు 'అన్నమాచార్య సంకీర్తనలు – ఇతర వాగ్గేయకారులు : తులనాత్మక అధ్యయనం' అనే అంశం చేబట్టాను. నాయీ కృషినిమెచ్చి భారతప్రభుత్వం సాంస్కృతిక వ్యవహారాలశాఖవారు సీనియర్ ఫెలోషిప్పును అనుగ్రహించారు. నాయీ పరిశోధన అప్పుడే ప్రారంభించాను. నాయీ గ్రంథంమూలంగా పదకవితా రంగంలో ఎన్నో అజ్ఞాతాంశాలు బయల్పడగలవనీ, అవి దేశ సమైక్యానికి దోహదం చేయగలవనీ విశ్వసిస్తున్నాను.

0.2 నిరంతరం కొనసాగిస్తున్న నా పరిశోధనాత్మకకృషిలో భాగమే నాయీ 'తెలుగులో పదకవిత' అనే సవివరణ, విమర్శనాత్మకగ్రంథం. ఇందలి విషయం అనంతం. అయినా సాధ్యమైనంతవరకు సహృదయ హృదయాలను సంతోషపెట్టేలా ప్రయత్నించాను.

0.3 సంగీతంలో సప్తస్వరాల్లా నాయీ గ్రంథం సప్తప్రకరణాలతో విరచితం. మొదటిప్రకరణం పదకవితావిర్భావ వికాసాలను వివరిస్తుంది. రెండో ప్రకరణంలో పదకవులచరిత్ర యుగ విభజనాత్మకంగా సహేతుకంగా విశదీకరించడం జరిగింది. మూడో ప్రకరణంలో పదకవుల కవితావైభవ వివరణముంది. నాల్గో ప్రకరణం పదకవుల భాషావిశేషాల్ని స్థాలీపులాక న్యాయంగా తెలుపుతుంది. ఐదో ప్రకరణం పదకవుల శృంగారం, భక్తి, మధురభక్తి, నీతి, వైరాగ్యాలను వివరిస్తుంది.

ఆరో ప్రకరణంలో పదకవుల సంగీతాభినయాలగూర్చి క్లుప్తంగా చెప్పడం జరిగింది. ఉపసంహారమే ఏడో ప్రకరణం.

0.4 పాఠక, పరిశోధకుల ప్రయోజనార్థం సూచికలు (Foot Notes) ఆయాప్రకరణాల అంతంలో ఇవ్వడం జరిగింది.

0.5 ఉపయుక్తగ్రంథాలు గ్రంథాంతంలో చేర్చాను.

0.6 తప్పనిసరిఅయిన కొన్నిసవరణలు చిట్టచివరిపుటలో ఉన్నాయి.

0.7 నాయీ కృషి సహృదయహృదయాలను అలరిస్తుందని, ఉపకరిస్తుందని ఆశిస్తున్నాను. ఆకాంక్షిస్తున్నాను. అలాజరిగితే నాకృషి సఫలమైనట్లు భావిస్తాను.

డా॥ ఎస్. గంగప్ప

# 1.0 పదకవిత - ఆవిర్భావ వికాసాలు

"మహి మున్ తాళ్ళపాక ధాత స్వీకరింపన్, క్షేత్రకామేశు ద
మ్మహనీయ స్థితి మూలమై నిలుప, శ్యామాత్రాత బ్రోవన్, మహా
మహులై గోపన, త్యాగయోగులు భజింపన్, సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రీ పద గేయ సుందరతర ప్రాగల్భ్య మూహించెదన్".

— కళాప్రపూర్ణ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.

తెలుగు సాహిత్యంలో పద కవితకు ఒక ప్రత్యేక స్థానముంది. పద్య కవిత పండితైక పరిమితం. పద కవిత పలుపురు పామర ప్రజల పరవశత్వానికి హేతువు. ఇలాంటి పద రచనగావించిన పదకర్తలను, పదకవితా వైభవాన్ని గూర్చి తెలుసుకొనేముందు - పదమంటే ఏమిటి ? పదకర్త అంటే వాగ్గేయకారుని లక్షణాలేమిటి ? ఈ పద కవిత్వపు పుట్టు పూర్వోత్తరాలేమిటి ? మొదలైన విష యాల్ని అవగాహన చేసుకోవడం ఎంతైనా అవసరం. ఈ అవగాహన నేపథ్యంగా ఉండి తరువాత అనుశీలనకు అనేక రీతుల ఉపకరిస్తుందని వేరే చెప్ప నక్కర్లేదు.

"ముదివిటులు విధవలంజలు
పద కవితలు మారు బాస బాపనవారల్
చదువని పండిత వర్యులు
కదనాస్థిర వీర వరులు కడిది పురమునన్"

—ఇది శ్రీనాథుని చాటువని ప్రతీతి. కాని విశ్వసనీయంకాదు. శ్రీనాథుడు ఒక ప్రక్క ఉద్దండ పండిత ప్రశంసా పాత్రమైన శృంగార నైషధాది కృతులకు కర్త అయినట్లే, మరోప్రక్క పామర ప్రజల మన్ననలకు పాత్రమైన పల్నాటి వీర చరిత్ర, కాటమరాజు కథలను రచించి ఉండడం సర్వపండిత లోకానికీ సువిదితమే.

పరంపరగా పండితపద్యాలు పద కవితలకు ప్రాధాన్యం ఇవ్వలేదన్న మాటమాత్రం అక్షరసత్యం.

సంస్కృత సమాస భూయిష్ఠమైన శబ్దాడంబరసంయుతమైంది పండితుల భాష. సరళమూ, సులలితమూ, సులభగ్రాహ్యమూ అయినది పామర భాష. దీన్నే మనం లక్షణానుగుణంగా మరోవిధంగా చెప్పవచ్చు. గ్రాంథిక భాష, గ్రామ్యభాష అనవచ్చు. కానీ ఈ గ్రాంథిక భాషకంటే గ్రామ్యభాషే మొదటిదన్న సంగతి మనం మరవకూడదు. పామరులు వాడుకచేస్తూన్న గ్రామ్యభాష కాలాంతరంలో సంస్కరించబడి, వ్యాకరించబడి, లక్షణబద్ధమై గ్రాంథికభాష అయింది. అంటే పండిత భాష అయింది. "ప్రయోగ శరణం వ్యాకరణమ్" సూత్రమే దీనికి చక్కటి నిదర్శనం.

ఇదే రీతిని కవితావిషయంలోను మనం చూడగలం తెలుగు సాహిత్యాన్నంతటినీ పండితసాహిత్యమూ, పామర సాహిత్యమూ అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు; దీన్నే ప్రౌఢసాహిత్యమూ, జానపద సాహిత్యమూ అని పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్టసాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ అని చెప్పటం సముచితం. ఈ శిష్టసాహిత్యం కంటే శిష్టేతరసాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి వికాసం పొందింది. ఆ వెనుకే శిష్టసాహిత్యం ఉద్భవించి తన బలాన్నీ, ప్రాభవాన్నీ స్థిరపరచుకొంది. నిజమే ! 'ముందొచ్చిన చెవులకంటే వెనుకొచ్చిన కొమ్ములు వాడి' అన్న సామెత ఉందిగదా ! అనాదిగా వస్తూన్న సహజమూ, స్వాభావికమూ, నిసర్గ మనోజ్ఞమూ అయిన జానపదకవితను మనపూర్వులు సేకరించి కాపాడలేదు. రాజాదరణకు పాత్రమైన శిష్టసాహిత్యం అధికారం చలాయిస్తూ వచ్చింది. జానపద సాహిత్యమంతా ఆడి, పాడుకోటానికి ఉపకరించే పదకవితలు. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్టసాహిత్యమంతా పద్యకవితలు. జానపద సాహిత్యం ఒకప్రక్క, పండిత సాహిత్యం మరోప్రక్క తమదారిన తామే కొనసాగుతూ వచ్చాయి. ఇంకా మనం ఈ విషయాన్ని ఇలా వివరించవచ్చు. తెలుగు సాహిత్యపు మాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తూవచ్చింది. మొదటిది కేవలం జానపదకవిత. దాని పుట్టుక అనాది, లిఖితంకాలేదు. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపదకవిత. దీనికి మళ్ళీ జానపదుల వ్యాప్తిలోనున్న ఏలలు, జోలలు

మొదలైన పదరూపాలే ఆధారం. కాకపోతే ద్విపదని మాత్రం ఇతడు గ్రహించాడు గ్రహించడమేకాదు, దానికి కావ్యభాషాప్రతిపత్తిని తెచ్చాడు. అంటే పండితులు గౌరవించేట్టుచేశాడు.

"తేటతెనుంగున ద్విపద రచింతు

.... .... ....

ఒప్పదు ద్విపద గావ్యోక్తి నా వలవ
దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వ సామాన్యంబు గామి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకు
నట్టలుగాక కావ్యప్రౌఢి పేర్మి
నెట్టణ రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్య పద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ భావింప....

.... ... ....

వరకవు ల్గానియాడ వర్ణనకెక్క
ధరఁజెప్ప గృతియు నుద్యత్కృతిగాక"1

—అని చెప్పడమేగాదు. ఆనాటి పండిత లోకంలో తెలుగు పలుకులంటే గౌరవాదరాలు లేవని తెలుస్తూంది. ఆ పండితుల్ని ఒప్పించడానికి పాల్కురికి పాటుబడినట్లు స్పష్టమవుతుంది.

"ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై బరగిన జానుఁదెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ

> తెలుఁగు మాట లనంగవలదు; వేదముల
> కొలదియకాఁ జూడు డిల నెట్టులనినఁ
> బాటి మామునకును బాటియౌనేని
> బాటింప నోలయుఁ బాటియకాదె"[2]—

—'తెలుగు మాటలనంగవలదు, వేదముల కొలదియ కాఁజూడుడు' అని పాల్కురికి పట్టుపట్టి ఒప్పించాడు. అందుకే ఆ తర్వాత తెలుగు సాహిత్యంలో ద్విపద రచనలకు అత్యంతాదరం లభించింది. ఒక శాఖగా శోభాయమానంగా వెలుగుతూ వచ్చింది. ఇక మూడోది తాళ్ళపాక అన్నమాచార్యునితో ఆరంభమైన సంకీర్తన కవిత. ఇది తెలుగులోని పదకవిత. అనాదినుంచి వస్తూ ఆనాటి సామాన్య ప్రజలలో ప్రచారంలో ఉన్న జానపద గేయరీతుల్ని గ్రహించి అనేక పదకవితల్ని, శిష్టకవితలో ఒకభాగంగా వెలయించి, పద్యకవితా పీఠం పక్కనే పదకవితకు సైతం సరిపీఠం వేసిన ఘనత అన్నమాచార్యునికి దక్కింది. పైపెచ్చు 'సంకీర్తనలక్షణం' సంస్కృత భాషలో రచించి దీనికి విశిష్టతని, గౌరవ ప్రతిపత్తుల్ని తీసుకొచ్చాడు. ఇది గమనించదగ్గది, గర్వించదగ్గది.

ఈ పదకవితలు దేశికవితా విభూతిలోభాగం. కవిత్వం మార్గ దేశి అని రెండు విధాలు. దేశంలో అంతవరకు మార్గకవిత ప్రచారంలో ఉండగా దేశికవిత్వాన్ని తెలుగులో వెలయించినవారు చాళుక్యరాజులన్న విషయం తెలిపినవాడు నన్నెచోడుడు.

> "మును మార్గకవిత లోకం
> బున వెలయగ దేశికవితఁ బుట్టించి తెనుం
> గున నిలిపి రంధ్ర విషయం
> బునఁ జనఁజాళుక్యరాజు మొదలుగఁ బలువుర్"[3]

మార్గదేశి విభాగం మొదట సంగీత పరంగా చెప్పబడింది

శ్లో॥ "మార్గదేశి విభాగేన సంగీతం ద్వివిధంమతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం; యదుక్తం భరతేనచ
తన్మార్గోహి యయారీత్యా; యత్స్యాల్లోకానురంజనం
దేశేదేశే సంగీతం తద్దేశీత్యభిధీయతే".

(సంగీత దర్పణము)

"బ్రహ్మచేత ఉద్దేశింపబడి భరతునిచే చెప్పబడినది మార్గ సంగీతము. ఆయా ప్రదేశములయందు, ఆయా ప్రజల అనురంజనార్థమై ఒక్కొక్క ప్రదేశమున ఒక్కొక్క రీతిగా నుండునది దేశి సంగీతము – అని పై శ్లోకమునకు తాత్పర్యము. అనగా నియమబద్ధమును, లక్షణయుక్తమును, శాస్త్రసమ్మతమును ఐన సంగీతము మార్గము. ఈ లక్షణమే సంగీత రత్నాకరముననుగలదు.

"దేశేదేశే జనానామ్యద్ రుచ్యా హృదయరంజకమ్
గీతంచ వాదనం నృత్తం తద్దేశీత్యభి ధీయతే"

"అట్టి నియమముగాని, లక్షణముగాని లేక శాస్త్రములకెక్కక సామాన్య ప్రజారంజనార్థము పాడెడి చిల్లరపాటలు, పదములు, కీర్తనలు మొదలైనవి దేశి సంగీతము. ఈ రెండు జాతులకును సమాన ధర్మము గానము".

"మరి ఈ భేదమే దశరూపకమున నృత్య, నృత్తపరముగ చెప్పబడినది".

శ్లో॥ "ఆద్యం భావాశ్రయం నృత్యం, నృత్తంతాళలయాశ్రితం
ఆద్యం పదార్థాభినయోమార్గో; దేశి తథాపరం"

నృత్య, నృత్తములలో నృత్యము భావము నాశ్రయించి యుండును. అది గేయము లోని పదములయొక్క అర్థాభినయ పూర్వకము. అది మార్గ మనిపించుకొనును. రెండవది తాళమును, లయను మాత్రమే ఆశ్రయించి యుండును. అది నృత్తము; అది దేశి అనుపించుకొనును.

దశరూపకమును ఆంగ్లములో అనువదించిన ప్రొఫెసర్ హాస్ (Prof. Hass) అను విద్వాంసుడు నృత్యమును High style, నృత్తమును popular style అనియు అనువదించెను[4]. ఈ అనువాదము పై వివరణము నందలి అర్థమునకు అనుగుణముగ నున్నదనుట స్పష్టము. నృత్త, నృత్య పదములకుగల ఈ అర్థభేదమును సాహిత్య పరముగా అన్వయించు కొన్నచో తేలెడి సారాంశమది. నియమ బద్ధమై, శిష్టసమ్మతమును, శాస్త్రసమ్మతమును అయి ఉత్తమ ఫణితిని రచింపబడినది మార్గకవిత. నియమరహితమై, శాస్త్రమున కెక్కక కేవల ప్రజానురంజనమునకై రచింపబడినది దేశికవిత"[5].

దేశి అయిన తెలుగు కవిత నాలుగు విధాలనీ, అందులో మధుర కవితారీతిలో చేరినది పదకవిత అనీ లాక్షణికోక్తి ఉంది. "తెలుగుకవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱగుల గలదని" లాక్షణికులనిరి.... ....అందు మధుర కవిత యనగా పాటలు మొదలైనవి. లక్షణదీపికలో నీవిషయ మిట్లు చెప్పబడినది. మధుర కవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యాది దేవతోదాహరణములు, సప్తతాళ నటనలు, నట్టొట్లు, గీత ప్రబంధంబులు, చతుర్భద్రికాష్ట భద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురతర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాలజోలలు, జక్కుల రేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద చతుష్ట పదాష్టపదులు నివి యాదిగాఁగలునవి"[6].

## 1.1 పద నిర్వచనం :

'పదం' అంటే సామాన్యార్థంలో పాట అనే మాటక. రాగ తాళాలతోను ఉండవచ్చు. లేదా కేవలం స్వరరహితమూకావచ్చు. ఇది జానపదుల సాహిత్యంలో స్పష్టంగా తెలుస్తుంది. కోలాట, దంపుళ్ల పాటల్లో తాళముంటుంది, రాగంతోపాటు. విసర్రాయి, కపిలిపాటల్లో రాగమేకాని తాళాని కవకాశం ఉండదు. రెంటిలోను లయ ఉండి తీరుతుంది. 'పదం' పాడమన్నది జనవ్యవహారం. భరతముని చాలాకాలం క్రితమే పదం అంటే ఏమిటో నిర్వచించాడు

"గాంధర్వం యన్మయా ప్రోక్తం, స్వరతాళ పదాత్మకమ్
పదం తస్య భవేద్వస్తు స్వరతాళానుభావకమ్
యత్కించి దక్షర కృతం తత్సర్వం పద సంజ్ఞితమ్
నిబద్ధం చానిబద్ధంచ తత్పదం ద్వివిధం స్మృతమ్
అతాళంచ, సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చ వైస్మృతమ్" [7].

—స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వర తాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థ సహితమైన అక్షరాలతో కూడినది పదమనీ, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం అని రెండువిధాలనీ, అవి అతాలము, సతాలమూనని రెండు విధాలనీ' భరతుని నిర్వచనం. "నియతాక్షర సంబంధము కలిగి, ఛందోయతి సమన్వితమై, తాలపాతములతో కూడిన పదము నిబద్ధ మనబడును. యతిపాద నియమము లేనిదియును, అనియతాక్షరమును అగుపదము అనిబద్ధమనబడును."[8] నిబద్ధ పదాలలో ప్రధానములు వృత్త పదాలు. ఇవి సమవృత్తాలు, అర్ధ సమవృత్తాలు విషమ వృత్తాలు అని మూడు రకాలు. ఉక్త, అత్యుక్త, మధ్య ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి మొదలైన 26 ఛందస్సులలో నుంచి (సంస్కృత ఛ్ఛందశ్శాస్త్రంలోనివి) వృత్తాలను తీసి ధ్రువాధ్యాయంలో పదములుగా భరతుడు లక్షణం చెప్పాడు. శ్రీ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, విద్యుద్భ్రాంత, భూతలమాన్య, కమలముఖి మొదలైన రెండువందలవరకు పదములను చెప్పి వీటినే ధ్రువ పదములుగా నిర్దేశించాడు. దేశీయ వ్యవహారములోని దరువునుంచి ధ్రువ పదమనే లక్షణ నామం గాని, ధ్రువపదంనుంచి దరువు అనే వ్యవహారంగాని వచ్చి ఉండవచ్చునని ప్రాజ్ఞుల అభిప్రాయము"[9]. సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధాలనబడతాయి. పైని భరతముని చెప్పినవే_మతంగుడు, శార్ఙ్గదేవుడు చివరకు వేంకటమఖి వరకు_సమంగానే ఉన్నాయి. ఇంక ఈ ప్రబంధంలోని అవయవాలు అంటే ధాతువులు మొదలైన వాటిని పరిశీలిద్దాం. "ప్రబంధ శరీరం 4 భాగాలు; 4 ధాతువులు. అవి ఉద్గ్రాహము, మేలాపకము, ధ్రువము, ఆభోగము. ఉద్గ్రాహము ప్రబంధపు మొదటి భాగం. అనగా ఆరంభం. ధ్రువము ప్రబంధపు ముగింపు. మేలాపకం ఉద్గ్రాహ ధ్రువాలను కలుపుతుంది ఆభోగము ప్రబంధ రచయితనామమో, అంకితమిచ్చిన దేవతా నామమో ముద్రగా కలిపిన తుదిభాగం........ ఈ ధాతువుల ఏర్పా

టును బట్టి ప్రబంధాలు మూడువిధాలు. ద్విధాతుకాలు, త్రిధాతుకాలు, చతుర్ధాతుకాలు. ద్విధాతుకం అంటే ఉద్గ్రాహ ధ్రువములుమాత్రమే ఉండే ప్రబంధం. ఉద్గ్రాహ ధ్రువాభోగాలుండేది చతుర్ధాతుకం." "స్వరం, బిరుదం, పదం, తేనకం, పాటం, తాలం అను ఆరూ ప్రబంధానికి అంగాలు.........ఈ అంగాలతో విరచితములైన ప్రబంధాలు ప్రత్యేకం నాదాత్మకాలు – అంటే మాతురచనా ప్రధానములు కావన్న మాట." "మరొక మూడు విధాలయిన ప్రబంధవిభజనం ఉంది. అవి ఏవంటే సూడ ప్రబంధాలు, ఆళి సంశ్రయాలు, విప్రకీర్ణాలు."10. యేలాదులు ఎనిమిది మొదటిరకం. వర్ణాదులు 24 రెండోరకం. శ్రీరంగాదులు 36 మూడోరకం.

స్వరరాగాలతో పాడబడేది గీతం. "స్వరరాగైః ప్రగాయంతి గీత మిత్యభిధీయతే" "శార్ఙదేవుడు గీతములకు ప్రబంధములకు ఒకే అధ్యాయం చెప్పాడు. వేంకటమఖి మాత్రం గీతాలకు ప్రత్యేకాధ్యాయం చెప్పాడు. గీతములు శుద్ధసూడ, సాలగసూడ (ఛాయలగసూడ) అని రెండు భేదాలు శాస్త్రనియమాలు గల ఛాయలో పాడబడే గీతం శుద్ధము సాలగసూడ గీతాలు ధ్రువ, మఠ్య, ప్రతిమఠ్య నిస్సారుక, అట్ట, రాస, ఏక అనే ఏడు తాళములకూ ఏడు భేదాలు. వీనిలో ధాతుమాతువులతో చేరిన రెండు గీత ఖండాలలో మొదటిది ఉద్గ్రాహం. దానికి న్యాసం ఉంచబడేచోట రెండవ ఖండం ధ్రువంగా వర్తిస్తుంది ఉద్గ్రాహ ఖండంలోని స్వరాలకంటె ఉచ్చ మైన స్వరాలతో ఆభోగఖండం. ధ్రువానికి 11 అక్షరాలు మొదలు 26 అక్షరాల వరకూ వచ్చే 16 భేదాలు చెప్పబడ్డాయి. వాటికి వేరువేరు పేర్లు, రసాలు, తాళాలు నిర్దేశించారు.

"ధ్రువము మొదలైన సూళాదిఏడుతాళాలు, ఝోంపట, రగణమఠ్యము అను 9 తాళాలలో మాత్రం గీతాలను రచించాలని వేంకటమఖి నిర్దేశించాడు.........గీతాలు కొన్ని రెండు ఖండాలవీ, కొన్ని మూడు ఖండాలవీ; రెండుఖండాల గీతాలలో మొదటి ఖండంలోనే ధ్రువం మధ్య షడ్న్యాసంగా ప్రయుక్త మవుతుంది మూడుఖండాల గీతాలలో మొదటిది ఉద్గ్రాహము, రెండవది ఆభోగము మూడవది, ముద్రాఖండము; మొదటిదైన ఉద్గ్రాహంలో ధ్రువం తర్వాత అంతరి, తర్వాత జావడ (గీతంలో సగం అని అర్థం ఇచ్చే దేశీయ పదం) ఆ తర్వాత రెండవదైన ఆభోగ ఖండం, మళ్లీ అంతరి, చివర ముద్రాఖండము. అంతరి అనే ఖండం ఎన్నిసార్లు వచ్చినా ధాతువు, మాతువు మారకుండా ఒకే విధంగా ఉంటుంది." 11 ఇవి భరతుడు మొదలుకొని

ఇతర సంగీత శాస్త్రవేత్తలు ప్రబంధం, గీతం_అన్నింటిని గురించి చెప్పిన విష యాలు.

ఈ సందర్భంలో కన్నడంలోని హరిదాసులు రచించిన పదాల లక్షణ వివరణ తెలుసుకోవడం సముచితమే. కర్ణాట హరిదాస వాగ్గేయ కారుల కృతులలో ముఖ్యంగా కీర్తన, సూళాది ఉగాభోగాలనే మూడింటిని గూర్చి మనం గుర్తించవలసి ఉంది. ఒకే తాళ సహిత రాగాలలో పాడదగిన కృతికీర్తన. వీటినిగూర్చి ఎక్కువ చెప్ప వలసిన పనిలేదు. సూళాదుల రచన విశిష్టమైంది. వేర్వేరు సప్తతాళాల్లో (ధ్రువ, మఠ్య, రూపక, ఝంపక, త్రిపుట, అట్ట, ఏక) రచితమైన కృతులు సూళాదులు. వీటిలో కొన్నింట ఐదే తాళాలుంటాయి. ఈ ఏడు (అథవా ఐదు) తాళాలమీద చివరికి రెండుసార్లు ఒక 'జతి' వస్తుంది. వెంకటమఖి పుండరీక విఠలాదులు సంగీత గ్రంథాల్లో చెప్పబడిన 'సూడాది'యే కన్నడంలో సూళాది. కర్ణాటక సంగీత వైశిష్ట్యాల్లో ఒకటి సూళాదులని సంగ్రత విద్వాంసుల అభిప్రాయం. ఉగాభోగమన్నది భావగీతం లాంటిది. ఈ ఉగాభోగాలు శుద్ధసాహిత్య దృష్టితో అత్యంతం గమనించ దగ్గవి. 'ఉగాభోగ' శబ్దాన్ని 'ఉక్+ఆభోగ' మని చాలమంది విడదీశారు. అయితే సంగీత గ్రంథాల్లో చెప్పిన ఉద్గ్రాహక, మేలాపక, ధ్రువ, అంతరా ఆభోగాలనే అయిదు ధాతులక్షణానుసారం పాడదగిన రచనలే ఉగాభోగాలు. పై ఐదు పేర్లలోని మొదటిపేరు చివరిపేరు కలిపి 'ఉద్గ్రాహాభోగ' మని చేసుకొన్నారు. దాని తద్భవమే ఉగాభోగ శబ్దం........సూళాదులు తాళలయ ప్రధానాలనీ, ఉగాభోగాలు స్వర ప్రధానాలనీ పండితుల అభిప్రాయం."[12]

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధి పొందిన తాళ్ళపాక అన్నమాచార్యుడు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణాన్ని అతని మనుమడు చినతిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా రచించాడు.[13] అందులోని పదకవితా లక్షణం ఇది.[14] ఇది చాల వరకు భరతాదులు వచించిన పద్ధతే.

"భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకట భూమీ

ధరపర కీర్తన లక్ష్యము
లుప పద కవితా పితామహుం డేర్పఱచెన్"[15]

—అని చినతిరుమలాచార్యుడే చెప్పి ఇంకా పద సంప్రదాయాల్ని, ప్రామాణికతను గూర్చి ఇలా వివరించాడు.

"రమణీయ సంగీత రత్నాకర ప్రబం
ధాధ్యాయమున నుక్తమయ్యెఁ బదము

సముదిత సంగీత చంద్రికా దేశైక
మందు మిక్కిలిఁ దేటమయ్యెఁ బదము

అమల తత్త్వవాదమైనట్టి సంగీత
చూడామణికిఁ బల్కు చోటు పదము

ధన్య సంగీత సుధాకర గ్రంథంబు
నందు మిక్కిలిఁ జెలువొందుఁ బదము

తానె యన్నిటికి మూలమైన భరత
మందుఁ బంచమ పశాధ్యాయ మందు విమల
వృత్త చూర్ణ నిబంధక వివిధ నామ
ధన్యలక్షణములకు నాస్పదము పదము."

—ఇందులో పదనిర్వచనం సైతం స్పష్టంగా ఉంది.

"పదమగు సుప్రసిద్ధనము
పదమవయవ, మవయవియును బదమనఁబరగున్
మది నీ తెలుంగుపదములన్నియుఁ
బదకవితామార్గ సార్వభౌముఁడు దెలిపెన్"[16].

ఇందులో అవయవ పదం చతుష్పాదం. వృత్త, ధాతు, అవయవాలలో పాటించ బడుతుంది. ఈ పదాలు శృంగార వైరాగ్య పదాలని ద్వివిధం. ఈ శృంగార పదాలు గ్రామ్యోక్తులతో ఉండవచ్చును.

"పదములు శృంగార వధూ
మృదుమధుర మనోజ్ఞ వాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంకమెఱిఁగి పలుకగఁ జెల్లున్"

"వల్లవ నారీ ప్రేమో
ద్యోల్లాస మనోజ్ఞ బంధు రోక్తులు చవియై
చెల్లును గ్రామ్యము లైనను
హల్లీసకముఖ్య నాటకాధిక ఫణితిన్"[17]

—అయితే వైరాగ్య పదాలు అలాగాక ఉదాత్తంగా ఉండడం అవసరం

"వైరాగ్య వృద్ధికర గం
భీర పదశ్రేణి పొసగఁ బెనుపుచు సగ్రా
మ్యా రమ్య విష్ణు చరితో
దారములై యున్నఁ జాలు ధరణి న్వేలయున్"[17].

—వీటినే అధ్యాత్మపదాలంటారు ఈ పదాలు సంస్కృత, ప్రాకృత దేశభాషల్లో చెప్పవచ్చు వీటికి పద్యాల్లాగా యతిప్రాసలు వర్తిస్తాయని భరతాదుల మతం. ఈ పదాలు నృత్త, నిబంధ, అనిబంధాలని మూడు విధాలు. ఈ నిబంధ పదంలో నాలుగు పాదాల చరణమొక్కటిగాని అంతకు మించిగాని ఉండవచ్చు. ఇలాంటి చరణాల అర్థాన్ని పదలక అన్నిటికీ ఏక వాక్యతతో గుదిగ్రుచ్చినట్లు మరల మరలా భాసిల్లునట్టి పల్లవి ఉంటుంది. ఇది పల్లవి, శిఖాపదమని ద్వివిధం. 'పద సమాన మాన పాదయుగ్మముకలది' పల్లవి. అందులో సగం ఏకపాదం గలది శిఖాపదం. ఈ నిబంధపదంలో పల్లవి ఉంటే శిఖాపదముండదు. శిఖా పదముంటే పల్లవి ఉండదు. ఇలాంటి పల్లవి, శిఖాపదాలతో గూడిన నిబంధ పదం చతుర్ధాతుక, త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుకాలని చతుర్విధం.

కాని ఏకధాతు పదం అరుదుగా ప్రయుక్తమవుతుంది. వృత్తాలు నాలుగు పాదాలతోను, జాతులు రెండు పాదాలతోను ఉన్నట్లే సంకీర్తనలు కూడా చతుష్పాద, ద్విపాదాకృతితో ఉంటాయి. ఇట్టి కీర్తనలలో దరువు, వాక్యం, అర్ధ

చంద్రిక, ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదాలు అనేవి రెండు పాదాలలో ఉంటాయి. ఇవిగాక అష్టపది, పదమాలిక, శరభపాదపదం అనే పద విశేషా లున్నాయి. ఇంక అనిబంధపదం అంటే అనిర్యుక్తపదం. ఇది తాళ బంధ చ్ఛందోవిరహితమై మార్గాఖ్యతో ఉంటుంది. దీనిని తాళగంథి అనికూడ అంటారు. ఇది సూక్ష్మంగా అన్నమయ్య సంస్కృతంలో చెప్పిన సంకీర్తన లక్షణం దీనికి లక్ష్యంగా వేల సంఖ్యలో అతడు రచించాడు సంకీర్తనలు.[18]

ఇట్లే సుబ్బరామ దీక్షితులు కీర్తన, పదం మొదలైనవాటిని నిర్వచించాడు[19]. వాటిలో ముఖ్యంగా కీర్తన, పదం, జావళి-వీటిని గురించిన వివరణ ఇది. "కీర్త నము: మాతువు దేవతాస్తుతిగాను, పల్లవి, అనుపల్లవి, చరణాలతోను మొదటి చరణపు కడపటి భాగము అనుపల్లవి యొక్క ధాతువును అనుసరించి తక్కిన రెండు చరణాలు మొదటి చరణధాతువును అనుసరించీ ఉంటాయి. కొన్ని కీర్త నలలో అనుపల్లవి, చరణాల కడపటి భాగాలు మధ్యమకాలపు అవర్తకములుకాగా, అనుపల్లవి చరణాంతములలో తిరిగి పల్లవి ఎతుకొనుటతో మాతువులో భావం పూర్తి అవుతుంది. పల్లవి ఒక ఖండమయితే అనుపల్లవి రెండు ఖండాలు చరణాలు నాలుగుఖండాలు. పల్లవి రెండు ఖండాలయితే తక్కినవి రెట్టింపుగాను ఉంటాయి .... .... పదము యొక్క మాతువు శృంగారరస నాయికా నాయక లక్షణ వ్యవహారాదులతో పల్లవివెంట అనుపల్లవి చరణ మాతువులు విళంబకాలముగా పాడదగినది. అనువల్లవిలోను మూడవ చరణములోను నాయక ముద్రలు అనగా నాయక నామాంకితము ఉండవలెను. అనుపల్లవిలో నాయక ముద్ర ఐచ్ఛికము మొదటి చరణ ధాతువు ప్రకారమే రెండవ మూడవ చరణములు కూడా అనుస రించి ఉండాలి. కీర్తన శృంగారాత్మకమై పదంగా మారింది .... .... దరువు పదమువలెనే శృంగార రసాత్మకము".

"జావళి :- ఇది దరువులక్షణమును. గ్రామ్య గానమును అనుసరించి ఉంటుంది. సరళమైన వ్యావహారిక భాషలో సాగే శృంగారాత్మకమైన తేలిక పాట. ధాతువు మధ్యమ కాలంలో చిందులు తొక్కుతూ ఉంటుంది"— అని సుబ్బరామ దీక్షితులు చెప్పిన వాటికి రజనిగారి వివరణ ఇది [20]. కీర్తన ఎలా క్రమపరిణతి చెందిందో దీనివల్ల తెలుస్తుంది. "జయదేవుని అష్టపదులలో మొదటి ఉద్గ్రాహమనే ఖండము అనుపల్లవిగాను తరువాతి ధ్రువమనే ఖండము పల్లవిగాను,

తరువాతి రచనలలో పరిణమించాయి. ఉద్గ్రాహంలో రెండు పంక్తులు, ధ్రువంలో రెండు పంక్తులు ఉంటాయి. చరణాలు పంక్తుల చొప్పున ఎనిమిది ఉంటాయి. అందుకే వానికి అష్టపదులని పేరువచ్చింది .... నారాయణతీర్థుల నాటికి ఆయన తరంగాలలో పల్లవి (ధ్రువం) ముందుకువచ్చి ఒక పంక్తిగాను, తరువాత రెండు పంక్తుల ఉద్గ్రాహం అనుపల్లవిగాను మారి తాళ్ళపాక వారి నాటివలె ఒక్కొక్కటి నాలుగేసి పంక్తులుగల మూడు చరణాలతో ముగియ వచ్చింది .... .... చరణాలు కొన్నిటిలో మూడు మాత్రమేగాక 4, 8, 9, 10 కూడా ఉంటూ వచ్చాయి. క్షేత్రయ్య నాడు తరువాత త్యాగయ్యాదుల నాడు కూడ పల్లవి, అనుపల్లవి 3 చరణాలు ఉండే సంప్రదాయం వచ్చింది" "క్షేత్రయ్య వరకూ వచ్చిన వారి కీర్తనలలో, పదాలలో చరణాలు మూడేసి ఉండటం కద్దు త్యాగయ్య, దీక్షితులు మొదలైన అద్యతన వాగ్గేయకారుల రచనలలో కొన్నిటిలో ఒకే చరణం కనబడు తూంది .... తొలిరోజులలో పదము, సంకీర్తనము పర్యాయపదాలుగా ఒకే అర్థంలో వ్యవహారముండేది. అవి శృంగార సంకీర్తనలనీ, అధ్యాత్మ సంకీర్తనలనీ రెండు విధాలయి రానురాను క్షేత్రయ్య నాటికి శృంగార సంకీర్తనలు పదాలనీ, త్యాగరాజు నాటికి అధ్యాత్మ సంకీర్తనలు కీర్తనలనీ వ్యవహారం రూఢమయింది .... కీర్త నలో ధాతువు, మాతువు సమపాళ్ళలో ఉంటాయి క్షేత్రయ్య కాలంనుంచి ధాతువు అధికంగా ఉండి మాతువు తక్కువగా ఉండి విళంబంగా గమక, వరికలతోను, విన్యాసంతోను గానంచేసే పదశైలి వ్యాపించింది ఆ తరువాత త్యాగరాజాదుల కాలంలో విలంబ పదశైలి మధ్యమ కాలసంగతులతో కూడి ఇప్పటి కీర్తనశైలిగా పరిణమించింది "

"కీర్తన ధాతువులో సంగతుల విస్తృతితోకూడిన ప్రస్తావముతోడయి త్యాగ రాజు నాటినుంచీ నెరవకల్పనతో చిట్టస్వర కల్పనలతో మరింత పటిష్ఠమై కీర్తనకు కృతి అనే వ్యవహారం వచ్చింది."[21] ఇది కీర్తనకు కలిగిన క్రమపరిణామం.

ఇది ఇలా ఉండగా సంగీత సాహిత్యవేత్తలలో అగ్రేసరులైన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పదనిర్వచన మిట్లు చేశారు "కాని ఇప్పుడు శృంగార మయమై, ఎక్కువగా విలంబకాలమందు, క్వచిత్తుగా మధ్యమకాలమందు నడచుచు పల్లవాను పల్లవములు మూడింటికి తక్కువకాని చరణములు కలిగి ప్రాచీన రక్తి రాగములలో చేయబడిన గేయరచనకు 'పదములని' పేరు .... సంగీత రచనా ప్రథా

నములకు త్యాగయ్యగారి రచనలవంటి వానిని 'కృతు'లను చున్నాము. భక్తి ప్రధానములగు రామదాసు పాటలవంటివి 'కీర్తనములు' అనుచున్నాము సంగీత సాహిత్యములు రెండును చౌకరకములవై దేశీయ రాగములలో చిల్లర శృంగారపు మాటలఁ గూర్చిన పాటలను జావళులు అనుచున్నాము. కృతులందువలె సాహిత్యమును గాని, కీర్తనలందువలె సంగీతమును గాని దిగ్రమింగుటకు పదములలో అనుమతి లేదు. రెంటికిని సమాన ప్రాధాన్యమీయగల సంగీతశిల్పికి తప్ప తక్కినవారి కిందులో పప్పుడకదు"22. ఇది పదాల గూర్చిన రాళ్ళపల్లి వారి నిష్కర్ష అయిన అభిప్రాయం కానీ, శ్రీ వద్దమూడి గోపాలకృష్ణయ్యగారూ పదమంటే ఇలా వివరించారు. "పదమంటే లోకంలో చాలాకాలంగా పాట అన్న అర్థం పరివ్యాప్తమై ఉన్నది. ఈ దృష్ట్యా పాటలుగా వున్న భాగాన్ని పదభాగమనీ, పద్యాలుగావున్న భాగాన్ని పద్యభాగం అనికూడా అనవలసివస్తుంది. వస్తుస్థితిని పరిశీలిస్తే పద పద్యాలకు భేదం కన్పించదు. పదమంటే పద్యమనీ, పద్యమంటే పదమని భావించడంలో శాస్త్రీయంగా దోషములేదు శాస్త్రాంతర్యం పరిశోధనా దృక్పథంతో తెలిపినారుగాని మామూలుగా లోకంలో అత్యంతసామాన్యులైన పామరులు గాని పద పద్యాలకు భేదం పాటించరు. సామాన్యంగా పనిపాటలు చేసేప్పుడు ఉత్సాహం కోసమో, పరిశ్రమమూలకమైన బడలిక వైపునుంచి మనసును మళ్లించడం కోసమో, కాలక్షేపం కోసమో ఏదైనా ఎవరైనా పాడితే బాగుంటుంది అనుకున్నప్పుడు 'ఓసోయ్‌బుల్లీ! పదం అనవే పదం ఎత్తవే — పదం అందుకోవే పదంపాడుసే—వంటి మాటలతో కోరడం జరుగుతుంది ఇటువంటి సందర్భాలలో ఈ కోరికమీద కేవలం పాటమాత్రమే పాడడం జరగదు. పద్యాలు కూడా పాడడం జరుగుతుంది 'పదం అనవే' అంటే కేవలం పాట మాత్రమే పాడాలని అవతలి వారు – అర్థితులు – అనుకోరు పాట పద్యాలలో దేన్నయినా పాడవచ్చు రెండూ పాడడం కూడా జరుగుతూవుంటుంది. అంటే పదం అంటే పాటకావచ్చు, పద్యమూకావచ్చు నన్నమాటపామరుల దృష్టిలో. రగడ–తరువోజ–ద్విపదలవంటి వేవైనా బాగా సంగీతం మేళనంచేసి పాడారనుకోండి. అప్పుడవి అసలు పాటలనే అనుకుంటారు. మామూలు మనుషులేకాదు. ప్రత్యేకించి ఛందోలక్షణాలను దృష్టిలో పెట్టుకొని పరిశీలించిన వారైతేనేతప్ప లేకపోతే అందరూ— విద్యావంతులు కూడా పాటలనే భావిస్తారు"—అని తెలిపి

పదం అంటే కేవలం 'సంకీర్తన', 'పాట' అనేగాక పద పద్యాల కది సంకేతమవు తుందనీ 'పదం' అంటే కేవలం శృంగార పదమేకాదని, సమస్తమయిన పాటలు అందులో గతార్థ మవుతాయనీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు సుదీర్ఘ చర్చలో సయుక్తికంగా నిరూపించారు.[23] సమస్తంగా పదవాఙ్మయాన్ని పరిశీలించినప్పుడిది వాస్తవమే కావచ్చు. కాని ముఖ్యంగా క్షేత్రయ్య పదాలనే గ్రహించినప్పుడు మాత్రమే పదం అంటే శృంగార పదం అని రాళ్ళపల్లి వారి అభిప్రాయంగా మనం తలంచ వలసి వుంది కారణం సుబ్బరామదీక్షితులు, పద నిర్వచనం చేస్తూ "పదం యొక్క మాతువు, శృంగారరస నాయికా నాయక లక్షణ వ్యవహారాదులతో కూడిన"దని చెప్పారు.[24]

పైగా సంగీత శాస్త్రం ఎంతో అభివృద్ధి చెందింది. దీనిలో కేవలం పదం ప్రత్యేకార్థంలో ప్రయుక్తమవుతూ వచ్చింది. సంకీర్తన, కీర్తన, కృతి మొద లైన రూపాలు ఎంతో అర్థవంతంగా సంగీతజ్ఞులు ప్రయోగిస్తున్నారన్న సంగతి ఈ సందర్భంలో మనం గుర్తుంచుకోవడం చాలముఖ్యం.

ఇక్కడ ప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞులు ప్రొఫెసర్ పి సాంబమూర్తిగారు కీర్తన, కృతి, పదం—అనే వీటినిగూర్చి వివరించిన రీతులను ఉట్టంకించడం ఎంతైనా అవసరం. "It will be useful at this stage to draw the line of distinction between Kriti and the Kirthana. Some scholars think that these two terms are synonyms. But it is desirable to restrict the term kriti to the composition whose claim to performance lies more in its music than in its Sahitya. Kirtanas are older than Kritis. Kriti is a development from the Kirtana The Kirtana had its birth in its fully developed form appears about three centuries later.

"The Kirtana is a strictly sacred form Its sahitya is of a devotional character; or it may relate to a Puranic theme. It may also be in praise of great devotees (Bhaktas). Its music as well as its rythm are simple. It is a Compositton belonging to the realm of applied music and the music is used only as a vehicle for the singing of the glories of the God; i. e the music used simply as a means to an end. The music is sub-ordinated to the Sahitya.

Words are many and Charanas are all sung to the same dhatu. Sometime the charanas have the same music as the Pallavi. The Anupallavi is a dispensible anga in a Kirtana. The range of the music is short and the piece can easily be learnt by rote Kirtanas are usually composed in common ragas

"In the Kriti the Sahitya may be of a sacred of secular character and the words serve only as a vehicle for the singing of the music. Words are few. The music is complex and bristle with technical beauties There may be one or more charanas. The charanas may have the same dhatu or different dhatus. The range of a Kriti extends usually over 1½ to 2 Octaves. Atita—anagata complexities are freequently seen in Kritis. Kritis are veritable raga crystals and we derive knowledge of the many rare (apurva) ragas only through them. We find the musical language in its free form in a Kriti and such a thing as musical interpretation is possible only in Kritis.

"The pallavi, anupallavi and charana are the minimum essential angas of a Kriti. There may be one or more charanas. In many Kritis the dhatu of the later part of the charana is found to be the same as that of the anupallavi. But in Kritis of Muthuswamy Dikshitar the dhatu of the anupallavi is not repeated in the charana

"Pada is a scholarly composition. The term pada is some times used to signify any devotional composition. It is only in the sense that we talk of kanarese padas of Puranaradasa. (Dasara padagalu) and the Tamil padas of the Muthu Tandaver In musical parlounce, however, the term is restricted to the type of composition which belongs to the sphere of dance music and which treats of Nayika and Nayaka relationships Although strictly advance form, yet the pada is sung in concerts on account of its musical excellence. To understand a pada aright and to enter truly into its spirit, one must have some knowledge of Nayika Nayaka (loved and the lover) lakshanas ... ... ... .... ... ... Most pada compositions admit of a dual meaning; the out ward sringara meaning and the in word philosophical meading.

"The pada has the divisions; pallavi, anupallavi and charana. There may be three or more charanas. There are no sangatis and no tense sancharas. The music is slow and flows in a natural manner. Its diction is simple. The piece is replete with raga, bhava, and a sustained balance is maintained between the words and dhatu thought. The charanas have the same music Colloquial words figure in the sahitya"[25]. ఈ వివరాలన్నీ గుర్తించాక పదం అన్నది పద్యం కంటే భిన్నమని తెలుస్తుంది. ఇదే సంకీర్తన, కీర్తన, కృతి అని మార్పులు చెందుతూ వచ్చిందని వాగ్గేయకారుల రచనల్ని పరిశీలిస్తే స్పష్టమవుతుంది. ఈ పదకారులు లేదా పదకర్తలు లేదా వాగ్గేయకారుల లక్షణాల్ని గూర్చి తెలుసుకోవడం అవసరం.

## 1.2 వాగ్గేయకారుడు :

"తాళ్ళపాకవారి కాలమున సంకీర్తనమునకే పదమనియు వ్యవహారము. దానినే గేయమనియు నేటి వ్యవహారము. 'కృ్తాత సంశబ్దనే'—కీర్తించునది కీర్తనము. సమ్యక్ కీర్తనము (గీయత ఇతిగీతం) పాడబడునది గీతము లేదా గేయము. కాగా అవాఙ్మానస గోచరమగు దివ్యశక్తిని కీర్తించి పాడునది కీర్తనము. లేక సంకీర్తనమైనది. ఇట్లు గీయమానమగు కీర్తనమే భక్తుని హృదయమును పరమాత్మని పాద సన్నిధికిఁ గొంపోవునది. 'పదగతే' అని అమరము, అందువలన అట్లు తీసుకొని పోవునదే పదమనియు రూఢి కెక్కినది. ఇట్లు నాడు కీర్తనము, పదము అనబరగిన రచన సంగీత సాహిత్యముల సమ్మేళన రూపము. ప్రాచీన లాక్షణికులిందలి సాహిత్యాంశమును 'వాక్' అనియు సంగీతాంశమును గేయమనియు వ్యవహరించిరి. వీనికే క్రమముగా మాతు, ధాతు సంజ్ఞలు కూడ కలవు"[26]. పదంలోని వాక్కును గేయాన్ని రచనచేయగలవాడు వాగ్గేయ కారుడు. శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో వాగ్గేయకారుని గూర్చి నిర్వచించినవాటిని బాలాంత్రపు రజనీ కాంతరావు గారు వివరించారు. వాటి వివరణ యిది[27].

> "వాఙ్మాతురుచ్యతే గేయం ధాతు రిత్యభిధీయతే
> వాచం గేయంచ కురుతేయః సవాగ్గేయ కారః."

—పదంలోని వాక్కు మాతువు. గేయం ధాతువు. అట్టి వాక్కును గేయాన్ని రచించగలవాడు వాగ్గేయకారుడని అర్థం. కాగా ఈ వాగ్గేయకారున కుండవలసిన లక్షణాలివి.

'శబ్దానుశాసన జ్ఞాన మభిధాన ప్రవీణత
ఛన్దః ప్రభేద వేదిత్వమలంకారేషు కౌశలమ్'

—శబ్దానుశాసన జ్ఞానము, అభిధాన ప్రవీణత, రసభావాల పరిజ్ఞానము, లోకజ్ఞత, అశేషభాషా జ్ఞానంతోపాటు సమస్త కళా శాస్త్రాల్లో అభినివేశమూ, నృత్య గీత వాదాల్లో నేర్పు, మనోహర గాత్రం, తాళలయ జ్ఞానము, కాక్వాదుల వివేచన, ప్రతిభ, సుభగగేయత, దేశీరాగాల్లో సంపూర్ణజ్ఞానం, వాక్పటుత్వం, సరసత, ఔచిత్య జ్ఞానం, నూత్నధాతునిర్మాణక్షమ, ఇతరుల చిత్తవృత్తుల పరిజ్ఞానం, ప్రబంధ ప్రాగల్భ్యం, ధృతగీత నిర్మాణంతోపాటు నానా గీత రచనా దక్షత, మంద్ర మధ్యమ తారస్థాయిలలో గమకం ప్రయోగించగలనేర్పు, ఆలాపనలో సంపూర్ణ జ్ఞానం, అవధానం— అంటే చిత్తైకాగ్రత—అనే గుణాలు కలవాడే ఉత్తమ వాగ్గేయ కారుడు. అంటే ఈ వాగ్గేయ కార లక్షణాల్ని పరిశీలిస్తే ఉత్తమ కవికుండవలసిన లక్షణాలతో ఏమాత్రం తీసిపోవని తెలుస్తుంది. అంతేగాదు కవికంటె ఉత్తమ వాగ్గేయకారునిలో సంగీతాది కళలలో పరిజ్ఞానం ఉండాలని స్పష్టమవుతుంది. వాగ్గేయ కారుని 'బయకారు' దనటం వాడుకలో ఉంది. చతురకల్లినాథునకు, రామామాత్యు నకు, 'రాయబయకార' (రాజవాగ్గేయకారుడు) అన్న బిరుదం ఉన్నట్లు తెలు స్తూంది[28].

'మాతూంశ్చ ధాతూనుభయాన్ కరోతి
యస్తం విదుశ్చోభయకార సంజ్ఞం
తమేవలోకా బయకార నామా
పదంత్యప భ్రంశ పదేన సర్వే'

—అంటే మాతువు, ధాతువు అనే రెంటిని గుర్తించినవాడు ఉభయకారుడనీ, కానీ ప్రపంచంలో ఉభయకారుడనడానికి బదులు అపభ్రంశ బయకార శబ్దంతో పిలుస్తున్నారనీ గోవింద దీక్షితులు శబ్ద వ్యుత్పత్తిని వివరించారు[29].

కాగా పద కవితావిర్భావ వికాసాల్ని తెలుసుకోవడం అవసరం.

## 1.3 పదకవిత - ఆవిర్భావం :

పద పద్య కవితలలో పదకవిత్వమే ముందావిర్భవించినదనడం సర్వజనాంగీకృత విషయం ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతులను పొందినపుడు, తదనుగుణంగా ఆడిపాడుకొనడంలోనే ఈ పదకవిత పుట్టింది. అదే కాలాంతరంలో సంస్కరించబడి మరోవిధంగా పద్య కావ్యంగా, ప్రౌఢకావ్యంగా, పండిత కావ్యంగా అంగీకరించబడి, గౌరవపాత్రమైనది పదకవిత పండితామోద ముద్ర నెంత మాత్రము పొందకపోయినా, విద్వద్గోష్ఠులలో ప్రస్తావించకబడకపోయినా, రాజగౌరవం సంపాదించకపోయినా దాని దారినది నడుస్తూనే ఉంది. అభివృద్ధి చెందుతూనే ఉంది. సామాన్య ప్రజల మన్ననలకు పాత్రమవుతూనేఉంది. చివరికి రాజ గౌరవం కలగడమేకాదు, పండితులు సైతం సమాదరించడం జరిగింది.

పదకవితావిర్భావాన్ని గూర్చి R. G. Moulton పండితుని అభిప్రాయాలు ఇవి.

"The improvised lyrical soug, communal or individual, popular or artistic, is probably the simplest and most spontaneous form of lyric expression .... The true song is primarily the instinctive out burst of emotion or emotional thought in language which by aptness of word and rythm echoes or suggest the underlying emotion and by melody of line and hormony of stanza is adapted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance. The words must be and at the same time rich in connotation and sensuous. The rhythm must reproduce the urgency and speed, the flow and ebb, of the dominant feeling on the one hand emphasizing the movement by the regularity of metre on the other avoiding rigidity. The melody must be facile in its consonant—sequences, preferably open in the quality and varied in the musical pitch of its vowel sounds ... ... The song is, therefore, more than any other lyric kind a musical 'Cry'[30].

"That the popular or traditional ballad is folk poetry, i. e. poetry that has originated usually in oral form among a homogeneous, nonliterary people, and has been handed down among them by word of mouth, is generally conceded ... But the exact method of origin is a question still under discussion"[31].

"Ballad :- Manner-From the three possible methods of expression-singing, saying, doing-are derived the three primary kinds of poetry-song, recital and drama ... ... The ballad combines song and recital. In its earlier stages it is both a recital or saying and a song in later stages it loses some thing of its lyricas tune while its narrative content comes to the front. It also assumel dramatic quality to the degree in which the singer or recitar of the poem impoersonates the speaking characters. 2. The verse of the ballad is characteristically a simple measure, the lyrical effect of which is often heightened by a chorus, burden of refrain. 3. The subject matter of the ballad is deeds, which may be historical, romantic or mythical"[32].

ఈ విషయాన్నే పింగళి లక్ష్మీకాంతం గారు తమ సహజ ధోరణిలో ఇలా వివరించారు.

"ఈ పాడదగిన కావ్యమునకు పదమనిపేరు.

"ఏ వాఙ్మయము నందైనను ఈ పదకవిత్వము పద్య కవిత్వము కంటె ముందుపుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము. చిత్ర విచిత్ర కార్య కమనీయ పర్వతారణ్య మయమైన ప్రకృతిలో పుట్టి పెరిగిన ప్రాకృత జీవియగు ప్రాక్తన మానవుని హృదయమున సంతోషమయమో దుఃఖమయమో యగునొకానొక భావము జనించి పరవశుని చేయగా అతని నోటివెంట అప్రతర్క్యకముగా, ఒకపాట వ్యక్తమైయుండుననియు, ఆవేశపూరితుడై అత డాపాటను చిందులు త్రొక్కుచు పాడియుండుననియు ఆట-పాట లేక నృత్యగీతము (Ballad-dance) అనిపేరు పెట్ట వచ్చుననియు, అదియే కవిత్వమునకు శ్రీకారమనియు ఈ సిద్ధాంతము యొక్క సారాంశము.

"అసలు ఒకవ్యక్తి పరవశస్థితియందు చేసెడి ప్రసంగముకాని పాడుపాట గాని, శరీరావయవ విక్షేపముతో కూడి అభినయ పూర్వకముగానే వ్యక్తమగు చుండును. భావోద్వేగమనునది ఒక హృదయమును మాత్రమే కదిలించి ఊరుకొనదు అది శరీరము నంతటినీ ఊగించి వేయును.

"కాబట్టి ఆదికాలమున భావపరవశుడై పాటపాడిన ఆప్రాక్తనకవి, ఆడుచునే పాడెననుట శాస్త్రీయముగా నమ్మదగిన విషయము.

"ఈ 'ఆట_పాట'లో మూడు భిన్నకళాంశములు కలవు. అడుగు వేయుట, రాగము తీయుట, మాట పలుకుట శాస్త్రపరిభాషలో ఈ మూడింటికి నృత్యము, గీతము, శబ్దము అనిపేరు. ఈ మూడు అంశములను మూడు శాఖలుగా కాలక్రమమున నాట్యము, సంగీతము, పద్యము అనెడి కళలుగా పరిణమించి దేని రాజ్యమును అది యేలు కొనసాగెను. కాని ఈమూడిటికిని జన్మస్థాన యొక్కటియే అవి స్వతంత్రతా నిరూపణార్థము ఎంత విడిపోయినను పరిణత సంపూర్ణ స్వరూపములో మరల ఏకీభవించు చుండును.

"ఈపద కవిత్వమువ శబ్దమున కెంత ప్రాధాన్యమున్నదో గీతికకును అంతే ప్రాధాన్యమున్నది అనగా ఇందు సుందర శబ్దరచనతో పాటు, మధురమైన పాటయును కలిసి యుండును" 33.

పద కవితనుంచే పద్య కవిత్వముద్భవించిందనీ పదమే ప్రాచీనమని రాళ్ళపల్లి వారి అభిప్రాయం. "మన 'దేశంలో చాలా ప్రాత పాటలు వేద సూక్తములు. మనుష్య జాతికి అవి మొదటి రచనలు అని యూహింప వలసినవి. వాటి గాన మందు తాళములేదు అన్నది మన మిక్కుడ గమనింప వలసిన తత్వము .... నేటికినీ తెలుగులో పరమ ప్రాచీనమైన పద్ధతి యనిచెప్పదగిన పల్లె పాటలు, కపిలె పాటలు మొదలగునవి_కొన్ని తాళనియమము లేకుండ పాడబడు చున్నవి. ఈ రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము. దాని పూర్ణానుభవమును మనకప్పుడే. సతాళముగనో, వితాళముగనో కావ్య కళారసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాట రూపముననే అనుభవించి రసించినదని పండితులూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు" 34.

### 1.3.1 సంస్కృతంలో పదకవిత:

తెలుగు వాఙ్మయంలోని పదకవిత్వానికంటే ముందుసంస్కృతాది భారతీయ భాషలలోని పద కవితారంభ వికాసాలను తెలుసుకోవడం అవసరం భక్తితత్వం భారతీయ తత్వం; భక్తితోపాటు పదకవిత సైతం ప్రారంభమైంది. నిజానికి వేద సూక్తాలే మొట్టమొదటి పదాలన్న రాళ్ళపల్లి వారి మాటలు పూర్వోక్తం. సామవేదం

గానయోగ్యమైందన్న సంగతి సర్వజనవిదితమే. భరత మహర్షి ధ్రువాగానాన్ని నాట్యశాస్త్రంలో వివరించాడు. అంటే భరతముని కాలానికే ఈ ధ్రువాగానం ఉందని స్పష్టం 13వ శ॥ నాటికే శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలో చెప్పిన ప్రబంధ రీతులన్నీ సంస్కృతంలో వున్నట్లు మనం గమనించవచ్చు. తదనంతరం అభినవ గుప్తాచార్యుడు అభినవ భారతిలో రాగకావ్యాలనబడే ప్రబంధాలను గూర్చి పేర్కొన్నాడు. 11-12 శతాబ్దుల మధ్యకాలంలో వెలసిన 'గీత గోవింద' మనే మధుర కావ్యంలో జయదేవుడు రాధాకృష్ణుల ప్రేమను అభివర్ణించి తరించాడు. వాస్తవానికి మధురభక్తికిదే ఆరంభం. ఇందు రాధాకృష్ణుల ప్రేమ జీవేశ్వరుల సంబంధాన్ని చాటుతుంది. గీతగోవిందం అష్టపదులలో రచితం. జయదేవుని తర్వాత సంస్కృతంలో పేర్కొనదగిన వాగ్గేయకారుడు లీలాశుకుడు ఈతని కృష్ణకర్ణామృతంలోని శ్లోకాలు భక్తికి సంపూర్ణ నిధులు. సంగీత సభలలో, భజన గోష్ఠులలో వీనికి ఎనలేని ప్రచారం ఈ నాటికీ ఉంది. లీలాశుకుడు 13వ శతాబ్దికి చెందినవాడు. అంటే జయదేవుని తర్వాత నూరేండ్ల కవతరించిన మహానుభావుడు. యావద్భారతంలో లీలాశుకుని భక్తిసముద్రంలో ఓలలాడని భక్తుడు లేడంటే అత్యుక్తికాదు.

తెలుగులో ప్రథమ వాగ్గేయ కారుడైన అన్నమాచార్యుడు సంస్కృతంలోను మనోహరమైన పదరచన చేసి తరించాడు. తద్వారాతన ఉభయ భాషా పాండిత్య ప్రకర్షను వ్యక్తంచేశాడు. ఈ పదాలు చాలవరకు శృంగార విషయంలో జయదేవుని అష్టపదుల్ని పోలిఉంటాయి.

ఆవెనుక పేర్కొనదగిన వాగ్గేయ కారుడు శివనారాయణ తీర్థులు (1580-1680). ఇతడు సంస్కృతంలో రచించిన శ్రీకృష్ణ లీలా తరంగిణి చాల ప్రసిద్ధమైనది ఇదిమిక్కిలి సులభశైలిలో ఉండడం విశేషం. శ్రీకృష్ణలీలా విశేషాలను మనోజ్ఞంగా వర్ణించాడు. భక్తిపారవశ్యంలో లీలాశుకుని తర్వాత శివనారాయణ తీర్థుల రచనలే చాల ప్రసిద్ధి పొందాయి

రామదాసు సైతం సంస్కృతంలో కొన్ని కీర్తనలు రచించడం విశేషం.

నాదోపాసకుడు త్యాగయ్య (1767-1847) తెలుగుతోపాటు సంస్కృతంలో సైతం కృతులు రచించడం ఆయన ఉభయ భాషా పాండిత్యానికి నిదర్శనం.

ఇంకశ్యామ శాస్త్రిలు అంతకంటే ముత్తు స్వామి దీక్షితులు సంస్కృతంలో కీర్తనలు రచించిన మహానుభావులు. ఇలాగా సంస్కృతంలో పదరచన కొనసాగిందని స్పష్టమవుతుంది.

1 3.2 హిందీ మరాఠీ భాషల్లో పదరచన :-

భారతీయ భాషల్లో భక్తిగీతాలు రచించబడడానికి కారణం బౌద్ధ సిద్ధుల తాత్త్విక చర్యగీతాలే కారణమంటారు రాఘవన్‌గారు.

"While in the west of India the Jain mystics were producing this kind of electric literature, in the East the Buddhist Siddhas of Sahaja cult were composing in symbolic language (Sandha-bhasha) philosophical songs called charya - gitas; as padas these charya - gitas were all set to music and in a way, may be considered to have paved the way for the emergence of the Hindu Saints and their songs in the Indian languages"[35].

ఈ విధంగా భారత దేశంలో భక్తిగీతాలు ఆరంభమయ్యాయి. కృష్ణ భక్తికి వంగదేశం ఆటపట్టు. కృష్ణ భక్తిని ప్రతిపాదించినవాడు వల్లభాచార్యుడు. ఇతని 'అష్టచాప్' అనుఎనమండుగురు శిష్యులలో ముఖ్యుడు సూరదాసు హిందీలో కృష్ణభక్తితో మైమరచి ఇతరుల మురిపించిన వాడీతడు సూరదాసు పదాలు భక్తిరస ఘుళికలు. వంగ దేశంలో వల్లభాచార్యుని తర్వాత కృష్ణ భక్తి పారమ్యం పొందిన వాడు చైతన్య స్వామి (1486-1534). చైతన్య స్వామి సంస్కృతంలో రెండు స్తోత్రాలు మాత్రమే పాడినా, ఆయన శిష్యులు వంగ సంస్కృత భాషలలో కృష్ణ భక్తి సాహిత్యాన్ని సృష్టించారు విద్యాపతి మైథిలీ భాషలో క్రీ॥ శ॥ 14వ శ॥ రాధాకృష్ణ భక్తి ప్రతిపాదకాలైన ఎన్నో పదాలు రచించాడు ఇతడు మన క్షేత్రయ్యతో అన్ని విధాల సరితూగగల వాగ్గేయకారుడు. విద్యాపతి పదాలను చైతన్యస్వామి ఆలపించి తన్మయత్వం చెందేవారట. వంగ భాషలో కృష్ణపదాలు రచించిన మరొక పదకర్త చండీ దాసు. ఈ ఇద్దరు పదకర్తల గూర్చి ప్రశంసించిన శ్రీ అరవిందుల వాణి స్మరించదగినది.

"The desire of the soul for God is there thrown into symbolic figure in the lyrical love cycle of Radha Krishna.......... This acomplished lyrical form springs at once to perfect birth from

the genious of the first two poets who used the Bengali tongue, Vidyapathi, a consummase artist of word and line and the inspired singer. Chandidas in whose name stand some of the sweetest and most poignant and exquisite love lyrics in any tongue"[36].

మహారాష్ట్రలో 50 మంది మహాభక్తులుండేవారు. వారిలో జ్ఞానదేవ, నామదేవులు 13–14 శ॥ ల మధ్యకాలంలో ఉండేవారు. నామదేవుడు అభంగ వృత్తాలన బహు భావగీతికలు రచించాడు. ఇక్కడే సమర్థ రామదాసుతో పాటు పరిగణింప దగిన భక్తాగ్రేసరుడు భక్తతుకారామ్. వీరు అభంగులు రచించిభక్తిని ప్రకటించారు.

పోతే రాజస్థాన్‌కి చెందిన మీరాబాయి (16వ శ॥ పూర్వం) మహాకృష్ణ భక్తురాలు. ఈమె రాజస్థానీ, గుజరాతీ, వ్రజ, హిందీభాషలలో సుమారు 2400 కృతులు కృష్ణభక్తి పారమ్యంగా రచించి తరించింది. ఇచ్చట మీరాభాయి భక్తితత్త్వాన్ని గూర్చి శ్రీ అరవిందుల వారు—

"Another type is created in the perfect lyrics of the Rajput queen, Mirabai in which images of the Krishna symbol are more directly turned into a song of the love and persuit of the devine lover by the soul of the singer"[37]. అని ప్రశంసించారు ఈ సమయంలో హిందీలో కృతులు రచించిన భక్త కబీరును పేర్కొనడం సమంజసమే భక్త రామదాసు గురువీతడే ఇట్లు ఉత్తర హిందూస్థానంలో కృష్ణభక్తి ప్రపూరితమైన గీతాలు కోకొల్లలుగా రచింపబడుతూ భక్తితోపాటు పద కవితాభివృద్ధి చెందనారంభించింది.

### 1.3.3 తమిళంలో పదకవిత :

పైవిధంగా ఉత్తర హిందూస్థానంలో కృష్ణభక్తి బహుళ వ్యాప్తిని పొంది దక్షిణ దేశానికి సైతం వ్యాపించింది. దానితోపాటు పదకవిత మిక్కిలి అభివృద్ధి చెందింది. అంతకుముందే భక్తిబీజాలు గల దక్షిణ భారతంలో కృష్ణభక్తికి ఎనలేని గౌరవం లభించింది. దాని మూలకంగా సంస్కృతంలోనేగాక తమిళ, మలయాళ, కర్ణాటాంధ్ర భాషలలో భక్తిపూరితమైన పదకవిత మూడు పూవులారుకాయలుగా వికాసం చెందింది. ఈ విషయాన్ని అధికారికంగా వివరించిన రాఘవన్‌గారి మాటలుల్లేఖించడం సముచితం.

"The cycle came (from north) full round and reached South India again. Through music, dance and dance-drama the influence of Jayadeva spread South wards and in Telugu, Kannada, Tamil and Malayalam. Universal stories and plays on devotional themes were composed in Sanskrit and these languages. Kirtana and Bhajana flowed from Maharashtra chiefly and from Bengal to some extent, so that on a soil already the seed-bed of Bhakti the flow of these fresh waters from other areas, fed to a rich new crop of devotional music and dance-drama"[38].

తమిళనాడులో జైన బౌద్ధమతాలను త్యజించి కొందరు సుమారు 7వ శతాబ్దంనుంచి శైవమతాని కెక్కువ ప్రాధాన్యమిచ్చి పోషించారు. అట్లే వైష్ణవ మతం ప్రాబల్యానికి వచ్చింది. "ఒకవైపు శైవము మరియొకవైపు వైష్ణవమును ప్రబలుచుండినకాలమది. శైవ సమయాచార్యులకు నాయన్మారులనియు, వైష్ణవ మతాచార్యులకు ఆళ్వారులనియు వ్యవహారనామములు కలిగెను........మత విషయిక వాదోపవాదములలో మునిగిపోయిన నాయన్మారులుగాని, ఆళ్వారులుగాని ప్రత్యేక గ్రంథములు సంతరించక పోయినను, భక్తి రస ప్రపూర్ణములగు గీతము లనేకములు వెలయించిరి. ఆభక్తి గీతములే తరువాతి కాలమున సంకలనము చేయబడి గ్రంథ రూపమున వెలువడెను. శైవగీతకదంబమునకు తిరుమత్తై అనియు, వైష్ణవ గీతికా సందోహమునకు నాలాయిరప్రబంధము అనియు వ్యవహారనామములు కలిగెను. కనుక శైవ వైష్ణవ మతాచార్యుల యుగమున ప్రచారములోనికి వచ్చిన తమిళ సాహిత్యము మధుర గేయ మయమై, భక్తి రస ప్రపూర్ణమై యున్నదనుట సమంజసం. ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృత భాషాభిజ్ఞులైనను భక్త్యుద్రేకమున వారు ప్రజల భాషయందే గీతములు పాడిరి"[39]. నాయన్మారులలో శ్రేష్ఠుడైన మాణిక్యవాచకరు దేశికవితా శాఖకు చెందిన అచ్చనగాయల పాటలు, గొబ్బిపాటలు, జోలపాటలు వంటివాటితో మధుర కవిత వెలయించాడు శైవం లాగా వైష్ణవం కూడా ప్రాచీన మతం. దక్షిణ భారతంలో ముఖ్యంగా తమిళ దేశంలో వైష్ణవమత వ్యాప్తికి తోడ్పడిన వారు ఆళ్వారులే[40]. ఆళ్వారులు పన్నిద్దరు. వీరి విష్ణుభక్తి గీతాలు నాలుగు వేలున్నాయి. ఈ సంకలన గ్రంథానికి నాళాయిర ప్రబంధమని పేరు. ఈ ఆళ్వారులలో నమ్మాళ్వారు శ్రేష్ఠుడని ప్రతీతి. వీరిలో మహావిష్ణు భక్తురాలు శ్రీ ఆండాళ్ (గోదాదేవి) పెరియాళ్వారు పుత్రిక.

భక్తి పరవశయై ముప్పై పాశురాలు పాడింది. ఇచట శ్రీ ఆండాళ్ భక్తితత్త్వాన్ని గూర్చి శ్రీ అరవిందు లిట్లు వివరించారు "This (Krishna bhakti) is given still more direct turn by a Southern poetess (Andal) is the image of herself as the bride of Krishna"[41] ఇట్లు తమిళదేశంలోని శైవ వైష్ణవ కవులు స్వతంత్ర రచన చేసినను సంస్కృత భాషాభిజ్ఞులేయైనను వారికి తమిళ భాషమీద ఆదరమెక్కువ. పవిత్రమైన గీతాలు వెలయించిన కవులువారు. ఇవి గానానుకూలమై ఉండడం మరో విశేషం.[42] ఈ తమిళంలోని తేవారమ్, దివ్య ప్రబంధాలు దేవాలయాలలో కీర్తించబడేవి. ఇవి పరమ పవిత్రంగా భావించ బడేవి.[43] పోతే మలయాళం చాలకాలం వరకు తమిళంతోనే కలసి ఉండడంవల్ల ప్రత్యేకించి భక్తిపూరితమైన పదకవిత వెలయలేదేమోకాని జానపద కవితకు మాత్రం మా భాషలో కొదవలేదు. ఉలుకుతయ పెరుమాళ్ పాట్టు (రోకంటి పాటలు) అమ్మోతం పురాన్ పాట్టు, రామకథ పాట్టు మొదలైన వీకోవకు చెందినవి కలవు. మంజరీచ్ఛందస్సులో రచితమైన కృష్ణగాథ పేర్కొనదగినది. తత్కర్త ఎవరోగాని మహాభక్తుడని తెలుస్తుంది. ఇంక 18వ శ॥లో ఆటకథ అనబడు కథకళి ఆరంభ మైంది. 'కృష్ణనాట్టం' అన్నది 'గీత గోవిందం'ను అనుసరించి వ్రాయబడిందని పిళ్లల అభిప్రాయం[44].

1.3.4 కన్నడంలో పదకవిత :

తమిళనాడులోని నాయన్మారులా, ఆళ్వారులా భక్తి కన్నడదేశానికి ప్రాకి అక్కడాయా మతాలభివృద్ధిచెందాయి. 'The impulse spread from Tamilnadu to adjacent Karnataka where Comparable to the Nayanars and Alwars, two groups of saints arose the Virasaivas or Lingayats and Hari dasas"[45]. 13వ శ॥లో ఉడిపిదగ్గర ద్వైత మత ప్రవక్తలగు శ్రీమధ్వా చార్యులు అవతరించి శైవమతానికి బసవేశ్వరునిలాగా భాగవతధర్మాన్ని వ్యాప్తిలో నికి తెచ్చాడు ఇతని శిష్యుడు నరహరి తీర్థులు దాసకూట నిర్మాతలు. మరొక శిష్యుడు పద్మనాభ తీర్థులు. ఇతని శిష్యుడే శ్రీపాదరాయలు (1451). కన్నడంలో దేవర నామములనబడే కీర్తనలను రచించి పూజా సమయంలో పాడించే పద్ధతిని ఆరంభించిన ఘనత వీరికి దక్కింది[46]. ఈ కీర్తనలు రంగవిఠలముద్రతో లభిం చాయి. ఈ పాటలలో పద లాలిత్యమూ, భాషా ప్రౌఢిమ, భక్తిశృంగారాదులు నిర్వహించబడి శ్రోతల నాకర్షిస్తూఉంటాయి. శ్రీపాదరాయలముఖ్యశిష్యుడు, విద్వద్వ

రిష్యుడు తపస్సంపన్నుడు వ్యాసరాయస్వామి శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో ఆసామ్రాజ్యానికి తనతపశ్శక్తిని ప్రసాదిస్తూ మహారాజుచే పూజల్ని, సత్కారాల్ని పొందినవాడు. మనోహరమైన మూర్ల కొలది కీర్తనలను రచించి దాస కూటాన్ని ఉన్నతస్థితికి తెచ్చిన ప్రముఖుడు [47]. ఈదాస కూటంలో పురందరదాసు కర్ణాటక సంగీతానికి పితామహుడు. వ్యాసరాయల ప్రియశిష్యులలో పురందరదాసు ప్రథమ గణ్యుడు. మహాపండితుడు. వాగ్గేయకారకచక్రవర్తి. "ఆయన వ్రాసినన్ని కీర్తనలు మరెవ్వరూ వ్రాయలేదు. 'సూళాదులు, ఉగాభోగము' లను కూడా అతడు రచించెను. ఇవి యొక విధమైన పాటలు. పురందరదాసు కర్ణాటక సంగీతాభ్యాసమునకు చక్కని ప్రణాళిక నేర్పరచి దక్షిణ భారతంలో చిరస్మరణీయుడైనాడు."[48]. తెలుగులో వేల కొలది సంకీర్తనలు రచించి సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ పేరు పొందిన అన్నమాచార్యుల కాలంలో యువకుడై తరువాత తానుగూడ కన్నడంలో లక్షవరకు సంకీర్తనలు (దాసరపదగళు) రచించి కర్ణాటక దేశంలోనే గాక ఆంధ్ర ద్రావిడ, మహారాష్ట్ర దేశాలలో ఆరాధ్యుడైన వాగ్గేయకారుడూ, పరమ భక్తాగ్రేసరుడు పురందరదాసు (1484-1564).[49]. ఇట్టి పురందరదాసు ప్రభావాన్ని గూర్చి విశిష్టంగా చెప్పిన రాఘవన్‌గారి మాటలు ఉదాహరించ దగ్గవి.

"The Karnataka movement based on Vishnu-devotion that of the Haridasas, become widely known in non-kanarase areas also, chiefly through its association with music. The great art of the pada-singers of this school Purandaradasa (1480-1564) is revered as founder of modern Karnataka music ... His Padas, the model and source of inspiration for Thyagaraja, are remarkable for their devotion, moral teachings, popular sayings, wit and satire and philosophical truths"[50].

ఇట్టి వ్యాస రాయలశిష్యులలో పేర్కొన దగిన మరో హరిదాసు కనకదాసు. ఇంకా గోపాలదాసు, విజయదాసు, జగన్నాథదాసులు అనేకకీర్తనలు పాడి కన్నడంలో దాసర పదాలకు ఎంతో పుష్టి చేకూర్చారనడంలో సందేహంలేదు.

### 1.3.5 తెలుగులో పదకవిత:

పైపరిశీలన సారాంశానుసారం ఏ సాహిత్యంలోనైనా పదపద్యకవితలలో

పదమే మొదట ప్రారంభమైనదన్న సిద్ధాంతం సర్వజనామోదన్ని పొందిందని వ్యక్తమైంది. అదే రీతిని తెలుగు సాహిత్యంలో పదమే ప్రథమంగా పుట్టింది. 11వ శతాబ్దంలో నన్నయ భారతంతో తెలుగు కవిత్వం ప్రారంభమైనప్పటికీ, నన్నయ ఆదికవియైననూ ఇంతకంటె భిన్నమయిన అసలుకు సిసలయిన తెలుగు కవిత ఒకటి ఉండాలనీ, అదే పదకవిత అనీ, దాన్ని దేశి అని అంటారనీ మనం మరవకూడదు. కవిత్వం మార్గ దేశి అని రెండు విధాలు. పండితులచే లక్షణాను గుణంగా వెలయించబడిన దానిని మార్గకవిత్వమనీ, లక్షణాలతో సంబంధంలేకుండా తమహృదయరుచి ననుసరించి సామాన్య జనులచే వెలయించబడిన దానిని దేశి కవిత్వమనీ చెప్పవచ్చు.[51] ఈలక్షణాలు మొదట సంగీత పరంగా చెప్పబడ్డాయి. "శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమున బ్రహ్మాదులచే మార్గితమై ఈశ్వర సమక్షమున భరతాదులచే ప్రయోగింప బడినది మార్గమనియు, నాయాదేశములందు జనులకు హృదయ రంజకమగునది దేశియనియు జెప్పబడినది"[52]. తరువాత ఇది సాహిత్యానికి సైతం సమన్వయించ బడింది. తెలుగులో మొదట మార్గదేశీ పదాలను వాడిన కవి నన్నెచోడుడు[53]. "శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరమున గాన గంధర్వములను గూర్చి వివరించుచు గానము నిబద్ధము, అనిబద్ధము అని రెండు తెఱంగులనియు, గాంధర్వ గానములు మార్గదేశీ భేదముల కపర రూపము లనియు దెల్పియుండెను. కవిత్వ విషయమున మార్గదేశి పద్ధతులు రెండింట కూడా నీ రెండు తెఱంగులు గోచరించునని చెప్పవచ్చును. నన్నయ్య రచన నిబద్ధ మార్గము. అనగా స్వతంత్రచ్ఛాయలతో కూడిన మార్గపద్ధతి. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న తుమ్మెద వెన్నెల పదాదులు శుద్ధ దేశీమార్గమునకు జెందినవి. అవియు నిబద్ధములు. సోమనాథుని రచనలు నిబద్ధ దేశిమార్గమునకు జెందినవి"[54] "కాబట్టి పాటలు, పదములు, కొన్ని తెఱగుల పద్యములు మొదలగు పాండిత్య నిరపేక్షములగు రచనములును, వానిని బంధించు ఛందో వ్యాకరణ విధులును కొన్ని యంతకు (నన్నయ్య) ముందే గలవనుట నిశ్చయము"[55] "నన్నయ్య గారికి పూర్వము తరువోజలు, మధ్యాక్కరలు రగడలూ కవులు రచిస్తూ ఉండేవారు. సీసపద్యానికి ముడి ఛందస్సనిపించే ఛందస్సులో పాటలుండేవి."[56] నన్నయ కాలమందలి పదాలెలాంటివో మనకు తెలియదు. కాని "నన్నెచోడుని కాలము నాటికి (క్రీ॥ శ॥ 50) ఊయల పాటలూ, గౌడుగీతములు ఉండేవని ఆయన సాక్ష్యమువల్ల తెలుస్తుంది".[57] తెలుగు దేశీయతను సమాదరించిన పాల్కురికి సోమనాథుడు తనకాలంలోని పదాలను పేర్కొన్నాడు.

ఇతడు తన బసవపురాణానికి "ఆతత సకల పురాతన భక్తగీతార్థ సమితియే మాతృక" అని పేర్కొన్నాడు[58].

ఇంకా "మదినుబ్బు సంసార మాయాస్తవంబు
పదములు, పర్వత పదము, లానంద
పదములు, శంకర పదముల్, నివాళి
పదములు, వాలేశుపదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సెజ్జ
వర్ణన మణిగణ వర్ణన పదము
లర్ణవ ఘోషణ ఘూర్ణిల్లు చుండ"

– భక్తులు శ్రీశైల పర్వతారోహణ సమయంలో పాడినట్లు చెప్పాడు[59]. కాని పైని పాల్కురికి పేర్కొన్న అనేకపదాలకు ఆనాడు లక్ష్యాలు లేకపోయినా దేశీ చ్ఛందస్సైన ద్విపద కధిక ప్రాధాన్యం ఇచ్చి కవిత చెప్పిన మహానుభావు డీతడే. అయినా నన్నయ్యకు పూర్వంసైతం అనేక దేశీఫణతులలో పదకవిత్వం తెలుగు దేశంలోఉండి తీరాలి. ధీనికి నిదర్శనం సైతం లేక పోలేదు నన్నయ్యకు పూర్వ శాసనాలు పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. నన్నయ్యకు పూర్వశాసనాల్లో తరువోజ, సీసం, మధ్యాక్కరలు అన్నదేశీయ చ్ఛందస్సులు వాడబడ్డాయి[60] ఇవి కొంతవరకు నిబద్ధ చ్ఛందస్సులలో ఉండడంవల్ల శాసనాల్లోకి ఎక్కాయి. కాని అనిబద్ధాలై పండితులచే ఈసడించబడిన పదాలు పరిగణన లోనికి రాలేకపోయాయి. కాబట్టి వాటికి స్థిరత్వం లేక నశించాయి. ఇక్కడ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారి మాటలుల్లేఖించదగ్గవి. "ఏ వాఙ్మయంలోనైనా పాటలే ముందూ, పద్యాలు తరువాతనూ. కనుక తెలుగులో నన్నయగారికి ముందు పాటలు పుట్టి ఉండాలి. రాజుల పోషణగల సభా వాఙ్మయమే చాలమట్టుకు ఖిలమై పోగా, జానపదుల వల్లింపు మీద ఆధారపడిన పాటలు ఎలాగ నిలబడగలవూ?"[61] అయినా మానవుడు జన్మించి సహజ సంతోష దుఃఖాల అనుభూతిని పొంది నప్పటినుంచీ పదాలు కోకొల్లలు వెలసి ఉంటాయి. పామర ప్రజలే పట్టుగొమ్మలై వాటి కాధారమయ్యారని తలంచవలసి ఉంది. "నన్నయనాటికి తెనుఁగున నెలకొన్న రచనములు పాటలు, పదాలు, ఏలలు, జోలలు, అర్ధ చంద్రికలు మొదలగు గేయ రచనములును, అక్షర

గణములతోగాక మాత్రా గణములలో నిబద్ధములగు అక్కరలు, రగడలు, సీసములు, గీతములు, మంజరి, తరువోజ, ద్విపద మొదలగు పద్యవచనములును, వాని ప్రకృతులును నై యుండును"[62]. "తెల్గు కవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱగులు గలదని లాక్షణికులనిరి. అందు మధుర కవిత యనగా పాటలు మొదలగునవి." అన్నది. పూర్వోక్తం. నాచనసోమనాథుడు ఉత్తరహరివంశమేగాక వసంత విలాసం అన్న ప్రబంధం రచించినట్లు తెలుస్తూంది. అందులో ఒక జాజరపాట ప్రసక్తిఉంది

"వీణాగానం వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
పేరుచెప్పిన పిన బ్రాహ్మణువీట
జాణలు మెత్తుడు జాజరపాట"

— ఇలాంటి తేటతెలుగు పద కవితల చవిచూచే భాగ్యం తెలుగు ప్రజలకు లేక పోయింది ఇదిగాక ఇంకా తదితర పదాలు లభించక పోవడంవల్ల.

తెలుగులో సంకీర్తన వాఙ్మయం కృష్ణమాచార్యులతోనే ఆరంభమైంది. కృష్ణమాచార్యుడు సంకీర్తనలు సింహగిరివచనములు అనే పేరుతో అనేకం రచించాడు ఇవి వచన గంధులు సింహాచలం దేవాలయంలో అయన కీర్తించినట్లు ఆతడు 12వ శతాబ్దమునకు చెందినట్లు పరిశోధనలవల్ల తెలియ వచ్చింది[64]. 12వ శతాబ్దంలో కన్నడ వాఙ్మయంలో సైతం వచన వాఙ్మయం ప్రబలంగా వెలిసింది. అయితే దీని లక్ష్యం వేరు. ఇవి శైవ మత ప్రచారోద్దిష్టమైనవి వీటి నారంభించిన వాడు బసవేశ్వరుడు ఏమైనా తెలుగులో మొదట వాగ్గేయకారుడు కృష్ణమాచార్యు డనడంలో సందేహముండ నక్కరలేదు. ప్రాచీన కాలంనుంచీ దేవాలయాల్లో సంకీర్తన లుండేవని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి మాటలవల్ల వ్యక్తమవుతుంది. "కావ్యరచన చేశారో లేదో గాని నాటి కవులు దేవాలయములలో స్తుతులు చేస్తుండే వారని, ముఖలింగములోని 'సుకవీంద్ర స్తుత్యనిత్యోదయః' అన్న శాసన ఖండంవల్ల తెలుస్తుంది."[65] అహోబలం, సింహాచలం మొదలైన దేవాలయాల్లో 13, 14వ శతాబ్దాల్లో కృష్ణమాచార్యుని నామసంకీర్తనలు సంకీర్తనం చేయబడుతూండేవని

వేటూరి వారు శాసనస్థాధారాల్ని చూపించారు[66]. అంటే కృష్ణమాచార్యులతో ఆరంభమైన సంకీర్తన పద్ధతి ఇలా వ్యాపించిందని తలంచ వలసిఉంది.

"కృష్ణమాచార్యుల తరువాత చెప్పుకోదగ్గ పదకర్త, వచనకారుడు యాగంటి వారు. ఇతనిపదాలు, వచనాలు, ఏలలుకొన్ని ప్రచారంలో ఉన్నాయి. వీరికి ఏగంటివారు, యాగంటివారు, ఆగంటివారు అని వ్యవహారం ఆయా పుస్తకాల్లో వున్నది"[67].

ఇంక శ్రీనాథుని యుగంలోను పదకవితలుండినట్లు స్పష్టమవుతుంది. పదకవితలను ముదివిటుల కింద తీసిపారేశాడన్న నెపం ఒకటి శ్రీనాథుని మీదుంది. కాని ఈమాట అత దని ఉండదనే తలంచాలి. కారణం ప్రత్యక్షసాక్ష్యం అతని పల్నాటి వీరచరిత్ర 14వ శతాబ్దంలో ఓరుగంటిలో పలనాటి వీరుల కథపాడి, ఆడినట్లు క్రీడాభిరామంలోఉంది. ఈ పల్నాటి వీరచరిత్ర మంజరీ ద్విపదల్లో రచితం. "మంజరీద్విపద కావ్యాలన్నీకూడా దేశిరాగవైఖరులతో తాళముతో ఇతర అంగముల మేళవింపుతోపాడుకొనుటకే పుట్టెను." [69] శ్రీ నాథునికి పదకవితపైన అభిమాన మనడానికి

'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"[70].

—అని పామర ప్రజల యక్షగాన పద్ధతిని చెప్పడమేచాలు శ్రీనాథునికి కనకాభిషేకము చేసిన దేవరాయల ఆస్థానంలో చతురుడనే ప్రజ్ఞానామంపొంది సాక్షాత్సంగీత దేవత, అభినవ భరతాచార్య, రాయబయకార తోడరమల్ల అనేబిరుదులు గల కల్లినాథుడుండే వాడు "సంగీత చరిత్రలో రాయబయకార (రాజవాగ్గేయకార) ఉద్యోగం ప్రథమంగా ఆ పేరుతో ఇతనినుంచే ప్రారంభించినట్లు కనబడుతుం"దనీ ఇతడు శ్రీనాథుని కనకాభిషేక సమయాన బిరుద ప్రబంధులు పాడిఉంటాడని శ్రీరజనీకాంతరావుగారి ఊహ. [71] కాబట్టి ఆనాడు గేయప్రబంధాలు ఉండవచ్చునని తలంచడం అసమంజసం కాదు

## 1.3.6 పదవికతా వికాసం :

తెలుగు పదకవితకు 15వ శతాబ్దం వసంతకాలం. అనాడు వేలకు వేలు

పదాలు రచించబడ్డాయి. తెలుగుపదకవితకు ఆద్యుడు అనవద్యుడు అన్నమాచార్యుడు. ఇతడు 1424 వ సంవత్సరంలో జన్మించి 1503లో దివ్యధామం పొందినట్లు తెలుస్తూంది [72] వీరికుటుంబ మంతా కవికుటుంబం. 16వ శతాబ్దం చివరివరకు వీరి పదకవితా ప్రాగల్భ్యం ప్రబలింది. తాళ్ళపాకవారి పదకవిత తెలుగు తల్లికెన లేని మణిభూషణ నికరం అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలు 32000. ఇవి అధ్యాత్మ శృంగార సంకీర్తనలని రెండువిధానాలు శ్రీవేంకటేశ్వరస్వామి కంకితాలు.

"మరి అన్నమయ్యకు పూర్వము వాడుకలోనున్న జానపద గీతములు, జాజఱలు, చందమామ పదములు. తుమ్మెద పదములు, గొబ్బి పదములు, లాలలు, జోలలు, తందనాలు మొదలగునవి ఆయన రచనలో నున్నవి."[73] ఇతడు పద కవితా పితామహుడు, సంకీర్తనా చార్యుడు అని బిరుదులు వహించాడు అవి అక్ష రాల సార్థకం. అంతకు పూర్వమే తెలుగులోని బీజ ప్రాయమైన పదకవిత ఇతని కాలంలో ఫలించింది. అటు జయదేవుని గీతగోవింద ప్రభావమూ, ఇటు ఆళ్వారుల పాశురాల మహిమ, మరోప్రక్క 'దాసర కూటములు' మహిమాన్విత వైశిష్ట్యమూ అన్నమయ్య పద రచనకు ఉపకరించాయి. పూర్వోక్తమైనట్లు తమిళ దేశంలోని వైష్ణవ సాంప్రదాయకులైన ఆళ్వారుల ద్రవిడ ప్రబంధాలు ఉద్బోధ కాలై ఉంటాయి

అన్నమయ్య సతీమణి తాళ్ళపాక తిమ్మక్క 'సుభద్రాకళ్యాణమనేగేయ కావ్యం రచించినది పెద తిరుమలాచార్యులు కూడా సంకీర్తనకర్తగా ప్రసిద్ధి పొందాడు ఇతడు అన్నమయ్య ద్వితీయ పుత్రుడు. అనేకశృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, వైరాగ్య వచనగీతాలు మొదలైన వెన్నో తెలుగున మధుర కవితలు వెలయించాడు. పెద తిరుమలాచార్యుల పెద్ద కుమారుడు చిన తిరుమలాచార్యుడు. "తండ్రి తాతల సత్కవితా సంగీత సంప్రదాయము వేంకటేశ్వర భక్తినిష్ఠా, సంస్కృతాంధ్ర ప్రాకృతాది భాషా వైదుష్యము కలిగిన చిన తిరుమలయ్యకు అష్టభాషా కవిచక్రవర్తి అని, శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కికకేసరి అను బిరుదాలున్నట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. ఇతడు అన్నమా చార్యులు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణాన్ని తెలుగుచేశాడు "[74] ఇతడష్ట భాషాదండకం రచించాడు. పెద తిరుమలయ్య మరొక పుత్రుడూ, చిన తిరుమలయ్య తమ్ముడూ అయిన చిన తిరువెంగళనాథుడనే చిన్నన్న సంకీర్తనలు

మనకు లభించలేదు. కాని ఇతడు అన్నమాచార్య చరిత్ర, అష్టమహిషీ కళ్యాణము, పరమ యోగవిలాసము, ఉషా పరిణయము — అనే ద్విపద కావ్యాలు రచించాడు. ఇట్లే తాళ్ళపాక వారి కుటుంబం తెలుగు సంకీర్తన వాఙ్మయానికి ఎనలేని సేవ చేశారనడంలో అత్యుక్తిలేదు

అటు తర్వాత 16 వ శతాబ్దంలో మధురకవితలు వెలిశాయి. 16వ శతాబ్ది ఉత్తరార్ధమందుండిన కందుకూరి రుద్ర కవిత లిఖించిన ప్రప్రథమ యక్షగానం. అదే కాలంలోనిదే విప్రనారాయణచరిత్ర కలదు. గ్రంథం లభించకపోయినా, ప్రోలుగంటి చెన్నశౌరి 'సౌభరిచరితం' యక్షగానం రచించినట్లు తెలుస్తూంది. ఇతడు నరసింహరాయలచే సత్కరించబడ్డాడట. ఈ నరసింగరాయలు పినవీరభద్రుని పోషకుడూ, అన్నమయ్యకు మిత్రుడు అయిన సాళ్వ నరసింగరాయలే. ఇతడే కూచిపూడి భాగవతుల నృత్యం తిలకించి ముగ్ధుడైన సంబెట గురవరాజును శిక్షించినవాడు. ఈ యక్షగానాల కధిక ప్రాముఖ్యం అంతకు ముందు పండితులలో లేకపోయింది. సామాన్య ప్రజల్లో ఉండేదనడానికి పూర్వోక్తమైన శ్రీనాథుని భీమ ఖండంలోని "కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వమున యక్షగాన సరణి." అన్నది చక్కటి నిదర్శనం అంటే అంతకు పూర్వం నుంచీ ఇలాంటి యక్షగానాలుండేవని తెలుస్తూంది. తెలుగులోని మధుర కవితలలో యక్షగానం ఒకటి. ఈ యక్షగానంలో అనేక పదాలు, దరువులు, కీర్తనలు సామాన్యమే. ఇంకా ద్విపదలు, ఉదాహరణకావ్యాలు వెలిశాయి. అయితే ఇవన్నీ పామరప్రయోజనోద్దిష్టాలే. అయినా కొంతవరకు ద్విపదలు పండితాదరణకు పాత్రమైనా పదకవితకు ప్రాముఖ్యం వచ్చినట్లు లేదు. కాని పండితామోదముద్రగల ప్రబంధాల్లో సైతం నాయిక చెలులతో పుష్పాపచయం చేసే సందర్భంలో రగడఅనబడు గేయ ఫణుతులు ప్రవేశించే ఉన్నాయి. మైసూరు ప్రాంతం 'ఎలహంక' ప్రభువైన పెద్ద కెంపరాయడు (1513-1569) గంగా గౌరీ విలాసమనే తెలుగు యక్షగానం రచించాడు. ఈ విధంగా 17 వ శతాబ్దంలో యక్షగానాలు విరివిగా రచింపబడ్డాయి. అదొక పద్ధతి.

అన్నమయ్య తరువాత పేర్కొనదగిన మహా వాగ్గేయకారుడు నారాయణ తీర్థులు (1580-1680)-ఇతడు శ్రీకృష్ణలీలా తరంగిణి అన్న గేయ కావ్యాన్ని

సంస్కృతంలో రచించిన ఆంధ్రుడు. జయదేవుడే నారాయణ తీర్థులుగా అవతరించా డన్న ప్రతీతి ఉంది. శ్రీకృష్ణలీలా తరంగిణిని సంస్కృతంలోని యక్షగానమంటారు రజనిగారు[75]. ఇతడు తెలుగులో పారిజాతాపహరణమనే యక్షగానమూ, మరికొన్ని సంస్కృత గ్రంథాలు రచించాడు. కూచిపూడిలోనే రచన ఆరంభించినా రాజాశ్రయం కోసం తంజావూరు వెళ్ళినట్లు తెలుస్తూంది ఇతని శిష్యుడు సిద్ధేంద్రయోగి (1600–1700). కూచిపూడి భాగవతమేళాలకు ఆద్యుడు. ఇతడు తన భామా కలాపం అన్న రచనద్వారా కూచిపూడి సంప్రదాయాన్ని ప్రతిష్ఠించాడు. కాని అసలుకు సిసలైన పదకవితలు వెలయించినవారు లేకపోయారు అన్నమయ్య దగ్గరనుంచి క్షేత్రయ్యవరకు.

రాజుల మీదేగాక మువ్వ గోపాలునిపై వేలకొలది పదాలు రచించి తరించిన వాడు క్షేత్రయ్య "తెలుగు పదకవితా కన్యకు పితామహుండు తాళ్ళపాక అన్నమయ్య గారంటిని. కాని జనకుడే క్షేత్రయ్య. తాత మొదలుపెట్టిన పనిని తలపొలము దాకా ఈడ్చిన తండ్రి యితడు."[76] అన్న రాళ్ళపల్లి వారి మాటలు సార్థకమైనవి. ఇతని కాలంలో కంచెర్ల గోపన్న అనబడే రామదాసు అనేక కీర్తనలు భక్తి పరవశుడై రచించాడు. ఈ రామదాసు తెలుగువారి మన్ననలకు పాత్రుడైనవాడు. తరువాత అధ్యాత్మరామాయణ కీర్తనలు రచించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (1730–80) పేర్కొనదగ్గ పదకర్త. ఇంకా ఈ పదకవితలు మహోన్నత శిఖరాల నధిష్ఠించిన సమయం తంజావూరు రాజుల కాలంలోనే. శృంగారరస పిపాసువులైన రాజులు పోషించగా ఎంతోమంది కవులు, కవయిత్రులు, గాయకులు, నర్తకులు వెలసి తెలుగు పదకవితలకు, సంగీతాది కళలకు ఆరోజులు ఆటపట్టయ్యాయి. అన్ని ప్రాంతాలనుంచి కళాకారులు తంజావూరికి వలసపోయారు. ఈ విషయాన్ని చెప్పిన రాఘవన్‌గారి మాటలు స్మరించదగ్గవి. "With Nayaka and Maratha rule at Tanjore, many devout teachers and gifted music composers from Andhra and Maharastra went there; it was as if for a time all literary and cultural roads led to Tanjore. This was the golden age of Karnatak music"[77]. క్షేత్రయ్యకు ఆశ్రయమిచ్చిన విజయరాఘవ నాయకుడు స్వతః పదకర్త. రంగాజమ్మ మొదలైన కవయిత్రులు యక్షగానాల్లో పదకవిత కధిక ప్రాధాన్యమిచ్చారు. విజయరాఘవనాయకుడు కూడా యక్షగానకర్త. ఇతని ఆస్థాన విద్వాంసుడు, చతుర్దండి ప్రకాశిక కర్త అయిన వేంకటమఖి వాగ్గేయ కారాగ్రణి.

కార్వేటి నగరం ఆస్థానంలో ఉండిన సారంగపాణి, క్షేత్రయ్య తరువాత చెప్పుకోదగ్గ వాగ్గేయకారుడు. విజయరాఘవుని ఆస్థానంలోని యక్షగానకర్తలలో కోనేటి దీక్షిత చంద్రుడు, పురుషోత్తమ దీక్షితుడు మొదలైన వారే కాక పెద్దిదాసు అనే పదకర్త సైతముండేవాడు మహారాష్ట్ర రాజుల కాలంలో సంగీత సాహిత్యాలకు మధుర, తంజావూరు రాజ్యాలలో ఎనలేని పోషణ లభించింది గిరిరాజకవి ఘనం శీనయ్య, కాశీ నాథయ్య, వీరభద్రయ్య, శ్రీనివాసయ్య, ఆదియప్పయ్య, మాతృభూతయ్య మొదలైన వారెందరో పదకారులు వెలిశారు. పదాలేకాక శబ్దాలు మొదలైన రచనలు వచ్చాయి. సంగీతానికి పట్టాభిషేకం జరిగింది. త్యాగయ్య (1767–1874) నాదోపాసనలో. త్యాగరాజు భక్తప్రపూరితాలైన కృతులు రచించి కర్ణాటక సంగీతానికి స్థిర రూప మేర్పరచాడు. క్షేత్రయ్య పదాలలో సంగీత సాహిత్యాలు సమపాళ్ళలో ఉండగా, త్యాగయ్య తన కృతులలో సంగీతానికే ప్రాధాన్య మొసగిన మహానుభావుడు. ఇది త్యాగయ్య తాత గిరిరాజకవి కాలంలో ప్రారంభమై త్యాగయ్య నాదంలో ఒక సురూపం పొందింది. త్యాగయ్య కేవలం త్యాగి. రామ భక్తుడు. ఇతని కృతులలో భక్తికే ప్రాధాన్యమెక్కువ. ఇతని ప్రహ్లాదభక్తి విజయం అన్న నాటకం, నౌకాచరిత్రమన్న గేయ నాటకం, సీతారామవిజయం అసంపూర్ణ గేయ నాటకం లభించాయి. త్యాగరాజు తర్వాత ఆ సంగీతాన్ని పెంపొందించినవారు శ్యామశాస్త్రులు, ముద్దుస్వామి దీక్షితులు మొదలైన మహానుభావులు. వారి కీర్తనల్లో, కృతుల్లో సంగీత సాహిత్యాల్లో సంగీతానికే_అంటే ధాతు మాతువుల్లో ధాతువునకే_ అధిక ప్రాధాన్య మిచ్చినా పదరచన క్రమపరిణతి చెందినట్లు స్పష్టమవుతుంది.

# సూచికలు

1. పండితారాధ్య చరిత్ర-పు. 18-20 పరిష్కర్త. డా॥ చిలుకూరి నారాయణరావు, 1939.

2. బసవపురాణము-పు. 8,9 పరిష్కర్త. శ్రీ బండారు తమ్మయ్య-1952

3. కుమార సంభవము 1-23.

4. The Dasarupa–A Treatise on Hindu Dramaturgy. pp. 425.

5. శ్రీ పింగళిలక్ష్మీ కాంతం ఆంధ్రసాహిత్య చరిత్ర- పు. 28-33.

6. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి-సింహావలోకనము- పు. 42.

7. భరతముని నాట్యశాస్త్రము-అధ్యా. 32: శ్లో. 25-47.

8. డా॥ పి. యస్. ఆర్. అప్పారావు - నాట్యశాస్త్రము - అధ్యా. 32 పు. 809.

9. శ్రీ బాలాంత్రపురజనీకాంతరావు-ఆంధ్ర వాగ్గేయ కారచరిత్రము పు. 56,57.

10. పైదే. పు. 57,58,59.

11. పైదే. పు 74,75.

12. శ్రీ ఎం. చిదానందమూర్తి : ఉగాభోగగళు మత్తు వచనగళు-ప్రబుద్ధ కర్ణాటక-సం. 46. క్రోధనం. చైత్ర సంచికె. 1.

మైసూరు విశ్వ విద్యాలయ, మైసూరు, 1964-65.

13. శ్రీ చినతిరుమలాచార్యుడు సంకీర్తన లక్షణము.
Vol. I. The minor works of Tallapaka poets.
Ed. by V. Vijaya Raghavacharya and G. Adinarayana Naidu–1935.

14. డా॥ వేటూరి ఆనందమూర్తి. తెలుగు సంకీర్తన లక్షణము-లక్ష్యలక్షణ సమన్వయము-భారతి-ఆగస్టు 1971. పు. 5,9 ఇందులోని విషయములనే ఇక్కడ చాలవరకు గ్రహించాను.

15. పైదే 12 సూచికలోనిదే పద్యం. 13. పు. 139.

16 పైదే. ప 18,24 పు 141.

17. పైదే. ప. 56,58,59.

18. పైదే 14 సూచికలోనిదే. పు. 11-16.

19 సుబ్బరామ దీక్షితులు; సంగీత సంప్రదాయ ప్రదర్శిని. మొదటి సంపుటము. పు 106–111.

20. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు – ఆంధ్రవాగ్గేయ కారచరిత్రము పు. 75-77.

21. పైదే. పు. 78-80.

22. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ - పదములు క్షేత్రయ్య. ఆంధ్రపత్రిక (సంవత్సరాది సంచిక_చిత్రభాను సంచిక, (1942-43)పు.15.

23. శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య – పీఠిక_శృంగార పదములు పుటలు iii–xxxviii

24. పైదే 19 సూచికలోనిదే_పుట 109.

25. Prof. P. Samba Murthy – South Indian music series. 1–4 p p. 41–56.

26 డా॥ వేటూరి ఆనందమూర్తి - తాళ్ళపాక కవుల పదకవితలు – భాషా ప్రయోగ విశేషాలు_ద్వితీయ భాగము పు.2.

27 ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము – పు. 48–55.

28. పైదే. పుటలు 33, 34, 37, 53.

29. గోవింద దీక్షితులు___సంగీత సుధ.

30. R. G. Moulton - Methods and Materials of Literary criticism —p p. 13 and 14.

31. R G Moulton – The Modern study of Literature – An Introduction to literary Theory and Interpretation – Chicago 1915 — P. 605.

32. పై దే. p. 440.

33. శ్రీ పింగళి లక్ష్మీకాంతం – పీఠిక. పల్నాటి వీరచరిత్ర. పు. 20–25.

34. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ – సాహిత్యోపన్యాసములు–3. క్షేత్రయ్య పద సాహిత్యము. పు. 12,13.

35. Dr. V. Raghavan – The Great Integrators–The Saint Singers of India.

36. Sri Aurobindo – The foundations of Indian culture P 361

37. పై దే.

38. పై దే. 35 వ సూచికలోనిదే. P. 19.

39, 40 ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ – తమిళ సాహిత్యము – దక్షిణ భారత సాహిత్యములు పు 24, 25.

41. పై. 36 సూచికలోనిదే పు. 362

42. పై 39, 40 సూచికల్లోనిదే. పు. 27.

43. పై. 35 సూచికలోనిదే. పు. 21, 22.

44. డా॥ కె. యం జార్జి. అను : చల్లా రాధాకృష్ణశర్మ–మలయాళ సాహిత్యము- దక్షిణ భారత సాహిత్యములు. పు. 116–133.

45. పై. 35 సూచికలోనిదే. పు 24.

46. పై. 12 సూచికలోనిదే.

47. శ్రీ గడియారం రామకృష్ణ శర్మ – కన్నడ సాహిత్య చరిత్ర – దక్షిణ భారత సాహిత్యచరిత్ర. పు 92–94.

48. పై దే. పు. 94.

49. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు. పురందరదాసు-
ఆంధ్రవాగ్గేయ కారచరిత్ర - పు 151.

50. పై. 35 సూచికలోనిదే. పు. 25.

51. ప్రొఫెసర్॥ దివాకర్ల వేంకటావధాని - మార్గదేశి కవిత్వములు-
సారస్వత వ్యాసములు-ప్రథమ సంపుటము పు 21.

52 పైదే. పుట. 19.

53. కుమార సంభవము 1-23.

54. పై. 51 సూచికలోనిదే. పు. 26.

55. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి - సింహావలోకనము. పు. 2.

56. శ్రీ పాదగోపాల కృష్ణ మూర్తి - దేశి సారస్వత విభూతి
_కిన్నెర (డిశంబర్ 1953) పు 553.

57. పైదే.

58. పాల్కురికి సోమనాధుడు - బసవ పురాణము. పు. 9.

59. పాల్కురికి సోమనాధుడు - పండితారాధ్య చరిత్ర- పు. 513.

60. ప్రొ॥ దివాకర్ల వేంకటావధాని - ప్రాఙ్నయయుగము-ఆంధ్ర
వాఙ్మయ చరిత్రము. పు. 9_13.

61. పై 55 సూచికలోనిదే. పు. 8,9.

62. పై 56 సూచికలోనిదే. పు. 557.

63. పై 55 సూచికలోనిదే. పు. 42.

64. విస్సా అప్పారావుగారు - మొదటి ఆంధ్ర వాగ్గేయకారులు నృత్యసంగీత
వ్యాసరత్నావళి. పుట. - 4.

65. పై 56 సూచికలోనిదే. పు. 553.

66. డా॥ వేటూరి ఆనందమూర్తి - మన సంకీర్తన భాండాగారము. అక్షరార్చన పు. 173.

67. పై 56 సూచికలోనిదే. 449

68. శ్రీనాథుని క్రీడాభిరామం. పు. 21, 22.

,, ద్రుతతాళంబున్. ప. 116.

,, గర్జించియరసి. ప. 117.

,, పచ్చని పిండి గంధమును ప. 120.

69. భావరాజు వేంకటకృష్ణారావు - శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర-కిన్నెర (డిసెంబర్ 1949). పు. 58.

70. శ్రీనాథుని భీమఖండం.

71. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము. పు. 33, 34.

72. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి - అన్నమాచార్య చరిత్ర. పీఠిక. పు.2, 3.

73. పై 64 సూచికలోనిదే. పు 5, 6.

74. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పు. 142.

75. పైదే. పు. 175.

76. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ - పదములు-క్షేత్రయ్య-ఆంధ్రపత్రిక - సంవత్సరాది సంచిక-చిత్ర భానుసం. (1942-43) పు.12.

77. The Great Integrators — The Saint Singers of India, pp 30 and 31.

# 2.0 పదకవుల చరిత్ర

పదకవుల చరిత్ర అనడం కంటే వాస్తవానికి పద సాహిత్యచరిత్ర అనడమే సముచితం. కానీ ఇక్కడ పదకవుల చరిత్ర అన్నంత మాత్రంచేత పదకవుల జీవితాల చిత్రణ మాత్రమని కాక, పదకవులు చేసిన రచనలు, వాటి వైశిష్ట్యమూ మొదలైన విషయాల వివరణ ప్రాధాన్యం వహిస్తుంది. పదకవుల కవితా వైభవం మొదలైన విషయాలు తెలుసుకొనే ముందు అయాయుగాలలోని అయాకవులగూర్చి గ్రహించడం ఎంతైనా అవసరం. వాగ్గేయ కారులనే పదకవులు లేదా పద కర్తలు లేదా పదకారులు అనడం లోకంలో ఉంది ఇలాంటి పదకవుల చరిత్రను చక్కగా గ్రహించడానికి అంటే అధ్యయన సౌలభ్యానికి తెలుగుపద సాహిత్యాన్ని యుగాలుగా విభజించు కోవడం అవసరం. ఈ యుగ విభజన ఏ సాహిత్యానికైనా, ఆయా సాహిత్యాల్లో అంతర్భాగాలైన సాహిత్య ప్రక్రియలకైనా అవసరమే. తెలుగు వాఙ్మయాన్ని సైతం అధ్యయన సౌలభ్యార్థం కొన్నియుగాలుగా విభజించి ఉండడం సాహిత్య వేత్తలకు తెలిసిన విషయమే. అదేరీతిలో తెలుగులోని పద సాహిత్యాన్ని కొన్నియుగాలుగా సమంజసమైన రీతిలో విభజించడం అవసరమే. ఇంతవరకు సముచితమైన యుగవిభజన జరగలేదు. దీనికి కారణముంది పద సాహిత్యాన్ని గూర్చిన సమగ్రమైన పరిశోధనలు, అధ్యయనాలు జరిపి ప్రామాణిక గ్రంథాలు రచించ వలసినంతగా తెలుగులో వెలయక పోవడమని చెప్పవచ్చు. కళాప్రపూర్ణ శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారి ఆంధ్రవాగ్గేయకారచరిత్ర మొక్కటే ప్రామాణిక గ్రంథం. అంతకుముందు సుబ్బారామదీక్షితులు వారు రచించిన 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'లో వాగ్గేయకార చరిత్రఉంది. ఇంక డా. వేటూరి ఆనందమూర్తిగారు తాళ్లపాక కవులమీద వెలువరించిన గ్రంథాలు, డా. ఎస్. గంగప్ప క్షేత్రయ్య, సారంగపాణిమీద ప్రకటించిన గ్రంథాలు, అకాడమీలు మొదలైన సంస్థలు వెలువరించిన ప్రత్యేక సంచికలు, ప్రధానంగా త్యాగయ్య మీద అనేకగ్రంథాలు మాత్రమే ఈనాడు ఈ దిశలో మనకు లభించే గ్రంథాలు, కానీ పరిపూర్ణంగా తెలుగు పదకవుల చరిత్రను తెలిపే పద సాహిత్య చరిత్రలేదు.

పదకవుల కవితామాధుర్యాన్ని ఆస్వాదించే ముందు వారి చరిత్రల్ని స్పష్టంగా తెలుసుకోవడం అవసరం. అందుకు యుగ విభజన అత్యంతావశ్యకం. ఇందులో పదరచనా పరిణామాల తీరుతెన్నులు అంతర్లీనంగా ఉంటాయి.

## 2.1 యుగ విభజన :

వాగ్గేయకారచరిత్రను యుగాలుగా విభజించ దొరకొన్న మొట్టమొదటి ఘనత శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారికే దక్కింది. ఆ విషయం ఇక్కడ ఉటంకించడం ఎంతైనా ముఖ్యం.

"వాఙ్మయ చరిత్రమును యుగములుగా విభజించినట్లు వాగ్గేయకారచరిత్ర మును కూడా విభజించవచ్చు. ప్రబంధ రచనా పద్ధతిలోని విశిష్ట లక్షణాలనుబట్టి ఆయాయుగాని నామాపేరు పెట్టడం అన్ని భాషలలోను వాఙ్మయ చరిత్ర కారులవ లంబించిన ప్రసిద్ధ సంప్రదాయం. ఈ సంప్రదాయాన్నిబట్టి మన వాగ్గేయకార చరిత్రమును ఏమే యుగాలుగా విభజించవచ్చునో పరిశీలిద్దాము" అనితెలిపి "సామ గానయుగం, గాంధర్వయుగం, ఆఖ్యానయుగం, ధృవాగానయుగం, రాగకావ్య యుగం, గీత గోవిందయుగం, దేశభాషా సంకీర్తనయుగం, యక్షగానయుగం, ధాతుకల్పనా పరిణామయుగం, సభా సంప్రదాయయుగం, హరికథాయుగం", అని యుగవిభజనచేసి వాటి సార్థక్యాన్ని స్పష్టంగా వివరించారు.[1]

కానీ ఈ యుగవిభజనకీ, వారి గ్రంథప్రణాళికకు అంతగా పొంతన కుదర లేదు. అయితే విస్తృత ప్రణాళికపై ఈ యుగ విభజన చేసినట్లు తెలుస్తుంది. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర అన్నప్పుడు "దేశభాషా సంకీర్తన యుగం" దగ్గరనుంచి మాత్రమే యుగవిభజన వర్తిస్తుంది. అంతకు పూర్వమున్నదంతా పూర్వయుగం గానే మనం చెప్పుకోవడం అవసరం; అవసరమేకాదు సముచితం. దీనిమూలంగా ఈ పద వాఙ్మయాన్ని సృజించిన వాగ్గేయకారునకుగాని, దాన్ని స్థిర పరచిన పద కర్తలుగాని, దాన్ని విస్తృతపరచిన నాదయోగులకుగాని సముచిత స్థానం కనిపించ డంలేదు. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని సముచితంగా పదసాహిత్యాన్ని యుగాలుగా విభజించవచ్చును. ఈపద సాహిత్యంలో ప్రముఖులైన మహాను భావుల పేర్ల మీదుగానే ఆయాయుగాలుగా విభజితం కావడం సైతం మిక్కిలి అవసరం. అనామకులకు ప్రాధాన్యం ఇవ్వడంగాని, ప్రధాన పదకారుల్ని విస్మరించ

డంగాని ఇందులో చేయగూడదనిపని. అందువల్ల ప్రముఖ వాగ్గేయ కారులను, వారు సంగీత సాహిత్యాలకు, భక్తినీతి వైరాగ్య ప్రబోధంతో మానవకోటికి సంస్కృతి మార్గంలో చేసిన సేవను పురస్కరించుకొని యుగ కర్తలుగా మనం గ్రహించడం అవశ్యమాచరించ వలసిన కార్యం.

తెలుగులో పదకవిత అనగానే తాళ్లపాక అన్నమాచార్యులు గుర్తుకు రావలసిందే. అతడు ఈ పదవాఙ్మయానికి చేసిన సేవ అనన్యసామాన్యం. అతని పుత్రపౌత్రులు సైతం ఈ మార్గాన్నే అవలంబించి సుసంపన్నం చేసిన మహానుభావులు. అంటే తాళ్లపాక కుటుంబమంతా ఈ పదవాఙ్మయానికి సేవచేసింది. అంతేగాక అన్నమాచార్యులు సంకీర్తనాచార్యుడనీ, పదకవితాపితామహుడనీ ఆనాటికే ఎంతో ప్రసిద్ధిపొంది ఉండటంవల్ల ఈ తెలుగుపదసాహిత్యానికంతా మూలవిరాట్టు తాళ్లపాక అన్నమాచార్యుడనడంలో విప్రతిపత్తిలేదు. కనుకనే తెలుగుపదసాహిత్యంలో అతని పేరు మీదుగానే ఒకయుగం వ్యవహరించ బడటం చెప్పుకోదగ్గ విషయం అంతకంటే ముందున్న పదకవిత నంతా పూర్వయుగంగా మనం పిలవడంలో దోషంలేదు. కాబట్టి ఈ చక్కటి అవగాహనతో తెలుగుపద సాహిత్యాన్ని ఈ విధంగా యుగవిభజన చేయడం సముచితమని నాభావన.

1. అన్నమాచార్య పూర్వయుగం (1400 వరకు)
2. అన్నమాచార్య యుగం (1400 - 1600)
3 క్షేత్రయ్య యుగం (1600 - 1750)
4. త్యాగయ్య యుగం (1750 - 1850)
5. ఆధునిక యుగం (1850 నుంచి ....)

సముచితమైన ఈ యుగవిభజన మూలంగా పదసాహిత్యాన్ని అధ్యయనం చేయడం చాలానులభతరమవుతుందని చెప్పడంలో ఏ విధమైన సందేహమూ ఉండనక్కరలేదు. పై యుగవిభజన అర్థంపట్టినట్లు వాగ్గేయ కారుల తారతమ్యాన్ని స్పష్టీకరిస్తుంది. పై పెచ్చు మరో సౌలభ్యాన్ని సైతం సంపాదించి పెడుతూంది. పదకవుల చరిత్రఅన్నప్పుడు కేవలం పదకవులే కాక, పదాలు, దరువులు ప్రాముఖ్యం వహించిన యక్షగాన కర్తలు, కాలజ్ఞాన తత్వకర్తలు, అద్యతనయుగంలో వెలసిన

హరికథా వాగ్గేయకారులు వారి వారి కాలానుగుణంగా పై యుగాల్లోనే ప్రస్తావనకు వస్తారు. అంటే ఈ యుగవిభజన నిర్దుష్టమూ, నిర్దిష్టమూనై చక్కటి సమన్వయంతో సముచితమై ఉన్నదని స్పష్టమవుతుంది.

ఈ యుగవిభజన ఆధారంగా అయా యుగాల్లోని ఆయా పదకవుల గూర్చి సంక్షిప్తమే అయినా సముచితంగా తెలుసుకోడానికి ప్రయత్నిద్దాం.

## 2.2. అన్నమాచార్య పూర్వయుగం (1400 వరకు) :

తెలుగులో వెలసిన పదకవులందరిలోనూ చుక్కల్లో చంద్రుడిలా జగజ్జేగీయమానంగా వెలుగుతూన్నవాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు. వాస్తవానికి అన్నమాచార్యునితోనే పదకవితకు పట్టంగట్టబడినట్లు మనకు తెలుసు. సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ అతనికి బిరుదులు. కాబట్టి అన్నమాచార్యుని ప్రధాన పదకవిగా గ్రహించి ఈయుగవిభజన చేయడం సమంజసంగా జరిగింది. అన్నమాచార్యునికి పూర్వం ఉన్నయుగాన్నంతటినీ అన్నమాచార్య పూర్వయుగమని పేర్కొనడం సముచితమే. వాస్తవానికీ యుగం తెలుగు సాహిత్య యుగవిభజనలో ప్రాఙ్నన్నయయుగం లాంటిదంటే సుస్పష్టమవుతుంది. నన్నయకంటే పూర్వమున్న శాసనాల వల్లనైతేనేమి, అంతకు పూర్వమూ, సమకాలికమూ అయిన జానపద సాహిత్యంలో అయితేనేమి ఎలాంటి పదకవిత ఉండేది, నన్నయనాడు, నన్నెచోడుని, పాల్కురికి సోమనాథుని కాలంలో ఆవెనుక 1400 వరకు ఎలాంటి పదకవితలు వెలిశాయి, సూక్ష్మంగా పరిశీలించడమే ఈ యుగంలో ప్రధానంగా చేయడం వాస్తవానికీ ఈ విషయాన్ని ప్రథమప్రకరణంలో తెలుగులో పదకవితావికాసాన్ని గూర్చి వివరించిన సందర్భంలో మనకు సుబోధమైంది. పోతే ఈ యుగాని కంతటికీ తెలుగువాగ్గేయ కారుల్లో మొట్టమొదట పేర్కొనదగ్గ సింహగిరివచన రచన చేసిన కృష్ణమాచార్యుడొక్కడే ప్రముఖంగా మనముందు నిలుస్తాడు. అంతకుముందే ఈ పదకవిత ముఖ్యంగా సంస్కృతంలో వెలసినా, మన తెలుగునాడులో సైతం దానికి ప్రాముఖ్యమూ, ప్రచారమూ ఉండటంవల్ల ఆ విషయాన్ని ఇట ఆరంభంలోనే తడవటం అసమంజసమేమీకాదు. పైగా అవసరంగూడా. అందులో ముఖ్యంగా గీతగోవిందకర్త జయదేవుడు, శ్రీ కృష్ణకర్ణామృతకర్త లీలాశుకుడు అనే సంస్కృతకవులను గూర్చి క్లుప్తంగా వివరించడం ఇందుకుపకరించే విషయం.

తెలుగు జానపద కవితావిర్భావం అనాది. తెలుగుజాతి బతుకులో ఒకభాగం. అది అనియతం కావడం వల్లా, అదికేవలం ఆశువు (Oral) కావడం వల్లా దాని స్వరూప స్వభావాన్ని అనాదినుంచి పరిశీలించే అవకాశంలేదు. ఆధునికయుగంలో మాత్రమే జానపదవాఙ్మయ ఉద్ధారకులు సేకరించి పరిరక్షించడానికి యత్నించారు. ఇదిఎన్నో మార్పులకు గురిఅయి ఈనాటి రూపంలో ఉందని మనకు తెలుస్తుంది. పోతే ప్రాఙ్నన్నయ యుగంలో లభించిన శాసనస్థ ఆధారాన్నిబట్టి నన్నయకు పూర్వం తరువోజలు, మధ్యాక్కరలు, ద్విపదలు, సీసం, రగడలు మొదలైన దేశీచ్ఛందస్సులలో గానయోగ్యంగా పదాల్లాంటి పద్యాలుండేవని తెలుస్తుంది. వీనిలో ద్విపదను నన్నయ భారతమున వ్రాయకున్నను తద్వికారమనఁదగు తరువోజను గ్రహించెను. అతని భారతమున 'రగడ' రచనలులేవుకాని నాఁటిచాళుక్యరాజరాజు కోరుమిల్లి శాసనమున భిన్నయతులు గల సంస్కృత రగడరచన మున్నది కావున శిష్టసాహిత్యమునఁగూడ నీతీరు రచనల కానాఁడే ప్రవేశముకలిగినదని చెప్పవలసి యుండును.

"ఇఁకనన్నెచోడుడు దేశి కవితను పేర్కొని 'దేశి సత్కవుల సంస్తుతి' చేసియే యున్నాడు. అంతేగాదు. దేశి కవితాశాఖకుఁజెందిన తనకాలపు గేయఫణితు లను గొన్నిటినిగూడ పేర్కొనెను. అతడు కుమారసంభవమున ఈశ్వరునిగూర్చిన అంకమాలికలు (3-38) (11-51); కల్లుదించువారి "గౌడుగీతికలు" (6-45); శబరకామినులు 'రోకటిఁగొని దంచుపాటలు (6-47), ఉవిదలింపుగపాడు' నూయల పాటలు' (4-89); మున్నగువానిని ప్రస్తావించుచు' వనపాల బాలికలు నవలతికాంపో లముల వేడ్క నలుపుచు నాలతు లొగిఁజేసిపాడిన (4-112) విధమును గూర్చియు, అంకమాలికలను "పనిగొన సాహుళి ఫలమంజరమునఁ బేరాళి నాందోళి భైరవి నాట నునుపార నాలతుల్ నూల్కొనఁజేసి" (9-135) పాడినరీతిని గూర్చియుఁగూడ కొంత వివరించెను. ఇవి యెల్లనాడు ప్రచారమందుండిన దేశి వరుసలే. వీనిలో 'అంకమాలికలు' పాడుకొనుటకు వీలుగా నక్షరక్రమమున మాలికారూపమున పాల్కు రికి సోమనాథుడు రచించిన 'అక్షరాంకమాలిక'లను గద్యపద్యాదులను బోలిన రచన లేమో! ఇఁకనతడు పేర్కొన్న ఊయల, దంపుళ్ళపాటలు నాటివి కానరాకున్నను నేటికిని ప్రచారమందున్న వరుసలే."[2]

ఇలాగే పాల్కురికి సోమనాథుని కాలంలో తుమ్మెదపదాలు, గొబ్బిపదాలు, వెన్నెలపదాలు మొదలైన పదాలు పాడుతున్నట్లు చెప్పిన విషయం పూర్వోక్తం. ఇలాగే జోలపాటలు, కోలాటపాటలు, చాగుభళాలు మొదలైన పాటలు పాడుతున్నట్లు సైతం ఇతడు పేర్కొన్నాడు.[3] పాల్కురికి సోమనాథుని కాలంనాటి సంగీత సంప్రదాయాన్ని గూర్చి వివరించిన శ్రీ రజనీకాంతరావుగారి మాటలు ఉల్లేఖించదగ్గవి.

"పాల్కురికి సోమనాథుని సంగీత శాస్త్ర వైదుష్యము అసాధారణమై యుండాలి. భారతదేశములోని వివిధ రాజ్యాలలో నెలకొని, అలముకొంటూ వుండిన వివిధ సంగీత పద్ధతులలో సోమనాథునిది ప్రత్యేకించి చెప్పదగిన శాఖలోనిదని తోస్తుంది. ఈ శాఖలోనికొన్ని అంశములకు శార్ఙ్గదేవుడు మొదలైన సమకాలిక లక్షణకర్తల పద్ధతిలోని అంశములతో ఏకాంత మాత్రమో సాధారణ దృష్ట్యా సామ్యం ఉన్నప్పటికీ విశేషాంశాలెన్నిటినో సోమన పద్ధతి తనకాలపు దేశీయగాన సంపదనుండి పుణికి పుచ్చుకున్నట్లు ఊహింపవచ్చు"[4]

"సోమన పేర్కొనిన పదప్రక్రియలట్లుండగా నాతని అక్షరాంక పంచ ప్రకారాది గద్యములును, బసవాష్టక గంగోత్పత్తి సద్గురు చెన్నబసవ రగడాదులును సుప్రసిద్ధములగు గేయకృతులే యనవలెను. వీనిలో గద్యపయములగు నీతని గేయకృతులే తరువాతి కాలమున వచన సంకీర్తన పద్ధతి యనునొక నూతన పద్ధతికిఁగూడ దారితీసినది. సోమనాథుని ఈ రచనల తరువాత చక్రపాణి రంగనాథుని రచనలుగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చేత నిటీవల ప్రకటింపబడిన నయన, నమశ్శివాయ రగడలును, కృష్ణమాచార్యుని రచనలుగా నా పరిశీలనమున గుర్తింపబడిన రామనామ, నృసింహనామములనఁబడు రగడ రచనలునిట పేర్కొనవలసియున్నది. వీని తరువాత నాచన సోమనాథుని జాజరపాటయే మనకునేఁటి లక్ష్యోదాహరణము నించుక మిగిలియున్నది"[5]

ఎర్రాప్రెగ్గడ సంగీతరసికుడట. పోతన 'గోవిందుమీద పాటలు, చాలు నంకించి పాడెడుపాటలు' పేర్కొన్నాడు. శ్రీనాథుడు జాజరలనబడే చర్చరీ గీతాలను, పల్నాటివీరగాథల్ని పేర్కొన్నాడు. దేశిరచన యక్షగానరీతిని

ప్రశంసించాడన్న విషయం పూర్వోక్తం. పుడికిసింగన 'చతురలీలలనాడి సంకీర్తనము చేసిన వైఖరిని ప్రస్తుతించాడు. ఆ వెనుక తాళ్లపాకవారి సమకాలికులు, ఆ తరువాతి తెలుగు కవులు తమ సంగీత పాండిత్యాన్ని ప్రకటించుకొన్నారు.

ఈ యుగంలో అన్నమాచార్యులకు ముందు పదకవులని చెప్పదగ్గ వాగ్గేయ కారులు లేరు. కాని భగవత్‌స్తుత్యాత్మక వచనాలు రచించి పాడిన కృష్ణమాచార్యులు మాత్రమే మనకు కనిపిస్తాడు కృష్ణమాచార్యుని గురించి తెలుసుకొనేముందు సంస్కృతంలో ప్రసిద్ధగేయకృతి గావించిన జయదేవుని స్మరించడం అవసరం.

జయదేవుడు (1090-1153) :

"అది పండ్రెండవ శతాబ్దారంభం. అప్పటికింకా భారతీయ సంగీతంలో ఉత్తర హిందూస్థాన, కర్ణాట పద్ధతులనే చీలిక రాలేదు. ఇంకా శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరం వెలువడటానికి కా శతాబ్దం పూర్తికావలసి యున్నది చరిత్ర కారులు ఆ కాలాన్ని రాజపుత్రయుగం అన్నారు అప్పుడు ఉత్తర భారతదేశమంతా ఖండ ఖండాలై వేర్వేరు రాజుల పాలనలో ఉంటోంది. పడమట పాంచాలం మొదలు తూర్పున గౌడదేశం (బంగాళం) వరకు వేర్వేరు రాజ్యాలు మహారాష్ట్ర కర్ణాటకా లలో పశ్చిమ చాళుక్యులు, కళ్యాణి చాళుక్యులు, ఆంధ్రదేశంలో తూర్పు చాళుక్యులు, దక్షిణాన చోళులు తమతమ రాజ్య విస్తృతికి కట్టుదిట్టాలు చేసికొని దేశ భాషలలో సాహిత్య కళలను ఉద్ధరించడానికి ప్రారంభించారు. అప్పటికప్పుడే రాజరాజనరేంద్రుడు నన్నయభట్టు చేత మహాభారతం తెలుగులో వ్రాయించాడు (1060)"[6].

కావ్యగీతి ప్రియుడు, కవిపండిత గాయక పక్షపాతి, స్వయంగా సంగీత సాహిత్య పండితుడూ, ప్రబంధ రచనాదక్షుడూ అయిన లక్ష్మణసేనుడనే రాజు గౌడ దేశాన్ని 1116 నుంచి 1160 వరకు పరిపాలించాడు. అతని ఆస్థానంలో వెలసిన వాడే వరకవి జయదేవుడు. ఈతని గీతగోవిందం సంగీత సాహిత్యాల సమ్మేళనం. రమాదేవి భోజదేవులు ఇతని తల్లిదండ్రులు. ఇతని జన్మస్థానం బిందుబిల్వం. కాని కొన్ని శ్లోకాల్లో కేందుబిల్వమనీ, కిందుబిల్వమనీ, తిందుబిల్వమనీ చెప్పబడింది. బహుశా ఇది వ్రాయసగాండ్ర దోషమేమో ! బిందుబిల్వం ఒరిస్సాలో జగన్నాథ

క్షేత్రానికి సమీపాన ఉంది. కాని వంగదేశంలోని దిది అంటారు కొందరు. అక్కడ ఏటేటా జన్మదినం జరుపుతారట. కొన్ని సాక్ష్యాధారాల్నిబట్టి జయదేవుడు సుమారు 1090 లో జన్మించి 1153 వరకు జీవించినట్లు తెలుస్తుంది బహుశా ఓఢ్ర దేశంలో జన్మించినా వంగదేశంలో జీవించి ఉత్తమ వాగ్గేయకారుడుగా ప్రసిద్ధిపొంది ఉంటాడని భావించడం అసమంజసమేమీకాదు 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ' అని తన భార్య పేరు పద్మావతి అని పేర్కొన్నాడు. జయదేవుడు రాధాకృష్ణ భక్తుడు. రాధాకృష్ణ ప్రణయాన్ని ప్రబంధాలుగా గానం చేస్తుండగా పద్మావతి నాట్యం చేస్తూ ఆ ప్రబంధాల్లోని భావాల్ని అభినయిస్తూ ఉండేదట. ఆ ప్రబంధాలే క్రమగతిని గీత గోవిందమై వెలిశాయి

"ఇతని అష్టపదులలో కీర్తి ధవళము, మంగళాచరణము, భ్రమరపదము, గరుడపదము వంటి దేశి ప్రబంధరీతులు కనిపిస్తాయి 'ప్రళయ పయోధిజలే' అను దశావతారాష్టపది కీర్తి ధవళము. ఇది సంగీత లక్షణకర్తలు ప్రబంధాధ్యాయా లలో స్పష్టీకరించిన ధవళ ప్రబంధంగా మాత్రమేకాక, తెలుగు మధుర కవితా రీతు లలో ఒకటయిన ధవళంగా కూడా మనం గుర్తించవచ్చు. అలాగే ద్వితీయాష్టపది 'శ్రిత కమలా కుచమండల' అనేది మంగళాచార ప్రబంధం భ్రమర పదాని కుదా హరణం. 'చందన చర్చిత నీల కళేబర పీతవసన వనమాలీ', గరుడ పదాని కుదాహరణ, 'వహతి మలయ సమీరే మదన హృదయముపనిధాయ'. "రాధా గోవిందుల ప్రణయ, విరహ, విశ్లేష, కలహ, ఖండన, సానునయ, సమాగమ, సంధానముల ద్వారా జీవబ్రహ్మైక్య సంధాన వేదాంతం వ్యంజితమవుతోందని గీత గోవిందం పరమార్థం తెలిసిన పెద్దలు చెబుతారు."[7]

ఇంకా చంద్రాలోకం, రీతిమంజరి, కారకనాదం, తత్వచింతామణి అనే గ్రంథాలకు కర్త జయదేవుడన్న ప్రతీతి ఉంది. ప్రసన్న రాఘవ నాటక కర్తా, శృంగార మాధవీయ చంపూరచయిత వేర్వేరు జయదేవ నామకులని, గీతగోవింద కర్తకాదని తెలుస్తుంది.

లీలాశుకుడు (13 వ శ.) :

జయదేవుని తరువాత భారతదేశంలోని ప్రసిద్ధ వాగ్గేయకారుడు లీలాశుకుడు. ఇతని కాలం 13 వ శతాబ్ది అని పండితులు తలంచారు. ఇతడు ఉత్కళుడని కొందరు

తలంచినా, ఆంధ్ర దేశీయుడని పలువురు అంగీకరించారు. లీలాశుకుడు తన కృష్ణ కర్ణామృత కావ్యాన్ని తెలుగు కవుల్లాగానే – ఆశ్వాసాలుగా విభజించడంవల్ల, చింతామణి వేశ్యమూలంగా సన్యసించిన బిల్వమంగళుడన్న ప్రవాదం ఉండడం వల్ల, 16 వ శ. లోని పెనుగుహూడి వెంగాగణి అనే కవి కృష్ణకర్ణామృతాన్ని తెలుగులోని కనువదించడం వల్ల లీలాశుకుడు ఆంధ్రుడని శ్రీ రజనీ కాంతరావు గారి భావన.[8]

కాని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారీ విషయాన్ని అంగీకరించలేదు. "ఇట్లే శ్రీరజనిగారి అభిప్రాయాలు కొన్నిటిని యథావత్తుగా అంగీకరించడం కొందరికి సాధ్యం కాకపోవచ్చు. లీలాశుకుడు ఆంధ్రుడనుకొనడానికి వారందించిన హేతువులు చాలా దుర్బలములుగా నాకు కానవచ్చినవి."[9]

"జయదేవుడు గీత గోవిందంలో రాధాకృష్ణుల ప్రణయ శృంగారంలో అవస్థా భేదములను ప్రదర్శించి, మానవ మనస్తత్వానుగుణమైన రూపక నిర్మాణం చేశాడు లీలాశుకుడు గోపికలతోపాటు తన్ను, మనలనుకూడా నాయికలనుచేసి, నాయకుడైన శ్రీకృష్ణ కిశోరమూర్తి దివ్యమంగళ విగ్రహాన్ని తనివితీరా కోటిధంగులలో ప్రదర్శించడమే కాకుండా ఆదర్శంలో తనకూ మనకూ కూడా కలిగే సత్య సౌందర్య పరమావధియైన ఆధ్యాత్మికానందంద్వారా నిర్మాణాన్ని ప్రసాదించిన వాడయాడు.[10]

సంగీత సభలలో రాగమాలికలుగా గానంచేసే కృష్ణకర్ణామృత శ్లోకాలు : 'కస్తూరీ తిలకంలలాట ఫలకే; కస్తంబాల బాలానుజః; కాళిందీ పులినేషు; గోధూళీ ధూసరిత కోమల; సాయంకాలే వనాంతే కుసుమిత సమయే; హేగోపాలక హేదయా జలనిధే; రామోనామబభూవ హుం; మొదలైనవి. గేయచ్ఛందస్సులున్న వృత్తాలు నర్కుటం, మంజుభాషిణీ; హరిణీప్లుతం, మాలిని, పృథ్వీ, మత్తకోకిల, తోటకం, మొదలైనవి. "ఇత్యాదిగా సంగీతానికి, నృత్యానికీ, అభినయానికీ, చిత్రలేఖనానికీ, శిల్పానికీ ప్రదర్శన యోగ్యాలయిన గేయచ్ఛందస్సులు కృష్ణకర్ణామృతం ద్వారా మనకు అందించిన లీలాశుకుడు శిశుసౌందర్యంలో పరబ్రహ్మానుచూసి, భక్తి శృంగార పరమావధిలో అధ్యాత్మిక బ్రహ్మానందము కలిగించిన ప్రముఖ వాగ్గేయ కారులలో అద్వితీయుడు" [11].

## కృష్ణమాచార్యులు (1268-1323) :

"13వ శతాబ్దివాడే అయి సింహగిరి నరహరిపై వచనమాలికాగేయాలు రచించిన కృష్ణమాచార్యుడు శివాఖ్యునికి సమకాలికుడవుతున్నాడు. ఆ కాలంలో ఆంధ్రదేశాన్ని పరిపాలించిన కాకతీయ రాజులు శైవమతాభిమానులు. దేశం అంతటా శైవమతం ప్రచారంలో ఉండేకాలంలో శివాఖ్యుడు ఆరంభంలో పంచాక్షరీ మంత్రోపాసకుడు కావడం సమంజసమే. కృష్ణమాచారి నెలవైన సింహగిరి లాగానే కాకతీయ రాజధానికి అంత సమీపంగాలేని వైష్ణవక్షేత్రమైన వేదాద్రికి చుట్టు పక్కల ఇతడు సగం జీవితం గడిపి ఉండవచ్చు."[12] అని శ్రీ రజనీకాంతరావుగారి అభిప్రాయం.

కృష్ణమాచార్యుడు కాకతీయ రాజులలో రెండవ ప్రతాపరుద్రుని (క్రీ. శ. 1254-1323) కి సమకాలికుడు. ఇతని జననం శ్రీ నిడదవోలు వెంకటరావు మొదలైన పండితుల ప్రకారం 1290. కానీ కృష్ణమాచార్యులు వచనాల ఆధారంగా అతని జననం 1268లో కావచ్చునని డా॥ వేటూరి ఆనందమూర్తిగారు అభిప్రాయ పడుతున్నారు.[13]. అందుకు తగిన ఉపపత్తులు చూపించారు. కానీ డా॥ ఎమ్. కుల శేఖరరావుగారు అతని జననం 1265-70 ప్రాంతమంటున్నారు.[14]. కృష్ణమాచార్యుని స్వగ్రామం సంతూరు లేక సంతనపురం. ఇది ఆంధ్రదేశంలోనిదే అనీ. ఈనాడు తెలంగాణా మహబూబ్ నగర్ జిల్లాలోని సంతవూరని డా॥ ఎమ్. కుల శేఖరరావుగారు నిరూపించారు[15]. దీన్ని డా॥ వేటూరి ఆనందమూర్తి అంగీకరించారు, ఇది సముచితంగానే ఉంది.

వృత్తిపాతయోగాన పుట్టడంవల్ల అబాలుని తల్లిదండ్రులు పాడుబావిలో పడవేసిపోగా కుమార (కుమార) నామక సన్యాసి రూపంలో నృసింహ స్వామియే రక్షించి, సింహాచలానికి చేర్చగా అక్కడ స్వామివారి అభిషేకక్షీరాన్ని ఆస్వాదించి కళ్ళుకద్దుకోగా చూపువచ్చిందట. ఇతని మేనమామ శ్రీ రంగాచార్యులు ఇతన్ని గుర్తించి పిల్లనిచ్చి పెళ్ళిచేశాడు సాంసారిక జీవితం గడుపుతూ పుత్రసంతానం పొంది, పుత్రవియోగంలో బాధపడి, సంకీర్తన వాక్పూజలు చేస్తూనే ఆవెనుక వేశ్యాలోలుడై ఉండగా, అతని దర్శనార్థం పొతకమూరు అర్జున సోదర భాగవతులు వచ్చారు. వారి దర్శనంతో కృష్ణమాచార్యునికి కనువిప్పు కలిగింది. ఇలాగా ఎన్నో కథలున్నాయి." ఏది యేమైన భక్తిసంకీర్తలను పాడుకొంటూ మహిమలెన్నో ప్రద

ర్శిస్తూ ఈ మహనీయుడు, పుట్టింది సంతనపురంలోనే అయినా, బహుకాలం సింహా చలంలోనూ, నడుమ కాలం వోరుగల్లులోను, చివరకు శ్రీరంగంలోనూ జీవయాత్ర సాగించినట్లు తెలుస్తుంది. ఆంధ్రదేశంలోని ప్రసిద్ధవైష్ణవ పుణ్యక్షేత్రాలనన్నిటిని దర్శించినట్లు కూడా తనవచనాలలో ఆయనే పేర్కొన్నాడు" 17.

కృష్ణమాచార్యుని వచనాలపై కర్ణాటక వీరశైవ వచనాలు, సంస్కృతంలో రామానుజస్వామి విరచితగద్యత్రయం ప్రభావం ఎంతోఉందని విజ్ఞుల అభిప్రాయం వివిధపదాల నిర్వచనాలు మొదలైన వివరణ ప్రథమ ప్రకరణంలో మనం గ్రహించాం. వృత్త, నిబంధపదాలనీ, చూర్ణాఖ్యాలనీ పదాలు మూడువిధాలు. అందులో కృష్ణమాచార్యునివి చూర్ణాఖ్య పదాలని తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు తెలిపాడు.

"ధర కృష్ణాచార్యాదిక
పరి కల్పిత పదము తాళ బంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరగు ననిర్యుక్త నామ భాసితమగుచున్" 18.

దీన్ని కొందరు తాళగంధి అని అంటారని, తాళగంధి అంటే ఇదనివీరు తెలిపారు—

"ఛందో గణముల నియతిం
బొందక తాళ ప్రమాణమునఁగడుఁజెలువై
కొందరిచేఁదచ్చూర్ణం
బందముగా తాళ గంధియనఁ బొగడొందున్" 18.

కృష్ణమాచార్యుడు అనియత పదాలైన చూర్ణనామక వచనాలు రచించి తరించాడు.

"ఆంధ్రదేశమున వచనరచనకు, భజన సంకీర్తన పద్ధతులకు పరమా చార్యుడు, ప్రపితామహుడు నయినవాడు మన మెరిగినంతలో నీ కృష్ణమాచార్యుఁడే. 'ఓం నమోనారాయణాయ', అనియు 'నమోనమో లక్ష్మీవల్లభా' అనియు, 'అనాథపతి సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ!" అనియు, మాయతి రామానుజముని వరం దాతారు కృష్ణకుమారస్వామి నరహరీ నమోనమో దయానిధీ! 'అనియు పరబ్రహ్మ సింహగిరి నరహరీ నమోనమో దయానిధీ! అనియు మకుటములుగా

స్వామి వారి యనంతనామగుణ కథలకు వచన భావంబున నీతడు విన్నపము సేయు చుండెడివాడు. ఈ విధమున కృష్ణమాచార్యుడు పాడుకొన్న వచన సంకీర్తన ములలో విన్నపములుగాను, చూర్ణికలుగాను గుర్తింపదగినవి కొన్ని మాత్రమే మనకు లభించినవి .... పదునైదు, పదునారు శతాబ్దాలలో వెలసిన తాళ్లపాక కవీశ్వరులు ఈ కృష్ణమాచార్యునే తమకు మార్గదర్శకుడుగను, తాళబంధచ్ఛందో విరహితమై చూర్ణాఖ్యంబరగు నట్టి పదరచనలకు పరికల్పకుడుగను పేర్కొని నారు"[19].

కృష్ణమాచార్యుని లభ్యమైన కృతులు వచన సంకీర్తనములు, తులసీ మహాత్మ్యము, నృసింహనామాలు, రామనామ కీర్తనము, రామనామాలు అయినా ఈతడు చాతుర్లక్ష వచనాలు రచించినట్లు తెలుస్తుంది వాటిని వైష్ణవమత సిద్ధాంత ప్రతిపాదకాలు, పురాణ సంబంధమైనవి, వేదాంత పరమైనవి, నీతిబోధకమైనవి అని నాలుగు విధాలుగా విభజించవచ్చు, భక్తి ప్రబోధాత్మకంగా, వర్ణవ్యవస్థా రహితంగా చెప్పిన ఒక వచనం.

"దేవా విష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము సేయునతఁడెకుల జుండు, శ్వపచుండైన నేమి ? ఏ వర్ణంబైన నేమి ? ద్విజున కంటె నతఁడె కులజుండు. సంధ్యా (వందనాది) నిత్య కర్మానుష్ఠానంబులు తప్పక నడపిననేమి ? సకల ధర్మంబులు సేసిననేమి ? మా సింహగిరి నరహరి దాసులకు దాసువైనం గాని లేదుగతి. స్వామీ ! సింహగిరి నరహరి నమోనమో దయానిధీ !"[20].

కృష్ణమాచార్యుని వచనాల ప్రభావాన్ని గూర్చి డా॥ ఎమ్ కులశేఖరరావు గారిలా వివరించారు

"తెలుగు భాషలో నవచనసైక చేయుటలో ప్రథముడైన కృష్ణమాచార్యుల ప్రభావము అతని తరువాత ఆంధ్ర రచయితలపై స్పష్టముగా కాన్పించు చున్నది. రచన పద్ధతి యందును, భావమునందును, సంప్రదాయమునందును ఈ ప్రభావ మితరరచయితలపై నున్నది. స్తుతి వచనములు వ్రాయుట యందీతడే యగ్రగామి యగుటవలన నీ సంప్రదాయమును పాటించి రచనలు చేసిన శ్రీ వేంకటేశ్వర వచనములు, శతకోప విన్నపములు, కాళికాధీశ్వర వచనములు మొదలగు వాని రచయిత లందరును నీతని యనుయాయులే "[21]

ఇలాగా వచనాలు రచించి సంకీర్తన పద్ధతికీ, వైష్ణవభక్తి ప్రవృత్తికి చక్కగా ప్రచారంతెచ్చిన ఘనత కృష్ణమాచార్యునికి దక్కుతుంది. పైపెచ్చు తదితర యుగాల వారిపై తనప్రభావాన్ని అనంతంగా నెరపిన మహానుభావుడీతడే. ఏమైనా తెలుగులో అన్నమాచార్యుని పూర్వయుగంలో వాగ్గేయకారుడుగా చెప్పదగిన వాడు ఒక్క కృష్ణమాచార్యుడే అన్నది సారాంశం

2.3 అన్నమాచార్య యుగం (1400-1600) :

తాళ్లపాక అన్నమాచార్యుడే తెలుగులోని పదకవితలకు ఆద్యుడు. ఆతని పేరు మీదుగా ఈ యుగం పిలువబడడం ఎంతైనా సముచితం. యుగం అంటే సామాన్యంగా వంద ఏళ్లని లెక్కలోకి తీసుకోవడం పరిపాటి. అయితే ఇక్కడ అన్నమాచార్యయుగం 1400 నుంచి 1600 వరకు. అంటే ఆయన మరణానంతరం సుమారు వంద యేండ్లు కలుపుకొని పిలవడం జరుగుతూంది. కారణం ఆతని పుత్ర పౌత్రులు 1562 వరకు కొనసాగారు. వీరిలో ఎవరినీ యుగకర్తగా స్వీకరించ వీలులేదు. పోతే ఈ యుగంలో తొలి యక్షగాన కర్తలు, తత్వకర్తలున్నారు. వారిని పదకర్తలుగా చెప్పుకోవడం తప్ప సంగీతానికి వారు చేసిన సేవ అంతగా కానరాదు. కాబట్టి వారెవరూ యుగకర్తకాదగిన అర్హతను పొందలేకపోయారు. ఆ తరువాత అన్నమాచార్యునంతటివాడు క్షేత్రయ్య. క్షేత్రయ్య వరకు కొనసాగిన కాలాన్ని మనం అన్నమాచార్యయుగం గానే పిలవడం సముచితమని భావిస్తున్నాను

కృష్ణమాచార్యులు అనిబంధ పదాలైన వచనాలు రచించి తరించాడు. ఇది దేశీ రీతి. మార్గ పద్ధతిలో నిబద్ధపదరచన జయదేవునితో ఆరంభమైన సంగతి మనం గుర్తించాము. ఆనాటి పండితులు దేశి సాహిత్యం అంటే ఆదరించే వారు కారు. పైగా ఈ పదరచనను లెక్కచేయలేదు. అందుచేత తాళ్లపాక అన్నమయ్య దేశీ ఫణుతులైన పదాలు నిబంధరీతిలో రచించి ఆడి పాడి, భక్తి ముక్తికి సోపానమని నిరూపించాడు ఈ విషయాన్ని డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ఇలా వివరించారు.

"మనదేశమున ప్రాచీనమగునీ 'వచన సంకీర్తన పద్ధతి' యొక ప్రక్కన ప్రచారమునకు వచ్చుచుండగా మఱియొక వంక భాషా వ్యుత్పత్తియు, సంగీత

పరిజ్ఞానమును గల శిష్టులగు వాగ్గేయకారులు కొందరు తత్పూర్వపు మార్గ దేశి గేయ రచనారీతుల నాకళించుకొని 'సంకీర్తనా పరిశుద్ధినే దగఁ జేయఁబూని, లక్ష్య లక్షణ సమన్వయముతో నిబంధ కవితా పద్ధతికి గూడా చక్కటి మార్గమునుగల్పింప సాగినారు. వారిలో క్రీ॥ శ॥ 15వ శతాబ్ది నడిమి భాగము నుండియు లక్షణశుద్ధి గల పదకవితలతో దేశము నుఱ్ఱూత లూగించిన తాళ్లపాక వారే ప్రముఖులును, ప్రథమాచార్యులును అనవలసియున్నది వారికిఁ బూర్వమట్టి పదకవితలు దేశీయతా ముద్రగలిగి జానపదుల వాగ్వ్యవహారముననేగాని లక్షణ శుద్ధిగలిగి శిష్టసాహిత్య మునఁ జేర్పఁదగినవియు, కాలమును గర్తృత్వమును గుర్తింపవీలగునవియు నధిక ముగ లేవనియే చెప్పవలెను. ప్రాచీనుల ద్విపదలు, రగడలు, తరువోజలుకాక- అట్లు కాలమును, కర్తృత్వమును గుర్తింపదగిన పాటలలో, పదములలో నాచన సోమునిదని చెప్పబడు జాజరయు, గార్లపాటి లక్ష్మయ్యగారి వని యిటీవలనే తలపఁ బడుచున్న (యాగంటి) ఏగంటివారి పదములలోని 'శివశివయనమేలు తుమ్మెదా' అను తుమ్మెద పదమును, 'సూర్యసోమావహ్ని నడుమా శౌర్యమనే చిలకాగంటి' అనెడి ఏలయు కొన్ని మాత్రమే కనబడుచున్నవి. వీనిలో ఏగంటివారి పదముల రచనాకాలము విషయమున విమర్శకులలో నభిప్రాయభేదము లేకపోలేదు."22

కాగా సంస్కృతంలోని జయదేవ లీలాశుకుల రచనలు తెలుగులో పద కవితకు దోహదం చేశాయన్న విషయం పూర్వోక్తం. ఇంక కన్నడభాషలోని ప్రాచీన వీరశైవ యుగంలోని బసవేశ్వరుడు మొదలైనవారు వచించినభక్తి, జ్ఞాన, వైరాగ్య బోధక వచనాల్ని గమక కళాకోవిదులు మనోహరంగా ఆలపించే సంప్రదాయం ఈ నాటికీ కర్ణాటకలో వుంది. వీటిని వీరశైవులు శాస్త్రాలనీ వ్యవ హరిస్తారు. వీటిని మన వచన సంకీర్తనల లాంటివని చెప్పవచ్చు. ఈ కర్ణాటక వచన గీతాలే తెలుగులోని వచన సంకీర్తనలకు మూలమని తలంచడం సమంజ సమే. పోతే శ్రీపాదరాయలతో ఆరంభమైన దాస సాహిత్య ప్రభావం సైతం ఉందన్న విషయం పూర్వోక్తం

## తాళ్లపాక అన్నమాచార్యుడు (1408-1503) :

తెలుగులోని పదకవితాలయానికి మూలవిరాట్టు తాళ్లపాక అన్నమాచార్యుడు వాస్తవానికి ఈ అన్నమాచార్య యుగం తెలుగు పదకవితా చరిత్రలో వసంతకాల మంటే అత్యుక్తికాదు. సహజోక్తి.

అన్నమాచార్యుడు నందవరీకబ్రాహ్మణుడు. ఋగ్వేది; ఆశ్వలాయన సూత్రుడు, భారద్వాజ గోత్రుడు అయిన నారాయణ సూరికి, అతని ధర్మపత్ని లక్కమాంబకు శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో 'విరుదు గజ్జియల ముప్పిడి కఠారంబగు నందకాంశమున వైశాఖ విశాఖా నక్షత్రమున, చక్కని గ్రహము లుచ్చయమున మూఁడలర' అన్నమాచార్యుడు జన్మించాడు. ఈతని జననవత్సరం 1424, దివ్యధామం చేరిన వత్సరం 1503 అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిర్ణయించారు[23] ఈ విషయాన్ని బలపరచారు డా॥ వేటూరి ఆనందమూర్తి గారు.[24] కానీ అనేకాధారాలతో శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు అన్నమాచార్య జననం. 1408 అని నిరూపించారు

"అన్నమయ్య క్రీ. శ 1424 క్రోధి సం. వైశాఖ శుద్ధపూర్ణిమనాడు విశాఖా నక్షత్రమందు జన్మించినట్లు కీ. శే ప్రభాకరశాస్త్రిగారు పేర్కొనియున్నారు శాస్త్రి గారే వేంకటేశ్వర వచనములకు పీఠికవ్రాయుచు (1945 పీఠిక-పు. 12,13) అన్నమయ్య జన్మకాలము క్రీ. శ. 1408 అని వ్రాసి, అన్నమాచార్యచరిత్ర పీఠిక (1949 పీఠిక-పు. 2,3)లో దానిని సవరించి క్రీ. శ. 1424 అని వ్రాసినారు. డా॥ వేటూరి ఆనందమూర్తిగారు తాళ్ళపాక కవుల కృతులు, వివిధసాహితీ ప్రక్రియలు అనే గ్రంథమున (పు 60-65) దీనినే బలపరచుచు శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నిర్ణయమును, శ్రీ చాగంటి శేషయ్యగారి నిర్ణయమును త్రోసిపుచ్చిరి.

"1408 విరోధి వైశాఖశుద్ధ పూర్ణిమ విశాఖానక్షత్రమున జన్మమనుట సబబు విరక్తుడగు అన్నమయ్య ఈ విధముగ లెక్కించెననుట సమంజసము"[25].

అన్నమాచార్యుడు కొండనెక్కే నాటికి పదహారేండ్లవాడని చెప్పిన ప్రభాకర శాస్త్రిగారి మాటలను అంగీకరించక అన్నమాచార్యుని మనుమడు చిన్న అన్నమాచార్యచరిత్రలో చెప్పినట్లు కొండనెక్కేసరికి ఎనిమిదేండ్లే అని భావించి ఐదో ఏటనే ఉపనయనం జరిగినట్లు విశ్వసించి, దానికి తగిన ఉపపత్తులు గౌతమ ధర్మ సూత్రాల నుంచి ఉదాహరించి, పై చెప్పిన దానిని ఈ విధంగా స్థాపించారు శ్రీ గౌరి పెద్ది రామసుబ్బశర్మగారు.

"ఇక దుర్బలాహారులగు నేటివారు గూడ కాలినడకన ఎనిమిదవ యేటనే కొండనెక్కుచుండుట ప్రత్యక్షమైన విషయమే. అట్లు అన్నమయ్యయు, పుట్టిన దాది యెనిమిదవ యేటనే కొండనెక్కియుండుట వింతగాదు.

తే. లీల నెనిమిదియేడుల పిన్న-
బాలుఁడయ్యును నిష్ఠఁబనిఁబూని యతఁడు
.... .... .... ...
వితత వృత్తంబుల వేంకట పతికి
శతకంబు నుతకంబు సమకూరఁదీర్చి
పదములాధారుఁడై సనుదెంచి యతఁడు"

(అన్నమాచార్యచరిత్రము- పు. 23, 24)

అని చిన్నన్న తాతగారి చరిత్రమును దగ్గర దగ్గరకాలములో విన్నవాడు చెప్పుచుం డగా శ్రీ శాస్త్రిగారు కోమల మతులుగాన, అన్నమయ్యను సుకుమారునిగా భావించి ఎనిమిదవయేట కొండ నెక్కించుటకు సందేహించిరి." [26] అని తెలుపడం సము చితమే కాబట్టి అన్నమాచార్యుని జననం 1408 అనడమే సమంజసమని నేనుసైతం భావిస్తున్నాను.

అన్నమాచార్యుని తల్లిదండ్రులు, వదిన పనులు చెబుతుండగా చేస్తుండేవాడు ఒకదినం కసువుకోసి తెమ్మనగా వెళ్ళిచేతివేలు కోసుకొని విసివి తిరుపతికి వెళ్ళే యాత్రికుల గుంపులో కలిసి వెళ్ళిపోయాడు మోకాళ్ళ ముడుపు వద్దకి చెప్పుల కాళ్ళతో నడచివెళ్ళి అలసిపోయి రాతిబండ మీదనిద్రపోగా, అలమేలుమంగ ప్రత్యక్షమై అతని అలుపు తీర్చి వెళ్లిపోతుంది. ఆమెఇచ్చిన ప్రసాదం మూలంగా ఇతడు సరస సాహిత్య పారీణుడై అలమేలుమంగాంబపై శతకం ఆశువుగా చెప్పాడు. ఆ వెనుక కొండ మీదికి పదాలు పాడుకొంటూ వెళ్లి, కోనేరు మొదలైన వాటిని చూచి, స్నానా దులు ముగించి, శ్రీవేంకటేశ్వరుని దర్శించి, పులకితుడవుతాడు అర్చకులు తీర్థప్రసా దాలు, శఠగోపం ఒసగిపంపారు. పాపనాశాదుల్లో అవగాహనుడై శ్రీవేంకటేశ్వరునిపై శతకం చెప్పాడు స్వామిదర్శనానికి పోగా తలుపులు బిగించి ఉండడం గమనించి, ఆవేశంతో ఇంతకుముందే చెప్పిన శతకం లోని పద్యాలు మళ్ళీ చదవగానే తలుపులు వాటికవే తెరచుకొన్నాయి. అర్చకుడాశ్చర్య చకితుడవుతాడు. స్వామివారి ముత్యాల పేట అన్నమయ్య పాదాలపై బడింది. అచటి వైఖానసార్చకులు ఆశ్చర్యపడి స్వామి వారి అపరావతారమని కీర్తించారు. ఆ వెనుక ఘనవిష్ణుయతి స్వామి ఆదేశాను సారం అన్నమయ్యను శంఖచక్రాంకితునిజేసి, పంచసంస్కారాలు గావించి, శరణా

గతి ధర్మాన్ని బోధించి వైష్ణవునిగాచేశాడు. తల్లి వెతుక్కొంటూ వచ్చి ఇంటికితీసుకు పోతుంది యుక్తవయస్కుడు కాగా తల్లిదండ్రులు-తిరుమలమ్మ, అక్కలమ్మలను ఇద్దరు కన్యలతో అన్నమయ్యకు వివాహంచేస్తారు. శఠకోపముని వద్ద సకల వేదాంత పఠనం పూర్తిచేసు కొంటాడు. శ్రీ వేంకటేశ్వరునిపై పదరచన చేస్తూ ప్రసిద్ధి కెక్కాడు. ఇతని బాల్యమిత్రుడు సాళువ నరసింగ రాయలు పెనుగొండలో రాజ్యం చేస్తూండి ఇతనిని పిలిపించి శృంగారపదాలు పాడించుకొని మురిసిపోయి, తనపై సహితం అలాంటి పదాలు చెప్పమని వేడుకోగా తిరస్కరిస్తాడు. హరినామస్మరణలో నానిన నాలుక నరుని స్మరించలేదని గట్టిగా చెప్పాడు శృంఖలాబద్ధుని గావించాడు రాజు.

"ఆకటి వేళల నలపైన వేళల-
తేకువ హరినామమే దిక్కు మఱిలేదు" (5-100)

అన్న పదం చెప్పగానే సంకెళ్లు ఊడిపోగా, ఆతని మహిమను గుర్తించి పాదాక్రాంతు డవుతాడు రాజు. ఆ వెనుక సన్మానించి పంపివేస్తాడు క్షమించి వెళ్ళిపోతాడు తిరుమలకు అన్నమాచార్యుడు అక్కడ దినానికొక్క పదం చొప్పున చెప్పుతూ శ్రీ వేంకటేశ్వరుని అర్చిస్తూ ఉండేవాడు. పుల్లమామిడిని తియ్యమామిడిగా మార్చి, నిరుపేద వివాహానికి ధనం సమకూర్చడం మొదలైన మహిమలు ప్రదర్శించాడట.

పదకవితా పితామహుడై ప్రసిద్ధి కెక్కిన అన్నమాచార్యుని చరమ దశలో పురందరదాసు దర్శించినట్లు అన్నమాచార్యుల మనుమడు చిన్నన్న రచించాడు.

"ఎనయ సంధ్యలకు నీళ్లియ్యం జేకొనుచుం
దనరు పురందర దాసాహ్వయుండు
పరమ భాగవతుండై పరగుచు నంద
పరకులాగ్ర గణియైన వైష్ణవోత్తముండు
నవరించు మురవైరి సంకీర్తనములు
కువలయంబునం చేరుకొన్న మాత్రమున

తలఁచిన భూత భేతాళ పిశాచ
ములు పాఱిపోవ నిమ్మల శుభం బెసఁగ
విని కనియును తోన పెఱగందికొనుచు
చని, తాళ్ళపాక కాసనుఁడన్నమయ్య
వెన్నని గానె భావించి కీర్తించి
సన్నుతి సేయ నాచార్యవర్యుండు
నతని విట్ఠలునిగా ననయంబు దలఁచి
ప్రతి లేని గతుల సంభావించె...."[27]

కానీ కర్ణాటక విద్వాంసులు కొందరు దీన్ని అంగీకరించలేదు.[28] కానీ అన్నమాచార్యుని మనుమడే తన తాత జీవితచరిత్ర రాస్తూ తెలిపిన విషయం గనుక విశ్వసించడమే సముచితం. అనేకోపపత్తులతో దీన్ని నేను నిరూపించాను.[29] ఈ పురందరదాసు కర్ణాటక సంగీత పితామహుడని ప్రసిద్ధి కెక్కినవాడు.

అన్నమాచార్యుడు 32 వేల పదాలు రచించినట్లు తెలుస్తూంది. అవి శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలు అని రెండు విధాలు. సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ ఇతనికి సార్థక బిరుదులున్నాయి. ఇంకా శృంగారమంజరి, అలమేలు మంగాంబపై చెప్పిన శతకమూ ప్రకటితం. మరికొన్ని శతకాలు, ద్విపద రామాయణం, వేంకటాచల మాహాత్మ్యం (సంస్కృతం), సంకీర్తన లక్షణం (సంస్కృతం) అన్నవి లభించలేదు. సంకీర్తన లక్షణాన్ని చిన తిరుమలాచార్యుడు తెనిగించాడు.

"ఆళ్వారులు రచించిన ద్రావిడ వేదమనీ, పంచమాగమ మనీ పిలువబడే నాలాయిరం 4000 సంకీర్తనములు గలది. అన్నమాచార్యు డొక్కడే రచించిన ఆంధ్రవేదము ముప్పది రెండువేల సంకీర్తనములు కలది. వీటిలోకూడా ద్రావిడ ప్రబంధాలలో వలెనే భక్తునకు పరమేశ్వరునకు నాయికా నాయక భావము, పతి పత్నీభావము కల్పితమై ఉజ్జ్వల రసానుభూతినొదవించుచు ననేక దేవాలయముల లోని యర్చామూర్తుల నభివర్ణించుచు శరణాగతి మహత్త్వమును ప్రతిపాదించుచు నింక ననేకవిధముల లోకనీతి ధర్మోద్బోధ భూతదయాది విశేషాంశముల వెల యించుచు సంతోషింపగా, వేడుకగా సంగీత సారస్యముతో, సరసని భాషలో,

వేదవేదాంతేతిహాసాదిసూక్తి తదర్థ ప్రతిపాదనములతో వెల్లోరిసి, విజ్ఞాననిష్ఠతో విరాజిల్లుచున్నవి" అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు.

"సంకీర్తన లక్షణంలో అన్నమయ్య, చిన తిరుమలయ్య జయదేవకవి గీతగోవిందంను కొనియాడారు. అంతేకాదు. అన్నమయ్య తెలుగు సంకీర్తనములేకాక నూర్లకొలది సంస్కృత భాషలోకూడా సంకీర్తనములు వేంకటేశాంకితములుగా రచించాడు".30

కాగా అన్నమయ్య ఆనాడు జానపదుల పాటకలోఉండే జానపద గేయ రీతుల్ని అనేకం తనపదాల్లో ఉపయోగించుకొన్నాడు. అలాంటి వాటిలో – జాజరలు, చందమామపదాలు, కుమ్మెదపదాలు, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, లాల, జోల, శోభన, మంగళపదాలు, మేల్కొలుపులు, నలుగులు, వంపులు, కొట్నాలు, కూగూగులు, అల్లోనేరేళ్లు, ఛాంగుభళాలు, తందనాలు, వెన్నెలపదాలు మొదలైన వెన్నో వాడుకొన్నాడు

"అన్నమాచార్యుడు అద్వితీయ ప్రతిభాశాలి, ఋషికల్పుడు. పదంయొక్క అనంతరూపాలను తన రచనలలో ప్రదర్శించాడు. సంవాదగీతాలు అన్నమయ్య కీర్తనలలో కొల్లలు....ఈ విధంగా ఎన్నో అన్నమయ్య శృంగార వైరాగ్యాలను పరిపూర్ణంగా సమానస్థాయిలో ఆరాధించాడు. తన తర్వాతి పదకర్తలకు, కీర్తన కర్తలకు ఆయన మార్గదర్శి అయ్యాడు" 31.

అన్నమాచార్యభార్య తిమ్మక్క విదుషీమణి మంజరీ ద్విపదల్లో 'సుభద్రా కళ్యాణ'మనే గేయకావ్యరచయిత్రి. ఈవిడ తెలుగులో మొదటికవయిత్రి.

అన్నమయ్య పెద్దకుమారుడు నరసింగన్నకు, వాగ్గేయ కారుడుగా ప్రసిద్ధిలేదు. కవికర్ణరసాయనకర్త ఇతడే అంటారు. రెండో కుమారుడు పెదతిరుమలాచార్యుడు. తండ్రిలాంటి పదకర్త. తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు పెదతిరుమలయ్య పెద్ద కుమారుడు; పదకర్త. తాళ్ళపాక చిన్నన (తిరువేంగళనాథుడు) పెదతిరుమలయ్యగారి నాలుగో పుత్రుడు–ద్విపదల్లో అన్నమాచార్య జీవిత చరిత్ర, పరమయోగి విలాసం, అష్టమహిషీ కళ్యాణం, ఉషాపరిణయం రచించినాడు. పదకర్తగా ప్రఖ్యాతిలేదు. తాళ్ళపాక తిరువేంగళప్ప (చిన తిరుమలాచార్యుని కుమారుడు) రచించిన అమరుకం ప్రకటితం. కాని బాలప్రబోధిక, సుధానిధి అన్నవి అప్రకటితాలు. ఇలాగా తాళ్లపాక కుటుంబమంతా కవితా కుటుంబం కావడం విశేషం.

అన్నమాచార్యుల అనంతరం పదకవితలను వెలియించిన పెద తిరుమలాచార్యుడు, చిన తిరుమలాచార్యుడు అనే పదకర్తలను గూర్చి మరికొన్ని వివరాలు తెలుసుకోవడం అవసరం

పెద తిరుమలాచార్యుడు (1458-1554) :

అన్నమాచార్యుని చినభార్య అక్కలాంబ యందు పెద తిరుమలాచార్యుడు జన్మించాడు. ఇతని జననం 1458-1554 వరకు జీవించినట్లు తెలుస్తూంది. అంటే సుమారు 97 ఏండ్లు జీవించి కృష్ణదేవరాయ, అచ్యుతరాయాదుల పరిపాలనలను చూచినట్లు అవగతమవుతుంది.

ఇతడు గూడా మహిమాన్వితుడైనట్లు—
"మండెముకోట మండలం బెరుగ
మండలాగ్రాహతి మహనీయ పుష్ప
దామమై ధర్మాంగద స్థితిఁ బొలిచె
నే మహామహుని యహీన గాత్రమున"

—అని చిన్నన్న చెప్పడం గమనించదగ్గ విషయం. ఈ విషయాన్నే పెద తిరుమలాచార్యుడు "నాటికి నాడు గొత్త నేటికినేడుగొత్త" (6-85) పదంలో చెప్పుకొన్నాడు. దీన్ని "కరము జీడి పులుసు కలిగిన మామిడి కరము సోకిన యంతనే" (అన్నమాచార్య చరిత్ర పీఠిక — 65) అనే పదంలోను ప్రశంసించబడింది.

పెదతిరుమలయ్య శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ కీర్తనలు రచించి, తండ్రి మార్గాన్ని అనుసరించాడు. వేంకటేశ్వర వచనాలకు కర్త. శృంగార దండకం, చక్రవాళ మంజరి, శృంగారవృత్త శతకం, వేంకటేశ్వరోదాహరణం, నీతి శతకం, సుదర్శనరగడ, భగవద్గీత తెలుగువచనం మొదలైన వెన్నో మధుర కవితలు వెలయించి తరించాడు.

అన్నమాచార్యుని తరువాత ఈ పదకవితా స్రోతస్వినిని చక్కగా పారించిన ఘనత పెద తిరుమలాచార్యునిదే. ఆ వెనుక ఈ మార్గాన్నే ఀనుసరించినవాడు చిన తిరుమలాచార్యుడు.

"సింహగిరి నరహరి వనచములను పేరుతో తాళ గంథి వచన గీతము లను రచించిన కృష్ణమాచార్యులు, అన్నమాచార్యులు, పెద తిరుమలాచార్యులు తమ సంకీర్తనల ద్వారా ఆంధ్రవేదాంతకర్తలని, పంచమాగమ సార్వభౌములని అన్పించుకొన్నారు. పెదతిరుమలయ్యకు శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి, శరణాగత వజ్ర పంజర బిరుదాలు కలవు. ఈతనికి వేంకటేశ్వరస్వామి మూడు పురుషాంతర ముల వరకు ప్రత్యక్షమును ఏడు పురుషాంతరములవరకు మోక్షము ఇచ్చెదనని వరమిచ్చాట్ట పెద తిరుమలాచార్యులకు ఉపదేశ గురువైన కందాడ అప్పలాచార్యులే తెనాలి రామకృష్ణకవికి కూడా వైష్ణవ మిచ్చిన గురువు.

"అన్నమాచార్యుని రచనలో పురాణయుగపు సారళ్యము, సౌకుమార్యము, దేశి పలుకుబడుల తీయదనమూ కన్పిస్తాయి పెద తిరుమలాచార్యుడు పట్టుమని ప్రబంధ యుగంలో రాయలకు సమకాలికుడైనవాడు కనుక ఆయన కవితా కన్యక ముక్త పదగ్రస్తములు, యమకాలు మొదలైనశబ్దాలంకారాల సొమ్ములను ధరించిన ప్రౌఢతనంతో రామరాజభూషణాది ప్రౌఢ ప్రబంధ కవుల కవితా సుందరిని తల పింప జేస్తుంది"[32]

చిన తిరుమలాచార్యుడు (1488-1562) :

ఇతడు పెద తిరుమలాచార్యుని కుమారులలో పెద్దవాడు, తాళ్ళపాక పద కవిత్రయంలో చివరివాడును. అన్నమాచార్యులకు పెద తిరుమలాచార్యులు చన వరి సుతుడైతే, చిన తిరుమలయ్య ముద్దుల మనుమడు. ఇతనికి తాతగారే బ్రహ్మోప దేశం చేసినట్లు తెలుస్తోంది.

"తాళ్లపాక అన్నమాచార్య దైవమవు నీవు మాకు
వేళమే శ్రీహరిఁ గన వెరవానతిచ్చితివి
గురుడవు నీవే సుమ్మీ కుమతినైన నాకు
సరని బ్రహ్మోపదేశము సేసితి
పరమ బంధుఁడవైనా పరికింప నీవేసుమ్మీ
వరుసనేఁ జెడకుండ వహించుకొంటివి (16-139)

ఇతడు తాత తండ్రులలాగే శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలు రచించి ఉత్తమ పదకవిగా నిరూపించుకొన్నాడు. ఇతడు సంస్కృతాంధ్ర భాషల్లో మహాకవి గొప్ప విద్వాంసుడు. అష్టభాషా చక్రవర్తి అనే బిరుదు కూడా ఉంది. సంకీర్తన లక్షణాన్ని, అష్టభాషా దండకాన్ని ఇతడు రచించాడు

చిన తిరుమలయ్య తాతగారిని అనేక సంకీర్తనల్లో ప్రస్తుతించాడు తనకు బ్రహ్మోపదేశం అయిన వెనుక కొంతకాలం అన్నమాచార్యుడు జీవించినట్లు తెలుస్తోంది. ఈతని సంకీర్తనలవల్ల ఇతడు అపారమైన గురుభక్తి గలవాడు. భగవద్భక్తి విరహితంగా రాజాశ్రయాన్ని కోరే దైన్యాన్ని ఇతడు గ్రహించకపోవడం వల్ల ఈతని వ్యక్తిత్వం స్పష్టమవుతుంది శ్రీవేంకటేశ్వరునికి, దిగువ తిరుపతిలో వేల్పులకు గూడా ఇత డనేక కైంకర్యాలు జరిపించాడు.

"శాసనాధారాలను బట్టియు, కీర్తనలను బట్టియు నీతడు మత ప్రచారమునకును, సంకీర్తన ప్రచారమునకును చిత్తూరు, అనంతపురము, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు మున్నగు మండలములందు సంచారము గావించినట్లు తెలియుచున్నది మంగళగిరి దేవాలయమున నీతడు సంకీర్తన అరుళప్పాడున కేర్పాటు గావించెను ఈతడు క్రీ శ. 1562 వరకును జీవించియున్నట్లు తెలియుచున్నది."[33]

చిన్నన్న (చిన తిరువెంగళనాథుండు) :

సుబ్బరామ దీక్షితులు సంగీత సంప్రదాయ ప్రదర్శనలో చిన్నయ్యని ఉత్తమ వాగ్గేయకారుడుగా పేర్కొన్నాడు.[34] కానీ సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన అన్నమాచార్యుని గూర్చి తెలుపలేదు అన్నమాచార్యునే చిన్నయ్యగా సుబ్బరామ దీక్షితులు తప్పుగా పేర్కొని ఉంటారని పలువురు విమర్శకుల అభిప్రాయం. తెనాలి రామకృష్ణుని చాటువనబడే ఈ క్రింది పద్యములో చిన్నన్న ద్విపద కవిగానే పేర్కొనడం జరిగింది.

"చిన్నన్న ద్విపద కెరుగును
పన్నుగ పెద తిరుమలయ్య పదమున కెరుగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్య గద్యశ్రేణిన్"

—కాబట్టి ఇతడు అష్టమహిషీ కళ్యాణం, పరమయోగి విలాసం, ఉషా పరిణయం, అన్నమాచార్య చరిత్ర అనే గ్రంథాల రచయిత.

కాలజ్ఞాన తత్వకర్తలు :-

అన్నమాచార్య యుగంలోనే చెప్పుకోదగ్గ పదకర్తలు లేదా తత్వకర్తలు ఉన్నారు. వారిలోపేర్కొ దగ్గవారు వేగంటివారు, పోతులూరి వీరబ్రహ్మం, అతని శిష్యుడు దూదేకుల సిద్ధయ్య ముఖ్యులు. వీరూ ఇలాంటి తత్వకర్తలు సంగీత సాహిత్యాలకు చేసిన సేవ పరిగణించదగ్గది కాకపోయినా వారితత్వాలు సామాన్య ప్రజల సముద్ధరణకు ముక్తికి సోపానాలయ్యాయని శ్రీ రజనీ కాంతరావు గారు చక్కగా వివరించారు. "కాని పండిత వర్గంతోగాని, రాజస్థానములతోగాని ఏ మాత్రం సంబంధములేని పామరజనం, తమముక్తి పిపాసను తీర్చుకొనడం కోసం అన్నమాచార్యాదులు చూపిన సంకీర్తన మార్గంలోని వైరాగ్య పదముల పద్ధతినీ యక్షగానములలోని దరువుల పద్ధతినీ అవలంబించుకొన్నారు. 13వ శతాబ్దిలో సింహాచలంలో ఉండిన కృష్ణమాచార్యుల వచన గేయాలనూ, 15,16 శ లోతిరుపతిలో వెలసిన తాళ్ళపాకవారి అధ్యాత్మ సంకీర్తనలనూ, ప్రాతి పదికలుగా తీసుకోనే, ఆ తరువాతి శతాబ్దంలో కాలజ్ఞాన తత్వాలూ, ఆత్మబోధామృత తత్వాలూ అనుపేరుతో ఆధ్యాత్మిక ప్రబోధం కలిగించే కీర్తనలను రచించిన వాగ్గేయ కారులు ఉదయించారు. బ్రాహ్మణేతరకులాలలో జన్మించినవారూ, ఉపనిషత్తులలోను, వేదాలలోను చెప్పిన పరమార్థ తత్వాన్ని సులభభాషలో పామరులకు బోధించే కీర్తనలను చేసినవారూనూ. వీరు యోగసాధనలో సిద్ధులై, అనేక శిష్యవర్గమును చేరదీసి తమ విజ్ఞాన చంద్రికలను వెదజల్లినారు వీరిజ్ఞాన బోధ అంతా ప్రజలందరికీ సామాన్యముగా అర్థమయే మాటలతో కొంతవరకు సంకేతములతో రూపకాలం కారములతో తత్వార్థమును నిగూఢము చేసిన కీర్తనలలో, దరువులలో సాగింది. కాని ఈ వాగ్గేయకారులు భాషా విశారదులనిగాని, శాస్త్రీయ సంగీత వైదుష్యం కలిగినవారనిగాని అనుకొనడానికి వీలులేదు. శాస్త్రీయ గేయరీతుల నూతన ప్రవాహవేగంలో దేశీయ గేయరీతులు కొట్టుకొని, పోయి ఏహ్యంకాకుండా ఈ కాలజ్ఞాన తత్వాల రూపంలో కాలూనుకొని, నిలదొక్కుకొని ముందుకు సాగాయి. సాహిత్యంలో అంతమాత్రమేకాని, సంగీత పరిణామంలో ఇవి చేసిన దోహదమేమీలేదు." 35.

ఏగంటి వారు :

ఈలాంటి తత్త్వకర్తల్లో ప్రథమస్మరణీయులు ఏ గంటివారు. ఈ యాగంటి లేదా ఏగంటివారు అన్నమయ్య కంటే పూర్వులని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అభిప్రాయ పడ్డారు.

"అష్టపదుల తర్వాతమనకు తరచు వినబడే ప్రాచీనగేయము అరుణగిరి నాథుడనే డిండిముడు రచించిన 'నాదబిందు కళాదీనమోనమో, వేదమంత్ర స్వరూ పానమోనమో' అన్నదీ. చరణాల చివ్వర 'వరశూర', 'వెలుగోటి' అన్న చిన్న మాటలేగాని ధ్రువములేదు. పాటలో చరణములు మాత్రమే ఉన్నాయి. ఇది విజయ నగర ప్రౌఢదేవరాయల కాలము నాటిది."

"తర్వాతివి 'ఏగంటి వచనాలు' అన్న గార్లపాటి లక్ష్మయ్యగారి రాజయోగ కీర్తనలు వీనిలో పై 'నాద బిందు కళాదీ' వంటి కీర్తన, 'కాదన్న వ్యాసుని కర ములే సాక్షి లోకము లన్ని యెరుగనోదేవా!' మాత్రమేకాక జయదేవుని అష్టపదుల వంటి కీర్తనలు చరణమూ, ధ్రువమూ, ఇంకొక చరణము, ధ్రువమూ వరుసలో వచ్చేవి చాలా ఉన్నాయి."

"తరువాతివి అన్నమయ్య సంకీర్తనలు"[36]

"కనుక గార్లపాటి వారి కీర్తనల పాదాల చివ్వర వచ్చే రెండు పంక్తులూ పల్లవులే అయితే తాళ్లపాక వారి కాలంలో అంతవరకూ చరణాలకు చివర వచ్చే పల్లవి చరణాలన్నిటి మీదకి ఎక్కి కీర్తనలకి తలగా నిలచింది"

"ఏగంటి వచనాలు అన్నమయ్య సంకీర్తనలకు దారి చేసిన తొలిరూపాలే గాని, అన్నమయ్య సంకీర్తనలు శిధిలమైన నాటి రూపాలు కావేమో పరిశీలించండి అంటున్నాను"

"లక్ష్మయ్యగారు పాల్కురికి వారికి వలెనే వేదవాక్యాలు ఎత్తి వాటి విశే షార్థాలు చెప్పినారు. పాటలన్నిటికీ రాగములు చెప్పలేదు. అన్నమయ్య అన్ని సంకీర్తనలకు రాగములు చెప్పెను. కనుక పాల్కురికికీ, అన్నమయ్యకూ నడిమి వాడీయన :

"ఏతావాతా ఏగంటి వచనాలు విజయనగర సంగమ కాలము నాటి వంటు న్నాను."[37]

కానీ దీన్ని అంగీకరించక శ్రీరజనీకాంతరావుగారు: "వీరికి ఏగటింవారు, యాగంటివారు, ఆగంటివారు అనే వ్యవహారం ఆయా పుస్తకాలలో వున్నది. తత్వాల న్నిటిలోను, కొంత భాషా సౌష్ఠవం కలిగి, భావన స్పష్టంగా ఉన్న రచనలు ఏగంటి వారివి. ఏ గంటి లక్ష్మప్పగారి తత్వాలు అనీ, ఏలలు అనీ పదిదాకా కాలజ్ఞాన తత్వ సంచయంలో వున్నవి. ఇదికాక యాగంటివారి యేలలనీ, తత్వాలనీ ఇంకా 20,30 దాకా అందులోనే ఉన్నవి వీటన్నింటిలోను చివరి చరణంలో ముద్ర, యాగంటి యీశ అనికాని, యాగంటి గురుడు అనికాని, యాగంటి దాసుడు అనికాని కొన్నిం టిలో సంబోధన ప్రథమంలోను, కొన్నింటిలో ప్రథమా విభక్తిలోను, కొన్నింటిలో తత్పురుషలోను ప్రయోగాలున్నవి. వీటినిబట్టి యీ తత్వాలన్నీ యాగంటి వారైన వేర్వేరు వాగ్గేయ కారుల రచనలని గాని, లేదా అన్నీ ఒక లక్ష్మప్పగారి రచనలే అని గాని ఇతమిత్థమని చెప్పడానికి వీలులేదు. అన్ని యేలలలోను శివపారమ్యము కలదు" అని "వీరు తాళ్ళపాక వారి సమీపకాలంలోని వారనిగాని, తరువాతి వారని గాని అనడానికి ఇబ్బంది ఉండదు"[38]. అనీ అభిప్రాయ పడుతున్నారు. ఈ అభి ప్రాయంతో ఏకీభవిస్తూ అన్నమాచార్య సమకాలికుడుగానే భావిస్తున్నారు వేటూరి ఆనందమూర్తిగారు. దీనికి తగిన రీతిలో ఉపపత్తులు సైతం చూపారు. ముఖ్యంగా తనకాలంనాటి ఛాయాపహారుల్ని అన్నమాచార్యుడు గర్హించినట్లు సాక్ష్యమిచ్చే

"వెఱ్ఱులాల మీకు వేడుక కలిగి తేను
అఱ్ఱువంచి తడుకల్లంగరాదా ॥పల్లవి॥
ఉమిసిన తమ్మలో నొకకొంత క్రమము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరంగ ఛాయాపహారము చేసుక
తమమాట కూర్చితే దైవము గనడా॥"

మొదలైనవాటిని ఉదాహరించి, ఇంకా ఇతర ఉదాహరణాలతో ఈ తెగడబడినవారు ఏ గంటివారనీ, కనుకనే ఈ యాగంటి వారిని అన్నమాచార్యునకు సమకాలికులుగా భావిస్తున్నారు. [40].

9)

యాగంటివారి తత్త్వాల ప్రాధాన్యాన్ని గూర్చి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిలా పేర్కొన్నారు." జనులలో నెక్కువ వ్యాప్తిని గావించుటకును, మననము చేయుటకును పద్యములకన్న పాట లెక్కువ పనికి వచ్చునను తత్త్వమును పండితు లనేకులు గమనించలేదుగాని, పామరులు మాత్రమెఱిగి యాచరణకుఁదెచ్చిరి. అట్టి పాటలలో సామాన్యముగాఁగానరాని భాషాసౌష్ఠవము, విషయమును సంగ్రహించి చెప్పుశక్తి, భావాత్మైనశయ్య–ఇవి యీ యాగంటివారి పదములలో ఎక్కువగాఁగాన వచ్చును. ఒకటి ఉదాహరించెదను.

ప॥ "అనంతయోగముండు గావలెను
మనసు పదిలము సేయవలెను, ఈ
తనువులోపలి తెలివితోనె కనవలెను
కనుచూపులోకటి కావలెను, అందు
ఘన చిదానంద లింగము గానవలెను"

.... .... .... ....

—కన్నడమునందలి దేవరనామములవలె తెలుగులో ఇట్టి అద్వైత బోధకములగు పదములు లెక్కకు మిక్కిలి కలవు" 41.

ఇలాగే శ్రీ ఇంజూరి కాంతరావు గారు భాషాసౌష్ఠవమూ, భావనాశక్తి, కవితా శిల్పమూ కలిగిన యాగంటివారి యాలలు, కోలాట పాటలు, ఖేచరీముద్రగల తత్త్వమూ ఉదాహరించారు. 42.

పోతులూరి వీరబ్రహ్మంగారు :

యాగంటివారి తరువాత పేర్కొనదగ్గ ప్రముఖ కాలజ్ఞాన తత్త్వకర్త పోతులూరి వీరబ్రహ్మంగారు. వీరబ్రహ్మం చెప్పిన కాలజ్ఞానతత్త్వం ప్రమాణగ్రంథం. కాలజ్ఞానమంటే భూతకాలాన్ని భవిష్యత్కాలంగా చెప్పడం. ఈ కాలజ్ఞాన తత్త్వాల్లో వీరబ్రహ్మం స్వయంగా చెప్పినవికొన్ని, ఆయన ప్రియశిష్యుడైన దూదేకుల సిద్ధప్ప చెప్పినవి కొన్ని ఇంకా అనేకులు వీరబ్రహ్మం అనుయాయులు చెప్పినవీ కలవు.

"వీరబ్రహ్మంగారి కాలాన్ని కూడా చరిత్రకారులు రెండు మూడు రకాలుగా చెప్తున్నారు. శ్రీ అనంతకృష్ణశర్మగారు, బ్రహ్మంగారు 17వ శతాబ్దిమధ్య భాగంలో

ఉండిన వారన్నారు. వీరబ్రహ్మంగారి జీవిత చరిత్రమును వ్రాసిన తాడికొండ రాఘవాచార్యులుగారు తమ వీరాచార్యచరిత్రలో ఆయన 1686 వరకు జీవించినట్లును, జవంగుల నాగభూషణదాసుగారు తమ వీరబ్రహ్మేంద్రస్వాముల చరిత్రలో ఆయన 1594 వరకు జీవించినట్లు వ్రాశారు.

"బ్రహ్మంగారు విశ్వబ్రాహ్మణులు. నందికొండగ్రామ వాస్తవ్యులైన యన మొదల వీరభోజాచార్యులు, వీరపాపమాంబ అను దంపతులకు దత్తపుత్రుడు. బాల్యంలో యీయన కర్నూలు జిల్లాలోని బనగాని పల్లెలో గరిమిరెడ్డి అచ్చమ్మగారి పశువుల మేపుతూ ఉండగానే అనేక మహిమలను చూపినాడట. ....ఆయన ఒక చచ్చిన ఆవును, చనిపోయిన మనిషినీ బ్రతికించాడట .... అతడు పోలేరమ్మ గుడికెదురుగా తిన్నిపై కూర్చుండి చుట్టకాల్చుకొనడానికి నిప్పుతెమ్మని పోలేరమ్మ నడిగి, వారందరి ఎదుటా ఆ బాలిక రూపంలో వచ్చి, చుట్టను నిప్పంటించేటట్లు చేశాడు. ఒకనాడు జడివానలో నిలచి, తడియకుండా వచ్చాడు" [43].

"ఈతడును విగ్రహారాధనము, జాతిభేదములు, జాతరలు మొదలగు వానిని ఖండించి, ప్రజలకు హితోపదేశము చేసెను. ఇతడు సన్యాసిగాడు. గొప్పసంసారి. భార్యగోవిందమ్మ ఐదుగురు కొడుకులు, ఒక కూతురును ఉండిరి. ఇతని శిష్యులందరిలో మాదేకుల సిద్ధయ్య ప్రసిద్ధుడు" [44].

ఇతడు శివకేశవులకు భేదాన్ని, మతభేదాల్ని పాటించనివాడు. సర్వమానవ సౌభ్రాత్రాన్ని బోధించి ఆచరణలో పెట్టిన మహాత్ముడు. అతని వద్ద బ్రహ్మణులు మొదలు హరిజనులు వరకు సమ్మేళనా ఉండేవారు. వీరబ్రహ్మంగారి సమాధి నేటికీ కడపజిల్లా, బద్వేలు తాలూకా కందిమల్లయ్య పల్లెలోవుండి ఇప్పటికీ ప్రతి సంవత్సరమూ వైశాఖ శుద్దదశమినాడు బ్రహ్మంగారి ఉత్సవం జరుగుతూనే ఉంటుంది. ఇతని తత్వాల్లో కొన్నివాగా ప్రచారంలో ఉన్నవి.

1. "చెప్పలేపంటనకపొయ్యేరు, నరుల గురుని చేరి మొక్కితె బ్రతకనేర్చేరు"

2. ఇల్లు వాకిలి నాది ఇల్లాలు నాదనుచు
యేలబ్రమసితి వయ్యో మనసా....

3 పిల్లరరాళ్ళకు మొక్కమనుంటే చిత్తముచెడి పో నాలేవారే.

4. "తియ్యని మామిడిపండు, పండుతినబోతే దొరకాదు తీపులకెండు"

"అక్కలమ్మసారె వచ్చె వెన్నెలారో—"అని అన్నమాచార్యులు రచించిన వెన్నెల పదాన్ని జ్ఞాపకంచేసే చందమామ పదం ఒకటి బ్రహ్మంగారి పాటల్లో వుంది. ఇందు సహస్రారశీర్షకమైన పామును యోగసాధనచే లొంగదీసికొనుట వర్ణించాడు.

ఆనందభైరవి రాగం — ఆది.
చందమామ చందమామ చందమామా — యీ
సంధితెలిపే జ్ఞానులెవ్వరే చందమామా॥
కాయమను పుట్టలోను చందమామ — పాము
మాయగానె మెలగుచుండు చందమామా"[45]

.... .... .... ....

## దూదేకుల సిద్దయ్య :

బ్రహ్మంగారి ప్రియశిష్యుడు సిద్దయ్య. దూదేకుల పీరూసాహేబు, ఆదంబీబీల కుమారుడు. ఇతడు మహమ్మదీయుడైనా వైరాగ్యంతో బ్రహ్మంగారి నాశ్రయించి, అనేక పరీక్షలను నిలబడి, నెగ్గి శిష్యుడు కాగలిగాడు స్వమతస్థుల కోపతాపాలకు గురి అయ్యాడు ఇతడు కూడా అనేక తత్వాలు రచించాడు. "ఈ విధమైన తత్వకర్తలందరిలోను బ్రహ్మంగారి తత్వాలకు కొన్నింటికి మాత్రమూ, బాగా ఇటీవల ఎడ్ల రామదాసు కీర్తనలకు రాగాల పేర్లున్నాయి అవి ఆనాడు ప్రసిద్ధములై జనబాహుళ్యంలో ప్రచారంలో ఉండిన పూర్వవిరచిత గేయాల వర్ణమెట్లలో రచింపబడినవై యుండవచ్చు. ఏకనాదమూ, చిరుతయూ బ్రహ్మంగారికి గానీ, శిష్యులకుగానీ, వారి అనుయాయులకుగానీ తప్పని సరియైన వాద్యాలు"[46]

## సిద్దయ్య ప్రసిద్ధ తత్వాలు :

"ఏకులమని వివరమడిగితే యేమని దెల్పుదులోకులకూ — పలు
గాకులకూ, దుర్మార్గులకూ, యీ దుష్టులకూ॥
పాల భాగమున యాలలుబాడుచు భావముకన్నది నాకులము"

.... .... .... ....

"కులమెంచగానేల గుణమే కారణము
కులబింధు కులమామె కులమెక్కువేది"॥

వీరబ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మకూడా కాలజ్ఞాన సంపన్నురాలు. తత్వకర్త్రిణి. ఇలాగా ఈ తత్వకర్తలు పామరప్రజల ముక్తి సాధనకు తత్వాలు రచించి ప్రచారం చేశారు

యక్షగాన కర్తలు :

ఈ అన్నమాచార్యయుగంలో మూడోరకం పదకర్తలుగా తొలితెలుగు యక్షగానకర్తల్ని పేర్కొనడం అవసరం. తెలుగులో వెలసిన ఆశు, మధుర, చిత్ర, విస్తరాలనే నాల్గువిధాలైన కవితల్లో మధురకవిత ముఖ్యమైనది. అందులో దరువులు ఏలలు, ధవళములు, మంగళహారతులు, శోభనములు, ఉయ్యాల, జోలలు, జక్కుల రేకు పదములు, చందమామ సుద్దులు మొదలైన వాటితో యక్షగాన పదాలు కూడా చేరుతాయి గనుక యక్షగాన కర్తల్ని పదకర్తలుగా స్వీకరించి తక్కిన పదకర్తలతో, తత్వకర్తలతోపాటు ప్రస్తావించడం సమంజసమే.

"క్రీ. శ. 12వ శతాబ్దికి ముందు కాలము యక్షగాన చరిత్రలో నజ్ఞాత యుగము. అది యక్షవేషధారణము వృత్తిగా నవలంబించి యుండుటచే నేర్పడియుండ దగునని యూహింపదగిన ఎక్కలగాణల, జక్కుల జాతుల ప్రాదుర్భవస్థితి గర్భిత మైన కాలమైయుండునని యూహింపవచ్చును .... అసలు 15,16 శ. ముందునాట యక్షగాన మొకసాహిత్య ప్రక్రియగా గాని రూపొంది నట్లాధారములు గానరావు.... కాని యక్షగానములవలె దేశి సరణికిఁజెందిననాటకములు కొన్ని లేకపోలేదు.... ఆనాటి మనదేశి నాటకములే వీధినాటకములను పేర ప్రసిద్ధికెక్కినవి....పదునైదవ శతాబ్దిలో భీమఖండో దాహరణమును కీర్తింతురెద్దాని కీర్తి గంధర్వులు, గాంధర్వ మున యక్షగాన సరణి' (3-65) బట్టి యది స్తోత్రపాఠోపయోగియైన యొక ప్రత్యేక గానశైలి యనియు, క్రీడాభి రామోదాహరణమును బట్టి మదిజక్కుల పురంధ్రిచే నెక్కటిగా శ్రుతిలయాత్మక వాద్యోపకరణ సహితముగా, రాగతాళమున స్థాయిగమక నిహితముగాఁగథాభ్యాస పురస్సరముగా ప్రయోగింపబడు చుండెడిదనియు దెలియు చున్నదిగదా" 47.

ఈ యక్షగానాన్ని గూర్చి సంకీర్తన లక్షణంలో ఈవిధంగా చెప్పబడటం జరిగింది.

"యక్షగాన పదంబులు నవ్విధమున
సముచి తానేకవిధతాళ సంగతులను
నవరసాలంక్రియా సవర్ణంబులగుచు
నలరునని హరికీర్తనాచార్యుఁడనియె" 48.

"పై విషయమునుబట్టి 15వ శ. లో యక్షగానము కథావలంబనము, సముచితానేక విధ తాళ సంగీతములు, నవరసాలంక్రియా సవర్ణములు నగు పదములును గలిగి కావ్యరచనోపయుక్త స్వరూపమును కల్గి యున్నదని చెప్పనగును"49.

ప్రోలుగంటి చెన్నశౌరి :

"మన కిప్పటికి దెలిసినంతలోఁదెనుఁగున వెలసిన మొట్టమొదటి యక్షగాన రచన క్రీ. శ. 15వ శ. యుత్తరార్ధమున నుండిన ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరిచరితమే. అదియైన నతడు రచించినట్లు తెలిసినదే కాని గ్రంథము లభింప లేదు. అది జక్కులచరిత్ర అని పేర్కొన బడినది. అది తాళ్లపాక చిన తిరుమలార్యుడు చెప్పిన యక్షగాన లక్షణమట్లు నవరసాలంకృతముగ నున్నదని పేర్కొనఁబడుట గమనింప దగినది సౌభరిచరితము భాగవత విష్ణుపురాణము లందు గలదు"50 ఈ చెన్నశౌరి ఇంకా అనేకగ్రంథాలు రచించి నరసింగ రాయలచే సన్మానితు డయ్యాడట. 'చెన్నశౌరికి అగ్రహారాదులిచ్చి సత్కరించిన నరసింగరాయలు - పిల్లల మర్రిపినవీరభద్రుని పోషించి, అంతకుముందు అన్నమా చార్యులకు మిత్రుడుగానుండి, కర్ణాటక సింహాసనము (విద్యానగరం) సంపాదించు కొన్న సాళ్వనరసింగరాయలే" ఆనాటి సామంతుడైన సంబెట గురవరాజు దౌర్జన్యాలను యక్షగానంగా ప్రదర్శించగా చూచిన ఈ నరసింగరాయలు సంబెట గురవరాజును శిక్షించాడని గూడా తెలుస్తుంది,"51

కందుకూరి రుద్రకవి :

"మనకిప్పు డుపలబ్ధమైన యంతలోఁ గవికాలము తేలినంతలో క్రీ. శ.

16 వ శ యుత్తరార్ధమున నుండిన కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము అను యక్షగానమే ప్రాచీన తమమైనదిగాఁ బండితులెల్లరిచేఁ బరిగణింపఁబడు చున్నది కాని చక్రపురి రాఘవాచార్యుడను నాతని కృతిగా నూహింపఁదగిన విప్రనారాయణ చరిత్రమను యక్షగానము రుద్రకవి కృతి కొక్కించుక పూర్వమై నదిగా తోచును. ఇది 16 వ శ. నడుమ రచింపబడి యుండును. రచనా ప్రణాళికలలో రెండింటను జక్కని సామ్యము గలదు. రెండింటను త్రిపుట, జంపె మొదలగు తాళ ప్రధానములైన గేయ రచనలకును ద్విపదకును బ్రాధా న్యము - సంధి ప్రయోజనాత్మకములగు చిన్నచిన్న వచనములు, ఏలలు, అర్ధ చంద్రికలు మొ॥ అతి విరళముగాఁ బద్యములును బ్రయుక్తములైనవి".[52]

"త్రిపుట, జంపె, కురుచజంపె, అర్ధచంద్రిక, ఆటతాళ, ఏకతాళ, ద్విపద, ధవళం, ఏల అను దేశిగేయా లీ యక్షగానంలో ఉన్నాయి. ఆహిరి, సౌరాష్ట్రి, భైరవి, కళ్యాణి, పాడి రాగాలు కొన్ని దరువులు ముందు మాత్రమే కొన్ని తాళపత్ర ప్రతులలో సూచింపబడి ఉన్నట్లు ప్రభాకరశాస్త్రిగారు పాదవిజ్ఞాపికలో (ఫుట్‌నోట్స్) వ్రాశారు".[53]

పెదకెంపరాయలు :

"మైసూరు ప్రాంతంలో ఎలహంక ప్రభువులుగా ప్రసిద్ధిపొందిన రాజ వంశంలో జన్మించి, 1513 నుంచి 1569 వరకు ఆ ప్రాంతాన్ని పరిపాలించి, 1537లో బెంగళూరు పట్టణాన్ని నిర్మించిన పెదకెంపరాయడు గంగాగౌరీవిలాస మనే తెలుగు యక్షగానం రచించాడు. గ్రంథంపూర్తిగా లభించకపోయినా, ఉదా హరణలుగా కొన్నిపద్యాలు, ఒకటి రెండు దరువులూ, ఆ దరువులకు రాగతాళ ప్రసక్తి ఉన్నది"[54].

ఇలాగా పదకర్తలు, తత్వకర్తలు, యక్షగానకర్తలు మూడు విధాలైన పదకర్తలు అన్నమాచార్య యుగంలో ఉన్నట్లు స్పష్టం.

## 2.4 క్షేత్రయ్య యుగం (1600-1760):

అన్నమాచార్యుల తరువాత అన్నమాచార్యులంతటి వాగ్గేయకారుడు పద కవితా చక్రవర్తి క్షేత్రయ్య. పదకవితా పితామహుడు అన్నమాచార్యుడైతే పద

కవితా చక్రవర్తి క్షేత్రయ్య 1600-1750 కాలానికంతటికి యుగకర్త కాదగినవాడు క్షేత్రయ్య. అంటే త్యాగయ్య జననం వరకు క్షేత్రయ్య అంతటిపదకర్త మరొక్కడు లేకపోవటమే దీనికి కారణం. పదకవితా వైభవాన్ని ఆరంభించిన మహానుభావుడు మొదటి పదకర్త అన్నమాచార్యుడు సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్యమిచ్చి అభినయం జోడించిన పదకర్త క్షేత్రయ్య. పదాభినయం క్షేత్రయ్యతోనే ఆరంభమైంది. పైగా పదాలు అంటే శృంగార పదాలు అన్నభావం తెచ్చిపెట్టిన ఘనత క్షేత్రయ్యదే. సమకాలికుడు సారంగపాణి మొదలు ఆవెనుక తదితరపదకర్తలందరకి క్షేత్రయ్య మార్గదర్శకుడు. ఈ యుగంలో సంస్కృతంలో శ్రీకృష్ణలీలాతరంగిణి రచించిన నారాయణ తీర్థులు, కూచిపూడి నాట్యానికి ఆరంభకుడూ, నారాయణ తీర్థుల శిష్యుడూ అయిన సిద్ధేంద్రయోగి, దక్షిణాంధ్రయుగంలో వెలసిన పదకర్తలు, యక్షగానకర్తలు ప్రస్తావించబడతారు.

"15వ శ. లో సంకీర్తన పితామహుడైన అన్నమాచార్యుడు శృంగార సంకీర్తనములను, అధ్యాత్మసంకీర్తనములను వేలకొలది రచించి తరువాత వాగ్గేయ కారులకు పదకవితా మార్గదర్శి అయి బిరుదుపొందాడని చెప్పుకొన్నాము. 16వ. శ లో అన్నమాచార్యుల పుత్రపౌత్రులు పెదతిరుమలయ్య, చిన తిరుమలయ్యలూ, పురంద దాసూ, సంకీర్తనమును బహువిధాల రచించి వ్యాప్తితెచ్చారు. 17వ శ లో అనగా నారాయణ తీర్థులూ, రామదాసు, క్షేత్రయ్య అవతరించునాటికి సంకీర్తన రచనము మూడు నవ్య మార్గములను తొక్కింది. నారాయణ తీర్థుల కృషిలో సంకీర్తనము ప్రధానముగా అధ్యాత్మబోధను ఆదర్శముగా పెట్టుకొని శృంగారమును ఔపచారికముగా ఉంచుకొని, ఒకప్రక్క నాట్యాభినయ యుక్తమైన యక్షగానములకు ఉపాంగముగా అవుతూ, ఇంకొకప్రక్క భజన పద్ధతి ప్రాచుర్యానికి దారితీసింది. ఇది మొదటి మార్గము. ఇకరామదాసు కీర్తనలు భక్తిరస పరమావధినిపొంది, పామరజనం కూడా భక్తి మార్గంలో సాధన చేయడానికి అనువయిన భజనగోష్ఠుల వ్యాప్తికి కారణమై నాయి. ఇది రెండవ మార్గము. ఇది కొంత వరకు నారాయణ తీర్థుల రచనలకు కూడా దొరికిన మార్గమే. శృంగార ప్రధానమై, అధ్యాత్మ బోధ అంతర్గర్భితమై సాగినవి సిద్ధేంద్రుని యక్షగానములూ, క్షేత్రయ్య పదములుకూడా. వీరిరువురి రచ నలూ తీర్థుల తరంగాలతోపాటు నాట్యాభినయ ప్రదర్శనలకు కూడా అలంబములయి నాయి. వీరందరిలోను ఒక అడుగు ముందుకు వేసినవాడు క్షేత్రయ్య. మిగిలినవారి కంటెక్షేత్రయ్య వేసిన ముందంజ భావుకల్పనలో, ఇదితన తరువాతి వాగ్గేయకారు

పురందరికో అతనిని మార్గదర్శిగా చేసింది. నేటి కర్ణాటక సంగీతపు రాగములెన్నో స్పష్టరూపం తాల్చినది క్షేత్రయ్య పదాలలోనే" [55]. అని శ్రీరజనీకాంతరావుగారు చక్కగా వివరించారు.

"సంగీత కళారహస్యనిధి రామరాజభూషణుడు అళియరామరాయలను పల్మారుమెప్పించి రచించిన బహుసంస్కృతాంధ్రకృతులు నేడేవి? ఆ రాయనిమంత్రియైన బయకార రామయామాత్యుడు రచించి ప్రభువుకు వినిపించిన ప్రబంధము లిప్పు డెక్కడ? క్షేత్రయ్య ఒక్కడే ఈ ప్రవాహంలో ద్వీపమువలె నిలిచి నెలకొన్నకవి. ఇతనికి అన్నమయ్య ఒరవడి లభించినది" [56]. "తెలుగు పదకవితా కన్యకు పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య గారంటిని. కాని జనకుఁడే క్షేత్రయ్య. తాత మొదలు పెట్టిన పనిని తలవొలము దాక ఈడ్చిన తండ్రి యీతడు"[57]. అని పేర్కొన్న శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి మాటలు సార్థకమైనవి.

ఇలాంటి క్షేత్రయ్యకు కొంచెం వయస్సులో పెద్ద వాడైన నారాయణతీర్థుల గురించి తెలుసుకోవడం సముచితం.

నారాయణ తీర్థులు (1580-1680) :

శ్రీ కృష్ణలీలా తరంగిణీ కర్త నారాయణ తీర్థులు. ఈతని పేరు మీదుగా 'పారిజాతాపహరణం' అనే యక్షగానం లభించింది. శ్రీకృష్ణలీలా తరంగిణి సంస్కృత భాషలోను, పారిజాతాపహరణం తెలుగులోను రచించాడు.

"నారాయణ తీర్థుల కాలనిర్ణయమును గురించి డాక్టర్ వి. రాఘవన్‌గారు పరిశోధించి కొన్ని అంశాలు చెప్పారు. తీర్థుల వారి శిష్యుడు రచించిన పంచకోశమంజరి అను గ్రంథ మొకటి తంజావూరు పుస్తక భాండాగారంలో ఉంది. ఆ తాళపత్రప్రతి తులజాజీ మహారాజు వ్రాయించినది. ఆయనకాలం 1765-82. నారాయణతీర్థులు అప్పటికి రమారమి 100 ఏండ్లకు ముందుండవలెను .... తీర్థులవారి గురువైన శివరామతీర్థులు గురుచంద్రిక అనే సంస్కృత గ్రంథం వ్రాశారనీ, కంచిలో ఉండే వారనీ, వారికాలం విక్రమ శకం 1718-30. అనగా క్రీ. శ. 1675 ప్రాంతమనీ చెరువు లక్ష్మీనారాయణశాస్త్రి గారు వ్రాశారు. దీనినిబట్టి తీర్థులవారు అధమం క్రీ. శ

1700 వరకూ జీవించినట్లు తెలుస్తోంది. మొత్తానికి ఆయన సుమారు 1580 ప్రాంతంలో జన్మించి 1614లోపుగానే దక్షిణాదికి వెళ్ళి, అక్కడ దాదాపు 1680 వరకు జీవించి ఉన్నట్లు చెప్పవచ్చు"[58].

ఇతని గురువు శివరామానంద తీర్థులు. ఇతని స్వస్థలాన్ని గూర్చి పలువురు పలువిధములుగా చెప్పారు. కొందరు శ్రీకాకుళమనీ, మరికొందరు శోభనాద్రి అనీ, ఇంకకొందరు కూచిపూడి అనీ, ఆచార్య సాంబమూర్తిగారు దక్షిణాదిన జన్మించాడనీ తలంచడం జరిగింది. "తల్లావఝ్ఝల శివశంకరస్వామిగారు పై పండితుల వ్రాతల నన్నిటినీ పరిశీలించి, వావిళ్ల షష్టిపూర్తి సంపుటంలో వ్రాసిన వ్యాసంలో తెల్పిన విషయం. తండ్రిపేరు నీలకంఠశాస్త్రిఅయి, గాంధర్వదేవు డనేది ఆయనకు సంగీతంలో ప్రజ్ఞవలన వచ్చిన బిరుదనామం అయి ఉండాలి. ఈ నీలకంఠశాస్త్రి గుంటూరు మండలంలోని కాజగ్రామంలో ఉండేవారు. కాజగ్రామం పరంపరాగతంగా నేటికీ తల్లావఝ్ఝల వారికి ఆటపట్టు. తల్లావఝ్ఝలవారికి నాటినుండి అనేక తరాలుగా ముఖ్యంగా ప్రభువుల ఆదర గౌరవాలు లభిస్తూండడం కద్దు. తల్లావఝ్ఝల వారి కుటుంబంలోని వారు నేటికీ తప్పకుండా కృష్ణలీలా తరంగిణిలో అధమం మూడు తరంగాలయినా పారాయణం చెయ్యాలని నియమం ఉన్నదట. తీర్థులవారు తిరునల్వేలి జిల్లాలోని శీర్ణమహాదేవి అనే గ్రామంలో నివసించి, అక్కడనుండి కాశీవెళ్ళినట్లు కూడా ఒక ప్రతీతి ఉన్నదట. తీర్థులవారు కాజలో జన్మించి, పెరిగి కాలక్రమాన దక్షిణదేశం వెళ్ళి, శీర్ణమహాదేవిలో ఉండి, తిరిగి ఉత్తరదేశయాత్ర చేస్తూ ఆత్మీయులపై అభిమానం కొద్ది కాజ, కూచిపూడి మొదలైన గ్రామాలలో మళ్ళీ సంచారం చేసి ఉండవచ్చుననీ, ఆయన సిద్ధిపొందిన స్థలం దక్షిణదేశంలోని తిరుప్పూందురుత్తియే అని నిశ్చయంగా చెప్పవచ్చుననీ శివశంకరస్వామి వ్రాశారు"[59].

నారాయణ తీర్థులే సిద్ధేంద్రయోగి అనే వారు కొందరున్నారు. కానీ నారాయణ తీర్థుల శిష్యుడు సిద్ధేంద్రయోగి అని తేల్చబడింది.

నారాయణ తీర్థులు కృష్ణలీలాతరంగిణి భాగవతపురాణ దశమస్కంధంలోని, కృష్ణగాథలలో ప్రధానమైన వాటిని తీసుకొని, కొన్నిటిని సంగ్రహించి, కొన్నిటిని విస్తరించి 12 తరంగాలు (అంకాలుగా) రచించాడు. ప్రతితరంగారంభంలోనూ దాని లోని కథను శ్లోకాలలో సూచించి, తర్వాత పాటలలో శ్లోకాలలోని, సంధి గద్యాలలో విపులీకరించాడు. "ఈ తరంగాలన్నీ మహానాటకంలోని ఆయా సందర్భాల కనుగుణంగా

సంభాషణలుగాను, వర్ణనలుగాను, రచింపబడినప్పటికీ, దేనికది స్వతంత్రముగా శ్రీకృష్ణ పరమైన సంకీర్తనముగా, కృష్ణపరతత్వబోధకమైన ఆధ్యాత్మిక వివరణ ముతో కూడి ఉండడమే దానికి ముఖ్యకారణం. అంతేకాదు. తరంగం అనేమాట ఆగ్రంథం అ ఒక్కొక్క కీర్తనకు ఉద్దేశించిన పేరు కానేకాదు. కృష్ణలీలా చరిత్రకు సంబంధించిన 12 అంకముల మహానాటకంలోని ఒకొక్క అంకమునూ ఒక్కొక్క తరంగంగా పేర్కొన్నాడా మహాకవి. ఆంధ్రుడై వెలసిన వాగ్గేయకారులలో అన్నమాచార్యులకు తర్వాత ఇతడు అద్వితీయ ప్రతిభాశాలి. నృత్యసంగీత సాహిత్య వేదాంతాది బహుశాస్త్ర పారదర్శియై, నిసర్గ సరళమయిన శిల్పంతో నవ్యమార్గాన సంస్కృతాంధ్రములలో యక్షగాన రచన సాగించాడు. పరమభక్తాగ్రేసరుడు, యోగి పుంగవుడు, తత్వవేత్త, సంస్కృతంలో వేదాంతశాస్త్ర గ్రంథాలను కూడా రచించిన మధురవాచియైన దేశికుడు" [60].

ఇందులో 156 కీర్తన లున్నాయి. వాటికి వాడిన రాగాలు36. ఈ తరంగాలు చాలా ప్రసిద్ధి పొందాయి.

ఇతడు కృష్ణలీలాతరంగిణి కాక పారిజాతాపహరణమనే తెలుగు యక్షగానం రచించాడు ఈ పారిజాతాపహరణ దరువులకు, శంకరాభరణం, ఘంటా, ఆహిరి మధ్యమావతి, పున్నాగవరాళి, బౌళిరాగాలు వాడబడ్డాయి.

"తీర్థులవారి గేయరచనలు తమకు పూర్వయుగ స్వభావమైన సంకీర్తన సౌరభాన్ని దట్టంగా పట్టుకొని, తర్వాతి యుగలక్షణమైన యక్షగాన స్వరూపం పరి పూర్ణంగా అవలంబించుకొని, జయదేవాదుల భక్తిశృంగార భావంతో కంటె భక్త్యా ధ్యాత్మికతా భావంతో ఉదాత్త తరములై, నారాయణ తీర్థులను సంకీర్తన యక్షగాన సార్వభౌమత్వమనే అనితర సాధ్యమైన పదవికి అర్హునిగా జేశాయి" [61].

## క్షేత్రయ్య (1590-1675);

అన్నమాచార్యుని తరువాత అంతటి వాగ్గేయ కారుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య తన పదాల్లో సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్యం ఇవ్వడమేగాక సంగీతం జోడించి తెలుగులో పదాభినయానికి ప్రాధాన్యం తెచ్చినవాడు. ఇది ఆనాటి కూచిపూడి నృత్య కళాకారుల ప్రభావంతో పరిపుష్టి చెందింది. ఒక ప్రత్యేకతను సంతరించుకొంది.

తెలుగులోని పదకవితల ద్వారా సంగీత సాహిత్యాభినయాలకు ఎనలేని సేవచేసిన వాడు క్షేత్రయ్య. అందుకే ఈతడు ఈ యుగానికి యుగకర్త కాగలిగాడన్న విషయం పూర్వోక్తం.

క్షేత్రయ్య పూర్వనామం వరదయ్య. అనేక పుణ్యక్షేత్రాల సందర్శన వల్ల వరదయ్యకు క్షేత్రయ్య అనిపేరు కలిగింది. క్షేత్రజ్ఞానం కలవాడు క్షేత్రజ్ఞుడు ఈ పేరుతోనే దక్షిణదేశంలో ఇతడు ప్రసిద్ధుడు. క్షేత్రయ్య నివాసం మొవ్వ. ఇది కృష్ణామండలంలోని కూచిపూడి, పెదపూడి, ఘంటసాలలకు దగ్గరలోనే ఉన్న మొవ్వ. ఆ మొవ్వలో వెలిసిన మువ్వగోపాలస్వామిపై భక్తితో శృంగార రసభావాలతో రచించిన పదాలేమువ్వ గోపాలపదాలు. 'మువ్వగోపాల' అనే ప్రసిద్ధమైన మువ్వ, మువ్వరూపాలుగా వాడుకలో మారిపోయినట్లు తెలుస్తుంది. మువ్వగోపాల మకుటంతో రచితమైనవే క్షేత్రయ్య పదాలు.

క్షేత్రయ్య కేవలం గొల్లకాపరిగా ఉంటూ అల్లరిచిల్లరిగా తిరుగుతూండేవాడు. ఒక యోగివల్ల గోపాలమంత్రోపదేశంపొంది జపంచేశాడు. శృంగారరసాధి దేవత అయిన గోపాలుని అనుగ్రహంపొంది. "శ్రీపతి సుతుబారికినే-నోపలేక నినువేడితే కోపాల? మువ్వగోపాలా!" అనే పల్లవితో ప్రారంభించి పదకవితల్లి నట్లు తెలుస్తుంది. కానీ బాల్యంలో ఇతడు గొల్లకాపరికావచ్చు. క్రమంగా చక్కటి వైదుష్యం గడించినట్లు స్పష్టం. సంస్కృతాంధ్ర భాషల్లోను, సంగీతాభినయాలంకారాది శాస్త్రాల్లోను పాండిత్యం సంపాదించాడు. శృంగార పదాలు చెప్ప నారంభించాడు ఆనాడు ప్రసిద్ధమైన మధుర, తంజావూరు నాయకులను ఆశ్రయించాడు. "వేడుకతో నడచు కొన్న విటరాయడే" అనే పదంవల్ల మధుర తిరుమలేంద్రుడు, తంజావూరు విజయ రాఘవనాయకుడు, గోలకొండ పాదుషాలను ఆశ్రయించినట్లు తెలుస్తుంది ఇంకా రఘునాథనాయకుని, తుపాకుల వేంకటకృష్ణప్పనాయకుని గూడా ఆశ్రయించినట్లు సాక్ష్యాలున్నాయి. అందరిలోకి విజయరాఘవనాయకుడు క్షేత్రయ్యకు ఎక్కువ గౌరవం ఇచ్చేవాడట. ఇతర కవులు కొందరు ఈర్ష్యతో 'మహారాజా! ఇదేమి! ఏరా, పోరా, రారా అనే క్షేత్రయ్య మీద ఇంతమోహమా" అన్నారట. ఈ విషయం విజయ రాఘవనాయకుడు క్షేత్రయ్యతో చెప్పాడట. వెంటనే క్షేత్రయ్య "వదరకపోవే వాడేలవచ్చీని—వద్దు రావద్దనవే" అనే పదం చెప్పి మూడో చరణంలో చివరిపాదం ఆకవీంద్రులచే పూరింపజేయుమని రాజునుకోరి తాను సేతుయాత్రకు వెళ్ళాడట.

యాత్రానంతరం వచ్చిన క్షేత్రయ్య వారికి సాధ్యం గాలేదని తెలిసి "రామరామ ఈమేనితో నికవానిమోము జూడవలెనా మొదటి పొందేచాలు" అని పూరించాడట. సిగ్గుపడ్డ ఆకవీంద్రులు క్షేత్రయ్యను ప్రశంసించారట. విజయరాఘవుడు ఘనంగా సత్కరించాడు. ఆవెనుక గోలకొండ పాదుషాను క్షేత్రయ్య దర్శించి, అచటి తులసి మూర్తితో పోటీపడి నలభైరోజులలో 1500 పదాలు చెప్పాడట. పాదుషా సత్కారానికి పాత్రుడయ్యాడట. ఆవెనుక శృంగారి అయిన క్షేత్రయ్య మొవ్వగోపాలుని ఆలయంలోని దేవదాసినిమోహించగా ఆమె తిరస్కరించింది. భక్తిపూరితపదరచన చేస్తేఅతనికి వశమవుతానని చెప్పింది రక్తేగాని భక్తి యెరుగని క్షేత్రయ్యకిది అగ్నిపరీక్ష. గోపాలదేవుని ఉపాసించి, అనుగ్రహీతుడై పూర్వోక్తమైన 'శ్రీపతి సుతు బారికి నేనోపలేక నినువేడితే కోపాలా! మువ్వగోపాలా!" అని భక్తిభరితంగా పద రచన చేసి తరించాడు ఆవెనుక పరమ భక్తాగ్రేసరుడయ్యాడు. దేవదాసి చింతలేదు. మధురభక్తిపరవశుడు క్షేత్రయ్య. తానేనాయిక, తనప్రాణ వల్లభుడు మువ్వ గోపాలుడు. తుదుచితంగా మధురభక్తి పదరచన చేశాడు ఆంధ్రదేశమేకాక దక్షిణ దేశమంతా తిరిగాడు సందర్శించిన ప్రతి దేవునిమీద ఆదేవుడి ఉపముద్రతో ప్రధాన మువ్వగోపాల ముద్రతో పదరచన చేశాడు ఒకసారి శ్రీపెరుందేవీ వరదరాజులకు శయ్యాసనాలు సమర్పించి తలుపులు బిగించి పూజారులు వెళ్ళిపోయారట. ఆసమయంలో దేవాలయం లోపల ఉండిపోయాడట క్షేత్రయ్య. తెల్లవారుజామున ఒక దివ్య స్త్రీ అంటే పెరుందేవీదర్శన మిచ్చింది క్షేత్రయ్యకు. ఆ అలౌకిక శృంగారాన్ని ఊహించిన క్షేత్రయ్య నోటినుంచి "మగువ తనకేళికామందిరము వెడలెన్"— అనే అద్భుతపదం వెలువడిందట. ఇది ఆనాటి క్షేత్రయ్య మానసికస్థితికి తగినట్లుంది. మొదట పరమశృంగారి అయి ఆవెనుక మధురభక్తి పరతంత్రుడైన క్షేత్రయ్య 1590 ప్రాంతంలో జన్మించి 1675 వరకు జీవించినట్లు భావించవచ్చు[62] అయితే ఇతని జీవిత పరిసమాప్తి ఎక్కడ, ఎప్పుడు, ఎలా జరిగిందీ చెప్పడానికి తగిన ఆధారాలు లభించలేదు.

తనపదాల్లో సంగీత సాహిత్యాలను సమ్మేళనం చేసి, అభినయం జోడించి, ఉత్తమవాగ్గేయ కారుడుగా, సమున్నతస్థానం ఆక్రమించుకొన్నాడు. క్షేత్రయ్య. మధుర భక్త్యుపాసకుడుగా తరించి, భక్తులకు తరణోపాయం చూపించాడు. తనపదాల ద్వారా సంగీత సాహిత్యాభినయాలలో ఎందరికో మార్గదర్శకుడయ్యాడు. చేసింది పదరచనే అయినా, పదకవితా చక్రవర్తిగా, అత్యుత్తమ మధురభక్త్యుపాసకుడుగా తనపై శిష్ట్యాన్ని నిలబెట్టుకొన్న మహామనీషి; అమరుడు క్షేత్రయ్య.

సిద్ధేంద్రయోగి (1600-1700) :

ఈ యుగంలో క్షేత్రయ్య తరువాత పేర్కొదగ్గవాడు సిద్ధేంద్రయోగి. ఇతడు నారాయణ తీర్థుల శిష్యుడని ప్రతీతి. కూచిపూడి నివాసి.

"16 వ శ చివరి వరకూ జక్కులపురంధ్రుల ఏకపాత్రక ప్రదర్శనములూ, కొరవంజులూ వేటి కవి పేరుపేరుగానే పామరజనానికి వినోదాన్ని కలిగిస్తూఉండేవి. దాదాపు ఆ ప్రాంతంలోనే ఈ ప్రదర్శనలకుగాని, ప్రదర్శకులకుగాని సామాజిక గౌరవస్థాయిగాని, సాహిత్య నిబద్ధతగాని లేకపోవుట గమనించి, అఖిలశాస్త్రపారంగ తుడూ, భరతోక్త నాట్యసంగీత లక్ష్యలక్షణ పరిజ్ఞాతా అయిన నారాయణ తీర్థులో, సిద్ధేంద్రయోగో చతుష్షష్టికళలలో పాండిత్యం సంపాదించిన విద్వత్కుటుంబాలలోని పురుషులు నాట్యాభ్యాసమూ, యక్షగాన ప్రదర్శనమూ కులవృత్తిగా అవలంబించ వలెనని శాసించారు. ఆశాసనం ప్రకారం స్త్రీలు వేషాలు వెయ్యకూడదు. సుమారు 150 సం. ప్రాంతంనుంచీ కూడా కూచిపూడిలో యక్షగాన ప్రదర్శనములు కుల వృత్తిగా అవలంబిన బ్రాహ్మణకుటుంబా లుండేవని తెలుస్తోంది" [63].

సిద్ధేంద్రుడు సుమారు 17వ శ. అంటే 1600-1700 సం. ల మధ్య కాలంలో జీవించినట్లు తెలుస్తుంది. ఇతని జీవితానికి సంబంధించిన కథలు అనేకం. ఇతడు బాల్య కౌమారదశల్లో విద్యాగంధరహితుడై, దుర్జనుడై తిరుగుతూండే వాడు కూచిపూడి నాటక ప్రదర్శకులతో సంబంధం ఉండేది. అప్పటికే వివా హితుడు తాను చదువరికాదని అత్తవారింట్లో అవమానితుడై దూరదేశాలు వెళ్ళి సకల విద్యాపారంగతుడై తిరిగి వచ్చాడట ఆపద్ధర్మంగా స్వీకరించిన సన్యాసం స్థిరపడిపోయింది సిద్ధయ్య సిద్ధేంద్రయోగిగా మారిపోయాడు. నారాయణ తీర్థుల శిష్యరికం వల్లనే ఇంతటివాడై యుండవచ్చు. ఈ సమయంలో పారిజాత యక్ష గానం రచించే సంకల్పం కలిగి ఉండవచ్చు.

ఈ సిద్ధేంద్రయోగి కూచిపూడి వారి సంప్రదాయాన్ని ప్రతిష్ఠించిన వాడని మనం నమ్మడంలో దోషంలేదు. ఇతడు రచించిన పారిజాతంలోని తొలిఘట్టమే భామాకలాపం. పారిజాతాపహరణమూ, గొల్లకలాపమూ రెండూ సిద్ధేంద్రుని రచనలని కొందరూ, భామాకలాపం మాత్రం సిద్ధేంద్రునిదనీ, గొల్లకలాపం భాగవతుల రామయ్య రచన అని కొందరు భావిస్తున్నారు సిద్ధేంద్రుని భామా

కలాపంలో ఎక్కువ భాగం భామాకలాపమూ, కృష్ణుడు భామను అనునయించే వరకూ సాగి చివరిభాగంలో పారిజాతాపహరణ కథ స్వల్పంగా సూచితమవుతుంది. గొల్లకలాపంలో నాయిక ప్రేపల్లెవాడలోని గొల్లభామ 'చల్లోయమ్మ చల్ల' అంటూ యాదవ (గొల్ల) కాంతల సహజ సుందరమైన ధోరణిలో ప్రవేశించి, హాస్యసంభాషణా చతురుడైన బ్రాహ్మణ విద్వాంసునితో వివాదానికి దిగుతుంది. ఆ వివాదంలో ఆధ్యాత్మిక తత్వాన్ని సైతం వివరించడం జరుగుతుంది వీటిలో వెన్నెలపదాలు, దరువులు అనేకం ఉన్నాయి.

"ఈ కలాపాలు అనబడే ఆటభాగవతాలను మొదట కూచిపూడి వారే పురుషులు స్త్రీ వేషాలు ధరించి ఆడుతూవచ్చినా, దాదాపు 16 వ. శ మధ్యభాగం నుంచీ కళావంతుల స్త్రీలు కూచిపూడి విద్వాంసులవద్ద శిక్షణపొంది, భామవేషము లను స్త్రీలే ధరించి ప్రదర్శనలిస్తూ ఉండేవారు".

"అందుకే వీటిని (భామాకలాపం, గొల్లకలాపం) రచించిన సిద్ధేంద్రయోగి యక్షగాన కర్తలలో, సంగీత నృత్యశాస్త్రీయ సంప్రదాయాలను పరిపూర్ణంగా ఆకళించుకొన్న వాగ్గేయకారులలో నారాయణ తీర్థులకు తరువాత స్థానం అలంక రించాడు".

"నారాయణ తీర్థుల కృష్ణలీలా తరంగిణిలోని తరంగాలు, సిద్ధేంద్రుని యక్ష గానాలూ, లీలాశుకుని కృష్ణకర్ణామృత శ్లోకాలూ, క్షేత్రయ్య పదాభినయమూ పారం పర్యంగా కూచిపూడి వారి ప్రదర్శనలలో తప్పనిసరి అంశాలు.... మొదట నారాయణ తీర్థులూ, తరువాత సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్యా తమ రచనలతో కూచిపూడి నాట్య సంప్రదాయానికి తోడ్పడ్డారనీ అనుకోవచ్చు"[64].

రఘునాథనాయకుడు (1600-1631) :

రఘునాథనాయకుడు సంగీత సాహిత్యనిధి. ఇతని పరిపాలన కాలం 1600-1631. ఇతని ఆస్థానంలో కవిగాయకులు, వాగ్గేయకారులుండేవారని గోవింద దీక్షితులు రాజుపేర రచించిన 'సంగీతసుధ' అనే సంస్కృత గ్రంథంవల్ల తెలుస్తూంది. వేంకటమఖి ప్రముఖ వాగ్గేయకారు డీతని ఆస్థానంలో ఉండేవాడు. క్షేత్రయ్య సైతం రఘునాథుని దర్శించినట్లు సాక్ష్యం ఉంది[65] రఘునాథనాయకుడు

పైతం శ్రీ రుక్మిణీ కృష్ణ వివాహ యక్షగానము, జానకీ కల్యాణము చాటుకావ్యము అనే రెండు యక్షగానములు రచించినట్లు తెలియవస్తూంది[66]. వాటిస్వరూప స్వభావాలు తెలుసుకోడానికి వీలులేక పోయింది. కారణం అవి లభించక పోవడమే. 'రఘునాథమేళ' అన్నపేరు కొత్తగా తాను కనిపెట్టిన రాగానికి పెట్టడమేగాక జయంతసేన, రామానందమనే రాగాలను కనిపెట్టిన సంగీతజ్ఞుడు.

## కంచెర్ల గోపన్న (భద్రాచల రామదాసు) (1620-1680) :

భద్రాచల రామదాసని పేరుపొంది, ఆంధ్రదేశంలోనే కాక భారతదేశమంతటా ప్రసిద్ధికెక్కిన పరమ భక్తాగ్రేసరుడూ, వాగ్గేయకారుడూ అయిన ఇతని అసలు పేరు కంచెర్ల గోపన్న.

ఇతని తల్లిదండ్రులు కామాంబాలింగన మంత్రులు. తెలంగాణాలోని నేలకొండపల్లి స్వగ్రామం. ఇతనికి వైష్ణవమిచ్చిన గురువు రఘునాథ భట్టాచార్యులు. ఇతడు 1620 ప్రాంతంలో జన్మించి 1680 వరకు జీవించినట్లు తెలుస్తూంది. ఈ కాలంలో గోలకొండ రాజ్యాన్ని అబ్దుల్లా తానాషా, అబుల్ హసన్ తానాషాలు పరిపాలిస్తూ ఉండేవారు. వారి కొలువులో ఉన్న అధికారులు అక్కన్న మాదన్నలు అనే అన్నదమ్ములు గోపన్న మేనమామలు. వీరి మూలంగానే 1650 ప్రాంతంలో గోపన్న భద్రాచలం తహసీల్దారు అయ్యాడు అంతేగాక మహాభక్తుడూ, భజనకీర్తనల రచయితా, వేదాంతి అయిన కబీరుదాసు కితడు శిష్యుడు. అంటే ఇతడు నారాయణ తీర్థులకు, సిద్ధేంద్రయోగికి, క్షేత్రయ్యకుకూడా సమకాలికుడు అన్నవిషయం స్పష్టం. సాధుసంతర్పణ చేస్తున్న సమయంలో ప్రమాదవశాత్తువల్ల గంజిగుంటలోపడి మరణించిన కుమారుని రామసంకీర్తన ద్వారా బ్రతికించుకో గలిగిననాటినుంచి ఇతనికి రామదాసన్న ప్రసిద్ధి కలిగి౦దట.

రామదాసు తహసీల్దారుగా ఉంటూ సర్కారుపైకం ఖర్చుపెట్టి భద్రాద్రి రామాలయానికి, తమ్ముల దమ్మక్క అనే భక్తురాలిలాగానే మరమ్మత్తులు చేయించి, దేవునికి కైంకర్యం చేయించి నందుకు గోల్కొండ నవాబు ఆగ్రహానికి గురియై కారాగారశిక్ష పొందడం జరిగింది. పండ్రెండేండ్లు ఘోరనరకం కారలో అనుభవిస్తూ శ్రీరాముని ఆర్తితో వేడుకుంటూ అనేక కీర్తనలు రచించాడు. చివరికి శ్రీరామచంద్రుడు సలక్ష్మణుడై వచ్చిపైకం చెల్లించిరసీదు నిచ్చి చెరవిడిపించినట్లు ఆంధ్రు లందరకు సువిదితమే.

"రామదాసుగారి.... కీర్తనలను భజన గోష్ఠులలో తప్ప, సంగీత కచ్చేరీలలో తలవనే తలవరు. ఆకీర్తనలలో ఆవిద్వాంసుల విద్వత్ప్రకర్షకు అవకాశం తక్కువయి, వాటిసంగీత రచన సరళ స్పష్టలయాన్వితమై భావస్ఫురణ సూటియై సామాన్య జనానికి గుంపులుగా కూడి పాడు కోటానికి కూడా సుకరమైన సులభరచనలు ఉండటం కూడా శాస్త్రీయ విద్వాంసులకు వాటియెడల అనాదరం కలిగించి ఉండవచ్చు."[67].
అని అంటారు రజనీకాంతరావుగారు.

"రామదాసు చరిత్ర పుస్తకాలనుబట్టి, అతడు బాల్యములోనే సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సంపాదించినట్లు తెలుస్తుంది గోలుకొండ తురుష్క ప్రభుత్వంలో అధికారి కనుక, పారశీక, ఉర్దూ భాషలలో కూడా పండితుడై ఉండాలి. ఇతని కీర్తనలలోని వేరువేరుఛందో రీతులను బట్టిచూస్తే, దేశీయగేయరీతులను ఇతడు బాగా మనస్సుకు పట్టించుకొన్నట్లు కనబడుతుంది. తెలుగులోనే కాక సంస్కృతంలో కూడా రామదాసు ముద్రతో ఉన్న కీర్తనలు ఐదారింటికి పైగా కనిపిస్తున్నాయి".

"ఆనందభైరవి రాగం మన సంగీత చరిత్రలో మొట్టమొదట ఉపయోగించిన వాగ్గేయకారుడు రామదాసే .... ఈ రాగం ప్రత్యేకంగా ఆంధ్రులసొత్తు. క్షేత్రయ్యకూడా దీనిని ఎక్కువగా వాడాడు. అంచేత ఇది మొదట ఆంధ్రభైరవి ఆ తర్వాత ఆనందభైరవి అయిందేమో।"

"అతని సంగీత రచనలనుబట్టి అతని ఆశయం పాండిత్య ప్రకర్షకాదనీ, సంగీతం అతని భక్తిసాధనకు ఉపకరణ మాత్రమనీ చెప్పాలి. అతని కీర్తన లందుకే సహజభక్తి భావావేశంలో, తన్మయత్వంలో అప్రయత్నంగా సంకీర్తన భావానుగుణంగా వచ్చిన సరళమైన రచనలు. అందుకే ఒకేసారి ఎన్ని గొంతుకలు చేరిపాడిన, శ్రావ్యమైన మేళంలో వినిపించే బృందగీతులవి. రక్తికి భజన గోష్ఠులలో రామదాసు కీర్తనల తర్వాతనే మిగిలినవారి కీర్తనలకు పేరు".

"వీటిలో రామదాసు రచించినవి అని గుర్తుపట్టదగిన కీర్తనలు 100 మొదలు 108 వరకూ దొరుకుతాయి"[68].

కాని శ్రీ మంచాళ జగన్నాథరావుగారు స్వరసహితంగా సేకరించిన రామదాసు కీర్తనలు ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమీ ప్రకటించి రామదాసు కీర్తనలను నిలబెట్టటం ముదావహం.

ప్రసిద్ధమైన రామదాసు కీర్తనలుకొన్ని : తారకమంత్రము కోరిన దొరికెను; తక్కువేమి మనకు; పలుకే బంగారమాయెన; ఏ తీరుగనను దయజూచెదవో మొదలైనవి సుమారు ఇరవై దాకా ఉన్నాయి. పల్లెటూళ్లలో ఈనాడు భజనగోష్ఠులలో మనం వినవచ్చు.

విజయరాఘవ నాయకుడు (1633-1673) :

విజయరాఘవనాయకుడు తండ్రి రఘునాథనాయకుని లాగానే కవులను, కవయిత్రులను పోషించడమేకాక, యక్షగానాలు తానురచించి, కవులు, కవయిత్రుల చేత రచింపచేశాడు. అంతేగాక ఈ నాయక రాజుల పాలనలో ప్రత్యేకించి పదరచన కర్తలనేకులు వెలసి పదకవితకు పుష్టిని తుష్టిని చేకూర్చారు తండ్రి తరువాత 1633 నుంచి 1673 వరకు రాజ్యంచేశాడు.

విజయరాఘవ నాయకుడు రఘునాథాభ్యుదయమనే చారిత్రక ద్విపద కావ్యాన్ని రచించాడు. ఇరవైమూడు యక్షగానాలు, మూడు ద్విపదకావ్యాలు, గోపికాగీతలు, భ్రమరగీతలు, ఫాల్గుణోత్సవ రగడ-చౌపదినీ, రాజగోపాల దండకమూరచించి పదకవితకు ప్రాధాన్యమిచ్చిన వాడితడు. వాస్తవానికి రఘునాథుని కొలువులో క్షేత్రయ్య ఉన్నప్పటికీ ఎక్కువకాలం విజయరాఘవుని ఆస్థానంలోనే గడిపినట్లు చారిత్రక సత్యం అది పదరచనకు స్వర్ణయుగం.

ఇతని యక్షగానాల్లో ప్రాసాంత్యప్రాసాదులతో, అలంకారికశైలీ విన్యాసంతో దరువులనేకం మనోజ్ఞంగా ఉండడం విశేషం.

పసుపులేటి రంగాజమ్మ :

విజయరాఘవుని ఆస్థానకవయిత్రి రంగాజమ్మ. తండ్రి వెంకటాద్రి. తల్లి మంగమాంబ. ఈమె బహుముఖ వైదుష్యం గలది. మన్నారు దాసవిలాస నాటకమనే యక్షగాన కర్త్రి. మన్నారుదాసు విజయరాఘవుడు; అతని విలాసాన్ని అతని సభావైభవాన్ని తెలిపే యక్షగానం. ఈ యక్షగానంలోని దరువులు

చక్కగా క్షేత్రయ్యని స్మరింపజేస్తాయి. క్షేత్రయ్యలోని తెలుగు పలుకుబళ్లను, నుడికారాలను, అనుప్రాసలను, భావచిత్రాల్ని గుర్తుకు తెస్తాయి. "క్షేత్రయ్య పదాలకు రంగాజమ్మ పదాలలో కనపడేసామ్యము విజయరాఘవుని దరువులలో కాని, సమకాలికులైన ఇతరుల దరువులలో కాని కనపడదు. అందుచేత ఏరా, మేరా, వచ్చేని, పోయీని అని వ్రాసినంతమాత్రాన క్షేత్రయ్యను దక్షిణాంధ్ర కవి అనడం కంటే, అదేశైలిలో వ్రాసిన రంగాజమ్మకూడా పసుపులేటి యింటి పేరునుబట్టి, ఏ కృష్ణా గోదావరీ తీరమునుండో క్షేత్రయ్యవలెనే సారస్వత ధ్వజం నెలకొల్పడానికి దక్షిణాదికి తరలివెళ్లిందని చెప్పవచ్చు."[69] నంటారు రజనీ కాంతరావుగారు. ఈమాట ఎంతైన సముచితమని భావించడంలో తప్పులేదు.

విజయరాఘవుని ఆస్థానంలోని ఇతర పదకవులు :

గోవింద దీక్షితుని రెండోపుత్రుడు వేంకటమఖి. విజయరాఘవ నాయకుని ఆస్థాన విద్వాంసుడు, వాగ్గేయకారాగ్రణి. విజయరాఘవుని కోరికపై చతుర్దండి ప్రకాశిక అనే లక్షణ గ్రంథాన్ని రచించాడు. ఆనాటి సంగీత స్వరూపమా గ్రంథంవల్ల వ్యక్తమవుతుంది.

కామరసు వేంకటపతిసోమయాజి విజయరాఘవ నాయకుని పట్టపుకవి. విజయరాఘవ చంద్రికావిహారమనే యక్షగానకర్త. "ఇందలి పదములు క్షేత్రయ్య పదపక్కి మూదలగా రచింపఁబడినవి. అసలు క్షేత్రయ్య పదమే యొకటి "సుదినమాయెనే యీ ప్రొద్దు" అనునది యిందు గ్రహింపబడినది.... (రాగతాళములు మారినవి కాని యచ్చముగానిదే పదము). ఇందు కొరవంజ (జా) దరువు లోక విశేషము వానిలో కొరవంజి వేషభాషలు వర్ణితములు. ఇందనేక ప్రయోగ విశేషములును గలవు"[70].

పురుషోత్తమ దీక్షితుడు తంజాపురాన్నదాన మహానాటకమనే యక్షగానం రచించాడు. ఇది ప్రహసనప్రాయం. ఇందులో తెలుగువాళ్ల వంటకాలు వర్ణితం.

కోనేటి దీక్షిత చంద్రుడు విజయరాఘవ కల్యాణమనే యక్షగానాన్ని రచించాడు. ఇతడు విజయరాఘవునిచే "అగ్రహార తారహారాది బిరుదవాద్య పారితోషికాలు అందుకొన్నవాడు విజయ రాఘవకాంతిమతీవివాహం ఇందులో వర్ణితం.

"విజయ రాఘవుని కాలంలో పెద్దదాసరి అని నరసింహస్వామియెడల మహా భక్తుడైన పదకర్త ఉండేవాడనీ, రాజుకోరిక మన్నించనందున అతనిపై రాజుకు ఆగ్రహం కలిగి ఉరిశిక్ష విధించాడనీ, అతడు శిక్షను తప్పించుకొని, నరసింహాలయం ప్రవేశించి అంతర్ధానుడయినాడనీ ప్రభాకరశాస్త్రిగారు మున్నగు పెద్దలు వ్రాశారు. 'గ్రహఫలము మాయను' అనే దేవగాంధారి రాగంలో కీర్తన పెద్దదాసరి రచనగా సంగీతలోకంలో ప్రచారంలో వున్నది"[71].

మన్నారు దేవుడు హేమాబ్జనాయికా స్వయంవరమనే యక్షగానం రచించాడు. ఇతడు విజయరాఘవనాయకుని పుత్రుడు. 1674లో యుద్ధంలో మరణించాడు. గద్దె నెక్కలేదు. విజయ రాఘవ నాయకుడు హేమాబ్జనాయిక అను చెంగమ్మను మన్నారు దనే రాజగోపాలునకు కల్యాణం చేసినకథ–ఈ యక్షగానంలోని ఇతివృత్తం.

పై కవులు ప్రధానంగా చెప్పుకోదగ్గయక్షగానకర్తలు.

కంఠీరవరాజు (1704–1713) :

నాయకరాజుల పాలనలో యక్షగానాలు మూడు పూవులారుకాయలుగా వెలసి ఉండగా మైసూరు రాజ్యాన్ని 1672–1704 మధ్య కాలంలో పాలించిన చిక్కదేవ రాయలు సంస్కృతాంధ్ర కర్ణాటాది వాఙ్మయ పోషకుడు 1704–1713 ల మధ్య పాలించిన ఇతని పుత్రుడు కంఠీరవరాజు అనేక యక్షగానపదకర్త. ఇతని యక్షగానాలవల్ల కమనీయ కవితావైభవమూ, బహుభాషావైదుష్యమూ, సంగీత సాహిత్య నాట్యవిద్యలలో నేర్పరి అని స్పష్టమవుతుంది.

"తొలియక్షగానములలో త్రిపుట, జంపె, అటతాళములలో నడచిన రగడలు నాయకయుగపు యక్షగానాలలో ఈ తాళములలోనేసాగే దరువులుగా, పదాలుగా పరిణమించాయి. రాగకల్పనా, సాహిత్యానుగుణముగా రాగప్రయోగమూ వర్ధిల్లిన నాయక రాజుల కాలంలో లయ–క్షేత్రయ్య పదాలలోవలెనే కాల ప్రమాణముచౌకమై రాగాను కూలతను, పాటలో భావానుగుణమైన రాగవిస్తృతినీ సంపాదించుకొన్నది. .... ఏది ఏమైనా, తరువాతి శతాబ్దంలో మహారాజు, మహారాష్ట్రుల పోషణలో సంగీత సాహిత్యాలు, ఇతోధికాభివృద్ధిపొంది ప్రజల వాగ్గేయకారులు జీవించడానికి, తంజా

పూరు నాయకరాజుల కృషివల్ల అంకురారోపణం జరిగింది"[72]. అని నాయకరాజుల నాటి యక్షగాన సంగీత సాహిత్యరచనా విశేషాల గూర్చి చక్కగా వివరించారు శ్రీరజనీకాంతరావుగారు.

సారంగపాణి (1680-1750) :

అన్నమాచార్యునితో ఆరంభమైన తెలుగు పదకవిత క్షేత్రయ్యతో ఒకస్థిర రూపంపొంది, సారంగపాణితో విస్తృతి పొందింది. శృంగారపదాలకు ఈ ముగ్గురు పదకవులను వరుసగా చెప్పుకోవడం పరిపాటి. అయితే అన్నమాచార్యునితో ఆరంభమైన ఆధ్యాత్మికత సైతం అంతర్లీనంగా ఈ పద కవులలో లేకపోలేదు అంతేగాక పదరచనా క్రమరీతి వీరిలోమనం చూడవచ్చు. అన్నమయ్య తరువాత పేర్కొన దగ్గ పదకవి క్షేత్రయ్య. అలాగే క్షేత్రయ్య వెనుక చెప్పుకోదగ్గ పదకవి సారంగపాణి. తెలుగు పదసాహిత్యంలో సారంగపాణి పదాలకు వన్నెవాసి ఉన్న విషయం మనకు తెలిసిందే.

సారంగపాణి చిత్తూరు మండలంలోని కార్వేటి నగరం సంస్థానంలో ప్రసిద్ధిపొందిన పదకర్త, వాగ్గేయకారుడు. ఇతడు చెన్నపురి సమీపంలోని పొన్నేరులో పుట్టిపెరిగి, ఆ వెనుక కార్వేటినగరం చేరి, ఆ యాస్థానంలో స్థిర పడ్డాడు. వేణుగోపాలముద్రతో అనేక పదాలు రచించాడు. మాకరాజు వెంకట పెరుమాళ్ళరాజు (1719-1732), అతని సోదర పుత్రుడు మాకరాజు కార్వేటి రాజు (1733-1752) అనే కార్వేటి నగర రాజుల కాలంలో వారిచే సత్కృతుడై ఆస్థాన విద్వాంసుడుగా, విద్యాధికారిగా, వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడు సారంగపాణి. ఇతడు 1680 ప్రాంతంలో జనించి 1750 వరకు జీవితం కొన సాగించినట్లు తెలియవస్తూంది.[73]

సారంగపాణి విద్యాభ్యాసమూ, గురుపరంపర, వైదుష్యాల గూర్చి మన కంతగా తెలియదు. కానీ సంస్కృతాంధ్ర భాషానిపుణుడనీ, సంగీతాభినయాల్లో దిట్ట అనీ స్పష్టమవుతుంది అతని పదాల్ని పరిశీలిస్తే. సారంగపాణి పదాలుగా ఇప్పటికి లభించినవి 201. కానీ వాటిలో 6 పదాలు క్షేత్రయ్యవి. తక్కిన 195 పదాలు మాత్రమే సారంగపాణివి. వీటిలో నాలుగురకాల పదాలున్నాయి. ప్రథమభాగం శృంగార పదాలు. ద్వితీయభాగం దేశీయ పదాలు. వీటిలో వేశ్యా

విలాస, దూషణలు వివరించబడ్డాయి. తృతీయభాగం జాతీయ పదాలు. వీటిలో జానపద భాషారీతి స్పష్టం. చతుర్థ భాగం కీర్తనలు. ఇవి వైరాగ్య నీతి ప్రబోధాలై ఉన్నాయి. వీటిలో మూడు పదాలు మాకరాజు కార్వేటిరాజుకు అంకితమయ్యాయి. తక్కినవి వేణుగోపాలాంకితాలు.

కార్వేటినగర సంస్థానంలో పండితుడై, పదరచనచేసి, వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడు. వైణిక విద్యాంసుడై సత్కృతుడయ్యాడు. అభినయాచార్యుడై ప్రఖ్యాతి గడించాడు. క్షేత్రయ్యలాగే సారంగపాణి తన పదాల్లో సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్యమివ్వడమేగాక అభినయం జోడించాడు. 1731 లో మాకరాజు వేంకట పెరుమాళ్ళరాజు సారంగపాణికి దుర్గరాజపురమనే అగ్రహారం దానమిచ్చాడు. చివరిదశలో రాజాశ్రయాన్ని కోల్పోయి నిరుపేదతనంతో శ్రీనాథునిలా సారంగపాణి అష్టకష్టాలు అనుభవించినట్లు శ్రీరజనిగారు అభిప్రాయపడుతున్నారు[74]. కానీ ఆరంభంలో శృంగారప్రవణమైన పదాలు రాజు కోరికపై రచించినా, క్రమంగా చరమదశలో ఉత్తమ భక్తుడైనట్లు ఆతనికీర్తనలే సాక్ష్యం.

అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య పదాలు స్వరసహితంగా ముద్రితమైనట్లు సారంగపాణి పదాలు కాలేదు. ఈ విషయాన్ని "కాని క్షేత్రయ్య పదాలను నేర్చుకొని, పరంపరాగతంగా పాడుకుంటూ నేటికి కొందరు మిగిలినట్లుగా, సారంగపాణి పదాలకు అంతప్రచారం కలిగినట్లులేదు. దానికి కారణం చివరి కాలంలో ఆతనికి రాజాస్థానాలప్రాపు లేకపోవడమూ, శిష్య పరంపర లేకపోవడమూ కావచ్చు. ఈతని పదాల స్వర ఫణితులను అన్వేషించి సేకరించవలసి ఉన్నది"[75] అన్న శ్రీరజనిగారి ఆకాంక్ష తీరేదెప్పుడో? ఈ విషయంలో శ్రద్ధ వహించి ప్రతివత్సరమూ 'సారంగపాణి' ఉత్సవాలు కార్వేటి నగరంలో నడుపుతూన్న, ఆచార్య పి. వి. అరుణాచలంగారి కృషి శ్లాఘాపాత్రమైంది.

## గోవిందసామయ్య, కూవనసామయ్య (1680-1714) :

గోవిందసామయ్య కూవనసామయ్యలు అన్నదమ్ములు, సారంగపాణి సమకాలికులు; కార్వేటి నగరం ఆస్థానంలోనే వాగ్గేయకారులై వెలిశారు. గోవిందసామి భరతనాట్యశాస్త్ర కోవిదుడైన నాట్యాచార్యుడు. కార్వేటి నగరరాజు ఇతనిని మిక్కిలి సత్కరించాడు. ఈ రాజు వెంకటగిరి రాజకుమారి అయిన తన రాణిపై

కోపించి అనాదరించగా ఆమెకు సంగీతాభినయాలు నేర్పించి రాజును మెప్పించి స్వీకరించేట్లు చేశాడట ఈ గోవిందస్వామి. "ఇతని రచనలో తాళపుపోకడలు, జాతులమార్పుల ననుసరించి సాగిపోయే జతిస్వరగతులు అద్భుతం గొలుపు తుంటాయని పింజమూరి వరాహనరసింహాచార్యులవారు వ్రాశారు". .... మోహన రాగంలో 'సరిగాదాని' అనిస్వర సాహిత్యం వచ్చునట్లు రచించిన పదవర్ణము యీ సందర్భంలో పాడినదే కావచ్చు. ఇంకా యితడు కేదారగౌళ, నవరోజు, ముఖారి రాగాలలో పదవర్ణాలు రచించాడు ఇవన్నీ నృత్యాభినయానికి ఎంతో అనుకూలమైన జతిభేదాలను కలిగి ఉంటాయి. ఇతని తమ్ముడు కువనస్వామి రచనలలో నాటకురంజి రాగంలో 'ఇంత అలుక' – అన్న పదవర్ణము ప్రసిద్ధము"[76].

## శాహ భూపాలుడు (1684–1712) :

నాయకరాజుల అనంతరం తంజావూరు, మధురలు మహారాష్ట్రుల హస్తగత మయ్యాయి. అయినా ఆ కళావైభవం తగ్గలేదు. "విజయరాఘవుని మరణానంతరం నాయకరాజుల పరిపాలనం అంతరించింది కాని తంజావూరు సారస్వత కళావైభవం తరుగలేదు. పరిపాలన హస్తగతం చేసుకొన్న మహారాష్ట్ర రాజులు తమ మాతృభాష మహారాష్ట్రమయినా, పాలించేది ద్రావిడ దేశమయినా, సంస్కృతాంధ్రభాషల్లో, సంగీతసాహిత్య గ్రంథాలను స్వయముగా రచించి, అనేక కవి పండిత గాయకాదులను పోషించి, వారిచేత వ్రాయించి, నాయక రాజులనాడు ప్రారంభించిన సంస్కృతి బీజాలను ఇతోధిక భక్తి శ్రద్ధలతో పోషించి అభివృద్ధి చేశారు. నాయకరాజుల వలెనే ఈ మహారాష్ట్ర రాజులుకూడా చాలామంది స్వయముగా యక్షగానాలను, పదాలను రచించడమే కాకుండ, సంగీతలక్షణ గ్రంథాలను కూడా వ్రాశారు. 'అనేకమంది' వాగ్గేయకారులను పోషించి వారి రచనలకు ప్రోత్సాహ మిచ్చారు"[77].

మహారాష్ట్రులలో మొదటిరాజు ఏకోజీ (1676–1683). సాహిత్యరంగంలో చేసిందేమీ కనిపించదు. ఇతని పుత్రుడు శాహజీ స్థానికులతో కలసిపోయి కృష్ణదేవరాయ, రఘునాథనాయక విజయరాఘవనాయకులతో సమానంగా స్వయంగా గ్రంథకర్త అయి 1684–1712 మధ్యకాలంలో తంజావూరును పాలించాడు. 1693లో తిరువాసనల్లూరు అనే గ్రామాన్ని శాహరాజ పురమనే

పేరుతో 46 గురు విద్వాంసులకు బహూకరించాడు. ఇతని యక్షగానాలు ఇరవై దాకా ఉన్నాయి. వీటన్నిటిలోను దరువులు పదాలు అనేకం ఉన్నాయి. వీటిలో ఇతడు శంకరపల్లకి సేవా ప్రబంధాన్ని, తిరువారూరి శ్రీ వీథివిటంక త్యాగరాజస్వామి పల్లకిసేవను గురించి చాలాచక్కగా రచించాడు పల్లకిసేవా ప్రబంధంలోని శాహజీ

దరువు "చల్లేటిగంద వాడి మై జారి నిలువరో
పల్లకి పట్టిన ముద్దు పడతులారా ...." అన్నది

అన్నమాచార్యుని "కులకక నడవరో కొమ్మలారా
జలజలరాలీని జాజులు మాయమ్మకు" (XII–73)

అనే పదాన్ని గుర్తుకు తెస్తుంది

ఇతని ఆస్థానంలో శ్రీధర వేంకటాచార్యుడూ మొదలైన కవులు, పద కవులు, యక్షగానకర్తలు అనేకులు వెలిశారు

గిరిరాజకవి (1684-1728) ;

శాహభూపాలునిచే పోషింపబడిన ప్రసిద్ధ వాగ్గేయకారుడు గిరిరాజకవి. ఇతనిపౌత్రుడే త్యాగరాజు. ఇతడు శాహభూపాలుని (1684-1712) కొలువులోను, శరభభూపాలుని (1712-1728) దర్బారులోనుఉండి అనేక యక్షగానాలను, పదాలను రచించి ప్రఖ్యాతి పొందాడు ఇతని పేర శాహేంద్రాంకితాలుగా, త్యాగేశాంకితాలుగా అనేక పదాలున్నాయి ఇతడు ఏడుయక్షగానాలు రచించాడు.

మధుర శ్రీనివాసయ్య (1704-1731) :-

మధురనేలిన తిరుమల నాయకుని వంశరాజులలో 11వతరం వారైన విజయ రంగ చొక్కనాథుని ఆస్థానంలో మధుర శ్రీనివాసయ్య వెలసినట్లు తెలుస్తూంది. విజయరంగ చొక్కనాథుడు అనేక పదాలనూ, యక్షగాన కర్తలనూ పోషించాడు. మధుర మీనాక్షి అనుగ్రహంతో సంగీత సాహిత్యాలలో అద్భుతమైన ప్రజ్ఞపొందినట్లు ఐతిహ్యంవుంది "అర్థపుష్టి, శబ్దశయ్యా కలిగిన మాతువులు మేలిమైన ధాతుకల్పనతో అతడు విజయగోపాల ముద్రాంకితములైన కీర్తనలు రచించినాడట. నాటకురంజిలో

ఏనుమించినవారు, కాపిరాగంలో 'నీవే నన్ను బ్రోవవలెనమ్మ', కల్యాణిరాగంలో ఇంకా దయరాదా' ఇతని రచనలు"[78].

ఘనం శీనయ్య (1704-1731) :

మధుర విజయరంగ చొక్కనాథుని అమాత్యుల్లో ఒకడైన వంగల శీనయ్యే ఈ ఘనం శీనయ్య. ఇతడు సంగీత సాహిత్యనిధి, వాగ్గేయకారుడు. శేషం వేంకటపతి కృతమైన శశాంక విజయానికి ఇతడు కృతిభర్త. ఇతని సంగీత ప్రతిభను గూర్చి శశాంకవిజయంలో "హాహాహూహూలు .. (అవతారిక-57) పద్యంలో-'స్వరారోహ ప్రక్రియ'లో గొప్పవాడనీ, 'ఘననయ దేశీయ కమనీయ గ్రామ మూర్ఛనా బహువిధ విన్యాసధన్యా సమాన తాళమాన నానామాన తాన వితానభంగీ తరంగిత సంగీతవిద్యా విశారదుడు" (అవ-23) అనీ పేర్కొవడం గమనించదగ్గ విషయం. ఇత డనేక పదాలు రచించాడు. "శివదీక్షాపరురాలనురా" అన్నదీతని ప్రసిద్ధపదం. "ఇతని పదాలలోని భావాలబింకమూ, మాటల బింకమూ క్షేత్రయాదుల కనుకరణములుగా గాక, స్వతంత్రమైన పోకడలుగా కనిపిస్తాయి.... ఈ క్రిందిపదంలో కొంత క్షేత్రయ్య ధోరణిఉంది. శంకరాభరణం-త్రిపుట-'వాడెవరో మనమెవరో-వనితరో యీవట్టి వాదేల పోపోవే....' భావములలో అనుభవ పరిపాకమూ, రచనలో శిల్పపుతూకమూ కనిపిస్తున్న శీనయ్య పదాలు క్షేత్రయ్య రచనలతో సమానములుగా తులతూగేవేకాని, అనుకరణకవుల రచనలలో తీసివేయదగినవి కావు. వీటిని గానంచేసి అభినయించినపుడు వీటి రసాస్వాదన యోగ్యత మరింత స్పష్టమవుతుంది."[79]

మార్గదర్శి శేషయ్యంగారు :

ఘనం శీనయ్యకు పూర్వుడనీ, సంగీత సంస్కృతాలలో గొప్పపండితుడనీ, అయోధ్యనుంచి వచ్చిన శ్రీ వైష్ణవుడనీ, గొప్ప వాగ్గేయకారుడనీ మార్గదర్శి శేషయ్యంగారిని గూర్చి సుబ్బరామ దీక్షితులు పేర్కొన్నారు.[80]

మొదటి శరభోజీ (1711-1728) :

శాహజీ తరువాత మొదటి శరభోజీ (1711-1728) తంజావూరును

పాలించాడు. సంగీతంలో సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడు. శరభ భూపాల కురవంజి అనే యక్షగానం రచించాడు.

తుళజాజీ (1728-1736) :

ఇతడు షాహజీ రెండో తమ్ముడు. ఇతడు సంగీతసారామృతమనే సంస్కృత లక్షణ గ్రంథకర్త. విఘ్నేశ్వర కల్యాణమనే యక్షగానకర్త. 'ఏకరాజేంద్ర వినుతా' మొదలైన ముద్రలతో పదాలు రచించాడు. ఇవి నీతి బోధకమై, భక్తి రసాత్మకమై ఉన్నాయి. శృంగారం తక్కువ.

ప్రతాపసింహుడు (1740-1762) :

1740-1762 మధ్యకాలంలో రాజ్యంచేసిన ప్రతాపసింహుని నట్టువ కవయిత్రి ముద్దుపళని 'మహారాజ ప్రతాపసింహ-సలాము' అనే మకుటంగల శబ్దాలను కొన్నిటిని కూచిపూడి వారు పాడుతుంటారు.

కాశీనాథయ్య (1740-1762) :

ప్రతాపసింహుని ఆస్థానంలో ఉండినవాడు మేలట్టూరు కాశీనాథయ్య. ఇతడనేక శబ్దాలు రచించినట్లు పరిశోధనలవల్ల తేలిన సారాంశం. 'భళీ, భళిరా, సలాం, ఫిల్లాం, పరాకు మొదలయిన హెచ్చరిక మాటలతో, కవుత్తముతో కలిసి, తాళానుగతంగా ఏర్పరచిన జాతులతో స్వల్ప సాహిత్యంతో కూడిన రచనను శబ్దం అంటారు. వీటిని ఆలయములలో, దేవతాసేవయందు, రాజాస్థానములలో రాజు కొలువుదీర్చి ఉన్నప్పుడూ, వేల్పునుగానీ, రాజునుగానీ, బిరుదావళి రంగఘోషణ, యశోగీత ఇత్యాదులతో స్తుతించి నృత్యగానాలతో సహ అభినయిస్తూ విద్వాంసులుగాని, నర్తకీమణులుగాని ప్రదర్శించేవారు 'నాయకరాజుల నాడుండిన కైవారములు శార్ఙ్గదేవాదుల లక్షణ గ్రంథాల్లో వివరించిన కైవాడ ప్రబంధపు అద్యతన పరిణామాలే"[31].

మేలట్టూరు వీరభద్రయ్య (1740-1752) :

వీరభద్రయ్య సైతం ప్రతాపసింహ మహారాజు ఆస్థానంలో ఉండిన వాగ్గేయ

కాదుడు. ఇతడాంధ్ర దేశం నుంచి వచ్చిన తైలింగ్య బ్రాహ్మణుడు "వీరభద్రయ్య భోగులవంశజులైన తంజావూరు మహారాష్ట్రరాజుల కులదైవమగు 'ప్రతాపరాముని' ముద్రతో బహుకీర్తనములు అనేక రక్తిరాగములందు బహుదేశీయ రాగములందును, గేయకల్పనము వేర్వేరు విలసిల్లునటుల వివరించెనట. ఇవిగాక, ఇతడు ప్రతాప సింహ రాజుపైని దరువులు, పదములు, తిల్లానాలు, స్వరజతులు మొదలైనవి అనేక విచిత్ర గేయకల్పనలు జేసి బహుఖ్యాతి బొందెనట. 'ఈ మహానుభావుని వలననే దక్షిణదేశపు గానమార్గము మిక్కిలి పరిష్కారము కలదిగా నేటికిని ప్రకాశించుకొని యున్నది'. అని వీరభద్రయ్యను గురించి సుబ్బరామ దీక్షితులు వ్రాసినదానినిబట్టి, మన వాగ్గేయకార చరిత్రలోగాని, కర్ణాటక సంగీతక్రమపరిణామంలోగాని వీరభద్రయ్య యెటువంటి ప్రధాన స్థానాన్ని ఆక్రమించి ఉన్నాడో తెలుస్తుంది" 82.

కంకంటి పాపరాజు :

ఉత్తర రామాయణకర్తగా కంకంటి పాపరాజు మిక్కిలి ప్రసిద్ధుడు. ఇతడు విష్ణుమాయావిలాస నాటకం అనే యక్షగానకర్త. క్షీరసాగర మథనానికి పూర్వంగల మోహినీవృత్తాంత, ఇందు కథ. ఇతని కాలానికి సంబధించి భేదాభిప్రాయాలున్నాయి. వీరేశలింగంగారు ఇతనికాలం 1790 అని చెప్పగా, డా॥ యస్వీ. జోగారావుగారు 1600 ప్రాంతం కావచ్చునంటారు[83]. ఏమైనా ఇతడు పదకవుల చరిత్రలో క్షేత్రయ్య యుగంలోని యక్షగానకర్తగా చెప్పుకోవడమే సముచితం. "ఇందు (విష్ణుమాయా విలాసనాటకంలో) రకరకముల పదములు, దరువులు, రాగతాళ ధారాళములైనవి కలవు. ఏకతాళ, జంపె, కుంభచజంపె, త్రిపుట, రచ్చతాళం, అది, అటప్పట్టం, లఘుశేఖరం మొదలైన తాళ ప్రధానములైన దరువులే యెక్కువ. ఏలలు, అర్ధచంద్రికలు, ధవళ శోభనములు, నడలు, త్రిస్తబకము మొదలైన అనేక దేశి మధుర కవితారచనలు గలవు"[84].

మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (1730—80) :

మునిపల్లె సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణకర్త. రామదాసు కీర్తనల తరువాత తెలుగుదేశంలో మిక్కిలి జనరంజకమైన సంగీత సాహిత్యరచన — కీర్తనాత్మకమైన అధ్యాత్మ రామాయణం సంకీర్తనాత్మకంగా అన్నమయ్య ఆరంభించిన

గేయం అధ్యాత్మరామాయణంలో కథనాత్మకమైంది. రామాయణకథనంతటినీ ఆరుకాండలలో 104 కీర్తనల్లో సుబ్రహ్మణ్యకవి వివరించాడు.

ఇతని కాలం 1730-80 అని రజనిగారు నిర్ణయించి 'సంస్కృతాంధ్ర భాషల లోను, సంగీతనాట్యాలంకారశాస్త్రములలోను, వేదాంతశాస్త్రంలోనుకూడా సుబ్ర హ్మణ్య కవికి అపారమైన పాండిత్యం ఉన్నట్లు అతని రచనలవలన తెలుస్తుంది అంతేకాకుండా ఇతడు సంస్కృతాంధ్రములలో గేయరచనాదక్షుడు. క్షేత్రయ్య, త్యాగరాజులకు నడుమ వెలసి, బహుజనరంజకుడైన వాగ్గేయకారకుడు"[85] అని వివ రించారు. కాని ఇతడు 16వ శ. కి చెందినవాడని వివరించి "ప్రస్తుతము సుబ్ర హ్మణ్య కవికాల నిర్ణయము సంతృప్తికరముగా జరుగలేదని విన్నవించి, దానిని భావి పరిశోధకులకు వదలివేయుట మంచిదని తోచుచున్నది"[86] అని వదలిపెట్టారు కుమారి మంగళగిరి ప్రమీలాదేవి. కాని సుబ్రహ్మణ్యకవి క్షేత్రయ్య యుగమైన 1600-1750 మధ్యకాలంలో వెలసిన వాడుగానే భావిస్తున్నాను. పైపెచ్చు శ్రీరజని గారు అన్నట్లు క్షేత్రయ్య, త్యాగయ్యల నడిమికాలం వాడనటం మరీ సముచితమని నాభావన "అధ్యాత్మరామాయణము భక్తి, వేదాంత ప్రధానమైనా సుబ్రహ్మణ్యకవి తన కథాకథనంలో శృంగార రసాత్మకమైన మనోహరపదజాలాన్ని ....పల్లవులలోనే కాకుండా, కీర్తనలలో చాలాచోట్ల అవకాశం చిక్కినప్పుడల్లా అనుసంధిస్తూనే వచ్చాడు. భక్తితత్వప్రబోధితులయిన పోతనాది మహాకవులు పోయిన మార్గమే అది"[87].

సుబ్రహ్మణ్యకవి పదాలు సైతం రచించాడు వాటిలో కొన్నింటిని తిమ్మా వఝల కోదండరామయ్యగారు ప్రకటించగా వాటిని వివరించారు రజనిగారు. ఆ పదాలు దామెర్ల కుమారవేంకటేంద్రుని, అతని కుమారుడైన కృష్ణస్వామినీ, కాళ హస్తీశ్వరునీ, అగస్త్యనాథునీ నాయకులుగాచేసి చెప్పినవి. "సుబ్రహ్మణ్యకవి స్వతహాగా గొప్ప ఆధ్యాత్మికతత్వవేత్త భక్తినిష్ఠా గరిష్ఠుడూ అయినప్పటికీ జీవితం లోని శృంగారమునూ, సృష్టిలోని సౌందర్యమునూ, అనుభవానికి తెచ్చుకొన్న వాడేననీ, శృంగార రసనిష్యంది అయిన మధురభావసంపదా, లలితపద జాలమూ అతనికి కరతలామలకములే అనీ.... తెలుస్తూంది తనను ఆచార్యపీఠాన ఉంచి గౌరవించిన కాళహస్తి పాలకుల కోరికపైని కొన్నిపదాలుకూడా వ్రాసిపెట్టి వాటితో పాటు ఆశీఃపూర్వకంగా తనకుతానుగా దైవాంకితంగా రచించుకొన్న రామాయణ

కీర్తనలను కూడా దాపెర్లవారికి ఇచ్చి ఉంటాడు" "ఆంధ్రులను, ఆబాలగోపాలమును పాడించిన ప్రసిద్ధ వాగ్గేయకారులకోవలో ఇంచుమించు చివరివాడు సుబ్రహ్మణ్యకవి అతని కీర్తనల సంగీతాన్ని ఉద్ధరించుకొనడము వరదలో మునిగిపోవనున్న నాగార్జున శిల్పకళాఖండాలను ఉద్ధరించుకొనడము వంటిదే. ఎక్కడో దక్షిణాదివారి బాణీనో, ఉత్తరాది బాణినో అనుకరించడం తప్ప, ఆంధ్రులకు సొంత సంగీతములేదనుకొనే వారందరికీ – అన్నమాచార్యులతో ప్రారంభించి, సుబ్రహ్మణ్యకవి వరకూ–మనము స్మరించిన వాగ్గేయకారులందరి జీవితములూ సరియైన ప్రత్యుత్తర మియ్యగలవు"[88]

"క్షేత్రయ్యగొంతులో పరిపక్వమై ధాతుమాతు సమాన ప్రాధాన్యముతో సమగ్ర స్వరూపమునొందిన పదరచన మహారాష్ట్రీలనాడు శాహ భూపాలుడు, గిరిరాజకవి, మేరటూరి వీరభద్రయ్య, కాశీనాథయ్యవంటి వాగ్గేయకారుల రచనల్లో ధాతుకల్పన మరింత విస్తృతి పొందినవి. సలాములు, శబ్దములు మొదలైన సంగీత రచనలకూ.... ఇతోధిక ప్రవర్తకులైనారు"[89]

ఇలాగా క్షేత్రయ్యయుగం (1600–1750) లో వెలసిన పదకవులు సంగీత సాహిత్యాభినయాలకు ఎనలేని సేవచేసినట్లు స్పష్టమయింది.

## 2.5 త్యాగయ్యయుగం (1750–1850) :

తెలుగు పదకవితా ప్రపంచంలో త్యాగయ్యయుగం చాల ప్రధానమైంది, ప్రముఖమైంది. పదంక్రమ పరిణతిలో సంకీర్తన, కీర్తన అయి కృతిగా త్యాగయ్యయుగంలో రూపుదాల్చింది పదంలోని ధాతుమాతువుల్లో ధాతుప్రాధాన్యం వహించడం ఈ యుగ విశిష్టత అన్నమాచార్య యుగంలోని పదంలో మాతువుకే ప్రాధాన్యం. క్షేత్రయ్యయుగంలో ధాతుమాతువులకు సమప్రాధాన్యం; దానికి అభినయంతోడై జోడుకూడింది. కానీ త్యాగయ్యయుగంలో పదం కృతి; దానికి ధాతువుజీవాతువు. క్షేత్రయ్యయుగంలో పదంపోయిన పలుపోకడలు మనం చవిచూశాం. ఈ యుగంలో ధాతు ప్రాధాన్యమైన కృతిరూప పదసాహిత్యాస్వాదన చేద్దాం. ఈ యుగాని కంతటికీ నాదోపాసనతో తరించిన త్యాగబ్రహ్మ యుగకర్త. పైగా 1767లో జన్మించి 1847లో జీవన్ముక్తుడైన త్యాగయ్యనే 1750–1850 యుగానికి యుగకర్తగా పరిగణించడం సముచితమే పైధాతు

కల్పనాశిల్పంలో త్యాగరాజు తరువాతనే ఎవరినైనా పేర్కొనవలసి ఉంది అతనితో శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు గొప్ప వాగ్గేయకారులు. ఆ వెనుక త్యాగయ్య శిష్యవర్గం అత్యంత గణనీయమైన సేవచేసినట్లు విదితమవుతుంది. అంటే ఈ త్యాగయ్య ప్రభావం అనంతమని మనం తెలుసుకోగలుగుతున్నాము. అందుకే ఇది 1750–1850 త్యాగయ్యయుగం.

ఈ సందర్భంలో ఈ యుగ ప్రాధాన్యాన్ని గూర్చి వివరించిన శ్రీ రజని గారి మాటలు ఉల్లేఖించడమే సముచితం.

"ఒక్క దక్షిణభారత సంగీతచరిత్రలోనే కాకుండా, ప్రపంచ సంగీత చరిత్రలోకూడ 1750 నుంచి 1859 వరకూ అత్యంత ప్రధానమైనయుగం, రెండు చరిత్రలలోను ఈ యుగాన్ని స్వతంత్రధాతు కల్పనాయుగమని పిలువవచ్చును. యూరప్‌లో ఆనాడు బీతోవెన్, మోట్జార్ట్, మెండల్‌సోన్, షోపెన్, షూబెర్ట్, వీబర్ అనుగొప్ప సంగీత కర్తలందరూ వెలిశారు. వారందరూ సోనాటా సింఫోని ఇత్యాదిగా (ఆర్కెస్ట్రా) వాద్య మేళములపైనీ, ప్రత్యేక వాద్యములపైనీ ప్రయోగింపదగిన సంగీత రచనలను, అపూర్వమైన ధాతుకల్పనా చాతుర్యముతో వెలువరించి యశోధనులైనారు. ఇదేయుగంలో తమ స్వతంత్రధాతుకల్పనాత్మకములయిన కీర్తనలతో దక్షిణభారత సంగీతానికి అఖండ పరివ్యాప్తిని చేకూర్చిన అవతారమూర్తులయిన వాగ్గేయకారులు త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు. కర్ణాటక సంగీత చరిత్రకారులు వీరు ముగ్గురినీ సంగీత త్రిమూర్తులనీ, రత్నత్రయమనీ పిలుస్తారు. శ్యామశాస్త్రులు 1762-1827; త్యాగయ్య 1767–1847; ముత్తుస్వామి దీక్షితులు 1776–1835; ముగ్గురూ తంజావూరు జిల్లాలోని తిరువారూరుకు సంబంధించినవారే; సమకాలికులే వారి రచనలలో రాగస్వరూపము పరిపూర్ణమై సర్వకళలతోను స్పష్టముగా స్ఫురిస్తూ ఉంటుంది. మృదువైన భాషాశిల్పానికిగానీ, నవ్యకల్పనలతో నిత్యసుందరమయిన సంగీతశిల్పానికి గానీ ముందు వీరిని స్మరించి, మిగిలినవారిని స్మరించాలి. అతి అపూర్వ రాగాలలోకూడ అతి సునాయాసంగా చెప్పిన కీర్తనలూ, ఒకేరాగంలో వేర్వేరు ప్రత్యేక వ్యక్తిత్వాలు కనిపించే వేర్వేరు కీర్తనలూ, ఆకీర్తనల రసభావౌన్నత్యమూ, వాటి సంగీత రచనలో ఆత్మోత్తేజకమయిన ఉదాత్తతా, ఈ ముగ్గురు మహనీయులకూ సంగీత రత్నత్రయ పదవిని పట్టముగట్టిన ప్రధాన లక్షణములని శ్రీ సాంబమూర్తిగారు తమ వాగ్గేయకార చరిత్రలో వ్రాశారు"90.

త్యాగయ్య నాదోపాసనలో కృతి సుకృతి అయినది. ఈ త్యాగయ్యను గూర్చి తెలుసుకొనే ముందు ఈ యుగంలోని త్యాగయ్యకు పూర్వులు కొందరు వాగ్గేయకారులను గూర్చి పరిశీలించడం అవసరం.

పచ్చిమిరియం ఆదియప్పయ్య (1740-1833) :

త్యాగయ్యయుగంలో మొదట పేర్కొనదగ్గ వాగ్గేయకారుడు పచ్చిమిరియం ఆదియప్పయ్య. ఇతడు 1740-1833 మధ్యన తంజావూరునేలిన ప్రతాపసింహ, రెండోతులజాజీరాజుల కాలంలో ఉండినవాడు. ఇతడు అసామాన్యమైన ప్రజ్ఞకల వాగ్గేయకారుడు. ఇతని "విరిబోణి" భైరవి వర్ణం లాంటివనీ, తానవర్ణాలతో ఇతడు ప్రస్తుతించబడ్డాడు. రక్తిరాగాల్లోను, దేశీయ రాగాల్లోను విశేషగమకాలతో, జాతీయాలతో, మేరటూరి వీరభద్రయ్య మార్గంలో, వేంకటరమణ ముద్రతో అనేక కీర్తనలు రచించి తరించాడు. రాగాలాపన, మధ్యమకాల పల్లవి ఫణితులు ఇతనివల్లనే పరిశుద్ధమైనట్లు ప్రతీతి.

ఇతని కుమారుడు వీణ కృష్ణయ్య, మనుమడు వీణ సుబ్బుకుట్టి గొప్ప వాగ్గేయకారులు.

'1767లో త్యాగరాజు జన్మించునాటికి పచ్చిమిరియం ఆది యప్పయ్యగారు వయోవృద్ధులు. త్యాగరాజాది యావత్ వాగ్గేయకారులు తరుచుగా ఆదియప్పయ్య గారిని కలుసుకొని, శాస్త్రవిషయాలలోను రచనా సందర్భములలోను సందేహాలను నివృత్తి చేసుకొనేవారు' [91].

వీణ పెరుమాళ్లయ్య (1760-1790) :

1760-1790 ప్రాంతంలో తంజావూరు రాజులకొలువులో వుండేవాడు. ఈ సమయంలోనే పుదుక్కోట నేలుతుండిన విజయరఘునాథ తొండమానుడనే రాజువద్ద ఇరవై రోజులపాటు భైరవి రాగాలాపనచేసి మెప్పించిన మహాసంగీత విద్వాంసుడు. ఇతని తమ్ముళ్లకూడ సంగీత విద్వాంసులే.

మాత్ర్ భూతయ్య (1740-1833) :

మాత్ర్ భూతయ్య వాగ్గేయకారుడు, యక్షగానకర్త. తంజావూరునేలిన

ప్రతాపసింహునిచే సమ్మానితుడు. రెండో తులజాజీ తమ్ముడైన అమరసింహుని మంత్రి శివరాయ మంత్రికి అంకితంగా పారిజాతాపహరణ మనే యక్షగానం రచించాడు. ఆ వెనుక త్రిశిరగిరి అనే నేటితిరుచ్చిరాపల్లి వెళ్లి 'త్రిశిరగిరి' ముద్రతో అర్థపుష్టిగల నీతిపదాలు, కీర్తనలు రచిస్తూ ఉండేవాడు.

ఇతని పారిజాతాపహరణంలో కూచిపూడివారి గొల్లకలాపపు ధోరణులు చాలా కనిపిస్తాయని విజ్ఞుల అభిప్రాయం.

మాతృభూతయ్య పదాల్లోను, దరువుల్లోను చక్కటి తెలుగు జాతీయత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. తచ్చూరి సింగరాచార్య ఉదాహరించిన పదాల్లో కొన్ని మాతృభూతయ్యవి కావనీ అవి మునిపల్లె సుబ్రహ్మణ్య కవివే అని శ్రీ రజనిగారి అభిప్రాయం[92].

ఇనుప సెనగల వెంకట్రామయ్య :

ఈ వాగ్గేయకారుడు ఆదియప్పయ్య సమకాలికుడు. వయస్సులో చిన్నవాడు. సంగీతసాహిత్యాలలో నిష్ణాతుడు. ఇతని ప్రౌఢరచనలను పాడుటకు దుర్లభంగా ఉండడంవల్ల అనాటి గాయకులీతనికి ఇనుపసెనగల వెంకట్రామయ్య అని బిరుదిచ్చారట. గోపాలకృష్ణముద్రతో కొన్నికీర్తనలున్నాయి.

శొంఠి వేంకటసుబ్బయ్య :

ఇతడు సంగీతసాహిత్యాలలో విద్వాంసుడని ప్రసిద్ధిపొంది, ఆదియప్పయ్యకు సమకాలికుడు; వయసులో కొంచెంచిన్నవాడు. బిళహరి రాగంలో విచిత్ర కల్పనలతో రెండోతులజాజీపైని ఒక వర్ణం రచించాడు. ఇతని పుత్రుడు వేంకటరమణయ్య తండ్రిని మించిన వాగ్గేయకారుడు ఇతడే త్యాగయ్య బాల్యంలోని సంగీతగురువు.

కుప్పుస్వామయ్య :

అమరసింహ మహారాజు కాలంలోను, శరభోజీ పాలనలో ఆరంభంలోను ఉండిన కుప్పుస్వామయ్య తెలుగున పాండిత్య ప్రకర్షకలిగిన వాగ్గేయకారుడు. భక్తి శృంగారకీర్తనలను వరద వేంకటముద్రతో రచించాడు.

## రాజగోపాలకవి (పల్లవి గోపాలయ్య) :

సంగీత ప్రపంచంలో పల్లవి గోపాలయ్యనే వాగ్గేయకారుడే సాహిత్య కారుడుగా, కవి రాజగోపాల వాగ్గేయ కారాగ్రణిగా ప్రసిద్ధుడు. ఇతని భక్తిజనపారి జాతమనే ప్రబంధంలో తనపూర్వులు గుంటూరువాసులని చెప్పుకొన్నాడు. ఇతడు అమరసింహ, శరభోజీల కాలంలోనివాడు. "అటతాళంలో ఇతడు రచించిన 'వనజాక్షి' 'అనే' కల్యాణివర్ణం ఈనాటికి సుప్రసిద్ధము. ఈతానవర్ణములలోని వరికగమనములూ స్వరకల్పన, శయ్యా ఇతని సంగీత కల్పనా చమత్కారనైపుణ్యములకు దృష్టాం తములు.... ఇతని కీర్తనల పల్లవులలో రాగవిన్యాసం మనో ధర్మానుగుణంగా సాగుతుంది తోడిరాగంలో 'అంబవాదు' అనే కీర్తన, నాటకురంజి రాగంలోని 'నీదుమూర్తిని' కాంభోజిరాగంలో 'హరిస్వర' కల్యాణి రాగంలోని 'మహిషాసుర'— గోపాలయ్య రచించిన ఈ కీర్తనలు ఈ నాటికీ కచ్చేరీలలో గానంచేస్తుంటారు"[13].

## రామస్వామి దీక్షితులు (1738-1817) :

ఇతనికాలం 1738—1817. ఇతడు బాల్యంలో కంచిలో గడిపి, 'ఆ వెనుక మధ్యార్జున క్షేత్రానికి దగ్గరలో ఉన్న గోవిందపురంలో నివసించాడు. సంస్కృ తాంధ్ర భాషల్లో పాండిత్యం సంపాదించి, తంజావూరు వెళ్ళి మేరట్టూరి వీరభద్రయ్య వద్ద సంగీతమభ్యసించి, వీణనేర్చుకొని ప్రతాపసింహుని కుమారుడైన అమరసిం హుని మెప్పించి సత్కృతుడయ్యాడు. అమరసింహుని రాగమాలికా కీర్తన రచిం చాడు. తిరువారూరి లోని కమలాంబా త్యాగరాజస్వాములపై భక్తికీర్తన లెన్నో రచించాడు. ఇతని పుత్రుడే సుప్రసిద్ధ వాగ్గేయకారుడు ముత్తుస్వామి దీక్షితుడు. తన చిన్నకుమారుడైన చిన్నస్వామికి కలిగిన నేత్రదోషాన్ని తిరుపతి స్వామిపై 'మన సా వేరితరుల తలచక' అనే 48 రాగాల రాగమాలికను వేగవాహినీ రాగంలో 'ఇంకా దయరాకున్నను' అనే కీర్తనను గానంచేసి తొలగించి, దృష్టిని ప్రసాదింప చేశాడట. మధురమీనాక్షిపై 40 రాగాల రాగామాలికను, అనేక కీర్తనలను, హంసధ్వని అనే రాగాన్ని కల్పించి ప్రబంధమూ రచించాడు.

13)

పైడాల గురుమూర్తి శాస్త్రి :

ఇతడు తిరునల్వేలి జిల్లాలోని కయత్తారు గ్రామంలో జన్మించిన ఆంధ్ర బ్రాహ్మణుడు. రామస్వామి దీక్షితుల సమకాలికుడు, వయసున పిన్న. ఇతని కృతు లన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి.

ఉపనిషద్బ్రహ్మయోగి (1720-1800) :

కాంచీపురానికి దగ్గరగా పాలారునదీ తీరానగల బ్రహ్మపుర వాస్తవ్యులయిన లక్ష్మీసదాశివుల నోముల ఫలం శివరాముడు. ఇతడొక పుత్రునిగని గృహస్థాశ్ర మాన్ని వదలి రామచంద్రేంద్రయోగిగా సన్యాసాశ్రమం స్వీకరించాడు.

ఉపనిషద్భగవద్గీతలకు భాష్యం రచించి, ఉపనిషద్బ్రహ్మేంద్ర యోగిగా ప్రసిద్ధికెక్కాడు. త్యాగరాజాదులకు ఇతడు గురుప్రాయుడు. "ఉపనిషత్తులకు, గీతకు, బ్రహ్మసూత్రములకు భాష్యములువ్రాసి, జ్ఞానమార్గముద్వారాను, నామా వళిని, సంకీర్తనములను అష్టపదులను, తరంగములను గానముచేసి నాదబ్రహ్మో పేతమయిన భక్తిమార్గము ద్వారాను నిర్గుణ, సగుణోపాసనల రెండింటి ద్వారాను పరమాత్మజ్ఞానము పొందిన ఈయన త్యాగరాజాదులకు మార్గదర్శకుడయినట్లు ముందు చెప్పుకొన్నాము"[94].

త్యాగయ్య (1767-1847) :

ఈ యుగానికి యుగకర్త త్యాగయ్య. త్యాగయ్య నాదోపాసనలో ముక్తి పొంది, భక్తులందరికి దారిచూపిన మహా వాగ్గేయకార సత్తముడు. అన్నమా చార్యుని ఆధ్యాత్మికసంపద, పురందరదాసు సంగీతస్ఫూర్తి, రామదాసు భజనరీతిని పుంజీభూతం గావించుకొని, సంగీతసామ్రాజ్యానికి అధినేతృత్వం వహించిన మహానుభావుడు త్యాగయ్య.

త్యాగయ్య శాహాభూపాలుని ఆస్థాన వాగ్గేయకారుడై ప్రసిద్ధికెక్కిన గిరిరాజకవికి స్వయానపౌత్రుడు. గిరిరాజకవి పుత్రులలో కనిష్ఠుడు రామబ్రహ్మం. రామబ్రహ్మం పుత్రుల్లో కనిష్ఠుడు త్యాగయ్య. 1600 ప్రాంతంలో గిరిరాజకవి తండ్రి కాకర్ల పంచ నదబ్రహ్మం తెలుగునాడులోని కర్నూలు మండలంలోని కంభం తాలూకా (ఈనాడు

ప్రకాశంజిల్లాలో ఉంది) కాకర్లనుంచి తంజావూరు జిల్లాలోని తిరువారూరుకి వచ్చి స్థిరపడ్డ ములికినాటి ఆంధ్రబ్రాహ్మణుడు. సీతమ్మ రామబ్రహ్మంలకు పంచాప కేశ బ్రహ్మమనే జపేశయ్య, రామనాథబ్రహ్మం అనే మొదటి ఇద్దరు పుత్రులు సంప్రదాయ బద్ధులుగాక తల్లిదండ్రులకు ఇబ్బంది కలిగించేవారట. ఆ దంపతులకు తిరువారూరు త్యాగరాజస్వామి అనుగ్రహంతో కారణజన్ముడై వాల్మీకి, నారద, సరస్వతుల అంశాన జన్మించినవాడు త్యాగయ్య. ఇతడు 1767లో జన్మించాడు. త్యాగరాజ జనన సంవత్సరంగా ఇదే ప్రసిద్ధం. కానీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు 1783లో జన్మించినట్లు పేర్కొన్నారు[95]. వారెందుకిలా వ్యస్తంగా దేని నాధారంగా గ్రహించి పేర్కొన్నారో తెలియదు. తండ్రి రామబ్రహ్మం తంజావూరు ప్రభువు శరభోజీ ఆదరంలో ఉండే వాడు. తాత గిరిరాజకవి మహా వాగ్గేయకారుడు. మాతామహుడు వీణ కాళ హస్తయ్య ప్రసిద్ధుడైన సంగీత విద్వాంసుడు. తల్లి పురందర, రామదాసాదుల కీర్తలను పాడు కొంటూ ఉండేది. సంగీతం త్యాగయ్యకు ఉగ్గుబాలతోనే అబ్బింది. సంస్కృ తాంధ్రాలలో పాండిత్యం గడించాడు. శొంఠి వేంకటరమణయ్యవద్ద చేరి సంవత్సరంలోనే సంగీతంలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. రామకృష్ణానంద స్వామి అనే సన్యాసి నారదోపాస్తి మంత్రాన్ని త్యాగయ్య కుపదేశించాడు. నారదుడు యతివేషంలోవచ్చి స్వరార్ణవమనే సంగీత గ్రంథాన్నిచ్చి సమస్త సందే హాలు తీరిపోతాయని ఆశీర్వదించి పోయాడట. తన గురువైన నారదుని అనేకవిధాలా కీర్తనలలో స్తుతించాడు. రామకృష్ణానందస్వామి ఆదేశానుసారం 96 కోట్లు రామ తారక మంత్రపఠనంతో 38వ యేట శ్రీరాముడు సలక్ష్మణుడై దర్శనమిచ్చాడట. ఆ సందర్భంలో చెప్పిన కీర్తనే అఠాణా రాగంలోని 'ఏల నీ దయరాదు పరాకు జేసే వేల' అన్నది. అనేక పర్యాయాలు సైతం రాముని దర్శించినట్లు అనేకకృతులు సాక్ష్యమిస్తున్నాయి. అలాంటి వాటిలో 'కలిగ లల్లలాడగగని ఆరాణ్ముని యెటు పొంగెనో' అనేకృతి చక్కటి ఉదాహరణ.

త్యాగయ్యకు 18ఏట పార్వతమ్మతో వివాహమైంది. ఆ వెనుక తండ్రి రెండేండ్లకు మరణించాడు. ఆ పిమ్మట ఐదేండ్లకు మొదటిభార్య గతించగా, ఆమెచెల్లెలు కమలాంబనిచ్చి త్యాగయ్యకు వివాహం చేశారు. జీవనోపాధికై నరుల నాశ్రయించలేదు. ఉంఛవృత్తితో జీవించేవాడు. అన్న జపేశయ్యకిది నచ్చేది కాదు. రాజాశ్రయానికి తమ్ముని మనస్సు మరల్ప యత్నించి విఫలుడయ్యాడు.

ల్లు విభజించి తమ్మునికి వాటా ఇచ్చివేశాడు మారుతాడన్న ఆశతో. ఇది తనకిష్టం లేదు. ఉంఛవృత్తి, నిత్యరామసంకీర్తనమే తాను ఆచరించేవి. ఆయన కీర్తి దేశమంతటా ఉత్తమ వాగ్గేయకారుడుగా వ్యాపించింది. ఎంతోమంది ఆతనిచేత సంగీతసభ చేయించి సన్మానించ అభిలషించారు. తంజావూరు ప్రభువు రెండో శరభోజీ పలుకానుకలు పంపి ఆహ్వానించాడు. జపేశయ్య సంతసించాడు. కానీ త్యాగయ్య తిరస్కరించాడు. "నిధిచాల సుఖమా రామునిసన్నిధి సేవ సుఖమా" అంటూ ఆ సందర్భంలో పాడినకృతి. మహాయోగి త్యాగరాజు. ఇదేరీతిగా తిరువాన్కూరుప్రభువు స్వాతితిరునాళ్లు ఆహ్వానించగా తిరస్కరించి "పదవినీ సద్భక్తియు గల్గుటే" అనే కృతిచెప్పాడు. విసిగిపోయిన జపేశయ్య త్యాగయ్య పూజించే పంచాయతన విగ్రహాల్ని కావేరిలో పారేశాడట. తెల్లవారుజామున త్యాగయ్య ఆ సంగతి తెలుసుకొని 'ఎందుదాగినాడో' కృతి రచించి తన ఎదసొదను తెలిపాడట, తరువాత రాముడే కలలో కనిపించి చెప్పాడట. త్యాగయ్య కావేరినుంచి విగ్రహాల్ని తెచ్చుకొని పూజచేయ నారంభించాడు.

తిరువొత్తియూరు, కోవూరు, నాగలాపురం, తిరుపతి, పుత్తూరు, కంచి, వాలాజపేట, శ్రీరంగం, నాగపట్టణం, ఘటికాచలం మొదలైన పుణ్యక్షేత్రాల్ని సందర్శించి ఆయాదేవతల ఉపముద్రతోటి అనేక కృతులు రచించాడు త్యాగయ్య.

"అన్నమాచార్యుల నాడు సంకీర్తనముగాను, ఆధ్యాత్మికపదంగానూ ప్రారంభించిన కీర్తన రామదాసు, నారాయణ తీర్థులూ, సుబ్రహ్మణ్యకవీ వంటి వాగ్గేయకారుల చేత భజన కీర్తనగాను, అధ్యాత్మ కీర్తనలుగాను పరిణమించి, మార్గదర్శి శేషయ్యంగారు, వేరుట్టూరు వీరభద్రయ్య గారల రచనలలో ధాతు కల్పనకు క్రొత్త మార్గాలవలంబించి, ఆనూతన రూపంలో త్యాగరాజు నాటికి కృతి అనే పేరువహించి, పరిపక్వత పొందింది. కృతులు బయలుదేరునాటికి రాగాల స్వరూపంలో కూడా చాలా మార్పులు సంభవించాయి. రాగస్వరూప దర్శనానికి త్యాగరాజు కృతులు దర్పణము వంటివి.

"సాహిత్యంలోని అంతరార్థమును మరింత ప్రస్ఫుటం చేయడానికి రాగసంచారంలోని ప్రత్యేక ప్రయోగాలద్వారా రాగభావాన్ని సాహిత్య భావంతో రంగరించి విస్తరించడానికి సంగతుల ప్రయోగం విరివిగా జరిగి త్యాగరాజు కృతులకు ప్రత్యేక

స్వరూపాన్నిచ్చింది ఈ సంగతుల విస్తరణనే ధాతుకల్పన దక్షతగా పేర్కొన్నాము" 96.

త్యాగరాజు కృతులకు త్యాగబ్రహ్మోపనిషత్తు అనే ప్రసిద్ధి కలిగింది. ఇతడు 2400 కీర్తనలు రచించినట్లు తెలుస్తుంది. అయినా ఈ నాడు సుమారు 60 కృతులు మాత్రమే సంగీత స్వరాలతో ప్రచారంలో ఉన్నాయి. త్యాగరాజు 72 మేళకర్తరాగాలలోను కృతులు రచించాడు ఇతని ఘనరాగ పంచరత్న కీర్తనలు ప్రసిద్ధమే.

త్యాగయ్య ప్రహ్లాదభక్తి విజయం, నౌకాచరిత్రమూ, సీతారామవిజయమూ అనే మూడు సంగీతరూపకాలను రచించాడు. వీటిని ప్రబంధాలనీ వ్యవహరిస్తారు. ఇవినృత్యనాటికలు.

1847లో త్యాగరాజు సిద్ధిపొందాడు. స్వప్న ప్రబోధితుడై తాను దివ్యధామం చేరేదినం సైతం గుర్తించాడు త్యాగయ్య. ఆనాటి నుంచి అతని సమాధివద్ద ఆరాధనోత్సవాలు జరుగుతుంటాయి.

ఇతని శిష్యులు అనేకులు. వీరిని వాగ్గేయకారులు, సభాగాయకులు, ఇతరులని మూడు విధాలుగా విభజించవచ్చు అనీ, అందులో ముఖ్యులు వాలాజపేట వేంకటరమణయ్య మొదలైనవారనీ రజనిగారు తెలిపారు.

శ్యామాశాస్త్రిలు (1762-1827) :

సంగీత త్రిమూర్తుల్లో రెండోవారు శ్యామాశాస్త్రిలు. 1762లో జన్మించి 1827 దివంగతులు అయ్యారు. వీరిపూర్వులు ఆంధ్ర దేశంలోని కర్నూలు జిల్లా కంభంలో ఉండేవారట. త్యాగరాజు పూర్వులు గూడా ఆప్రక్కనేఉన్న కాకర్ల నుంచే దక్షిణాదికి వెళ్ళినట్లు తెలుసుకొన్నాము. ఇలాగా దక్షిణాదికి వెళ్ళిన తెలుగువారు క్రమంగా తమిళం నేర్చుకొన్నా, తమ మాతృభాష తెలుగును విడనాడలేదు. కాగా తెలుగులోనే సంగీత రచనలు చేశారు ఇతని పూర్వీకులు కాంచీనగరం వచ్చి అక్కడి బంగారుకామాక్షీదేవి విగ్రహానికి అర్చకత్వం వహించారు. తంజావూరులో కామాక్షిఅమ్మ ఆలయాన్ని నిర్మించేట్టు తులజాజీని ప్రోత్సహించినవాడు శ్యామాశాస్త్రుల తండ్రి విశ్వనాథశాస్త్రియే. యుక్తవయస్సు వచ్చే సరికి సంస్కృతాంధ్ర భాషల్లో

పాండిత్యంగడించాడు. ఒక సంగీతవేత్త అయిన యోగి వద్ద మూడేండ్లు సంగీతం నేర్చుకొన్నాడు ఆదియప్పయ్య ఇతనిని మిక్కిలి ఆదరించే వాడట.

"తండ్రి తర్వాత కామాక్షమ్మను అర్చనచేసే అధికారము శ్యామాశాస్త్రిలకు వచ్చింది. శ్యామాశాస్త్రిల స్వరజతులూ, తానవర్ణనలూ, కృతులూ, రానురాను విద్వత్ప్రసిద్ధి పొందనారంభించినవి. సామాన్య రాగాలలోనే కాక అపూర్వరాగాలలోను, అతిక్లిష్టమైన నడకలు గల తాళములలోను ఆయన సునాయాసంగా కృతులు రచిస్తూ ఉండేవాడు. ఆయన మొదటికృతి "జననీ జనపరిపాలినీ పాహిమాంభవానీ". "శ్యామాశాస్త్రిల ప్రసిద్ధరచనలలోకొన్ని : కీర్తనలు: 'ఓజగదాంబ; హిమాచలతనయ; 'పాహి శ్రీగిరిజాసుతే, శంకరీ శంకురు పాలించు కామాక్షి; తల్లీనిన్ను నెరనమ్మి; మరివేరేగతి యెవరమ్మ మహిలో.... స్వరజతులు : రావే హిమగిరి: కామాక్షి అను దినము; కామాక్షి" [97].

## ముత్తుస్వామి దీక్షితులు (1776—1835) :

సంగీత త్రిమూర్తులలో మూడోవాడు ముత్తుస్వామి దీక్షితులు. ప్రసిద్ధ వాగ్గేయ కారుడైన రామస్వామి దీక్షితులకు నలభై ఏండ్లవరకు సంతతి లేకపోయింది. భార్యాసమేతుడై శ్రీవైద్యనాథక్షేత్రంలో ముద్దుకుమారస్వామికి సంకీర్తన సేవచేయగా వరప్రసాది అయి జన్మించినవాడు ముద్దుస్వామి దీక్షితులు. వేదాధ్యయనంతోపాటు వ్యాకరణాది శాస్త్రాల్లో నిష్ణాతుడయ్యాడు చిదంబరనాథయోగి అనుగ్రహంతో మంత్రోపదేశం పొందాడు. వేంకటమఖిమాతుల పౌత్రుడైన వేంకట వైద్యనాథ దీక్షితుల సంగీత విద్యాశిష్యుడు తిరుత్తణిలోని సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అనుగ్రహంతో "శ్రీనాథాది గురుగుహోజయతి" అనే సంస్కృత కీర్తన వెలువడిందట. శ్రీ కామాక్షిసన్నిధిలో కంజదళాయతాక్షి, ఏ కామ్రనాధం భజేహం' మొదలైన కీర్తనలు అనేకం గేయకల్పనలలో రచించాడు. ప్రచారంలోకి తెచ్చాడు. కంచిలోని ఉపనిషద్బ్రహ్మస్వాముల రామాష్టపదులకు వర్ణక్రమంలో రాగతాళాలను ఏర్పరచిన ఘనుడితడు. ఆ వెనుక తిరువారూరు వచ్చి అచ్చటి శ్రీత్యాగరాజుస్వామి మొదలైన సమస్త దేవతలపై అనేక సంస్కృత కీర్తనలు రచించాడు. కాశీయాత్ర చేయడంవల్ల హిందూస్థానీ రాగాలైన యమునా కల్యాణి, ద్విజావంతి, బృందావనీ సారంగ, భీమపలాసి మొదలైన వాటిలో హిందూస్థానీ పరిచయం గోచరిస్తుందని పండితుల అభిప్రాయం.

"సంస్కృత భాషా ప్రయోగంలో ఈయనకు అసాధారణమైన సామర్థ్యమున్నది. అన్నికీర్తనలలోను అద్వైతాత్మకమైన వేదాంతతత్వము అంతర్లీనమై ఉంటుంది. వేంకటమఖి రాగసంప్రదాయములలో గమక జాతీయాలతో, ఆయారాగాల జీవస్వరాలు రాగనామాలను కూడా చేర్చి కీర్తనలు రచించాడు. సూళాదిసప్త తాళాలలోను చేసిన నవగ్రహ కీర్తనలలో ("బృహస్పతే తారాపతే బ్రహ్మజాతే నమోస్తుతే॥)" ఈయనకు గల జ్యోతిషశాస్త్ర పాండిత్యం స్పష్టపడుతుంది...."

"మొత్తానికి ఈయన కృతులు పండితులకు ఆస్వాదయోగ్యమయినట్లుగా సామాన్యజనులకు కావు. అవి సాధారణంగా విలంబకాలంలో సాగుతూ, అప్పుడప్పుడు ఒకేకృతిలో నడుమ మధ్యమకాలంలో కొంతనడిచి, వినేవారు పూర్తిగా సాలోచనగా, అనుభవిస్తేగాని రక్తికిరావు. త్యాగరాజు కృతులలో మధ్యమకాల రచనలెక్కువ. త్యాగరాజు సాహిత్యగుణం మాధుర్యం. శ్యామాశాస్త్రిలది ప్రసాదగుణం. దీక్షితులది ఓజస్సు. సమాసఘటితమైన శయ్యలో ఓజోగుణం వర్తిసుంది"[98]

తెలుగు పదకవుల చరిత్రలో సంస్కృతంలో రచించిన ఈ ముత్తుస్వామి దీక్షితులకు స్థానం ఇవ్వనవసరం లేదు. కానీ ఆంధ్రుడై ఉండి ధాతుమాతుకల్లో ధాతువుకు సంబంధించిన క్రమవికాసానికి తోడ్పడినవాడు కావటంవల్లనూ, సంగీత త్రిమూర్తుల్లో ఒకడు కావడం మూలాన ముత్తుస్వామిదీక్షితుల గురించి ఇచట ప్రస్తావించడం జరిగింది.

శరభోజీ, శివాజీలు (1798—1855) :

రెండో శరభోజీ మహారాజు తంజావూరు సరస్వతీమహల్ పుస్తకభాండాగారాన్ని నెలకొల్పిన ఘనుడు. వివిధ విషయాలపై అనేక గ్రంథాల్ని తాళపత్రాల మీద, ఆనాటి కాగితాలమీద రాయించి భద్రపరచిన సాహితీ ప్రియుడు. సంగీత సాహిత్య సంబంధి గ్రంథాలనేకం ఇందులో ఉన్నాయి. ఇతని తరువాతి రాజు శివాజీ. ఛత్రపతి శివాజీ వంశీకుడు. ఇతనికి గూడా ఛత్రపతి అనే బిరుదముంది. ఇతడు కవి పండితులను పోషించినవాడు. స్వయంగా అన్నపూర్ణా పరిణయమనే యక్షగానం రచించాడు.

మేరట్టూరి వేంకటరామశాస్త్రి :

శరభోజీ, శివాజీరాజుల కాలంలోనివాడు. ఇతడు మేరటూరు కాశీ వీరభద్రయ్యల లాగా ఆంధ్రనుంచి వెళ్లి మేరటూరులో స్థిరపడినవాడు. ఆనాటి సంగీతమూర్తి త్రయానికి సమకాలికుడు. ఇతడు ప్రసిద్ధ గాయకుడు; నాటకకర్త; నారసింహోపాసకుడై ప్రహ్లాద చరిత్రను యక్షగానంగా రచించాడు. ఇంకా మార్కండేయ చరిత్ర, రుక్మాంగదచరిత్ర మొదలైన అనేక యక్షగానాలు రచించాడు. వీటన్నింటిలోను ప్రహ్లాద చరిత్ర రసవత్తరమని పండితుల అభిప్రాయం. వీటితోపాటు 'బిందు' అనే గేయాలను, అద్వైత కీర్తనలు రచించాడు. బిందు అనేపదం - నాద నామక్రియ - ఆది పల్లవి : తళుకు కులుకుగల మిటారిరా యేరా నాసామి.॥ పల్లవితో ఆరంభమై ప్రాస శృంగార రసభరితమై ఉంటుంది.

దొరసామయ్య (1782-1816) :

శరభోజీ, శివాజీ రాజుల సమకాలికుడు. ఇతడు సంగీత సాహిత్య శాస్త్రాల్లో నిష్ణాతుడు. తెలుగులో కీర్తనలు, పదాలు, స్వరజతులు, తాలుగా రచించాడు. వీటిలో 49 పదాలు ఈనాడు ప్రచారంలో ఉన్నాయి. 'అద్భుత నటనం జాడీనిమా అంబరకేశుండు' ఆదిగాగల నటరాజు నాట్య నాలుగు కీర్తనల్లోను ఆయన నాట్యశాస్త్ర ప్రావీణ్యం స్పష్టమవుతుంది. దగ్గర కేగలేదని దాచేవేరా; దానికే తగునుగాని యేదానికైనా తగునా; గైకొనరే' మొదలైన పదాలు శృంగార రసాత్మకమై ఒప్పుతున్నాయి. వంటివేళ నన్నాదుకోవయ్య; అట్టి సమయమున నాదుచెయి - బట్టి కోవయ్యా' అనేవి అతని ఆధ్యాత్మ కీర్తనల కుదాహరణలు. సర్. రామన్ ఈతని వంశీకుడట. "ధాతుకల్పనా దక్షులయినంత మాత్రము — రచనలో శిల్పముగాని, భావ గాంభీర్యముగాని తగ్గని వాగ్గేయ రచనలకు సామయ్యగారి కీర్తనలు, పదాలూ, చక్కని ఉదాహరణములు. సొల్లుకట్టు కూడుకున్న ఆయన ధూర్జటి నాట్యకీర్తనలు పాడి, నాట్యాభినయం చేయగా కైలాసనాథుని తాండవ దృశ్యం కన్నులకు కట్టినట్లు కనిపించి, సభ కైలాసం అనిపించుకోకపోదు".

"అద్వైత తత్త్వ బోధాత్మకమై ఉదంబర నటరాజుకు నాట్యానంతరం పాడతగిన లాలిపాటతో దొరసామయ్యగారి రచనా విచారం ముగిస్తాము. ఆహిరి-ఝంపె : 'పరహంస నాలోన పవళింపవె....' ఈ పదంలోను కవిత ఉన్నత పంథాలలో విహరిస్తున్నది. భావాలు పరమోదాత్తములు పలుకులు కండ చక్కెరల వలె కరిగిపోయేవి. బ్రహ్మానంద రసానుభూతిని కలిగించే ఈ పదమును రచియించిన దొరసామయ్య రచనా శిల్పానికి జోహారు.



"ధాతు కల్పనలో సాధింపబడిన ప్రత్యేకమైన అభివృద్ధిని బట్టి ఈ యుగాన్ని ధాతుకల్పనా దక్షులయుగమని పిలిచినా, ఈ యుగపు వాగ్గేయకారులలో ధాతుకల్పనలో విశిష్టమైన పోకడలు చూపిన వారున్నారనడానికి త్యాగరాజు, దొరసామయ్య, ముందు చెప్పబోవు సభాపతయ్య చక్కని తార్కాణములు. దొరసామయ్యను సంగీత విద్వల్లోకంలో పల్లవి దొరసామయ్య అని వ్యవహారం. పల్లవి గోపాలయ్యను గూర్చి ముందు చెప్పుకొన్నాము"[99]

మూవనల్లూరు సభాపతయ్య :



ఆంధ్ర నుండి వలసవెళ్ళిన తెలుగువారు మేరట్టూరు, మూవనల్లూరు, సాలియమంగళం, ఉత్తుకాడులలో స్థిరపడ్డారు మూవనల్లూరిలో స్థిరపడ్డవారిలో సభాపతయ్య ఒకడు. ఇతడు పదకర్త. భరతనాట్యాచార్యుడూ అయి శరభోజీ కాలంలో ఉన్నట్లు తెలుస్తూంది. స్త్రీ వేషంలో శరభోజీ ఆస్థానంలో అభినయించగా అందరూ ఇతనిని వాస్తవంగా స్త్రీ అనే విశ్వసించారట. శరభోజీ ఏదేని కోరు కొమ్మంటే రాజాంతఃపురంలోని శ్రీకృష్ణవిగ్రహాన్ని కోరుకొన్న భక్తుడు. సంపదలపై ఆశలేనివాడు.



"ఉత్తరాంధ్రంలో కృష్ణాతీరాన జన్మించిన క్షేత్రయ్య, పశ్చిమాన రాయలసీమలో జన్మించిన సారంగపాణి, దక్షిణాన చోళమండలంలో వెలసిన సభాపతయ్య, ముందు చెప్పబోవు పరిమళరంగభక్తుడైన అజ్ఞాత కవీ పదకవితా శాఖను పరిపక్వస్థితికి తెచ్చి దేశమంతటా విస్తరింపజేసి ప్రసిద్ధికెక్కినవారు".

14)

"సభాపతయ్య పదాలనుబట్టి అతడు రస పారవశ్యానుభవ మెరిగిన కళా శిల్పి అని బోధపడుతుంది. కొన్ని పదాలు పల్లవి యెత్తుగడలోనే యే ఆధునిక కవి భావగీతమో అనిపిస్తాయి. అంటే వాటిలోని రసభావ మాధుర్యం (లిరికల్ స్వీట్‌నెస్) వాటికి అటువంటి నవ్యత్వాన్ని ఇస్తుందన్న మాట.

శంకరాభరణం - మిశ్ర :

"దారి చూచుచున్నది నీదుప్రియ తరళాక్షియౌ చిన్నది....
వారిజముఖి నీవు వచ్చువేళనుకొని కోరికతో రాజగోపాలసామి ॥దారి॥" [100]

1884 లో ఇతని పదాలు గుటిలీ ప్రతిలో ముద్రితమైనట్లు తెలుస్తూంది.

## కొందరు అజ్ఞాత పదకర్తలు :

పరిమళరంగ పదకర్త :

పరిమళరంగ ముద్రాంకితాలైన పదాలు, కీర్తనలు రచించిన పదకర్త పేరేమిటో తెలియరాలేదు. తంజావూరు నేలిన మహారాష్ట్రరాజుల కాలంలో ఇతడు జీవించినట్లు సుబ్బరామ దీక్షితుల కథనం వల్ల తెలిసిన విషయం మువ్వగోపాలుడు, వేణుగోపాలుడు రాజగోపాలుడు మొదలైన వారి లాగానే పరిమళరంగడు గూడా ఏదోక్షేత్రంలో వెలసిన దేవతామూర్తి కావచ్చునని శ్రీరజనిగారు భావిస్తున్నారు[101]. ఇంతవరకు పరిమళరంగని పేరుమీద 8 కీర్తనలు, 48 పదాలు లభించాయి. కీర్తనలు పరిమళరంగనాయకికి అంకితాలు. కీర్తనల్లో భక్తిరసాన్ని, పదాల్లో శృంగార రసాన్ని ఎంతో సముచితంగా పోషించాడు.

"ఈ పరిమళరంగ పదకవి తనకు పూర్వపద కర్తల ధోరణులు అందులో అన్నమాచార్యుల పదరచనా ధోరణులుకూడ బాగుగా తెలిసిన వాడిలా కనిపిస్తాడు;
ఘంటారవం :

'పరువము నాథుని చిన్నెలు మగువరో యెంతని తెలుపదు
సరసము చేసెను ఎంతలు జాడల నా మనసు'

కొన్ని పదాలలో శృంగార రసం చబ్బన చూలుగా పెల్లుబికే పచ్చితనం లేకపోలేదు. కాని అన్నిటిలోను కూడ భావంలో అధ్యాత్మికార్థం వ్యంగ్యభూతమై అంతర్లీనమై ఉన్నది శృంగార రసాత్మక మూలమయినా అతని పదాలన్నీ నాయికానాయక భావంలో జీవాత్మ పరమాత్మల ఐక్యానుసంధానమునే ప్రస్ఫుటింప జేస్తున్నవి. ప్రముఖులయిన క్షేత్రయాది పదకవులలో ఈ అజ్ఞాత వాగ్గేయకారుడు నాల్గవవాడు. క్షేత్రయ్య పదాలకు తరువాత దక్షిణదేశంలో పరిమళరంగని పదాలకే ఎక్కువ ప్రచారం ఉన్నది"[102]

తక్కినవారు : తెలుగులో రచించిన మరికొందరు వాగ్గేయకారులు. యువరంగని పదాలు రసభావాలు, భాషా శిల్పమూ మొదలైన గుణాల్లో మనోజ్ఞమై ఉన్నాయి. కస్తూరి రంగని పదాలన్న పేరుతో ఉన్నాయి. ఇంకా ఘట్టుపల్లివారు, బొల్లవరపువారి పదాలు, శోభనగిరివారి పదాలు, ఓటుపల్లి వారి పదం, ఇనుకొండ వారి పదాలు, శివరాంపురంవారి పదాలు అనే పదాలు అజ్ఞాత పదకర్తలవి ఉన్నాయి. ఇవిగాక ఇంకా ఎన్నో పదాలు అజ్ఞాత పదకర్తలు రచించినవి ఉన్నట్లు శ్రీవడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు ప్రకటించిన 'శృంగార పదములు' అనే గ్రంథ పీఠికలో వివరించారు [103]

"పదరచన కర్ణాటక సంగీతంలో రసభావయుతమైన రాగవిస్తృతికీ, నాట్యాభినయానికీ చాలా దోహదం చేసింది. భక్తి వైరాగ్యం కన్నా, శృంగారం జనసామాన్యానికి త్వరగా రక్తి కలిగిస్తుంది గనుక మొదటి రోజులలో పదాల ద్వారానే సంగీత సభాసంప్రదాయాలు వ్యాపిచెంది రాగ, తాన, పల్లవి, కీర్తనలద్వారా వినుగు కలిగిన శ్రోతలకు మనోరంజనమూ, సులభరసోత్పత్తి సాధ్యపడినవి. 15వ శ॥లో అన్నమాచార్యులు సంకీర్తన లక్షణంలో శృంగార సంకీర్తనమనీ, పదమనీ పేర్కొని నిర్వచించిన లక్షణం ప్రకారం లక్ష్యరూపంగా రచించిన పదాలే అద్యతన పదకర్త లందరకూ మార్గదర్శకాలు....క్షేత్రయాది అద్యతన పదకర్తల రచనల పద స్వరూపం పరిపూర్ణ సుందరమై ధాతుమాతు సమాన ప్రధాన శిల్పాన్ని దిద్ది తీర్చుకొన్నది."[104]

ధాతుకల్పనా దక్షులయిన మరికొందరు వాగ్గేయకారులు :

సుబ్బరాయశాస్త్రి (1803—1862) :

ఇతడు శ్యామశాస్త్రుల కుమారుడు. సంగీతంలో, సంస్కృతాంధ్ర తమిళ భాషల్లో విద్వాంసుడు. ఇతడు సంగీతం మొదట తండ్రివద్దను, ఆ వెనుక త్యాగరాజు వద్దను నేర్చుకొన్నాడు. కుమారముద్రతో అనేక కృతులు, స్వరజతులు రచించిన వాగ్గేయకారుడు. సంగీత త్రిమూర్తులతో సమానమైన వాగ్గేయకారుడు.

శ్యామశాస్త్రి శిష్య పరంపర :

శ్యామశాస్త్రి ప్రథమ శిష్యుడు అతని పుత్రుడు సుబ్బరాయశాస్త్రి, రెండోవాడు సంగీతస్వామి. సుబ్బరాయశాస్త్రి శిష్యుడు ఆతని పెంపుడు కొడుకైన అన్నాస్వామి శాస్త్రి (శ్యామకృష్ణశాస్త్రి) (1827-1900)

త్యాగరాజు శిష్య పరంపర :

బహుశః వాగ్గేయకారుల్లో త్యాగరాజు కున్నంత శిష్యపరంపర మరెవ్వరికీ లేదనవచ్చు. ప్రశిష్యులూ ఉన్నారు. వారిలో కొందరు వీణ కుప్పయ్య, తిరువొత్తియూరు త్యాగయ్య, మానంబువడి వెంకటసుబ్బయ్య, పల్లవి శేషయ్య, వాలాజాపేట వేంకటరమణ భాగవతులు, సదాశివరామ, కృష్ణస్వామి భాగవతులు, పట్నం సుబ్రహ్మణ్యయ్య మొదలైనవారు.

దీక్షితుల శిష్య పరంపర :

చినస్వామి దీక్షితులు (ముత్తుస్వామి దీక్షితుల రెండో సోదరుడు); బాలస్వామి దీక్షితుడు (దీక్షితుల కనిష్ఠ సోదరుడు); ఇతని దత్తపుత్రుడు సుబ్బరామ దీక్షితులు; ఇతడు సంగీతంలో ఆంధ్ర సంస్కృత, ద్రావిడ భాషల్లో విద్వాంసుడు 17 వఏటనే ఎట్టియాపురం సంస్థానాధీశుని మెప్పుపొందగలిగిన దర్బార్ రాగంలో కార్తికేయునిపై అటతాళ వర్ణం రచించిన వాగ్గేయకారుడు. ఆ రాజు ప్రోత్సాహంతోనే సంగీత సంప్రదాయప్రదర్శినిని రచించిన మహానుభావుడు. తెలుగు భారతాన్ని ద్రావిడంలోకి అనువదించినవాడు.

స్వాతి తిరునాళ్ మహారాజు (1813_1847) :

1829_1847 మధ్యకాలంలో తిరువాంకూరు పరిపాలించిన ఈ మహారాజు సంస్కృతాంధ్ర మళయాళ భాషల్లో విద్వత్తు గలిగిన వాగ్గేయకారుడు. కవి పండిత గాయక శిల్పి పోషకుడు. కులశేఖర పెరుమాళ్ అని గూడా ఇతనికి పేరు ఇతని ఆస్థానంలో అనేకులు విద్వాంసులుండేవారు అనేక పద వర్ణాలు, పదాలు, తిల్లానాలు, కృతులు రచించినవాడు. 'సరసిజనాభ' అనే కాంభోజరాగంలోనిదీ, 'సామినిన్నే నమ్మితిరా'అనే యదుకుల కాంభోజీ రాగంలోనిదీ నాట్యోపయుక్తమై చాల ప్రసిద్ధి పొందిన పద వర్ణాలు.

స్వాతి తిరునాళ్ మహారాజు తెలుగుపదం-

అఠాణారాగం_చాపుతాళం.

ప : వలపు తాళ వశమా నాసామికి

చలము సేయ న్యాయమా॥'

తెలుగుసైంధవి రాగం_ఆదితాళం

ప : ఇటు సాహసములు ఏల నాపై చక్కనిసామి॥

అ ప : ఇటులు వగలు తాళ నావశమా॥'

ఇతడు సంస్కృతంలో కొన్ని యక్షగానాలు సైతం రచించాడు

సదాశివ బ్రహ్మేంద్రస్వామి (1830_1887) :

ఇతడు వేమనలాంటి అధ్యాత్మతత్వవేది అయిన దిగంబర యోగి; సర్వసంగ పరిత్యాగి. కొత్తకోట సంస్థానం వారు తనిని గురువుగా పూజించుకొంటారు. 'మానస సంచరరే' అనే సామరాగ కీర్తన, 'బ్రూహిముకుందేతి....నహి దేవహిళంకా'॥ మొదలైన అధ్యాత్మతత్వ బోధాత్మకమైన ఇతని సంస్కృత కీర్తనలు ప్రసిద్ధం. ఇతడు రచించిన అధ్యాత్మ కీర్తనలన్నింటిలోను 'పరమహంస' అనే మకుటం ఉంటుంది.

కంచి వేంకటాద్రిస్వామి ;

ఇతడు త్యాగరాజుకు సమకాలికుడు. అల్లూరి వేంకటాద్రిస్వామి అని గూడా

అంటారు. వేంకటాద్రిస్వామి కీర్తన లన్నీ పేరుతో ఆంధ్రదేశంలోను, దక్షిణ దేశంలోను ప్రసిద్ధమే. దివ్యనామ సంకీర్తనమేగాక, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళారతులు, భగవంతునితో భక్తుని సంభాషణాత్మక కీర్తనలు వీటిలో ఉన్నాయి. త్యాగరాజు వాడిన రాగాలన్నీ వాడాడు. 1874న దివంగతుడయ్యాడు.

తూము నరసింహదాసు :

ఇతడు త్యాగరాజుకు సమకాలికుడు. ఇతడు గుంటూరు వాస్తవ్యుడు. ఆంధ్ర సంస్కృత భాషల్లోను, సంగీతంలోను విద్వాంసుడు. భద్రాచలం రామదాసుపై భక్తితో ఉత్సవ సంప్రదాయ పద్ధతిలో మేలుకొలుపులు, హెచ్చరికలు, లాలిపాటలు మంగళారతులు రచించాడు. 'భజనచేసే విధము తెలియండి, రామామృతమే నీకు రక్షకంబనుకోవే మనసా; ఎందుకే యీవట్టి బాధలు – నీకెందుకే' మొదలైనవి ఆంధ్రదేశంలో భజన కూటములలో వినిపిస్తాయి. ప్రచారంలో ఉన్నాయి. దక్షిణ దేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ దర్శించాడు. 'తూము నరసింహదాస' అనే ముద్రతో కీర్తనలు రచితం భద్రాచలం వెళ్లి కైంకర్యం చేసి చివరికి రామునిలో ఐక్యమందినట్లు తెలుస్తుంది.

మద్దిరాల వేంకటరాయకవి :

ఇతడు త్యాగరాజుకు సమకాలికుడు. పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామి భక్తుడు; నిత్యసేవాసంకీర్తనపరుడు. ఇతడు రాజరాజేశ్వరీ కుక్కుటేశ్వరుల శృంగార కలాపాన్ని 'ఏకాంత సేవా విలాస'మనే పేర రచించాడు. ఇతడు 1850లో పరమపదించాడు ఈ ఏకాంత సేవా విలాసంలో ధూపసేవా కీర్తనలు, ఏకాంత సేవ, భజనకీర్తనలు అనే మూడు భాగాలున్నాయి. ఏకాంతసేవా భాగంలో శృంగార హాస్యాలు, తక్కినవి విడివిడి భక్తి కీర్తనలుగా ఉన్నాయి. ఏకాంత సేవలో తలుపుదగ్గర సంవాదగీతాలు, లాలిపాటలు, జోలపాటలు, ఆరాత్రికాలు, శోభనపు పాటలూ ఉన్నాయి.

వీణ పెద గురాచార్యులు :

ఇతడు త్యాగరాజుకు సమకాలికుడు. 1794లో జన్మించి 1822న పరమపదించాడు. త్యాగయ్య దేశాటనలో ఇతనిని కలిసి విద్వత్ గోష్ఠి చేసినట్లు తెలుస్తూంది.

ఇతడు విజయనగరం, మాడుగుల, తిరువాన్కూరు ప్రభువుల ఆదరణను పొంది వారి కంకితంగా గీతాలు, తానవర్ణాలూ, తిల్లానాలు, స్వరపల్లవులు, శృంగారపదాలు, కోలుగోలు శబ్దాలు, జక్కిణీదరువులు, సలాముదర్వులు, అనేక కీర్తనలకు వర్ణమెట్లూ రచించాడు. విజయనగర విద్వాంసుల్లో వీరు ప్రసిద్ధులై వెలిశారు

పరాంకుశదాసు :

ఇతడు భజన సంప్రదాయ కీర్తనలు రచించినవారిలో ప్రసిద్ధుడు. త్యాగరాజు, కంచి వేంకటాద్రిస్వామి మున్నగువారికి 50 ఏళ్ల తరువాతివాడని తెలుస్తూంది. పరాంకుశదాసు కీర్తనలన్నీ పేరుతో ఎక్కువగా తెలుగులోను, కొన్ని సంస్కృతం, తమిళం, హిందూస్తానీలోనూ ఉన్నాయి. ఇవి భక్తిరసాత్మకాలు. తెలుగుదేశంలోనే గాక తమిళదేశంలోను ఇవి ప్రచారంలో ఉన్నాయి. కందార్థాలు, ఆరగింపుపాట, విడెము, శయ్య, పవ్వళింపు, లాలి, జోల, మేలుకొలుపు, మంగళం మొదలైన సంకీర్తనలు గలవు.

చెయ్యూరి చెంగల్వ రామశాస్త్రి (1810-1900) :

ఇతడు 1810 లో చెంగల్పట్టు జిల్లా పెరుంపేడు గ్రామంలో జన్మించాడు. సంస్కృతాంధ్ర భాషల్లో, భరతనాట్య, సంగీత శాస్త్రాల్లో పాండిత్యం సంపాదించాడు. సంస్కృతాంధ్రాల్లో అనేక కీర్తనలు, పదాలు, యక్షగానాలు, పద్యకావ్యాలు రచించాడు. వేయి కృతులు రచించాడు. అందులో కంచి కామాక్షిపై 360, మధుర మీనాక్షిపై 240, వేంకటేశ్వరునిపై నూటికిపైగా ఉన్నాయి. 1900 లో దివంగతుడయ్యాడు. సంగీత శిల్పంతోపాటు కవితాశిల్పంలోను ఇతనితో దీటైన వాడు ఈ యుగంలో పల్లవి దొరసామయ్య ఒక్కడే అని విజ్ఞుల అభిప్రాయం.

ఈ త్యాగయ్య యుగంలో పదాలు, సంకీర్తనలు, కీర్తనలు, కృతులు, భజన కీర్తనలు, యక్షగానాలు రకరకాలుగా రచనలు వెలిశాయి. ధాతుమాతువల్లో ధాతు ప్రాధాన్యం కీర్తనకారుల్లోను, మాతువిశిష్టత పదకారుల్లోను మనకు స్పష్టమవుతుంది.

2.6 ఆధునికయుగం (1850 నుంచి ...) :

తెలుగు పదకవుల చరిత్రలో చివరిదైన ఆధునిక యుగం 1850 నుంచి ఆరంభమవుతుంది. కానీ 1850 కంటే ముందే జన్మించిన వారిని గూర్చి సైతం ఇందులో ప్రస్తావించడం జరుగుతుంది. ఈ యుగానికి ఆధునిక యుగమనే పేరు తప్ప, ప్రత్యేకించి ఒకానొక వ్యక్తి పేరుమీదుగ పిలువదగినంతటి వాగ్గేయకారుడు లేడనే చెప్పవలసి ఉంది. అందుకే దీన్ని ఆధునిక యుగం అని పిలుస్తున్నాము.

"ఈ శతాబ్దంలో మొదటి సగములో మధ్యయుగపు ప్రాచీనతకూ, ఆధునిక యుగపు నవ్యతకూ నడుమనుండిన సంధియుగ లక్షణాలు కనిపిస్తాయి. అందుకే ఈ తొలి సగంలో ప్రాచీన సంకీర్తన యుగ లక్షణాలు, ధాతుకల్పనా దక్షులనాటి కృతి లక్షణాలు, సంగీత సభా సంప్రదాయాలూ కనిపిస్తాయి. అందుచేత ఈ తొలి సగంలో మనకు తారసిల్లే వాగ్గేయకారుల రచనలలో ఈ సంప్రదాయాలన్నీ కనిపిస్తాయి. ఒక్కరి రచనలోనే అన్నీ ఉంటాయనికాదు. ఒక్కొక్కరి రచనలో ఒక్కొక్క లక్షణం ఎక్కువగా భాసిస్తుందని చెప్పాలి.

"మొత్తం మీద ఆధునిక యుగపు వాగ్గేయ కారుల రచనలను మూడు విధాలుగా విభజించవచ్చును. ఒకరు-పూర్తిగా సంగీత విద్వాంసులై, సాహిత్యములో ఒక విధమైన ప్రవేశం కలిగి గేయరచనలు చేసినవారు. రెండవ విధానానికి చెందిన వారు పూర్తిగా సాహిత్య పరులయి లీలగా సంగీతాభిరుచి గేయరచనలు చేసినవారు. మూడవవారు-సంగీత సాహిత్యములలో సమానాభినివేశం కలిగి గేయరచనలు చేసిన వారు"[105].

ఇంకా ఈ యుగంలోని పదకవుల్ని కేవలం వాగ్గేయ కారులు, తత్వకర్తలు, యక్షగానకర్తలు, హరికథావాగ్గేయ కారులని గూడా విభజించవచ్చు. త్యాగరాజ యుగం స్వరకల్పనను అంటేధాతు ప్రాధాన్యాన్ని పరిశీలించిన యుగంగా మనం చెప్పుకోవాలి. అయితే పదం మరుపోకడలు పోయిన విషయం కూడా మనం విస్మరించరాదు. క్రమంగా ఈ ఆధునిక యుగంలో పదరచన ఏలా కొనసాగిందో పరిశీలిద్దాం.

విజయనగరం మహారాజులు :

ఈ యుగారంభంలో విజయనగరం పాలించిన విజయరామగజపతి, అతని కుమారుడు ఆనందగజపతి ఈ రంగంలో చేసిన సేవను గూర్చి రజనిగారిమాటలు ఉల్లేఖించడం అవసరం. "ఈ మహారాజు (విజయనగరం విజయరామగజపతి) తన ఆస్థాన విద్వాంసులయిన యీ (దూర్వాసుల సూర్యనారాయణ) సోమయాజులుగారినీ, వీణ వెంకటరమణ దాసుగారినీ, తన కుమారుడైన ఆనందగజపతి యువరాజులుం గారినీ వెంటబెట్టుకొని దక్షిణాదిని మదరాసూ, ఉత్తరాన కాశీ, కలకత్తా మొదలయిన ప్రదేశాలకుపోయి, అక్కడ కొన్ని నెలలు ఉంటూ, ఆయా హిందుస్థానీ, కర్ణాటక సంగీత మర్యాదలను తెలుసుకొని, తమ విద్వాంసులకు తెలియజేసేవారు. తండ్రి కోరికపైని ఆనంద గజపతి కూడా వీణావాద్యంలో ప్రజ్ఞావంతుడై, సంస్కృతాంధ్ర ములలో కృతులను రచించారు. ఆయన స్వరమే సాహిత్యంగా, సాహిత్యమే స్వరంగాను వుండే స్వరాక్షరాల కందము నొక దానిని భైరవిరాగంలో రచించారు. ఈ మహారాజుగారి సంగీత శిక్షణ దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులుగారి వద్దనే"[106]. స్వయంగా వాగ్గేయ కారుడు గనుక ఆనంద గజపతి మహారాజుకాలంలో ఆదిభట్ల నారాయణ దాసు, గురజాడ అప్పారావు వంటి సజ్జనులు వెలిశారు. గురజాడ సైతం పాటలు రాగతాళాలతో రచించినట్లు విదితమే.

దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు (1842-1896) :

ఇతడు విజయనగర రాజుల ఆస్థానంలో వెలసిన వాగ్గేయకారుడు. తన తండ్రి దూర్వాసుల వెంకటరెడ్డి శాస్త్రుల వద్ద సంగీత సాహిత్యాలు అభ్యసించాడు. విజయరామగజపతి మహారాజుపై 20 గీతాలు, 15 స్వరజతులు, ఆనందగజపతి రాజాంకితాలుగా స్వరజతులు, పదాలు, జావళీలు రచించాడు. 72 మేళకర్తరాగాలలోను పూసపాటి రాజుల చారిత్రక విజయాలను, వీరగాథలను వర్ణిస్తూ కీర్తనలు రచించాడు. కర్ణాటక హిందుస్తానీ సంగీతంలోనేగాక పాశ్చాత్యసంగీత రీతులలోను ప్రజ్ఞగడించిన వాడు.

తచ్చూరి పెద సింగరాచార్యులు; చిన సింగరాచార్యులు :

ఈ అన్నదమ్ములు జీవితాంతం ఆనందగజపతి మహారాజు ఆస్థాన విద్వాంసులు. 50 కి పైగా పెద సింగరాచార్యులు భక్తికీర్తనలు, చాలా జావళీలు రచించినట్లు తెలుస్తూంది. తిరువళిక్కేణి రామానుజాచార్యులు సమకూర్చిన సంగీత సర్వార్థసార సంగ్రహమనే గ్రంథాన్ని ప్రామాణికంగా పరిష్కరించి ప్రకటించారు. వ్యాందు స్వర రచనలు చేసినవారు. వీరి 'సామి నెడబాసి నేనెట్టు సైరింతునే' అనే దేవమనోహరి రాగజావళీ, 'వానిజోలి నాకేలె' అనే బ్యాగు రాగ జావళీ, 'ఎన్నాళ్ళు సైరింపునే ఓ చెలియ' అనే జంఝూటి రాగజావళీ ప్రసిద్ధమైనవి. 'పద వర్ణాల లోనూ, స్వరజతులలోనూ ఉండే స్వరకల్పనల ధాతువిన్యాసాన్ని వర్జించి, శృంగార రసాత్మకమైన సాహిత్యంలో మధ్యమకాలంలో స్పష్టమైన లయతో అందముగా సాగి, ఉద్రూత యాగించే రచన జావళీ. సభాసంప్రదాయయుగంలో వర్ణమాలతో ప్రారంభించిన సంగీత కచ్చేరిలో భక్తి రసాత్మకమైన కృతులనూ, ప్రత్యేక రాగాలాపననూ, తానమూ, పల్లవీ ముగించిన వెనుక పదాలు గానం చెయ్యడమూ, చిట్ట చివర మధ్యమకాలంలో చురుకైన లయలో ఓలలాడించే జావళీలు ఒకటి రెండు పాడి, మంగళంతో సభ ముగించడం పరిపాటి అయిపోయింది. లయాత్మకత వలనా, మధ్యమ కాలం వలనా, జావళికి కూడా పదవర్ణ, స్వరజతులవలెనే—భరత శాస్త్రాను గుణ్యంగా నాట్యం చెయ్యడానికీ, భావం అభినయించడానికీ ఎంతో అవకాశం ఉన్నది.... తెలిసినంతవరకు స్వాతితిరునాళ్ రచించిన జావళీలే చారిత్రకంగా మొట్ట మొదటి జావళీలని చెప్పవచ్చు."[107]

తంజావూరి విద్వచ్చతుష్టయం (1829–1900) :

స్వాతితిరునాళ్ ఆస్థానంలో ఉండిన పొన్నయ్య, వడివేలు అనే ఇద్దరూ, వారి సోదరులు శివానందం, చిన్నయలనే నలుగురు కలిసి సంగీత లోకంలో తంజావూరి విద్వచ్చతుష్టయం అని ప్రసిద్ధి. వీరు తెలుగులో వర్ణాలు, జావళీలు, కీర్తనలు రచించారు. వీరి వంశీకులు ఈనాడు దక్షిణ దేశంలో పేరెన్నికగన్న గాయకులున్నారు.

దాసు శ్రీరాములు (1846–1908) :

కవిగా దాసు శ్రీరాములుగారు విద్వల్లోకానికి సుపరిచితులే. వీరు అనేక కృతులు, స్వరజతులు, పదాలు, జావళీలు—రచించిన వాగ్గేయకారులు. అలంకార, సంగీత, భరతనాట్య శాస్త్రాల్లో నిష్ణాతులు. ఎందరో ఆనాటి కళాకారులకు సహాయం చేసినవారని తెలుస్తూంది.

వీణ శేషన్నగారు (1852–1926) :

శేషన్నగారి పూర్వీకులు శరభోజీ మహారాజు కాలంలో తంజావూరులో ఉండేవారు. తరువాత మైసూరు చేరుకొన్నారు శేషన్న కాలం 1852–1926. ఇతడు కర్ణాటుడైనా తెలుగులో వర్ణాలు, జావళీలు, తిల్లానాలు రచించాడు. వైణిక శిఖామణి బిరుదు గల ఇతడు అనేక వాద్యాలలో సైతం నిపుణుడు.

తుమురాడ సంగమేశ్వరశాస్త్రి (1874–1931) :

తుమురాడ సంగమేశ్వరశాస్త్రి ఆనందగజపతి ఆస్థానంలోని వైణికుడైన వండిగాన వెంకన్న శిష్యుడు. తానవర్ణమూ, తానపట్టలూ, స్వరపల్లవులూ ఇతడు రచించాడు. దాసు శ్రీరాముల సహవాగ్గేయకారుడు.

ముత్తయ్య భాగవతార్ (1877–1945) :

తమిళనాడులో పునల్వేలిలో జన్మించినవాడు ఇతడు హరికథలు రచించాడు ఇతడు తెలుగు, కన్నడ, సంస్కృతం, తమిళభాషల్లో అనేకాపూర్వరాగాలలో వర్ణాలు, కీర్తనలు, దరువులు, రాగమాలికలు, తిల్లానాలు వివిధలయ రీతుల్లో రచించాడు మైసూరు మహారాజు కృష్ణరాజ వొడయరు తన ఆస్థానానికి రావించి సన్మానించాడు. మద్రాసు మ్యూజిక్ అకాడమీ అధ్యక్షులు. ఇంకా అనేక పదవులు, బిరుదులు, సన్మానాలు పొందినవాడు; పరిశోధకులు.

మైసూరు వాసుదేవాచార్య :

ఇతడు మైసూరు మూడవ కృష్ణరాజ వొడయర్ ఆస్థానంలోని సుబ్రహ్మణ్యాచార్యులకు 1865 లో జన్మించాడు. 1896 లో పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ వద్ద

సంగీతాభ్యాసం ముగించి కచ్చేరీ చేసి సన్మానం పొందినవాడు. ఇతడు తెలుగులోను, సంస్కృతంలోను 300 కీర్తనలు, వర్ణాలు, రాగమాలికలు, స్వరజతులు, తిల్లానాలు రచించాడు. 1954 లో భారత రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌చే జాతీయ బహుమతి నందుకొన్నాడు.

ప్రయాగ రంగశర్మ (1859-1927) :

ఇతడు తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా గుడిమెళ్లంక లక్ష్మణ శాస్త్రిల పుత్రుడు. అధ్యాత్మరామాయణం, అష్టపదులు, తరంగాలు శ్రావ్యంగా గానం చేసేవాడట. ఇతడు భజన సంప్రదాయ కీర్తనలూ, మంగళహారతులూ, తలుపుదగ్గర పాటలూ, పెండ్లి ండ్ల వేడుకపాటలూ రచించాడు. వీరి దౌహిత్రులే మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు. 'శ్రీరామమంత్రపఠనశాయశే; రామ రామ యన రాదా;' మొదలైనవి ఇతని ప్రసిద్ధ కీర్తనలలో కొన్ని.

కొచ్చెర్లకోట రామరాజు (1878-1946) :

ఇతడు తూర్పుగోదావరి జిల్లా తాటిపాక కాపురస్థులయిన కొచ్చెర్లకోట వెంకటనారాయణ, జానికమ్మలకు 1878 జన్మించాడు 1940 లో దివంగతు డయ్యాడు. కీర్తనలూ, స్వరజతులు, వర్ణాలు రచించి, సంగీత సాహిత్యాలలో ప్రసిద్ధిపొందిన ఆంధ్రదేశపు ఉత్తమ వాగ్గేయకారుల్లో ఒకరు సంపన్నుడు. ఎంతో మంది విద్వాంసుల్ని ఆదరించాడు. వయొలిన్, మృదంగవాద్యాలలో ప్రవీణుడు. ఇతడెందరికో గురువు. ఇతని తానవర్ణాలు, స్వరజతులు సభలలో రక్తికట్టడమే గాక, అభ్యాసకులకు సైతం మిక్కిలి ఉపకరిస్తాయి ఇతడు కర్ణాటక సంగీతాని కెంతో సేవ చేసిన మహానుభావుడు. ఇతనివి సుమారు 30 స్వరజతులూ, 20 తాన వర్ణాలూ, 50 కీర్తనలు ఉన్నాయి. వీటిలో ప్రసిద్ధిపొందినవి సైతం ఉన్నాయి.

పాపట్ల కాంతయ్య :

తెలుగు పౌరాణిక నాటకాల్లోని పాటలకర్తగా ప్రసిద్ధుడు చిన్నవయస్సులోనే అనేక వర్ణాలు, కృతులు రచించాడు. ప్రసిద్ధ వాగ్గేయకారుడు పాపట్ల రామయ్య ఇతని అన్న. మైలవరం సమాజం వారి సావిత్రి, ద్రౌపదీ వస్త్రాపహరణం, కృష్ణ తులాభారం మొదలైన నాటకాల్లో చక్కటి పాటలు రచించాడు. సావిత్రిలోని

'పోషచున్నాడే' అన్నది కృష్ణతులాభారంలోని 'భలేమంచి చౌకబేరము; మునివరా' మొదలైనవి ఈనాటికీ ప్రసిద్ధాలే.

ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1953-1912) :

నాటకకర్త, ప్రయోక్త, నటుడు రామకృష్ణమాచార్యులు; చిత్రనళీయం, విషాద సారంగధర, పాదుక మొదలైన వారి నాటకాలన్నిట కీర్తనలు రచించి పాడి ప్రజల్ని సమ్మోహపరచిన నాటకవాగ్గేయకారులు వీరు

కోలాచలం శ్రీనివాసరావు (1854-1919) :

నాటకకర్త, ప్రయోక్త అయిన కోలాచలం శ్రీనివాసరావు గారు తమ నాటకాలు రామరాజు చరిత్ర, హరిశ్చంద్ర, ప్రహ్లద మొదలైన 28 నాటకాల్లో అనేక కీర్తనలు రచించినవారు

పురాణం కనకయ్యశాస్త్రి (1878-1954) :

పాపట్ల కనకయ్య శిష్యుడు ప్రసిద్ధ కర్ణాటక విద్వాంసుడు, వాగ్గేయకారుడు. ఇతడు యాదగిరి, గద్వాల సంస్థానాల్లో ఆస్థాన విద్వాంసుడుగా ఉండేవాడు. ఈయన సంగీత రచనల్లో ఆనందభైరవి రాగంలోని 'నిన్నే వలచియున్నదిరా' అనే వర్ణం ప్రసిద్ధం. ఇతని కుమారుడు పురుషోత్తమశాస్త్రి పేరెన్నికగన్న విద్వాంసుడు.

పిరాట్ల శంకరయ్యశాస్త్రి (1881-1951) :

పై కనకయ్యశాస్త్రి సమకాలికుడు. ఇతడు వర్ణాలు, కృతులు రచించాడు. శంకరముద్రతో ప్రసిద్ధికెక్కాయి ఇతని రచనలు.

యక్షగాన కర్తలు :

ఈ సందర్భంలో యక్షగాన, హరికథా వాగ్గేయకారులను గురించి, తత్వకర్తల గురించి తెలుసుకోవలసి ఉంది. ఆధునిక యుగంలో రచితమైన హరికథలు పూర్వం నుంచి వస్తూన్న యక్షగానాలు ఒకటే అని విజ్ఞుల అభిప్రాయం. నారాయణదాసు అభిప్రాయమూ ఇదే. బహుపాత్రలచే ప్రదర్శితమైతే అది యక్షగానమనీ, ఏకవ్యక్తిచే ప్రదర్శితమైతే హరికథ అనవచ్చునని కొందరి అభిప్రాయం.

గోగులపాటి కూర్మనాథకవి (1738-1800) :

ఇతడు రచించిన మృత్యుంజయ విలాసాన్ని 1870-1920 లో వుండిన ప్రయాగరంగశర్మ హరికథగా గానం చేశాడని తెలుస్తుంది. రచయిత కాలాన్ని బట్టి త్యాగరాజు యుగంలోకి వస్తాడు. కాని దాని ప్రచారం ఆవెనుకే గనుక ఇక్కడ పేర్కొవడం జరిగింది కూర్మనాథుడు సంగీత సాహిత్యవిశారదుడు.

గరుడాచల యక్షగాన కర్తలు ఓబయ్య, యాదవదాసు; వీరు 18వ శ॥ మధ్య ఉండినట్లు తెలుస్తుంది ఇందులో యాదవదాసు నాటకంలోని దరువులు ఈనాడు ప్రసిద్ధమే.

18, 19 శ॥ లోని మరికొందరు యక్షగానకర్తలు :

వేలూరి కన్నయదాసు శ్రీమహాభారత విలాసమనే యక్షగానం రచించాడు. కాశయ్య మార్కండేయ విలాసమనే యక్షగానం రచించాడు. కూచిగిరి యల్లదాసు రామాయణం; వేంకటనాయక కవి లేపాక్షిరామాయణం రచించారు. సన్నిధి జగ్గరాజు ఎరుకులకురంజి అనే తత్వబోధాత్మక యక్షగానం రచించాడు కానుకొలను వెంకటదాసు బందరు నివాసి.- శ్రీకృష్ణనాటక ప్రబంధరాసక్రీడా విలాసం అనే యక్ష గానం రచయిత ఇది కృష్ణలీలాతరంగిణి ప్రభావంతో రచితమని విజ్ఞుల అభి ప్రాయం. సామినేని పార్థసారథి ప్రబంధ షట్కమనే పేర ఆరు ప్రబంధాలు రచించాడు. ఎర్రగుంట్ల వేంకటశేషయ్య రంభారావణ యక్షగానం రచించాడు. ఇలాగా ఇంకా ఎందరో యక్షగాన కర్తలు అందులో కీర్తనలు, దరువులు, పదాలు రచించి అంతో ఇంతో ఈపదకవితకు సేవచేశారంటే తప్పులేదు

హరికథా వాగ్గేయకారులు :

"హరికథను పందొమ్మిదో శతాబ్దంనుంచి యక్షగానం అన్న పేరు పర్యాయ వాచకంగా కన్పిస్తున్నది.... తెలుగు హరికథా రచయితలలో చాలమంది తమ రచన లను యక్షగానాలని పేర్కొన్నారు "[108] అని ఐదువందల పై చిలుకు హరికథల్ని పరిశీలించి నిరూపించారు. ఆచార్య మూమాటి దొణప్పగారు తమ తెలుగు హరికథా సర్వస్వంలో.

తాట్కూరి నారాయణ కవి మోక్షగుండ రామాయణం హరికథగా రచించాడు. ఇందలి కీర్తనలు సులభశైలిలో ఉంటాయి. తోహరాలు, మంజరులు, రగడలు, అంత్యప్రాసయమకాదులతో కూడి ఉంటాయి సింగరిదాసు, నరసింహదాసు సంగడి నాగదాసు, కృష్ణదాసు మొదలైనవారు హరికథలు రచించారు సింగరిదాసు రామదాసు చరిత్ర ప్రసిద్ధం 1840-1902 మధ్యన జీవించిన జాగేపల్లి అనంత రామాచార్యులు అనేక హరికథలు రచించాడు. వీరందరిలోకి ఉత్తమ హరికథా రచయిత ఆదిభట్ల నారాయణదాసు (1864 - 1945) తొమ్మిది హరికథలకు కర్త. బహుభాషావేత్తలు ఇతనితోపాటు చెప్పుకోదగ్గ హరిదాసు బాలాజీదాసు. అనకాపల్లి నివాసి; అనేక హరికథలు రచించాడు ఇంకా తిరునగరి శేషదాసు, అయ్యగారి భద్రరావు, కోసూరి భోగలింగదాసు, కొమ్మూరి బాలబ్రహ్మానందదాసు, పరిమి సుబ్రహ్మణ్యదాసు, ములుకుట్ల పున్నయ్యశాస్త్రిదాసు, పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు మొదలైన ఇంకా అనేకులు ఈ హరికథారచనలు చేసి తరించారు. భక్తులకు తరణోపాయం చూపించారు.

కొందరు తత్వకర్తలు :

తత్వకర్తల్లో కొందరిని గూర్చి పూర్వయుగంలో పేర్కొనడం జరిగింది. ఈ యుగంలోను కొందరిని ప్రస్తావించడం అవసరం.

నిట్టల ప్రకాశదాసు :

19వ శ॥ తొలిభాగంలోని తత్వకర్తల్లో చెప్పుకోదగ్గవాడు నిట్టల ప్రకాశరావు. ఇతని తత్వాలు ప్రజాదరణ పొందాయి. 'గూటిచిలకేదిరా అన్నా ...., గాలిపటమురా జీవా; నారాయణ నీ నామము; రాములవారి మాట; దైవసహాయ మెన్నటికో' మొదలైనవి ప్రసిద్ధాలు. ఇతడు కొన్ని మహిమలు సైతం చూపినట్లు తెలుస్తుంది.

ఎడ్ల రామదాసు :

19 వ శ॥ అంత్యభాగంలో కాకినాడలో వెలసినవాడు, తత్వకర్త ఎడ్ల రామదాసు. బ్రహ్మంగారి తత్వాల తరువాత ఎడ్ల రామదాసు తత్వాలకే ప్రచారం

ఎక్కువ. ఇతడు రచించిన 119 కీర్తనలు గల 'సాంఖ్య యోగతార్కికామనస్క యోగం అనెడు సుజ్ఞాన చంద్రిక' తోపాటు అతని శిష్యులు రచించిన కొన్ని కీర్తనలు కలిపి ఎడ్ల రామదాసు చరిత్ర అనే పేరుతో ప్రకటితమైంది. ఇతని శిష్యులు బూచి అప్పలదాసు, చిట్టూరి నారాయణదాసు, వి త్తనాల కొండయ్యదాసు, వెంకటదాసు, బోని అప్పలదాసు, బోని గరవయ్యదాసు, మామిడి అప్పలదాసు మొదలైనవారున్నారు. సుజ్ఞానచంద్రికను ఎడ్ల రామదాసు తన జీవితచరిత్రగానే రచించాడు. ఇందులో తత్వాలు గాక కీర్తనలు, భజనపాటలు, మేలుకొలుపులు, మంగళహారతులు మొదలైనవి వున్నాయి.'పరబ్రహ్మం గూర్చిన కీర్తనలున్నాయి'. 'ఈశ్వరా జగదీశ్వరా పరమేశ్వరా కరుణించరా' 'జీవమా మేలుకొనవే; అనుమానమెందుకే మనస ఈ తనువు నిత్యము గాదు హంస; దీని భావము తెలియవలెనన్న నీలోను బ్రహ్మము'....

"మొత్తానికి యీ తత్వాలలో సూటిగా అర్థం చేసుకోబోతే చమత్కారార్థం స్ఫురించే సంకేత పదాలుండడంవల్ల బాగా ఆకర్షితులై వాటిని కర్ణాకర్ణిగా నేర్చుకొని తర్వాత ఏ గురునివద్దో దాని పరమార్థం తెలుసుకోవడంద్వారా వాటికి బాగా ప్రచారం వచ్చి ఉంటుంది. సాహిత్య పరులైన కొందరు ఆధునిక గేయ కవులకు ఈ తత్వములు కొన్ని ఒరవడులుగా పనిచేసినవి.... ఈ తత్వాలకు కొందరు కర్తలు ఏవో రాగాలు పేర్లూ అవీ నిర్ణయించిన, అవి ప్రాచీనకాలంనుంచీ వస్తూండిన ఏవోదేశీయ గేయ రీతుల వరుసలలో నప్పేటట్లుగా వారు తయారు చేసుకొన్నవేగాని, సంగీత రచనా శిల్పంలో తత్వకర్తలు ప్రత్యేకంగా పాటుపడినారని చెప్పడానికి ప్రత్యేకాధారాలు లేవు "[109] అయితే పదరచనా పరిణామంలో వచ్చిన మార్పులు గమనించడానికి మాత్రం ఈ తత్వకర్తల తత్వాలు ఉపకరిస్తాయని చెప్పడంలో ఏ విధమైన సందేహమూలేదు.

అత్యాధునికులు :

ఆధునిక యుగంలోని అత్యాధునిక వాగ్గేయకారులను గురించి సైతం ప్రస్తావిస్తే ఈ యుగం పరిపూర్ణత పొందగలదు. అలాంటి వారిలో కొందరు :

హరి నాగభూషణం (1884 జననం) :

తండ్రి హరి నరసింహశాస్త్రిగారే వీరి విద్యాగురువు. వీరు సంగీత సాహిత్యాల్లోను, సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లోను ప్రతిభగల పండితులు. వీరికి వాగ్గేయకార రత్న, సంగీత సాహిత్య భావనాపరాయణ మొదలైన అనేక బిరుదులున్నాయి. అనేక సన్మానాలకు నోచుకొని షష్టిపూర్తి చేసుకొన్న మహనీయులు. వీరు కొన్ని తాన వర్ణాలు, భక్తి పర కీర్తనలు, హరికథలు, సంస్కృత గ్రంథాలు రచించారు. ఈయన కీర్తనలు 50 దాకా ఉన్నాయి. వీరు 'జయనాట' అనే రాగాన్ని కల్పించి 'రామా యని పిలిచిన పలుకవేమి, నా మాటలు వినరావా' అనే కీర్తన రచించారు. 'నీ మహిమలు పొగడ తరమా; ఎవరి నాశ్రయించెదరా; నీ రూపము నెమ్మనమున'; మొదలైనవి వీరి ప్రసిద్ధ కీర్తనలు.

ఈ సందర్భంలోనే పేర్కొనదగ్గ వాగ్గేయకారులు: ఓగిరాల వీరరాఘవశాస్త్రి గారు, నల్లాన్ చక్రవర్తుల వేంకటనారాయణాచార్యులు, కొంతి సీతారామయ్యగారు; కీ॥ శే॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యంగారు, శిష్టా సత్యనారాయణ, రాజశేఖరంగారు, ఎమ్. సౌందర్యవల్లిగారు మొదలైనవారు.

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు :

29–1–1920 న బాలాంత్రపు వేంకట్రావుగారికి, వేంకటరమణమ్మగారికి నిడదవోలులో ద్వితీయపుత్రుడుగా జన్మించారు. 1940 లో బి. ఏ. (ఆనర్స్) డిగ్రీని ప్రథమశ్రేణిలో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి గ్రహించారు. ప్రతిభా సంపన్నులు, కవులు, గాయకులు. అనేక నృత్యసంగీత నాటికలు రచించారు. ఆకాశవాణి కేంద్రం డైరెక్టరుగా విశ్రాంతి దీసుకొని, తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య కళాపీఠం అధ్యక్షులుగా పనిచేసి, హైద్రాబాద్ దూరదర్శన్ కేంద్రంలో ప్రస్తుతం పనిచేస్తున్నారు. వీరు ఆంధ్ర వాగ్గేయకార చరిత్రకు 1955–58 సం॥ తెలుగుభాషా సమితి బహుమతి నందుకొన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వీరిని కళాప్రపూర్ణులను చేసి గౌరవించింది. సంగీత సాహిత్య రంగాల్లో వీరి సేవ అనన్య సామాన్యమైంది.

శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ :

శ్రీ పట్టాభి రామయ్య సూర్యకాంతమ్మగారలకు 6-7-1930 న జ బాలమురళీకృష్ణ; తండ్రి స్వయంగా వాగ్గేయకారుడు. వాగ్గేయకారుడు రంగశర్మగారు వీరి మాతామహుడన్న విషయం పూర్వోక్తం. గాయ భాముడైన పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి శిష్యులు. త్యాగరాజ వారి ప్రశిష్యులు. ఎనిమిదేళ్ళ వయస్సునుంచే సంగీత సభలు చేయనార ప్రతిభాశాలి వీరు; సంగీతాభిలాషులందరికి తమ గానంతో విందొనరిం ఇంకా ఒనరిస్తూ ఉన్నవారు.

వీరు స్వయంగా వాగ్గేయకారులు. 72 మేళకర్త రాగాలలో ఒక్కొక్క కృతి చొప్పున 'జనకరాజ కృతిమంజరి' అనే గ్రంథాన్ని ప్రకటించారు. సంస్కృతాంధ్ర భాషల్లోనేగాక తమిళంలోను కీర్తనలు ర ఇవన్నీ అనేక సందర్భాల్లో రచించారు. వీరు స్వయంగా సృజించిన రాగం నాంగి రాగం. ఆరాగంలోవి కృతి :

"మోహనాంగి రాగం—రూపకతాళం

ప॥ నీ నామమె నా జీవము, సుధామధురము

అ॥ప॥ నీ మేను గానమై—నీమాటగీతమై
నిను తలచి పులకించ—ఫలియించెను జన్మము ॥నీ

చ॥ పునీతమై సునాదమై
భువనమెల్ల వినోదమై
జనార్దన మనోహరి
మోహనాంగి రాగిణీ రవళి
సునీల మురళీకృతి ॥నీనామ

ఇలా మధురమంజుల సురభిళమై సంగీత సాహిత్యాలతో సాగుతుంది శ్రీ బాలమురళి సుకృతి.

ఎన్నో స్వదేశీయ, విదేశీయ సభల్లో కచేరీ చేశారు. ఎన్నో సన్మానాలు పొందారు ఇపుడు ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ అధ్యక్షులుగా మన ప్రభుత్వం నియమించి శ్రీ బాలమురళీకృష్ణగారిని సముచితంగా సత్కరించడం ముదావహం. వీరి జీవిత చరిత్ర సప్తస్వరాలు ముద్రితం.

ఆధునికయుగంలో ప్రాచీనపదం గేయ ఫణుతులలో గురజాడ అప్పారావుతో ఆరంభమై పలురకాలుగా రూపుదిద్దుకొంది. చలనచిత్ర పరిశ్రమ మూలంగా ప్రాచీన పదమే కొత్త కొత్త పలుకుల దుస్తుల్లో కనిపిస్తూనే ఉంది. అస్తు:

ఇలా పరివ్యాప్తమైన పదకవితారీతుల చిత్రణకు ఇది నేపథ్యంగా ఉపకరించగలదు. అంతేగాక ఇది ప్రధాన ప్రకరణంగాను మనం భావించడంలో అసామంజస్యం అణుమాత్రమూ లేదు ।

# సూచికలు

1. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము—పు. 81–83.
2. డా. వేటూరి ఆనందమూర్తి; తాళ్ళపాక కవుల పదకవితలు—భాషా ప్రయోగ విశేషాలు (ద్వితీయ భాగము). పు. 9, 10.
3. బసవపురాణము. పు. 22, 29.
4. పరిశోధన—ఆగస్టు, నవంబరు—సంచిక 1955. పుట 105.
5. పై 2 సూచికలోనిదే—పు. 12.
6. పై 1. సూచికలోనిదే. పు. 83.
7. పైదే. పు. 87, 88.
8. పైదే. పు. 93–95.
9. పరిచయవాక్యాలు : ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము. పు. 13.
10. పై. 1. సూచికలోనిదే. పు. 101.
11. పైదే. పు. 103.
12. పైదే. పు. 99.
13. తొలి సంకీర్తన కవులు. పు. 14, 15.
14. ఉపోద్ఘాతము—సింహగిరి వచనములు. పు. viii
15. పైదే. పు. xiii, xiv.
16. పై 13 సూచికలోనిదే. పు. 15.
17. పైదే. పు. 19.
18. The Minor works of Tallapakam Poets— సంకీర్తనలక్షణము — పద్యాలు. 54, 55, పు. 147.
19. పై 2. సూచికలోనిదే. పు. 21.
20. సింహగిరి వచనములు, వచనం 11; పు. 9.
21. పై 14 సూచికలోనిదే. పు. xxvi
22. పై 2 సూచికలోనిదే. పు. 40, 41.

23. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు; పీఠిక; అన్నమాచార్యుల జీవిత చరిత్రము. పు. 2, 3.
24. తాళ్ళపాక కవుల కృతులు_వివిధసాహితీ ప్రక్రియలు_పు. 60_65.
25. అన్నమాచార్య శృంగార సంకీర్తనములు. సం. 12. పీఠిక 6_8.
26. శ్రీ గౌరి పెద్దిరామ సుబ్బశర్మ:తృతీయ ముద్రణ పరిష్కర్త : శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల జీవితచరిత్రము_వివేక దీపిక పు_18_20
27. అన్నమాచార్య చరిత్రము_ పు_44,45
28. పై. 2 సూచికలోనిదే_అధోజ్ఞాపిక_పు 44
29. చూడుడు; నావ్యాసం "అన్నమాచార్య పురందరదాసుల సమాగమం" భారతి జూన్ 1982
30. పై 1 సూచికలోనిదే_ పు 112,113
31. పైదే పు. 120
32. పైదే పు. 126
33. పై 24 సూచికలోనిదే పు. 121
34. సంగీత సంప్రదాయ ప్రదర్శిని : పుటలు 8,9.
35. పై 1 సూచికలోనిదే_పు. 409,410.
36. శ్రీపాదగోపాల కృష్ణమూర్తి; అనుపల్లవి_కలగూరగంప: భారతి (సెప్టెంబరు 1961) పు 89-91.
37. శ్రీపాదగోపాల కృష్ణమూర్తి: ఏగంటివారి వచనముల కాలము_కలగూర గంప; భారతి (నవంబరు 1961) పు. 91,92
38. పై 1 సూచికలోనిదే_పు_413,415
39. పై. 2. సూచికలోనిదే_ పు. 40_43
40. పైదే. పు. 554-556
41. వేమన : పు. 134,135
42. పై 1 సూచికలోనిదే_పు. 414,415
43. పైదే. పు. 416,417
44. పై 41 సూచకలోనిదే. పు. 132,133
45. పై సూచికలోనిదే. పు. 149

46. పై దే పు. 417
47. డా. యస్వీ. జోగారావుగారు: ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర-ప్రథమ భాగము పు. 97-102
48. Minor Warks of Tallapakam poets-Vol I
సంకీర్తనలక్షణము పద్యం - 66.
49. పై 47 సూచికలోనిదే పు. 103.
50. పై దే పు. 104
51. పై 1 సూచికలోనిదే- పు. 153
52. పై 47 సూచికలోనిదే-పు-107,108
53. పై. 1 సూచికలోనిదే- పు. 156
54. పై దే పు-160
55. పై దే పు - 209,210
56. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. క్షేత్రయ్య పదసాహిత్యము-సాహిత్యోప న్యాసములు - 3 పు. 12,13
57. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. పదములు-క్షేత్రయ్య - ఆంధ్రపత్రిక-చిత్ర భాను సంవత్సరాది సంచిక (1942-43) పు. 12
58. పై 1 సూచికలోనిదే పు. 163,164
49. పై దే పు. 168,169
60. పై దే పు. 162
61. పై దే పు. 181
62. వివరాలకు నా గ్రంథం : క్షేత్రయ్య పదసాహిత్యం పు. 41,42 చూడనగును
63. పై. 1 సూచికలోనిదే- పు 182
64. పై దే పు. 183, 184, 186
65. క్షేత్రయ్య పదసాహిత్యం-పు. 24-27
66. పై 47 సూచికలోనిదే. ద్వితీయ భాగము- పు 251, 252
67. శ్రీ బాలాంత్రపురజనీకాంతరావుగారు: పీఠిక: రామదాసు కీర్తనలు- పు- VII

68. పై 1 సూచికలోనిదే- పు. 200-203
69. పైదే పు-263
70. పై 66 సూచికలోనిదే- పు. 265
71. పై 1 సూచికలోనిదే- పు. 263
72. పైదే. పు 264,265
73 వివరాలకు నా గ్రంథం: సారంగపాణి పదసాహిత్యం' పు. 6-8. చూడగోరుతున్నాను.
74. పై 1 సూచికలోనిదే. పు. 318
75. పైదే పు. 301
76. పైదే పు. 291
77. పైదే పు. 271
78. పైదే పు. 288
79. (i) పైదే పు. 288-290.
(ii) బాలాంత్రపు నళినీకాంతరావుగారు: సమాలోచనము-శశాంక విజయము- పు. XIV
80. సుబ్బరామ దీక్షితులు: సంగీత సంప్రదాయ ప్రదర్శిని- మొదటి సంపుటము- పు. 12
81. పై 1 సూచికలోనిదే పు. 281
82. (i) పైదే పు- 284
(ii) పై 80 సూచికలోనిదే. పు. 13,14
83. పై 47 సూచికలోనిదే- పు. 12-15
84. పైదే పు. 16
85. పై 1 సూచికలోనిదే- పు. 240
86. కుమారి మంగళగిరి ప్రమీలాదేవి-భారతి కళాతరంగిణి-పు. 36,37
87. పై 1 సూచికలోనిదే-పు. 243
88. పైదే పు. 249,252
89. పైదే పు. 315,316

90. పైదే పు. 314
91. పైదే పు. 302
92. పైదే పు. 302-306
93. పైదే పు. 307-308
94. పైదే పు. 310
95. శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి: శ్రీత్యాగరాజస్వామి చరిత్ర-త్యాగరాజ కీర్తనలు-విశేష వివరణము (ప్రథమ సంపుటము) పు. XIV
96. పై. I. సూచికలోనిదే.- పు 328,329
97. పైదే 346, 348, 349
98. పైదే పు. 352, 354
99 పైదే పు. 361,362
100. పైదే పు 363
101. పైదే పు 365
102. పైదే. పు. 369
103. డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్య : పీఠిక : శృంగారపదములు. (సం: శ్రీ. పి. సీతాపతి I. A. S. F. .R C. S (Lond)
శ్రీ వేంకటేశ్వరరావు 1972 పు: XXX VIII
104. పై 1 సూచికలోనిదే పు. 374,375
105 పైదే పు 446
106. పైదే పు. 403
107 పైదే పు. 406,407
108. ఆచార్య తుమాటి దోణప్ప : తెలుగు హరికథా సర్వస్వం-పు. 99
109. పై 1 సూచికలోనిదే పు. 425-426
110. శ్రీ మంగళంపల్లి సూర్యనారాయణ, M. A., B. Sc.
సప్తస్వరాలు - పు 272, 273.

# 3.0 పదకవితా వైభవం

పద పద్య కవితల్లో పదమే ప్రారంభంలో ఉద్భవించిందన్న విషయం సార్వోక్తం. ఈ పద కవిత్వ వైభవాన్ని పరిశీలించడమే ప్రస్తుత ప్రకరణోద్దేశం.

1 "ముదివిటులు విధవలంజలు
పదకవితలు మారుజాన జావస వారల్
చదువని పండితవర్యులు
కగనాస్థిర వీరవరులు కడిది పురమునన్".

ఇది శ్రీనాథుని చాటువని ప్రతీతి. కాని విశ్వసనీయంకాదు. శ్రీనాథుడు ఒక పక్క ఉద్దండ పండిత ప్రశంసా పాత్రమైన శృంగార నైషధాది కృతికర్త అయి నప్పటికీ మరోప్రక్క పామర ప్రజల మన్ననలకు నోచుకొన్న పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథల రచించి ఉండడం సర్వ పండితలోకానికీ సువిదితమే. పరంపరగా మన పండితవర్యులు పదకవితలకు ప్రాధాన్యం ఇవ్వలేదన్నమాట మాత్రం అక్షర సత్యం. చారిత్రక సత్యం. సంస్కృత సమాస భూయిష్ఠమైన శబ్దాడంబర సంయుత మైంది పండితుల భాష. సరళమూ, సులలితమూ, సులభగ్రాహ్యమూ అయినది పామరభాష. కాని పండిత భాష కంటే పామరభాషే మొదటిదన్న విషయం మనం మరవకూడదు. పామరభాష కాలాంతరంలో సంస్కరించబడి లక్షణబద్ధమై పండిత భాష అయినది. ఇదే రీతిని కవితా విషయంలోను మనం చూడగలం.

తెలుగు సాహిత్యాన్నంతటినీ పండితసాహిత్యమూ, పామరసాహిత్యమూ అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు. దీన్నే ప్రౌఢసాహిత్యమూ, జానపద సాహిత్యమూ అని పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్టసాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ అని చెప్పడం సముచితం. వాస్తవానికి శిష్టసాహిత్యం కంటే శిష్టేతర

సాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి వికాసం పొందిందనీ, ఆ వెనుకే శిష్టసాహిత్యం ఉద్భవించి తన బలాన్ని, ప్రాభవాన్ని నెలకొల్పుకొన్నదన్న సంగతి పూర్వోక్తం. నిజమే ముందొచ్చిన చెవుల కంటె వెనుకొచ్చిన కొమ్ములు వాడి అన్న సామెత ఉంది గదా! అనాదిగా వస్తూన్న సహజమూ, స్వాభావికమూ అయిన నిసర్గ మనోజ్ఞమైన జానపద కవితను మన ప్రాచ్యులు సేకరించి కాపాడలేదు. రాజాదరణకు పాత్రమైన శిష్టసాహిత్యం అధికారం చలాయిస్తూ వచ్చింది. జానపద సాహిత్యమంతా ఆడిపాడుకోటానికి ఉపకరించే పదకవితలు. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్టసాహిత్యమంతా పద్యకవితలు. జానపద సాహిత్యం ఒక పక్కా, పండిత సాహిత్యం మరొపక్కా తమదారిని తాము కొనసాగుతూనే వచ్చాయి. ఇక్కడ మన మీ విషయాన్ని ఇలా చెప్పుకోవచ్చు తెలుగు సాహిత్యమాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడుపాయలుగా ప్రవహిస్తూ వస్తూంది మొదటిది కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది లిఖితం కాలేదు. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపదకవిత. మూడోది అన్నమయ్యతో ఆరంభమైన సంకీర్తన కవిత ఇది తెలుగులోని పదకవిత. జానపద గేయరీతుల్ని గ్రహించి అనేక పదకవితల్ని శిష్టకవితలో ఒక భాగంగా వెలయించి, పద్యకవితా పీఠం ప్రక్కనే పదకవితకు సైతం సరిపీఠం వేసిన ఘనత అన్నమయ్యది అలాంటి పదకవితా పరిమళాల గుభాళింపులను ఆఘ్రాణించి ఆనందించేముందు మరో చిన్న విషయం ఇచట పరిశీలించటం అనవసరమేమీకాదు.

కాగా జానపద గేయాలు వాఙ్మయకోటిలో చేరుతాయా లేదా అన్న విచికిత్స ఒకటుంది. కానీ ఈ విచికిత్సకు ఈనాడు తావలేదన్న విషయం అందరికీ తెలిసిందే ఏ సాహిత్యానికైనా రసానందదాయక గుణం ప్రధానమన్న సంగతి సర్వపండితాంగీకృత విషయం. జానపద గేయమైనా అందులో రసస్ఫూర్తి ఉండటం వల్ల అది సాహిత్యంగానే పరిగణించబడింది. ఇది ప్రౌఢ సాహిత్యంతో తులతూగక పోవచ్చుగాక! అయినా ఇందులోని గీతి ప్రాధాన్యంవల్ల ప్రౌఢసాహిత్యం కంటే మిక్కిలి రసానందదాయకమనడంలో సందేహంలేదు. ఈ గేయసాహిత్యంలో సంగీతంతోపాటు కవిత్వపు పాలు సైతం అధికంగా ఉంటే తప్పకుండా బంగారానికి తావి అబ్బినట్లవుతుంది. అంటే ఆ గేయాలకు కావ్యత్వం సిద్ధించిందని అర్థం. అందువల్ల ఈ గేయాలు సాహిత్యంలో చేరుతాయనడం. రసానంద నిష్యంది అయిన ఈ జానపద గేయ సాహిత్యం సర్వజనామోదకరమై— ఏలాంటి ప్రయత్నమూ

లేకుండగానే – విన్న వెంటనే విషయం విశదమవుతుంది. ఆనందం అనంతంగా కలుగుతుంది. అంటే "సద్యఃపర నిర్వృతి" ఇందున్నదని అర్థం. సాహిత్య ప్రయోజనాల్లో "సద్యఃపర నిర్వృతి" ఒకటని గదా ఆలంకారికుల మతం ? అంతే కాదు; ఆలంకారికులు చెప్పిన 'వాక్యం రసాత్మకం కావ్యం(విశ్వనాథుడు) "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" (జగన్నాథ పండిత రాయలు)—వీటిని సైతం మనం ఇక్కడ అనుసంధించడం సముచితం. అందుకే ఈ జానపద గేయాలు సాహిత్యంగా పరిగణించబడ్డాయి. ఈ జానపద గేయ రీతుల్నే గ్రహించి నిబద్ధితమైన పదకవిత కూడా తప్పకుండా వాఙ్మయ కోటిలో చేరుతుందనడంలో అత్యుక్తిలేదు. పైపెచ్చు సహజోక్తి ! అంటే పదసాహిత్యంలో కావ్యత్వం ఉందని తీర్మానం.

ఈ సిద్ధాంతాన్ని అనుసరించే పదసాహిత్యంలో ఎంత మాత్రం కావ్యత్వపు పాలుందో పరిశీలిస్తే ఆ విషయం స్పష్టమవుతుంది.

పదకవిత లన్నిటిలో అనాది కవితలు జానపదగేయాలు. వాటిని మొదట పరిశీలిద్దాం. నేను సేకరించి ప్రకటించిన కొన్ని జానపద గేయ భాగాలు ఉదాహరించి, రసితాగీతిని, రసనిర్భరతని నిరూపిస్తాను. జానపద గేయ సాహిత్యంలో రామాయణానికి ఒక ప్రత్యేకత ఉంది అది ప్రజల్లో జీర్ణించుకొనిపోయింది. రాముడితోపాటు సీత అరణ్యానికి వెళ్ళినప్పుడు—

"అడేవి కదలుతా భూదేవి కదిలా
భూదేవి కదలుతా భూదేవిపైనున్న వృక్షాలే కదిలా
వృక్షాలపైనున్న పక్షులే కదిలా"— అని చెప్పబడింది.

సీత అడవికి వెళ్తుండగా తన పుత్రిక కష్టాన్ని చూచి సహించని తల్లి భూదేవి సైతం చలించిందట ! అలాగే చెట్లు, చెట్లమీది పిట్టలూ కదిలాయట. అంటే ప్రకృతి, ప్రకృతిలోని ప్రతిప్రాణి సీతాదేవి కష్టానికి చలించిపోయాయని గేయ కవి హృదయం. ఇది కవిత్వం కాదనగలమా ?

ఇట్లే మారీచుడు మాయలేడి రూపంలో వచ్చిన సందర్భంలో రాముడు బాణ ప్రయోగం చేస్తాడు.

"ఏసెనే రామస్వామి ఎండమ్మతోనా
కూలెనే ఆ మెకము కుమ్మరామాలా
సోలెనే ఆమెకము సొప్పకట్టలా"—

రాముని అమ్మ దెబ్బతిన్న ఆ జింక "కుమ్మరామాలా" కూలిపోయిందట. 'చొప్పకట్టలా' సోలి పోయిందట. చక్కని ఔపమ్యం. సహజ సుందరమూ, నిసర్గ మనోజ్ఞమూను. పైగా ఈ ఉపమానాలు పామర ప్రజల ప్రకృతికి తగిన రీతిగానే ప్రయుక్తం కావడం విశేషం. ఇలాగే కపిలిపాటలు రసఘుళికలు. అందులో మొరటుతనం ముమ్మరంగా ఉన్నా మోహనంగా, సమ్మోహనంగా కవిత ఉండి సహృదయ రంజకమై ఉంటుంది.

"కందిరీగ నడుముదానా కాసులోళ్ల చిన్నదానా
అద్దమంటా నీ మొగము చూడా యెద్దులింటా పొలుగు తగిలో"

ఇది ఒక కపిలపాట. ఇందులో సహజ సుందరమైన కవిత ఉంది 'కందిరీగ నడుము దానా' అన్నాడు గేయకవి. ఈ ఉపమానౌచిత్యానికి సహృదయ హృదయాలే సాక్షులు: "అస్తినాస్తి విచికిత్సా హేతుశాతోదరీ" అనీ "సదసత్సంశయ గోచరోదరీ" అనీ పేర్కొన్న శ్రీనాథుని సమాస భూయిష్ఠ రచన కంటే ఇది పండితపామర హృదయరంజకమై ఉంది. శ్రీనాథునిది పండితభాష ప్రజల భాషలో గ్రామీణ ప్రజలకు సహజమైన రీతిని స్త్రీ నడుం కందిరీగ నడుంతో పోల్చడం జరిగింది మరి ఇంతకంటే కవిత్వముంటుందా ? ఈ గేయ కవిత సాహిత్యంలో చిరస్థాయిగా నిలువగలదు.

ఇలాగే ప్రముఖ వాగ్గేయకారులలో కొందరి పదకవితా వైభవాన్ని పరిశీలిస్తే ఆపదసాహిత్యంలో ఏమాత్రం కావ్యత్వం ఉందో స్పష్టమవుతుంది.

అన్నమాచార్యుడు పదకవితకు ఆద్యుడేకాదు, అనవద్యుడు; సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ బిరుదులచేత ప్రసిద్ధుడు. అతడు రచించిన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు వేలకువేలున్నాయి. అందులో అతని కవితాత్మ బహుముఖాల ఆవిష్కృతమై ఉంటుంది. మచ్చునకు ఒకటి రెండు పదాలని పరిశీలిద్దాం

పల్లవి : ఏమొకొ చిగురుటధరమున-యెడనెడ కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన-పత్రిక కాదు గదా ॥ఏమొకొ॥

1. కలికి చకోరాక్షికి కడ-కన్నులు కెంపై తోచిన
చెలువం బిప్పుడిదేమొ-చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై-నాటిన యాకొన చూపులు
నిలువున బెరుకగ నంటిన-నెత్తురు కాదు గదా ॥ఏమొకొ॥

2. పడతికి చనుగవ మెఱుగులు-పైపై పయ్యెద వెలుపల
కడుమించిన విధమేమొ-కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో-ప్రియుడొత్తిన నఖ శశిరేఖలు
వెడలగ వేసవికాలపు-వెన్నెల కాదుగదా ॥ఏమొకొ॥

3. ముద్దియ చెక్కుల కెలకుల-ముత్యపుజల్లుల చేర్పుల
వొద్దిక లాగు లివేమొ-వూహింపరే చెలులు
గద్దరి తిరువేంకటపతి-కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల-అందము కాదుగదా ॥ఏమొకొ॥

(XIII-82)

ఇందులో నాయిక అయిన పద్మావతీదేవిని చెలికత్తెలు పరాచకాలు ఆడడం ప్రధాన విషయం. పద్మావతికి శ్రీవేంకటేశ్వరునిపై గల ప్రేమ, శృంగారం అభివర్ణితం. అన్నమయ్య ఈ పదకవితలో చక్కటి ఉక్తి చమత్కృతితోపాటు, ఉత్ప్రేక్షాయుత కవితావైభవం-మొదలైన ప్రయోగాలతో తెలుగులో ఏ ప్రబంధ కవికీ తీసిపోవడం లేదంటే ఆశ్చర్యపడ పనిలేదు. పై పదంలో శబ్దాలు చమత్కారయుతమై, రసనిష్యందులై, ఆనందాపాదులై ఉన్నాయి. పల్లవిలో, చరణాల్లో కార్యకారణ సంబంధంతో చెలులు ఒక భావాన్ని ప్రశ్నార్థకంగా ఊహించి అందుకు కారణం ఇది కాబోలు అని తలచడంలో చక్కటి సమన్వయం కుదిరి చమత్కారం స్పష్టమవుతుంది. పల్లవిలోని 'ఏమొకొ చిగురుటధరమున యెడనెడ కస్తురి నిండెను', అని ప్రశ్నించుకొని, అందుకు సమాధానంగా 'భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా !' అని భావించడంలో ఈ చమత్కారం గోచరిస్తుంది. ఇలాగే తక్కిన చరణాల్లోను.

మరో ఉదాహరణ :

పల్లవి : అతివ జవ్వనము రాయలకు బెట్టిన (బెట్టని) కోట
పతి రాజ్యసుఖ రాజ్య భారంబు నిలుప ॥అతివ॥

1. కాంత కనుచూపు మేఘంబు లోపలి మెఱుగు
కాంతుని మనంబు చీకటి వాపను
ఇంతి చక్కని వదన మిందుబింబము విభుని
వంత కనుదోయి కలువల జొక్కజేయ ॥అతివ॥

2. అలివేణి ధమ్మిల్ల మంధకారపు భూమి
కలికి రమణునకు నేకత మొసగను
పొలతికి బాహువులు పూవదీగలకొనలు
పొలసి ప్రాణేశు వలపుల లతల బెనచ ॥అతివ॥

3. పంకజానన రూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు సిరులు వెదజల్లగా
చింక (జింక) చూపుల చెలియ చేత మతనుని చేత
యింకా నతనినె మోహించ జేయగను ॥అతివ॥

ఇందులో ప్రబంధ కవితను మించిన కవితావైభవం అన్నమయ్య కుప్పించి ఉండడం సహృదయులు గ్రహించగలరు. రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారములో, పల్లవిలో, చరణాల్లో అంతటా ప్రస్ఫుటమై కొట్టవచ్చినట్లు ఈ పదంలో మనం చూడగలం. ఇది పదమే అయినా పద్య కవితని మించిపోయిందనడంలో సందేహంలేదు. దీనికి కావ్యత్వం సిద్ధించిందనడం సహృదయ హృదమైక వేద్యం !

పదకవితాపితామహుడు అన్నమయ్యకాగా, పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. క్షేత్రయ్య నాటినుంచి పదం అంటే శృంగార పదం అన్నప్రసిద్ధి ఏర్పడింది అన్నమయ్య తరువాత పదకవితా రచనలో పెద్దపీఠం మీద అధివసించిన వాడుక్షేత్రయ్యే. క్షేత్రయ్య శృంగార పదాల్లో సాధించని కవితా రీతియేలేదు. పైగా వివిధ శృంగార నాయికామూర్తి చిత్రణలో, ఆయానాయికల మనస్తత్వాల చిత్రీకరణలో, దక్షిణ

నాయకుని శృంగార రసలుబ్ధతా ప్రకటనలో అతని కతడేసాటి. అలాంటి పదాల్లో ఒకటి రెంటిని చవిచూద్దాం.

పల్లవి : చాలుచాలు ఈ ఉన్నెలతోనాదు_సరసకు జేరకుర

అ. ప: చాలు! ఈ ఉన్నెలు_సాగవు నావద్ద మువ్వగో

పాల! భామ వద్దకే పోర? ॥చాలు॥

1. కన్నుల పీడెముతో _ కాటుక మోవితో
వెన్నున కేల్జడ _ వేటుతోను
కన్నియ కెంపుల _ గాజుల నొక్కులతోను
వన్నెకాడ! నుదుటను _ నున్నలత్తుకలోను ॥చాలు॥

2. నిద్దుర మబ్బుతోను _ నిండు బడలికతోను
ముద్దియ కలసిన _ ముదముతోను
నిద్దంపుచెక్కిళ్ళ _ నెలవంకలతోను
వద్దురా పద్దులు _ వగకాడ నాతోను ॥చాలు॥

3. అలదాని కుచముల _ నలదిన జవ్వాజి
కల యురస్థలమును _ నంటి నన్నంటరాకు
బలిమిచేసెదేల _ బాలమువ్వ గోపాల
అలనాడె గూడిన _ చెలిమి పదివేలు ॥చాలు॥

(క్షేత్రయ్య పదములు_రెండవభాగం _ పద॰ 98) ఇదొక మనోజ్ఞపదం. ఈ పదంలోని భావాన్ని చిత్రకారుడుగాని, శిల్పిగాని, నర్తకిగాని, సాధించలేని దాన్ని క్షేత్రయ్య పదసంయోజనంతో, తన కవితా నైపుణ్యంతో సాధించాడని చెప్పవచ్చు. మొదటి చరణంలోని భావాన్ని ధ్వనిని చిత్రకారుడు చిత్రించలేడు. శిల్పి శిల్పంలో చెక్కలేడు. కవి మాత్రం తన పసనైన మాటలతో చెప్పగలిగాడు. 'కన్నులపీడెము కాటుకమోవి', గడుసు ప్రయోగాలు విన్నవెంటనే ఎంతో అసహజం అనిపిస్తుంది. కానీ అందులోని వ్యంగ్యం భావిస్తే మనోహరమై మంజులమైన భావం స్ఫురిస్తుంది. శృంగారంలో భాగమైన నాయికా నాయకులు పరస్పరం కళ్ళు ముద్దు గొన్నారన్న

ధ్వని ఇందులో ఉంది. కళ్ళలో వీడెమూ, మోవిని కాటుకా ఉన్నాయి. వెన్నున క్రీల్గడ వేటు తగిలిన గుర్తుంది. కెంపుల గాజుల నొక్కులు శరీరం మీద ఉన్నాయి. లత్తుక నుదుట ఉన్నదట. అంటే నాయిక పాదాలకు మ్రొక్కాడన్నమాట ఇది శృంగారంలో పరాకాష్ఠగదా! రెండో చరణంలోని నిద్దురమబ్బు, నిండుబడలిక, ముద్దియ కలసిన ముదము, చెక్కిళ్ళపై నెలవంకలు నాయికానాయకుల సురతక్రీడాచిహ్నాలు. మూడో చరణంలో 'నాయిక స్తనద్వయం'పై అలదిన జవ్వాజి నాయకుని ఉరోభాగంలో ఉందని వర్ణితం ఇలాంటి వ్యంగ్య స్ఫూర్తితోటి ధ్వన్యాత్మకంగా చిత్రించడం మహాకవితా శిల్పిఅయిన క్షేత్రయ్యకే సాధ్యం. ఇందులోని చమత్కారయుతరచన, వ్యంగ్యం, నిసర్గమనోజ్ఞమైన భావాలు, వీటిని సాధించడానికి అడంబరములేని శబ్ద సముచ్చయ ప్రయోగం, ఇవన్నీ క్షేత్రయ్య ప్రతిభకు ప్రతీకలు. కేవలం అంగాంగ వర్ణనలు చేసే ప్రబంధకవుల కంటె గూడా క్షేత్రయ్య గొప్పదనం దీనిమూలంగా మనకుస్పష్ట మవుతుంది.

క్షేత్రయ్య కృతి చమత్కృతికి మరో ఉదాహరణ.

పల్లవి : ఏతీరున రమణిని గెలిచి నీ – వెట్లు రూపొందువో
అ. ప : చూతముదారా? మదన నీ–చేతి బలిమి మాచెలియ బలిమి ॥ఏతీరున॥

1. రాతిరనే ఏనుగునెక్కి–రాకాచంద్రుడు గొడుగుగాను
లేతతెమ్మెర మొదలైన బలముల – చేత గెలిచెదనంటివా
పోతుటేనుగు కుంభములే – పొలతి గుబ్బలు మోము చంద్రుడు
నాతిప్రాణములే చలువ తెమ్మెర - జాతి వారిలో పగలు గలవా ॥ఏ తీరున॥

2. జంట విరిదమ్మి యెద – నంట గుమ్మెద నంటివా?
దంటలే చెలికేలుదమ్మి – తమ్మి యొక్కటేనుమ్మీ?
తుంట విల్లొక్కటినీది – తునియనివిండ్లు చెలియ కన్బొమలు
ఇంట గెలిచిరచ్చగెలువ వలెనను – నెన్నికలేక పూనితివి ॥ఏ తీరున॥

3. అంచలు మాచెలిని జూచి - అడుగు బెట్టనెంచి చూడ
పంచ వన్నెల చిలుక – పలుకులే చానపలుకులు
పంచ బాణములు నీవు – పడతిచూపులే తూపులనగ
నెంచ శక్యముగాదా మీద - నేలుకొన్నాడు మువ్వగోపాలుడు ॥ఏ తీరున॥

(క్షేత్రయ్య పదములు – ప్రథమ భాగము పదం–89)

—ఇందులోని కల్పనానైపుణ్యం, చమత్కారం మనోజ్ఞం ; 'రసజ్ఞ హృదయైక వేద్యం ;' ఇది ప్రబంధ వర్ణనలకుగానీ, చమత్కృతికిగానీ తీసిపోదు. పైగా ప్రబంధకవులు పద్యంతో సాధించిన దాన్ని క్షేత్రయ్య పదంలో సాధించాడు ఇదే అతని వైశిష్ట్యం. భావనాబలం, దానికి తగిన భాషాప్రయోగం మన కన్నులకు కట్టినట్లు చిత్రించే నేర్పు-వీటన్నిటినీ మించిన ప్రతిభా-మొదలైన మహాకవికి, మహా కావ్య శిల్పికి-ఉండవలసిన లక్షణాలన్నీ క్షేత్రయ్యలో కోకొల్లలు.

పదకవితరచనలో క్షేత్రయ్య ప్రక్కనే సరిపీఠమధివసించదగినవాడు సారంగపాణి సారంగపాణి పదరచనలో శ్లేష, చమత్కారం, భావుకత మొదలైన గుణాల్ని సైతం సాధించి ఉండటం గమనించగలం.

పల్లవి : ఏమిటికే నీపేరేమని యడిగితివి

అ.వ. ; కోమలి నను వేణుపాలుడని దెలిసి ॥ఏమిటికే॥

1. పడతి ; నీమోము-ముద్దిడు కొన్నప్పటినుంచి
పద్మాక్షుడని నను-బలుకుదురే
జడియక నీదు-కీల్జడ యల్లినదే మొదలు
తొడరి శేషశయ-నుడనుచు బిలుతురే ॥ఏమిటికే॥

2. అలివేణి నీమోవి-యానిన నెపమున
తలకొని మధుసూ-దను డందురె
బలిమి నీ గుబ్బలు-బట్టిజూచుట జేసి
తలిరుబోణి మందర-ధరుడని తలతురే ॥ఏమిటికే॥

3. మరుకేళి నినుగూడి-మరగినదే గురిఁజేసి
మదనజనకుడని-ప్రేమను గొలుతురే
పరిమళవతి నీపై-పసుపు దుప్పటైనది
అరసి పీతాంబర-ధరుడనుకొందురే ॥ఏమిటికే॥

(సారంగపాణి పదములు-9)

ఇందులో నాయకుడు నాయికని ప్రశ్నిస్తూనే కార్యకారణ సంబంధంతో కూడిన-తనకుగల వివిధ నామములకు సంబంధించిన-విషయములు చెప్పి చమత్కరిస్తున్నాడు. వాస్తవానికి అవి ఆయా కార్యాలవల్ల కలిగినవికావు. కానీ కలిగినట్లు చెబుతున్నాడు. దీనితో నాయికా నాయకుల సౌందర్య ప్రకటన సైతం కవి సాధించాడు. ఇందులో కవి భావుకత, భావుకతకు తోడైన భాష, చక్కటి కల్పన, సహజ సుందరమైన పదబంధాలు, సొగసైన భావాలు వ్యక్తీకరించి ప్రౌఢకవులకు ఏమాత్రం తీసిపోడనీ, పైపెచ్చు పదాల్లో సైతం సహృదయరంజకమైన కవిత చెప్పిన ఘనుడు సారంగపాణి అన్న విషయం స్పష్టమవుతుంది

సారంగపాణి పదంలో శ్లేష వైభవాన్ని సాధించినందుకు ఓ ఉదాహరణ :

పల్లవి : వరకన్యాతిలక మీ-వనిత పేరు దీని

అ.ప. : పరికించ వేణుగోపాలస్వామి ॥వరకన్యా॥

1 పొలతి నెమ్మోము సం-పూర్ణ చంద్రోదయము
అలకాళిరుచి వినో-దాం జనంబు ॥వరకన్యా॥

2. దాని మృదు మధురోక్తి-ద్రాక్షాది రస మెంచ
మానవతిచూపు మ-న్మథ బాణసమము ॥వరకన్యా॥

3. చెలియదాని గుణంబు-చింతామణి స్ఫూర్తి
అలరించు పాట శ్రుతి-కానంద రసము ॥వరకన్యా॥

4. సరసాంగి పొక్కిలి వ-సంత కుసుమాకరము
అరయగా చనులు బి-ల్వాది నిరసించు ॥వరకన్యా॥

5 తరుణి సర్వాంగ సుందర-రసము రతినేలు
కరుణ రాజమృగాంక-కలయు మిక రతిని ॥వరకన్యా॥

(సారంగపాణి పదములు-7)

ఇందులో నాయికను అభివర్ణిస్తూ ఆమె గుణాలతో ఔషధాల పేర్లని పేర్కొని ఆశబ్దాలకు, పదబంధాలకు ఉన్న అర్థద్వయంతో శ్లేషను సాధించాడు పదకర్త. 'పొలితి నెమ్మోము సంపూర్ణచంద్రోదయము' లో ఔపమ్యం కుదిరింది. 'అలకాళిరుచి

వినోదాంజనంబు'లో నాయిక కురుల కాటుకవంటి నలుపును తెలుపుతుంది ఇలాగే తక్కిన 'ద్రాక్షాదిరసము, చింతామణి, వసంతకుసుమాకరము' పదబంధాలు శ్లేష సమన్వితాలు. వీటి మూలంగా చక్కటి చమత్కారాన్ని సైతం కవి సాధించడం విశేషం.

పై పరిశీలనవల్ల పద పద్యకవితల్లో పద్యకవిత పండితలోకానికే పరిమితమై ఉండగా, పదకవిత పండితపామరులకు సమానంగా ఆనందాపాదకమై పద్యకవితా ప్రయోజనం కంటె అత్యంత ప్రాముఖ్యాన్ని నెరపిందనీ, దానిలో గేయరీతి సమస్త జనసముదాయానికీ అత్యంత ఆదరణ పాత్రమైందనీ మనకు స్పష్టమవుతున్న సత్యం కాబట్టి పదాల్లో కవిత్వపుపాలు అత్యంత మనోరంజకమై ఉండడం మూలాన్నే పదసాహిత్యం కావ్యత్వస్థాయిని పొందిందని చెప్పడంలో విప్రతిపత్తి ఉండరాదు కాగా సర్వజనానురంజకతగల కవితకే ప్రాధాన్యమన్న విషయం సైతం మన మిక్కడ మరవకూడదు. ఎంతగా శిష్టసాహిత్యం రాజ గౌరవాదరాలకు మొదటినుంచి పాత్రమై కొనసాగుతూ వచ్చినా శిష్టేతర సాహిత్యమైన పద కవితలు సైతం తమ మనుగడ సాగిస్తూనే వచ్చాయి. వాటి కంఠదండలు సామాన్య జనమే కాలక్రమేణ పండితులచేత సమాదరించబడి సముచిత రాజ గౌరవం పొందడం ముదావహ విషయం. పైగా ఈనాడు కవిత కొందరి కోసం కాదు, మందికోసం. తద్ద్వారా మందిమనుగడకు, మంచిమనుగడకు ఉపకరించి మహోన్నతం కావాలన్నది మనందరి ఆకాంక్ష. అలాంటి ఆకాంక్షకు అక్షరరూపమిస్తాయి నవకవులని ఆశిద్దాం !

## 3.2 అన్నమాచార్యుని పదాలు-కవితారీతులు :

అన్నమాచార్యుని పదాల్లోని కవితారీతుల్ని పరిశీలించడమన్నది ఒక అసామాన్య విషయం; అది అనంతం. కనుక స్థాలీపులాకన్యాయంగా అతని కవితా వైభవాన్ని-కొండని అద్దంలోలాగా-దిక్ప్రదర్శన చేయడమే ఇక్కడ నేను చేసే ప్రయత్నం.

### 3.2.1 భావుకత :

ఒక కవి కవితాత్మకు నిదర్శనం అతని భావుకత. అత్యంత మనోజ్ఞమైన భావుకత ఉన్నప్పుడు కవిత్వం రసనిష్యందియై ఆనందాపాది అవుతుంది. ఈ పద

కవితలో అన్నమాచార్యుని భావుకత భాసురమై బ్రహ్మానంద సహోదరమైన ఆనందాన్ని అందిస్తుంది. ఓ చక్కటి ఉదాహరణ.

"పీడెమిట్టు రావమ్మా పీఁడె పానుపుపైనున్నాఁడు
జోడైన వయసులే సొంపులు పుట్టించీని ॥పల్లవి॥

సొలసి నీవు చూచిన చూపు లెల్లాఁబతికిని
కలువ పూవుదండలై కమ్ముకొనెను
నెలత నీవు చక్కని నెమ్మోము చూపితేను
వలుద చంద్రబింబమై వలపులు రేఁచెను ॥పీడె॥

అరిది నాతనితోడ నాడిన మెల్లని మాట
తరితీపు తేనెలై దైలువారెను
సరుగనీవప్పుడు సన్న సేసిన సన్న
సరతపులకలై చుట్టుకొనెను ॥పీడె॥

యెనసి శ్రీ వేంకటేశు యెదుట నవ్విన నవ్వు
చెనకి పైఁజల్లిన సేసలాయను
పెనఁగి చేతులు వట్టి పిలిచిన పిలుపులు
తనివోని కంకణ దారాలాయను ॥పీడె॥

(24-117)

ఇందులో కవి భావించిన తీరు అత్యంత మనోజ్ఞం. సరసహృదయాల్ని మురిపిస్తుంది. నాయిక చూచిన చూపులు నాయకునకు కలువ దండలు, నెమ్మోము చంద్రబింబం అయి తోచాయట. తక్కిన భావాలన్నీ ఇలాగే మనోహరం. మరో ఉదాహరణ :

"అప్పై నాకు నేఁడంతటి లోనె
సుబ్బిన చూరల సూచన లదివో ॥పల్లవి॥

పూచీ నౌనే పున్నమ వెన్నెల
చేచేతనే నీ సెలవులను
కాచె నిమ్మలివె కడు నీ వురమున
పై చింతలనే పండెను మోము ॥అవ్వె॥

మూఁగీనౌనె మొకరి తుమ్మిదలు
తూఁగేటి నీ నెరితురమునను
రాఁగీఁజిలుకలు రతి నీ పలుకుల
ఆఁగీఁబికములు అదె కుత్తికను ॥అవ్వె॥

పాఁకీనౌనే బాహులతలు గడు
కాఁకల నీ నా కాఁగిటను
యేఁకట శ్రీ వేంకటేశుఁడఁదియ్యఁగ
సోఁకీ మదనుని సొమ్ములు రతుల ॥అవ్వె॥
(26-28)

ఇందలి భావుకత సహృదయ హృదయ రంజకమై ఒప్పుతూంది. అల్పాక్షరాలతో అనల్పార్థ రచన ఈపదంలోని ప్రత్యేకత. తెలుగు పలుకుల తియ్యందనానికి ఇది చక్కటి నిదర్శన. శబ్దాడంబర రహితమై అత్యంత మనోజ్ఞమైన రీతిని అన్నమయ్య భావించి, తదుచితరీతిని పదరచన చేసి తరించాడు. ఇది అన్నమయ్య భావుకతలోని ప్రత్యేకత.

కమనీయ కవిత :

పండితులను మాత్రమే కాక పామర ప్రజల్ని సైతం రంజింప జేయడం పదకవితల పరమప్రయోజనం. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేట్లు, వారి అర్థావగతికి దగ్గరగా ఉండేట్లు సరళమూ, సులభమూ అయిన భాషలో పదకవితల రచన సాగడం ఎంతైనా ముదావహం. ఈ విషయంలో అన్నమాచార్యుడు అన్ని విధాలా సఫలీకృతుడైనట్లు ఆతని సంకీర్తనలే చెబుతాయి. ఇందుకు చక్కటి ఉదాహరణ.

"విరహ మెక్కుండ మాయ విచ్చేయవయ్యా
నిరతి నాకెఁజూచి నీ వంటా మొక్కితిమి ||పల్లవి||

చెక్కిటి చెయ్యి చెలికి శేష పరియంకమాయ
జక్కవ చన్నులు శంఖు చక్రములాయ
చక్క చెమటే జలధివునికి సేసుక నిన్నుఁ
జక్కని సతి దలఁచి సారూప్యమందె ||విరహ||

పలువ కస్తూరి పూత సరినీల వర్ణమాయ
మెలుత నివ్వెర గనిమిష ద్రిష్టాయ
తొలుత చిగురు పాన్పు తులసి పూజాయ నిన్ను
జలజాక్షి తలపోసి సారూప్య మందె ||విరహ||

సిరుల గట్టిన తాళి శ్రీధర భావమాయ
వరుస వలపు భక్తవత్సల మాయ
యిరవై శ్రీ వేంకటేశ యింతలో నీవు గూడఁగా
సరస నిన్నంటె నాకె సారూప్యమందె ||విరహ||

(శృంగార సంకీర్తనలు XXVI–191)

ఇందులో కమనీయకవిత ఉంది. ఆ కవితకు తగిన చక్కటి భాషవుంది విరహవ్యథాభరిత మనస్క అయిన నాయిక సర్వవిధాలా శ్రీవేంకటేశ్వరుని లాగానే అయి సారూప్యమందిందట. ఈ విరహం నాయికకు ఒక అందాన్ని చేకూర్చిందట. ఆ సారూప్యమందిన నాయికనే నాయకుడు శ్రీవేంకటేశ్వరుడే కాబోలునని చెలులు "నిరతి నాకెఁ జూచి నీవంటా మొక్కితిమి విచ్చేయవయ్యా" అని ప్రార్థిస్తున్నట్లు చెప్పారు. ఇందులో వ్యంగ్యం, హాస్యం ప్రస్ఫుటమై సహృదయ హృదయాల్ని ఆనందపరవశుల్ని చేస్తాయి. ఇంతేగాదు, చెలిచెక్కిలి మీదిచేయి శేషపర్యంకమైందనీ, జక్కవ చన్నులు శంఖచక్రాలయ్యాయనీ, చెమట జలధి అయ్యిందనీ ఉత్ప్రేక్షించడంలో ప్రతిభా సంపన్నుడైన మహాకవి కుండవలసిన భావకత, తన్మూలంగా చమత్కారం గోచరించి మన రసానందానికి అవధిలేకుండా చేశాయనడం అత్యుక్తికాదు. ఇలాగే తక్కిన రెండు చరణాల్లోను. ఇలా వివరిస్తూ వెళ్ళితే

ఎంతైనా చెప్పవచ్చు. ఇందలి భాష సరళం. పైగా ఇందు క్రియలు "శేషపరియంక మాయ, శంఖచక్రములాయ" అని వ్యావహారిక భాషలోనే ఉండి పుష్టిని తుష్టిని చేకూర్చాయి. 'ఆయెను' అంటే అంత స్ఫూర్తి వచ్చేదికాదని మనకు తెలుసు.

### 3.2.2 వర్ణనలు :

"వర్ణనా నిపుణఃకవిః" ఉన్నది లాక్షణికోక్తి. దీనికి చక్కటి ఉదాహరణ మీ పదం. మన ప్రబంధ కవులు అష్టాదశవర్ణనల్లో ప్రధానమైన ఋతువర్ణన పలు రకాలుగా చేసి తమ గొప్పదనాన్ని చాటుకొన్న సంగతి మన కందరికీ తెలిసిందే. ఒకే చిన్న పదంలో ఆరు ఋతువుల్ని వర్ణించి వాళ్ళందర్నీ మించిపోయాడు అన్నమాచార్యుడు.

"కాలము లారునుఁగలిగె నీకు నిదె
బాలకి యందే పైపై నీకు ॥పల్లవి॥

సతి కొప్పువిరులు జలజలరాలిన
లతల వసంతకాలము నీకు
కతగాఁదన మైకాఁకలు చూపిన
అతి వేసవి కాలమప్పుడే నీకు ॥కాలము॥

కాఁగిట చెమటల కడు నిముఁదడిపిన
కాఁగల తొలకరి కాలమది
పేఁగని చూపుల వెన్నెల చల్లిన
రాఁగిన మతికి శరత్కాలంబు ॥కాలము॥

లంచపుఁబులకల లలన నీరతుల
కంచపు హేమంత కాలమది
యెంచఁగ శ్రీవేంకటేశ వలపుసతి
వంచ శిశిరకాల వైభవ మాయ ॥కాలము॥

(శృంగార సంకీర్తనలు – XXVI-88)

ఇంత సంక్షిప్తంగా ఆరు ఋతువుల్ని వర్ణనచేసిన పదకవేగాదు, కావ్యకవి సైతం మరొకరు లేరంటే అన్నమాచార్యుని గొప్పదనం స్పష్టమవుతుంది.

నాయికానాయకుల శృంగార రీతులే ఆరు ఋతువులుగా గోచరించిన రీతి నెంతో హృదయావర్జకంగా వర్ణించాడు అన్నమయ్య. ఇందలి భావుకత అనన్య సామాన్యం; అనితర సాధ్యం.

### 3.2.3 సంకీర్తన కవితా వైభవం :

అన్నమయ్య తన పదరచనలో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం ఇచ్చాడన్న విషయం విద్వద్వరేణ్యులు ఎరిగినదే. అందుకే ఏ పదం గ్రహించినా అన్నమయ్య పదరచనా వైభవం మనకు గోచరిస్తుంది. రసభావాలకు, రాగతాళాలకు సముచితరీతిని చక్కటి పదప్రయోగం చేసి, సహృదయ హృదయాలని అలరించడంలో అతని కతడేసాటి. ఉదాహరణకు శంకరాభరణంలో ఆదితాళంలో రచితమైన అలుమేలుమంగ దివ్యలాస్యాన్ని ఎంతో అద్భుతంగా అన్నమయ్య రచించాడు.

పల్లవి : అలరులు గురియగ_నాడెనదే
అలకల గులుకుల_నలుమేలుమంగ ॥అలరు॥

చ : అరవిరి సొబగుల_నతివలు మెచ్చగ
అరతెర మరుగున_నాడెనదే
వరుసగ పూర్వదు_వాళపు తిరుపుల
హరి గరగింపుచు_నలమేలుమంగ ॥అలరు॥

మట్టపు మలపుల_మట్టెలకెంపుల
తట్టడి నడపుల_దాటెనదే
పెట్టిన వజ్రపు_పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు_నలమేలుమంగ ॥అలరు॥

చిందుల పాటల_సిరిపొల యాటల
అందెల మ్రోతల_నాడెనదే
కందువ తిరువేం_కటపతి మెచ్చగ
అందపు తిరుపుల_నలమేలుమంగ ॥అలరు॥

(XII-24)

ఇందులో అలుమేలుమంగ చేసిన లాస్యం క్రమ పరిణతిలో వర్ణితం. అలకల కులుకులతో, అలరులుకురిసేట్లు అలుమేలుమంగ ఆడినదట. ఇది పల్లవిలో ఎత్తుకున్న విషయం ఈ విషయాన్ని క్రమవికాసంతో చరణాల్లో విస్తరింపచేశాడు అన్నమయ్య. శ్రీ వేంకటేశ్వరుడు కరగి పోయేట్లుగా, అతివలు మెచ్చుకొనేట్లుగా అరవిచ్చిన పూల సొబగులతో అరతెర మరుగున ఆడింది అలమేలుమంగమ్మ ఇది మొదటి చరణంలోని విషయం తాను ధరించిన "వజ్రపు పెండెపు తళుకులు అట్టిటు" ప్రసరింపజేస్తూ మట్టెల మ్రోతలతో, తట్టడినడకలతో ఆడిన సంగతి రెండో చరణంలో స్పష్టం. చివరి చరణంలో శ్రీ వేంకటేశ్వరుడు మెచ్చేట్లుగా చిందుల పాటలతో సిరిపొల యాటలతో, అందెలమోతలతో అందంగా, ఆనందంగా ఆడింది అలమేలుమంగ అని వివరించాడు. ఇందులో ఎలాంటి దూరాన్వయంకాని, అర్థ కాఠిన్యంగాని లేనిరీతిలో ఎంతో సొగసుగా, రసభావ వ్యంజకంగా సరళమైన భాషలో రచించి తరించాడు అన్నమయ్య. ఇందుకు సహృదయ హృదయమేసాక్షి. పూర్వోక్తమయినట్లు అన్నమయ్య పాటల్లో జానపద గేయాల్లోని అనేకరీతులు ఉన్నవని స్పష్టమవుతుంది. ఆరీతుల్లో ఒకటైన 'చాంగుభళా' అనే ఈ క్రింది పాటను పాడి రాగంలో, ఆది తాళంలో, అన్నమయ్యమనోహరంగా రచించాడు.

పల్లవి : చక్కనితల్లికి _ చాంగుభళా తన
చక్కెరమోవికి _ చాంగుభళా ॥చక్కని॥

చ : కులికెడి మురిపెపు _ కుమ్మరింపు తన
సళుపుజూపులకు - చాంగుభళా
పలుకుల సొంపుల _ బతితో గసరెడి
చలములయలుకకు _ చాంగుభళా ॥చక్కని॥

కిన్నెరతోపతి – కెలన నిలుచు తన
చన్నుమెఱుగులకు – చాంగుభళా
ఉన్నతిఁబతిపై – నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి – చాంగుభళా ॥పక్కని॥

జందెపు ముత్యపు – సరులహారముల
చందన గంధికి – చాంగుభళా
విందయి వేంకట – విభుఁబెనచిన తన
సంది వ దలకు – చాంగుభళా ॥పక్కని॥

(XII–101)

ఇందులో కూడా అలుమేలుమంగ సౌందర్యంతో పాటు పలుకులు, చూపులు, చేష్టలు అనన్యసాధారణంగా వర్ణించి తరించాడు అన్నమయ్య. ప్రతిపదం సార్థకమయి ఇందు ప్రయుక్తమయి రసగ్రాహి పాఠకులందరికీ కవిత్వపు విందు చేస్తున్నాయి.

'ఉన్నతి బతిపై నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి – చాంగుభళా' అని చెప్పడంలో ఉన్నతుడైన శ్రీ వేంకటేశ్వరునికి తగినరీతిలో సన్నపు నడుము సౌందర్యంతో అలుమేలుమంగ ఆనందాన్ని కూర్చింది. ఈ మాటలు సార్థకాలయి ఒప్పుతున్నాయి. ఇలాగా మనోజ్ఞపదరచనకు ఎన్ని పదాలైనా ఉదాహరణగా చూపవచ్చు.

### 3. 2. 4 ఉక్తిచమత్కృతి :

అన్నమయ్య పదకవితలో ఉక్తిచమత్కృతి కూడా మనోజ్ఞమై మహదానందాన్ని చేకూరుస్తుంది. నాయిక అయిన పద్మావతీదేవిని చెలికత్తెలు పరాచికాలు ఆడడం ఈ క్రింది పదంలోని ఇతివృత్తం. ఆ మాటల్లో చమత్కారం రసనిష్యంది అయి ఆనందాపాదియై ఉండడం స్పష్టమవుతుంది.

పల్లవి : ఏమొకో చిగురుటధరమున – యెడనెడఁగస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన – పత్రిక కాదు గదా ॥ఏమొకో॥
ఇందులోని చమత్కారం పూర్వోక్తం.

(XII–82)

### 3.2.5 భావ చిత్రాలు :

అన్నమయ్య పదాల్లో చక్కటి పదచిత్రాలు, భావ చిత్రాలు గోచరిస్తాయి. ఈ క్రిందిది దంపుళ్ళ పాట. కన్నెలు తమ మనసులను కుదురులుచేసి అందులో వలపులను నింపి కనుచూపులనే రోకండ్లతో దంపుళ్ళు సాగించారు. అనల్ప కల్పనా శిల్పం సైతం ఇందులో గోచరిస్తుంది.

పల్లవి : సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలాల ॥సువ్వి॥

చర : వనితలు మనసులు కుందెనచేసిటు
వలపులు తగ నించోలాల
కనుచూపులనెడి రోకండ్లను
కన్నెలు దంచెద రోలాల ॥సువ్వి॥

బంగరు చెఱఁగుల-పట్టుపుట్టములు
కొంగులు దూలఁగ-నోలాల
అంగన లందరు-నతివేడుకతో
సంగతి దంచెద రోలాల ॥సువ్వి॥

కురులు దూలఁగ మంచి-గుబ్బచనులపై
సరులు దూలాడగ నోలాల
అరవిరి బాగుల-నతివలు ముద్దులు
కురియుచు దంచెద రోలాల ॥సువ్వి॥

ఘల్లుఘల్లుమనుచు-కంకణరవముల
పల్లవ పాణుల నోలాల
అల్లన నడుముల-అసియాడుచు సతు
లొల్లనె దంచెద రోలాల ॥సువ్వి॥

కప్పుర గంధులు—కమ్మని పువ్వుల
చప్పరములలో—నోలాల
తెప్పలుగా రతిఁదేలుచుఁ గోనే
ఉప్పునిఁ బాడెద రోలాల ॥సువ్వి॥

(XII–352)

ఈ దంపుళ్ళ పాటలు, సువ్వి పాటలు అన్నవి జానపదగేయరీతుల్లోనివే. పల్లవి మొదలు చరణాలన్నింట భావచిత్రాలు దృగ్గోచరమై అమితానందాన్ని చేకూరుస్తున్నాయి. "సువ్వి సువ్వి సువ్వి సువ్వని—సుదతులు దంచెద రోలాల" అన్న పల్లవిలోనే చక్కటి భావచిత్రం మనకగుపిస్తుంది. ఇలాగే ప్రతి చరణంలోను చక్కటి భావచిత్రం గోచరించి సహృదయ హృదయాల్ని అలరిస్తుంది. ఇలాగే శ్రీకృష్ణలీలల్ని వర్ణించే అన్ని పదాల్లోను చక్కటి భావచిత్రాలని చిత్రించి అన్నమయ్య పరవశుడై మనల్ని సైతం పరవశులను చేస్తాడు.

### 3.2.6 అపురూప భావాలు :

అన్నమయ్య పదాల్లో అపురూప భావాల్ని వెల్లడించి, తద్వారా తన ప్రత్యేకత నిలబెట్టుకొన్నాడు. బహుశా ఇతర పదకవులుగాని పద్యకవులుగాని ఈలాంటి ప్రయోగాలకై ప్రయత్నించినట్లు కన్పట్టదు.

ఓ చక్కటి ఉదాహరణ :

"వలపారగించవమ్మ వనిత నీ—
యలుక చిత్తమున కాఁకలి సేసినది ॥పల్లవి॥

అడియాసలనె పక్వమైన సోయగపు—
పెడయలుకల మంచి వేఁడి వేఁడి రుచులు
ఎడసేసి తాలిమి నెడయించి పైపైనె
పొడమిన తమకంపు బోనము వెట్టినది ॥వల॥

ఆ మంచి మధురంపు అధరామృతముల
పేమారుఁదావులు చల్లు వెన్నెల బయటను
కోమలపుఁ దరితీపు కోరికఁ గుమ్మరించి
భామకుపూఁబానుపు పళ్లెము వెట్టినది ॥వల॥

కన్నుల కాంక్షలనెడి కళవళములుదీరె
సన్నపు నవ్వులనెడి చన వగ్గలించెను
అన్నువపు మరపు నీకంత నింతఁ గలిగె నేఁ-
డిన్నియును దిరువేంకటేశుని మన్ననలు ॥వల॥

(12-25)

ఇందులోని "వలపారగించవమ్మ, నీ యలుక చిత్తమున కాఁకలి సేసినది' పక్వమైన సోయగము, మంచి వేడివేడి రుచులు; తమకంబు బోనమువెట్టినది; పూఁభానుపు పళ్లెము వెట్టినది" ఈ మొదలైన ప్రయోగాలు అపూర్వం. అన్నమాచార్యుని ప్రతిభకు చక్కటి నిదర్శనాలు. ఇంకా 'నా చూపు నీకుఁగావలి వెట్టించునా (12-81): లేఁతమాయలు, పూతసిగ్గులు, యీఁతవలపు (12-85); కన్నుల విసిగెడిని (12-88): చిరునవ్వు నిప్పులు దోసిట ముంచేనే (12-90); నిట్టూర్పు టెండలు (12-203); కన్నుల నద్దలింపుచు (12-242); కన్నుల వలపు చిలుకఁగఁ జూడ (12-251); మోహపుటాఁకటికి (12-321); ముంగిటిసిగ్గులు పెద్ద మోపాయెంగదవే (12-556), పాములైనవి నా వలపులు నీపై (24-108); తీగలు సాగెను తీరని వలపులు (24-266); పులియదెప్పుడును పూచిన వలపు (24-266)" ఇలాంటి ప్రయోగాలు అన్నమాచార్యుని పదాలన్నిట కోకొల్లలు.

### 3.2.7 అలంకారాలు :

శబ్దాలంకారాలతోపాటు అర్థాలంకారాలకు అన్నమాచార్యుని పదాల్లో కొదవ లేదు. కొన్ని వేల పదాల్లో ఎక్కడ చూపినా వీటికి ఉదాహరణలు దృశ్యమానమవుతాయి.

3 2.7.1 శబ్దాలంకారాలు :

అనుప్రాసాదులు అనేకం అన్నమాచార్యుని పదాల్లో అన్నింటా మనం చూడగలం వృత్త్యనుప్రాస, యమకం మొదలైన ప్రాసలకన్నింటికి ఉదాహరణలు కోకొల్లలు. అంత్యానుప్రాసకో ఉదాహరణ :

"చూడఁ బిన్నవుగాని నీసుద్దు లెన్నైనాఁగలవు
వేడుక కత్తెకుఁగాని వేసాలింత రావే ॥పల్లవి॥

తేలగిల రమణుని దిష్టించి సారెఁజూచేవు
చేలకొం గాతఁడంటితే సిగ్గుపడేవు
నాలితనాన నెలవి నవ్వుఁగొంతనవ్వేవు
యీలీల తరితీపులు యెన్ని నేర్చుకొంటివే ॥చూడ॥

మునుకొని మగవాని ముందరనూఁబొలసేవు
పెనఁగి పైకొంగుఁదప్పించు కొనేవు
మనసిచ్చి యంతలోనె మంచి మాటలాడేవు
యెనలేని యడియాసలెన్ని నేర్చుకొంటివే ॥చూడ॥

సేవసేసే దానివలె చేరి వద్దనే వుండేవు
శ్రీ వేంకటేశుఁడేలితే జేరదీసేవు
భావించ డాతఁడు నన్నేలె పాదాలకు మొక్కేవు
యీ విధాన నిట్టి బూమెలేమి నేర్చుకొంటివే ॥చూడ॥

(24-17)

అంత్యప్రాస పదమంతటా వాడినా, ఒక తమాషాచేశాడు అన్నమాచార్యుడు. పల్లవి రెండో పాదంలోను, మూడు చరణాల్లోని నాలుగోపాదంలో 'వే' అన్న ప్రాసపాటించడం విశేషం. ఇదొక చమత్కారం. ఇట్లావివరిస్తూ పోతే ఎన్నెన్నో విశేషాంశాలు బయట పడతాయి. ఇవన్నీ అలవోకగా వచ్చినవే తప్ప ప్రయత్న ఫలితాలు కావు

2.7.2 అర్థాలంకారాలు :

ఉపమాద్యర్థాలంకారాలు అన్నమాచార్యుని పదాల్లో సముచిత రీతిని తమకు తామేవచ్చి చేరి పదకవిత కెంతో మనోహరత్వాన్ని ఆపాదించాయి. కొన్ని ఉదాహరణలు ;

ఉపమ :

"వాడే వాఁడే అల్లరివాఁడదివో
నాఁడు నాఁడు యమునా నదిలోన ॥పల్లవి॥

కాంతలు వలయపు కంకణ రవముల
నంతంతఁగోలాట మాడఁగను
చెంతల నడుమను శ్రీరమణుఁడమరె
సంతతపుఁజుక్కలలో చంద్రుని వలెను ॥వాఁడే॥

మగువలు ముఖపద్మములు దిరిగిరా
నగపడి కోలాట మాడఁగను
నిగిడీ నడుమనదె నీలవర్ణుఁడు
నగటుతోఁగమలబంధుని వలెను ॥వాడే॥

(25-342)

రూపకం :

"నీవే యెరుఁగుదువు నానెయ్యపు చోరమణి
భావము లోపలనుండి భ్రమయించ నేటికి ॥పల్లవి॥

చూపుటమ్ము బొమ్మ వింటజోడై నిలిచెఁగాన
చేపట్టి మర్మవేదనఁజేయుఁగాక
కోపుల మంచి తనపుఁగుచమండలము నేఁడు
యేపునఁ బ్రాణాలతోడ యేలాట మెట్లాడినే ॥నీవే॥

తొడగి మబ్బుగవిసి దొడ్డకుటిలపుఁగొప్పు
కడుఁగామాంధకారముఁగప్పఁగాక
నడుమమోముఁజంద్రుఁడు నవ్వువెన్నెల గాయుచు
చిడుముడి నామదిని జీఁకటుల సేసీనే ॥నీవే॥

(25-44)

ఉత్ప్రేక్ష :

"అల్లదె జవ్వని హరియురమున నదె
మెల్లనె యిటు వుపమించరే మీరు ॥పల్లవి॥
ముత్తెపు జిప్పలో ముంచిన కలువలో
వొత్తిలి కనుఁగవ లోకమాటాడరే
గుత్తపుఁ గుండలో కొండలో కుచములో
హత్తి యేర్పడఁగ ననరే మీరు ॥అల్ల॥

(25-375)

అర్థాంతరన్యాసం :

"సరిమోహా లిద్దరికి సాటికిఁ బెనఁగఁజొచ్చె
వరుసతోఁజవ్వనము వావెరుఁగునా ॥పల్లవి॥
పొంచి నీతో నవ్వఁబోతే పోకముడి నాకుజారీ
నించియంతలోఁజెమట నీకుఁగారీని
పంచలఁజెలులివి చూచి పకపక నవ్వేరు
చించుకొని వలపులు సిగ్గెరుఁగునా ॥సరి॥ (25-430)

స్వభావోక్తి :

ఎట్టు నిద్దిరించెనో యీరేతిరెల్లాను
పట్టిచుట్టుక పయ్యద పడఁదీసీ క్రిష్ణుఁడూ ॥పల్లవి॥
కడువేఁకువను లేచి కన్నులు పులుముకొంటా
కడుపక్కలించి యాఁ కలయీ్యానని
కడుపొక చేఁబట్టి నాకొంగొక చేతఁబట్టి
అడిగీనన్నము కృష్ణుఁడప్పుడే చూడరే ॥ఎట్టు॥

పెరుగు దరువ నన్నుఁదిరిగి రాఁజుట్టిచుట్టి
కరుచమాటల ముద్దు గునియుచును
తిరిగి కవ్వపుఁ గొల దిక్కుఁ గాఁగిలించి పట్టి
తరివెన్న వెట్టుమనీ తగునే యీ కృష్ణుడు ॥వెట్టు॥
(22-420)

ఇంకా ఇలాగే తక్కువ అలంకారాలన్నిటికి చక్కటి ఉదాహరణలు ఎన్నైనా చూప వీలవుతుంది.

### 3.2.8 జానపద గేయ రీతులు :

అన్నమాచార్యుల పదాల్లో జానపదాంశం ఎక్కువ. ఈవాగ్గేయకారుడు వాడిన భాష పండితుల కంటే పామరుల కోసమే ననిపిస్తుంది ఆయాపదాల్లో మనం పరిశీలిస్తే. అంతేగాదు. ఆనాటికి జానపదులలో వ్యవహారంలో ఉన్న గేయ రీతుల్ని తన పదాల్లో వాడుకోవడం ఒక విశేషం. వీటి మూలంగా జానపద గేయరీతుల్ని కొంతకుకొంతైన మనం చవిచూసే అవకాశం లభించిందని చెప్పడంలో అత్యుక్తిలేదు. అలాంటి పాటలకు కొన్ని ఉదాహరణలు : గొబ్బిళ్లో (12-98); అల్లో నేరేళ్లో (12-179); జాజర (12-274, 332); సువ్విపాట (12-361); చాంగుభళా (12-107); తందనాన (7-151); కూగూగు (4-56); జోలపాట (అ.చ. పీఠిక పు-61); శోభనం (12-18); దోబూచి (12-227); ఉయ్యాల (12-246, 343); మేలుకొలుపు (12-352); సోబాన (3-132); మంగళం (3-227); చందమామ (42-పు 35); ఎచ్చరిక (అ.చ. పీఠిక పు. 67).

ఈ గేయ రీతులన్నింటిని జానపద గేయాల్లోను, స్త్రీల పాటల్లోను మనం గమనించగలం. కాబట్టి జానపద గేయ రీతుల్ని పామరులను సైతం సంకీర్తన పద్ధతికి మళ్ళించడం కోసం అన్నమాచార్యుడు రచించినట్లు స్పష్టమవుతుంది.

## 3.3 తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు :

తాళ్ళపాక అన్నమాచార్యుని తరువాత అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుని పదాల్లో కవిత్వపు సొగసుల్ని చవిచూడడం సముచితమే. కవిత్వపుహొయలు

తండ్రితో పోటీ పడగలిగినంతగా పెద తిరుమలాచార్యుడు సైతం రచించి ఉండడం విశేషం. కానీ అన్నమాచార్యులు పదరచనలో అందెవేసిన చేయి.

### 3.3.1 భావుకత :

ఈ కింది పదంలో కవికిగల భావుకత గోచరిస్తుంది.

"ఇద్దరి చుట్టరికేలు యెంచి యెంచి పోలుచరే
సుద్దులనే మోహము నూటిపడుఁగాని ॥పల్లవి॥

సతివదనము పూర్ణచంద్రుని బోలుచరే
అతని కన్నులఁగలువ లలరుఁగాని
మితిలేని కురుము కుమ్మెదల బోలుచరే
తతి బతి మోవిఁదేనె దైలువారుఁ గాని ॥ఇద్దరి॥

మించుఁ జన్నులీకెవి తామెరల బోలుచరే
మించి విభుఁదేంట్లు మూఁగుఁగాని
పెంచి యిసుక దిబ్బగాఁ బిఱుఁదు వోలుచరే
ఉంచల నితని మనోహంస వాలుఁగాని ॥ఇద్దరి॥

తక్కక యీకె పాదాలు తాఁబేళ్ళఁ బోలుచరే
నిక్కి తని చెమటేరు నిండుఁగాని
అక్కున నలమేల్మంగ యద్దె శ్రీవేంకటేశుఁడు
చక్కఁదనాలు వోల్చరే సమములేఁగాని ॥ఇద్దరి॥

(23–240)

అతిసామాన్యమైన కవి సమయాలనే వాడుకొన్నా పెద తిరుమలాచార్యుని ఈ పదంలో భావుకత, చమత్కారం, కల్పన అత్యంత మనోజ్ఞంగా ఉన్నాయి.

### 3.3.2 వర్ణన :

తండ్రితో పోటీపడుతూ ఋతుషట్కవర్ణన చేయడంలో పెద తిరుమలాచార్యుని వర్ణనావైదగ్ధ్యం స్పష్టమవుతుంది.

"అంగన విభుఁగూడే దది యేకాలమోకాక
అంగజుని కిది గాల మాయనోకాక ॥పల్లవి॥

చెలియ చెంపలనుండి సేవంతి రేకులే రాలె
అలరు వసంతకాల మాయనోకాక
కలికి కన్నులనుండి కన్నీటి బొట్లు రాలె
మొలమి వాన కాలమిదియోకాక ॥అంగన॥

కాంత విరహపుమేనఁగాకల యెండలుగాసె
యింతలో వేసవికాల మిదియోకాక
వింత పులక మొగము వెన్నెల తేటలుగాసె
యింతట శరత్కాల మిదియోకాక ॥అంగన॥

శ్రీవేంకటేశుఁ జూచి సిగ్గులీ కామిని చిందె
యీవేళ హేమంతకాల మిదియోకాక
భావించి యీతనిఁగూడ వయ్యెద మేనఁగప్పి
ఆవటించు చలికాల మదియోకాక ॥అంగన॥

(23-525)

ఇందులో వర్ణనా పాటవంతోపాటు చమత్కారం, భావుకత మొదలైన కవి కుండవలసిన విశిష్టగుణాలు ఉండడం విశేషం.

### 3.3.3 భావ చిత్రాలు :

పదంలో చరణంలోని ప్రతిపాదం, రెండురెండు పాదాలు, ఒకొక్క చరణం ఒకొక్క పదచిత్రంగా భాసిస్తూ ఉంటాయి. ఈ కింది పదంలో చరణాల్లోని సగం సగం ఒకొక్క భావచిత్రంగా గోచరిస్తుంది.

"తలపులో విరహమో తరుణిపై మోహమో
చెలియ సింగారమో చెప్పరమ్మ చెలులు ॥పల్లవి॥

చిత్తరు పటము మీఁదఁజెలియ నెమ్మోము వ్రాసి
గుత్తపుఁ జందురుఁడని గుండె వగిలె
కొత్తగాఁ గ్రమ్మర నాకె కుచమండలము వ్రాసి
బిత్తరి జక్కవలని ప్రియుడట్టె భ్రమసె ॥తలపు॥

ప్రేమపు రమణి మేటి పిఱుఁదు దానే వ్రాసి
కాముని తేరనుచుఁ గలఁగ బారే
కాముకుఁడై పతి యింతి కరపద్మములు వ్రాసి
ఆమని జలజ బాణాలని చూచి వెఱచె ॥తలపు॥

అనుఁగుఁ దురము వ్రాసి అళులంటా వెఱగందే
ఘనుఁడయిన శ్రీవేంకట విభుఁడు
వనిత నింతా వ్రాసి వనిత కౌఁగటిలోన
తనరూపు వ్రాసుకొని తాపమెల్లా నడఁచే ॥తలపు॥

(23–511)

ఇలాగా అత్యంత మనోహరమై ఈతని పదకవితలు రసజ్ఞుల హృదయాలకు విందుచేస్తున్నాయి.

## 3.4 క్షేత్రయ్య :

అన్నమాచార్యుని తరువాత అంతటి పదకవి క్షేత్రయ్య. పదకవితాశిల్ప పరిరక్షణలో ఇతనిని మించిన వాగ్గేయకారుడు లేడంటే అత్యుక్తిలేదు.

### 3.4.1 మనోజ్ఞ పద రచన :

క్షేత్రయ్య సర్వవిధాలా మనోజ్ఞమైన పదరచనలో ప్రతిభా సంపన్నతను' నైపుణ్యాన్ని చూపించగలదిట్ట. ఇందు కేపదమైనా ఉదాహరణ అవుతుంది

"పల్లవి ; మగువ తనకేళికా-మందిరము వెడలెన్

అ. ప. : వగకాడ మాకంచి-వరద తెల్లవారె ననుచు ॥మగువ॥

విడజారు గొజ్జంగి – విరిదండ జడతోను
కడు చిక్కువడి పెనగు – కంటసరితోను
విడువ కన్నులదేరు – నిదుర మబ్బుతోను
తొడరి పదయుగమున – తడబడెడునడతో ॥మగువ॥

సొగసి సొగయని వలపు – సొంపుజూపులతోను
వగవగల ఘనసార – వాసనలతోను
జిగిమించు కెమ్మోవి – చిగురు కెంపులతోను
సగము కుచముల విదియ – చందురులతోను ॥మగువ॥

తరితీపు సేయు సమ సురత బడలికతోను
జరుత పావడ చెఱగు – జార్వైటతోను
ఇరుగడల కైదండ – లిచ్చు తరుణులతోను
పరమాత్మ ? మువ్వగోపాల తెల్లవారెననుచు ॥మగువ॥
(గి–వ-19)

ఈ పద రచనతో క్షేత్రయ్య అమరుడయ్యాడు. ఇది ఆతని కీర్తికి జయ పతాక ! రసజ్ఞులైనవారి కిందలి రస భావాలు అనుభవైకవేద్యాలు. పల్లవిలోని భావం నాయిక తన కేళికా మందిరం – ఏకాంతమందిరం – వెడలి రావడం. 'తన కేళికా మందిరం" అన్నాడు కవి చాల సాభిప్రాయంగా; అనుపల్లవిలోని భావంతో పదంలోని ప్రధాన భావం పూర్తిగా వ్యక్తమవుతుంది. తక్కిన మూడు చరణాల్లోను నాయిక బాహ్యాంతరాల భావాలన్నీ స్పష్టమవుతాయి. గతరాత్రి ఏకాంతమందిరంలోకి వెళ్ళుతూ జడలోతురుముకొన్న 'గొజ్జంగి విరిదండ' విడ జారిపోతూంది. 'కంటసరి' చిక్కువడి పెనగు లాడుతూంది విశాల నేత్రాల్లో–రాత్రి మేల్కొవడంవల్ల – తెల్లవారినా "నిదురమబ్బు"స్ఫుటంగా కనిపిస్తూంది. దానితో అలసట, అలసటచే తడబడునడకలు. పరవశత్వం పరిపూర్ణత్వం పొందీ పొందని 'వలపు చూపుల సొంపులతోను, కర్పూరపు పరిమళాలతోను', కెమ్మోవి చిగురు కెంపుల' కాంతులతోను, నాయకుడుంచిన నఖక్షతాలతోడి సగం మాత్రమే కనిపించే స్తనద్వయంతోను, నాయిక కేళికా మదిరం వెడలి వచ్చింది. అంతేకాదు. తరితీపులు కలిగించే 'సమసురతం' వల్ల బడలిక కలిగింది. అదిస్పష్టంగా తెలుస్తూంది 'ఆబడలిక

వల్ల జారిపోతున్న పైటను సైతం సవరించుకోవడంలేదు. అందదండలుగా చెలికత్తెలు ఇరుగడలఉన్నారు కాబట్టి సరిపోయింది.' అయ్యో పరమాత్మ ! తెల్లవారి పోయింది. అంటూ నాయిక తన కేళికా మందిరం వెడలివచ్చిందట! ఇది నాయిక పరిపూర్ణ పరవశత్వానికి పరమోదాహరణం. అమ్మవార్ని, అయ్యగార్లను వేంచేపు చేయించాక రాత్రి జరిపిన సురత క్రీడా చిహ్నాలు ఈ పదంలో వర్ణితం ఇది భగవత్పరకమైంది. నాయిక తానేఅయి మధుర భక్తి భావనతో క్షేత్రయ్య అభివర్ణించాడు ఈ అలౌకికమైన శృంగారం అనితర సాధ్యమూ, అనన్యసామాన్యమూ అంటే అబ్బురపడవలసిన పనిలేదు. ఇందులో 'విడజారు, కడుచిక్కువడి పెనగు, నిదురమబ్బు, తడబడెడునడ, సొగసి సొగయని వలపుసొంపు, వగవగల, విదియచందురులు, తరితీపుసేయు," మొదలైనవన్నీ సాభిప్రాయ పదాలు. ఇలాంటి పద ప్రయోగంలో అందెవేసినచేయి క్షేత్రయ్య. ఆయాపదాలు భావస్ఫూర్తితో రసాస్వాదనకు అనుకూలిస్తున్నాయి. రసభావాలు సహృదయ హృదయైక వేద్యం! మరి ఈపదం" వాక్యం రసాత్మకం కావ్యం' 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దఃకావ్యమ్' అన్న సిద్ధాంతాలకు సమంగ సరిపోతుంది. కారణమేమంటే ఒక చిత్రకారుడు మనోజ్ఞవర్ణచిత్రం చిత్రించవచ్చు. శిల్పిశిల్పంగా చెక్కవచ్చు. కాని 'నిదుర కన్నులదేరు నిదుర మబ్బు'ను వగవగల ఘనసార వాసనల'ను వెదజల్లే పద్ధతినీ చిత్రిచడం, చెక్కడం కష్టమే. నిదుర కన్నులదేరు నిదుర మబ్బునైన చిత్రించి, చెక్కవచ్చునేమోగాని, వగవగల ఘనసార వాసన'లను చిత్రంలోను చూపడం సాధ్యమయ్యే పనికాదు. అభినయంలో నర్తకి నిదుర కన్నుల నిదురమబ్బును ప్రకటించవచ్చునేమోగాని 'ఘనసార వాసనల'ను వెదజల్లడం కష్టమే. సంగీతంలో సైతం ఇది సాధించడం సులభంకాదు. కాని భావనైకలోకంలో భావుకుడు వీటన్నింటిని భావించి ఆనందించగలడు. అదే కవినేర్పు, కవితాకళలోని సొగసు. అంగాంగ సౌందర్య వర్ణనగల ప్రబంధ కవుల వర్ణనల కంటే క్షేత్రయ్య మనోజ్ఞవర్ణన ఎన్నోరెట్లు గొప్పది. ఇది చలత్సౌందర్య వర్ణన. ఇందులో పదలాలిత్యం, భావాల సొగసులు ఉన్నాయి. ఇట్లీపదం ఎన్నికోణాల చూచినా క్షేత్రయ్య పదకవితా శిల్పానికి మకుటాయమానమై ఒప్పుతూంది, 'రససిద్ధాఃకవీశ్వరా:' అన్న సూక్తికి నిదర్శనం క్షేత్రయ్య.

మరొక పదంలో చిత్రకారునకు, శిల్పికి, నర్తకికి, సంగీతజ్ఞునకు చేతగానిది కవికి మాత్రమే సాధ్యమైనది, క్షేత్రయ్య తన పదంలో సాధించాడు. ఇది భావనైకవేద్య సరసజ్ఞులను సమ్మోహ మొనరించగలదు.

పల్లవి : "చాలుచాలు ఈ చిన్నెలతో నాదు-సరసకుజేరకుర

అ.ప. : చాలు ! ఈ చిన్నెలు-సాగవు నావద్ద ! మువ్వగోపాల ! భామవద్దికేపోర

||చాలు||

కన్నుల పీడెముతో-కాటుకమోవితో
వెన్నున కీల్జడ-పేటుతోను।
కన్నియ కెంపుల గాజుల నొక్కులతోను
వన్నెకాడ ! నుదుటను-నున్నలత్తుకతోను ||చాలు||

నిదుర మబ్బుతోను-నిండుబడలికతోను
ముద్దియ కలసిన-ముదముతోను
నిద్దంపుచెక్కిళ్ళ-నెలవంకలతోను
వద్దురా వద్దులు-వగకాడ ! నాతోను ||చాలు||

అలదాని కుచముల-నలదినజవ్వాజి
కల యురస్థలమును-నంటి నన్నంటరాకు
బలిమి చేసేదేల-బాల మువ్వగోపాల
అలనాడె గూడిన-చెలిమి పదివేలు ||చాలు||

పై మొదటి చరణంలోని భావాన్ని, ధ్వనిని చిత్రకారుడు చిత్రించలేడు. శిల్పి శిల్పంలో చెక్కలేడు. కవి మాత్రం తన పదునైన మాటలతో చక్కగా చెప్పగలడు. 'కన్నుల పీడెము, కాటుకమోవి' గడుసు ప్రయోగాలు. విన్న వెంటనే ఎంతో అసహజం అనిపిస్తుంది కాని అందులోని వ్యంగ్యం భావిస్తే మనోహరమై మంజులమైన భావం స్ఫురిస్తుంది. 'నాయికా నాయకులు ఒకరినొకరు కళ్ళు ముద్దు గొన్నా'రన్న ధ్వని ఇందులో ఉంది. కళ్ళలో పీడెమూ, మోవిని కాటుక ఉన్నాయి. వెన్నున కీల్జడ ప్రేటు తగిలిన గుర్తుంది కెంపుల గాజుల నొక్కులు శరీరం మీద ఉన్నాయి. లత్తుక నుదుట ఉన్నదట. అంటే నాయకుడు నాయిక పాదాలకు మ్రొక్కాడన్నమాట ! ఇది శృంగారంలో ఒక భాగమేకదా ! "నిద్దుర మబ్బు, నిండుబడలిక, ముద్దియ కలసిన ముదమ్ము, చెక్కిళ్ళపై నెలవంకలు" నాయికా నాయకుల సురత

క్రీడా చిహ్నాలు. నాయిక స్తనద్వయంపై అలదిన జవ్వాజి నాయకుని ఉరోభాగంలో ఉంది ! ఇది పురుష వర్ణన. పైని వర్ణించిన 'మగువ తన కేళికా మందిరము వెడలెన్' అన్న పదంలో స్త్రీ వర్ణన. నిద్దుర మబ్బు, నిండుబడలిక–ఈరెండు పదాల్లోను, అందు స్త్రీపరంగాను, ఇందు పురుషపరంగాను వర్ణించాడు క్షేత్రయ్య. అందు స్త్రీ గనుక 'కుచములపై విదియ చందురులు,' ఇందు పురుషుడు గనుక నిద్దంపు చెక్కిళ్ళపై నెలవంకలు' వర్ణితం. ఇట్లు స్త్రీ పుం సహజమైన రీతిని వర్ణన కొనసాగింది. ఇది మహాపదకవితాశిల్పి అయిన క్షేత్రయ్యకే సాధ్యం. ఇందులోని చమత్కారయుత రచన, వ్యంగ్యం, ఆడంబరంలేని శబ్ద సముచ్చయం, నిసర్గ మనోజ్ఞమైన భావాలు–క్షేత్రయ్య ప్రతిభకు ప్రతీకలు ఇందు మనోజ్ఞమైన భావనాబలంతో కూడిన పదరచనకు కారణం క్షేత్రయ్య నాయిక; ఆనాయిక నాయకుని వర్ణించడం. ఇది ఆతని మధురభక్తిలోని రహస్యం ఇలాంటి క్షేత్రయ్య సాహిత్యం అజరామరం. అతని ప్రతిభ నవనవోన్మేషశాలిని. కేవలం అంగాంగ వర్ణనచేసే ప్రబంధ కవుల కంటె క్షేత్రయ్య గొప్పదనం దీనివల్ల స్పష్టమవుతుంది.

### 3.4.2 వర్ణనా వైదగ్ధ్యం :

ప్రబంధాల్లో వర్ణనా వైదగ్ధ్యానికే ఎక్కువ ప్రాధాన్యం. కవి సందర్భానుసారంగా వర్ణనలుచేసి కావ్యానికి అందంచేకూర్చడం అందులో పరమావశ్యకమైన గుణం. పదకవితలోను అలాంటి వర్ణనలు కోకొల్లలు నాయకుని వర్ణన –

పల్లవి : "ఎంత చక్కనివాడే ! నాసామి వీ–డెంతచక్కనివాడే

అ.ప. : ఇంతి మువ్వగోపాలుడు–సంతతము నామదికి సంతోషముచేసునె ||ఎంత||

మొలక నవ్వులవాడె–ముద్దుమాటలవాడె
తళుకారు చెక్కుటద్దములవాడే
తలిరాకు జిగిదెగడ–దగుమోవి గలవాడె
తెలితమ్మి రేకుకన్నుల నమరువాడే ||ఎంత||

చిరుత ప్రాయమువాడె–చెలువొందు విదియ చం
దురు గేరు నొసలచే–మెరయువాడే
చెరకు విల్తునిగన్న–దొరవలెనున్నాడే
మెరుగు చామనచాయ–మేనమరువాడే ||ఎంత||

పొదలు కెందామరల పెం-పొదవు పదములవాడే
కొదమ సింగపునడుము-కొమరమరువాడే
మదకరి కరముల-మరువుచేతులవాడే
సుదతి : ముద్దుగోపాలుడెంత-సొగసుగలవాడే ॥ఎంత॥

ప్రబంధ కవులను తీసిపోని వ్యక్తి వర్ణనయిది. పైపెచ్చు కేవలం ప్రబంధంలోని అంగాంగ వర్ణనేకాక ఆయా విషయాల కనుగుణంగా వర్ణించడం క్షేత్రయ్యలోని వైశిష్ట్యం.

### 3. 4. 3 భావ చిత్రాలు :

పైని వివరించినట్లు క్షేత్రయ్య పదాలలో చక్కటి వర్ణనలు, సంపూర్ణదృశ్యాలు ఉన్నాయి ఆయాపదాల్లోని చరణాలు మనోజ్ఞమైన దృశ్యాలుగా దృగ్గోచరమవుతాయి. ఇంతేగాక కేవలం కొన్ని శబ్దాల సముదాయంతో ముచ్చటైన ముద్దులొల్కు భావ చిత్రాలు (Imagey) మన నేత్రాలలో ఉపక్కున మెరసి మనోనేత్రాల్లో బొమ్మ కట్టి మనల్ని ఆశ్చర్యంలో ముంచివేస్తాయి. వీటివల్ల క్షేత్రయ్య ప్రతిభా, భావుకతలతోపాటు భాషమీది అసామాన్యమైన అధికారం స్పష్టమవుతుంది. దానితో మహాసాహిత్య స్రష్ట క్షేత్రయ్య అని అవగతమవుతుంది. ఇందుకు చక్కటి ఉదాహరణ. "విడిచిపోలేక నడి-వడి గొన్న నడలతో" (గి-వ-100) అన్నపదంలో నిసర్గమనోజ్ఞ ప్రియం భావుక భావనైక వేద్యదృశ్యాలు ఉన్నాయి. వీటిలో "విడిచి పోలేక నడవడి గొన్న చనుగవ; జీరు కొప్పునను సడలి యాడెడు విరులచేరు; నుదుటిపై నిడిన కస్తూరి చెమటచే కన్నుల మీదికి జారడం, ముంగురులు చెదరి రసునొమలను సొంపు కులకించడం, ఆపే ఎడనెడ నడుముపై పొదలడం, ఎడలేని పిరుదుల భారంతో తడబాటుపడు అడుగుల నడక, కూటముల ఎడబాటు పైటకడుతొడల జీరాడుతూన్నతీరు"-అన్న భావచిత్రాలు క్షేత్రయ్యవంటి భావుకునకే ఊహించశక్యం. ఇది మహాశిల్పిలక్షణం. ఒక నాయిక నాయకుని ఒంటిమీద "గంధముచాటున ఘనమైన జడవేటు" "వల్లె కందియున్న సొగసు" (గి-స్వీ-190)ను కనుగొన్నదట. ఈ భావ చిత్రమెంత ప్రతిభావంతుని భావనాబలానికి నిదర్శన మవుతుందో సహృదయ హృదయులు గ్రహించగలరు. ఇవన్నీ చక్కని భావ చిత్రాలు. వీటిని భావించిన

కొలది అనంతముఖాల భావాలుప్పతిల్లి ఆనంద కందమవుతాయనడంలో సందేహం లేదు. పైపద చిత్రాలన్నిట ధ్వని మస్తుగాఉంది. వ్యంగ్య ప్రేరణికిని చక్కటి ఉదాహరణలు.

### 3.4.4 కృతి చమత్కృతి :

కల్పనానైపుణ్యం, చమత్కారమూ మధుర మంజుల కవిత్వానికి తోడైతే మరింత శోభాయమానంగా ఉండి సహృదయులను ఆకట్టుకోగలుగుతుంది; పరవశింప జేస్తుంది. క్షేత్రయ్య కవితలో ప్రతిపదంలో ఏదో కొత్తదనం, ఏదో చమత్కృతి లేకుండా ఉండదనే చెప్పాలి. చేమకూర వేంకటకవి-"తా రస పుష్టిమై ప్రతి పదంబున జాతియువార్తయున్ జమత్కారము నర్థగౌరవముఁగల్గ ననేక కృతుల్ ప్రసన్నగంభీరగతిన్ రచించి మహిమించిన...." (విజయ విలాసం-అవతారిక ప-31) అని చెప్పినట్లు రఘునాథుడు, అతని ఆస్థానం ప్రవేశించిన క్షేత్రయ్యలో సైతం జాతివార్తా చమత్కారములుండడం సమంజసమేకదా? దూతిక నాయికా విరహాన్ని నాయకునితో చెప్పి చమత్కరిస్తూంది.

పల్లవి : ఏ తీరున రమణిని గెలిచి నీ-వెట్లు రూపొందువో

అ.ప. : చూతాము రారా ! మదన నీ-చేతిబలిమి మాచెలియబలిమి ॥ఏతీరున॥

రాతిరనే యేనుగనెక్కి-రాకాచంద్రుడు గొడుగుగాను
లేత తెమ్మెర మొదలైన బలముల-చేత గెలిచెదనంటివా
పోతుటేనుగు కుంభములే-పొలతి గుబ్బలు, మోము చంద్రుడు
నాతిప్రాణములే చలువ తెమ్మెర-జాతివారిలో పగలుగలవా ॥ఏతీరున॥

జంట విరదమ్మియెద-నంట గుమ్మెదనంటివా ?
దంట వే చెలికేలుదమ్మి-తమ్మియొక్క టే సుమ్మీ ।
తుంట విల్లొక్క టినీది-తునియని విండ్లు చెలియకన్బొమలు
ఇంట గెలిచిరచ్చ గెలువవలెనను-నెన్నికలేక పూనితివి ॥ఏతీరున॥

అంచలు మాచెలినిజూచి–అడుగుపెట్టవెంచి చూడ
పంచ వన్నెల చిలుక–పలుకులే చాన పలుకులు
పంచ బాణములునీదు–పడతి చూపులే తూపులనగ
నెంచ శక్యముగాదా మీద–నేలుకొన్నాడు మువ్వగోపాలుడు ॥ఏతీరున॥

(గి వేం.–స్వీ–82) ఇందులోని కల్పనానైపుణ్యం, చమత్కారం మనోజ్ఞం, రసజ్ఞ హృదయైకవేద్యం. ఇది ఏ ప్రబంధ వర్ణనలకుగాని, చమత్కృతికిగాని తీసిపోదు. పైగా ప్రబంధకవులు పద్యంలో సాధించినదాన్ని క్షేత్రయ్య పదంలో సాధించాడు. ఇదే అతని వైశిష్ట్యం. కార్యకారణ సంబంధాల్ని కని సాధించాడు. పైపెచ్చు పేటివల్లనైతే నాయికను జయించ దలచాడో అవే నాయికలో ఉన్నాయంటూ 'జాతి వారిలో పగలు గలవా ?' అంటూ అర్థాంతరన్యాసాలంకారంలో ప్రశ్నిస్తూంది దూతిక. ఇట్లే తక్కిన చరణాలూను.

ఈ క్రింది పదంలో నాయికానాయకుల పరిహాసాత్మకమైన మాటల్లోని చమత్కారం చాల సరసంగా ఉంది.

పల్లవి : మంచిదానవే చెలియ ! మాటలకును

అ.ప : పంచనగల సఖియని–వార్త చెప్పుకోవస్తి ॥మంచి॥

చెలియ ! నీ నెమ్మోము–చంద్రుడందురుగాని–
చంద్రుడైతే–చంద్రకళగావా ?
సరసుడవు నీవు నేను-సరసములాడంగ
కళవేళన కళవచ్చు చంద్రకళగానా ? ॥మంచి॥

కమ్మని నీముంగురులు–తుమ్మెదలందురుగాని, యేవే ?
తుమ్మెదలైతే ఎగురవా ?
కామాంధకారమున – గతులు రేయిపగలు
తామసపు రతివేళ తానెగసియాడున్ ॥మంచి॥

సకియ నీ చన్గవలు – సంగటి కొండలందురుగాని
కొండలై తేకోట – తలుపులేవే ?
ఇక నేనేమిసేయుదు ? మువ్వగోపాల ?
ఇదిగో పాలిండ్లపై తర్కించవ రసికమునికి తలుపుగాద'    ॥మంచి॥
(గి–స–63)

ఇందులో నాయికానాయకుల ఉక్తి ప్రత్యుక్తులతో కూడిన చమత్కారం ఎంతో సహృదయ రంజకంగా ఉంది.

### 3. 4. 5 సున్నితమైన భావ ప్రకటనా చణత్వం :

ఇల్లే సున్నితమైన భావాల్ని ప్రకటించడంలో గూడ అందెవేసిన చేయి క్షేత్రయ్య. దానివల్ల భాషమీద ఎంతటి అధికారం క్షేత్రయ్య కలిగి ఉన్నాడో, ఆయాభావాల కలాంటి భాషనెలా ప్రయోగించాడో మన కవగతమై ఆతని వైశిష్ట్యం గోచరిస్తుంది. విరహోత్కంఠిత అయిన ఒక నాయిక "తలపువానిమీద నాయె తల వాకిలె ఇల్లాయె" (గి–ప–33) అనివాపోతుంది. 'తలవాకిలె ఇల్లాయె అనడం ఎంత భావగర్భితమో, ఎంతటి మనోజ్ఞమైన భావనో, భావుకుల భావనె కవేద్యం? ఇల్లే మరొక నాయిక "ఇంతలో నీ వీడకు రాకుంటే, కన్నీరు కావేరి కాలువ సుమీ, వనజాక్షి ? నీ వీడకువచ్చేదాక, తలవాకిలే యిల్లుసుమీ". కన్నీరు కావేరి కాలువ సుమీ, తలవాకిలే యిల్లు సుమీ అనడం ఎంత సున్నిత భావ స్ఫోరకమో వ్యక్తమవుతుంది. "ఉల్లమలరగ తన యెదపైనను, మల్లెపూవలె నుంచుకొన్న వల్లభుడు (గి–ప–18) రాడేయని వాపోతుంది ఇంకొక నాయిక. ఈ సున్నిత భావాల వ్యక్తీకరణలో నవ్యతగోచరిస్తుంది. అలవిలుడు "విరి శరము బూని కులుకు గుబ్బలనడుమ గురిజూచుచున్నాడే" (గి–ప–83) అని విరహ బాధను తెలుపుతుంది వేరొకవిరహోత్కంఠిత. "కొప్పునను సడలియాడెడు విరులచేరు, నుదుటిపై నిడిన కస్తూరి చెమట జారుకన్నులును, ఎడలేని పిరుదులవి తడబాటు నడుగులను, ఎడబాటుపైట కడుతొడల జారెడుతీరు" (గి–ప–100) ఇవన్నీ ఎంతో సున్నితమై నిసర్గమనోజ్ఞమై, సహృదయ రంజకమైనవ్యమై ఒప్పారు ప్రయోగాలేగాని వేరుగాదు. ఈ మనోజ్ఞభావాల మహత్వమెరిగి ప్రదర్శించిన క్షేత్రయ్య భావనాపటిమ, భాషపైగల అధికారం అనన్య సామాన్యమూ అనితరసాధ్యమూను. వీటన్నిట ఏదో

ఒక నవ్యత, ఏదో ఒక విశిష్టత, ఏదో ఒక రమ్యత, ఏదో ఒక సొగసు, ఏదో ఒక ప్రత్యేకత లేకుండ క్షేత్రయ్య ప్రయోగించడు. నిజంగా ఇలాంటి సున్నిత భావ ప్రకటనాచణమైన క్షేత్రయ్య కవిత అజరామరం. క్షేత్రయ్య కవిసత్తముడు. పైగా సంస్కృత సమాసఘటాయిష్ఠ రచనగాని, శబ్దాడంబరంగాని లేక చక్కని చిక్కని తేట తెలుగుమాటలతో కూర్చగలిగిన ఆంధ్ర భాషా మర్మజ్ఞుడు క్షేత్రయ్య.

### 3.4.6 అల్పాక్షరాలతో అనల్పార్థరచనా సామర్థ్యం :

సున్నితమైన భావాల్ని ప్రకటించగల నైపుణ్యంతోపాటు క్షేత్రయ్యలో అల్పాక్షరాలతో అనల్పార్థంచన చేయగల సామర్థ్యం సైతముంది. వ్యర్థపద ప్రయోగం లేక ప్రయోగించిన ప్రతిశబ్దమూ అర్థవంతమై ఉండడం ఈతని పదకవితలోని మహత్తరశక్తి ద్విపద నాదరించి కవిత చెప్పిన పాల్కురికి సోమ నాథుడు "అల్పాక్షరముల ననల్పార్థ రచన కల్పించుటయెకాదె కవి వివేకంబు" అని ప్రతినబట్టినా భక్త్యావేశంలో సంస్కృత ఘటాయిష్ఠంగాను, అనల్పశబ్దాలతోను రచనచేసి, తన ప్రతినను నిలబెట్టుకోలేకపోయాడు. కాని తక్కువ పదాలతో, అనంతమైన అర్థాల్ని స్ఫురింపజేస్తూ వ్యర్థ పదప్రయోగరహితంగా, శబ్దాడంబరం లేకుండా, చక్కని కావ్యశిల్పంతో మనోహర రచన తెలుగులో చేయగలిగిన వాగ్మి, మహాకావ్యశిల్పి, శబ్ద మర్మజ్ఞుడు అయిన తిక్కన సోమయాజి క్షేత్రయ్య తప్ప ఆతనితో ఈ విషయంలో తులతూగగల మరొక్క కవి లేదంటే అత్యుక్తి కాదు. క్షేత్రయ్య పదాలన్నిట అల్పాక్షరాలతో అనల్పార్థరచనచేసిన విధం మనం చూడవచ్చు. ఇతఃపూర్వమే ఉదాహృతమైన "ముగువ తన కేళికా మందిరము వెడలెన్" (గి-వ-19) అన్న పదం ఇందుకు చక్కటి ఉదాహరణ. వ్యర్థపదాలు లేక, ప్రతిపదమూ అర్థవంతమైన పదమిది ప్రతిశబ్దం అమోఘమైన అర్థస్ఫూర్తి కలది. తక్కువగా చెప్పి, అనంతమైన భావాన్ని భావకునికే వదలిన మహాకవి క్షేత్రయ్య. మువ్వగోపాలుని వగలెల్ల తెలిసిన పరకీయ, ఖండిత అయిన నాయిక అంటున్న మాటలు –

పల్లవి : తెలియవచ్చెనురా ! నీవగలెల్ల–దృష్టితాకీనిరా

అ.ప. : వెలయు మువ్వగోపాల ! దానింట నుండి–

విచ్చేయు హొయలు చూచితె ఇపుడు ॥తెలియ॥

చక్కెరకెమ్మోవి వచ్చి నీ పలుకెంపు-
సామి ! నీ కన్నుల నిద్దురమంపు
చెక్కుటద్దములపై గ్రొన్నెలగుంపు-
దక్కిన నలినాక్ష ! దానిపై సొంపు ॥తెలియ॥

కలుకు సిబ్బెపు గబ్బి గుబ్బలపోటు-
గుత్తపు వన్నెల కీలు జడవేటు
అలదాని పసుపు దుప్పటివల్లెవాటు-
చెలువునడల మించిన తడబాటు ॥తెలియ॥

సందిట బంగారు గాజులదద్దు-
సకియ దిద్దిన నుదుటి తిలకము ముద్దు
అందకాడ ! మువ్వగోపాల ! యీప్రొద్దు
యిందువచ్చి నన్నేలిన పద్దు ॥తెలియ॥

(గి-ప-44)

ఈ పదంలో వ్యర్థపదం కావాలన్నా దొరకదు. అన్నీ భావగర్భితమైన పదాలు. ఆయా భావాలు అనంతం. పైగా ప్రయోగించిన శబ్దసముదాయం చాల తక్కువ. అయినా నాయకుని రూపురేఖలు మనకు కన్నులకు గట్టినట్లు, రస భావాల్ని కవి వ్యంజితం చేస్తున్నాడు. ఆయా భావాలు తరచితరచి చూచిన కొలది మనోజ్ఞమై, కడుంగడు ఆనందాన్ని సంతరిస్తున్నాయి. ఇదే అల్పాక్షరాలతో అన ల్పార్థ రచనాసామర్థ్యం అంటే !

3.4.7 అలంకారాలు :

ప్రౌఢ ప్రబంధాల్లోలాగానే క్షేత్రయ్య తన పదకవితలో చక్కగా, అతికి నట్లు, సందర్భాను సారంగా అలంకారాలు కూర్చి, తన కవితా పటిమను ప్రకటించు కొన్నాడు. అంత్యాను ప్రాసాదాది శబ్దాలంకారాలు, ఉపమాది అర్థాలంకారాలు ఇతని పదాల్లో ఎన్నో ఉన్నాయి. క్షేత్రయ్య కవితా కన్యకివి చక్కని అలంకారాలు.

3.4.7.1 శబ్దాలంకారాలు :

శబ్దాలంకారాల్లో అంత్యానుప్రాసను చాలచక్కగా వాడుకొన్నాడు క్షేత్రయ్య. ఈ క్రింది పదంలో పల్లవి, అనుపల్లవి, మూడు చరణాల్లో ప్రతి ఖండంలోను ఈ అంత్యానుప్రాసను పాటించి పదానికి శ్రుతిశుభగత్వం చేకూర్చి చదవడానికి, దానికంటే అధికంగా అభినయించడానికి సౌలభ్యం చేకూర్చిన మహాకవి క్షేత్రయ్య.

పల్లవి : ఇంటికి రానిచ్చేనా ఈ మేనితో-ఇంతి ! వాని దలిచేనా

అ.ప. : గొంటుకాడు మువ్వ-గోపాలరాయడు
తంటాలుచేసితే-దండించక విడిచేనా ॥ఇంటికి॥

ఇతనికి వెరచినే-నిక లంచమిచ్చేనా
ఇన్నాళ్ళవలె ననుస-రించేనా
బతిమాలి నే రాయ-బారమంపించేనా
పతి యని మునుపటి-భక్తి దయలుంచేనా ॥ఇంటికి॥

ప్రేమదలచి తన-మోమైన జూచేనా
ఏమి చెప్పిన నిజ-మెంచినా
రామా ! అయినదెగాని-రచ్చకువెరచేనా
ఆమాట సభలోనే-ననక విడిచేనా ॥ఇంటికి॥

ఎనసిన మొకమాట-మెంతైన జూచేనా
ఎంతో వేడిన మన-సిచ్చేనా
వనిత ! పట్టినపట్టు-వట్టిదనిపించేనా
పనిబూని 'మువ్వగోపాలా' ! యని పిలిచేనా ॥ఇంటికి॥

(గి-స్వీ-5)

ఇందులో అంత్యానుప్రాసమనోహరంగా పాటించబడింది. ఇది ఆయాపదాల్లో చరణాల్లోను. చరణాల ఖండార్థాల్లోను, పాటించడం ఎక్కడ బడితే అక్కడ చూడ వచ్చు. ఇంక లాటాను ప్రాసకు-"మానినిరో ! చేర రమ్మని పిలువని మాలిమేటి మాలిమే ?" (గి-స్వీ-135) — పదం చక్కటి ఉదాహరణ. ముక్త పద గ్రస్తానికి—

ఆ:యగలిగితేరా–రాగలిగితే తే
తే లేకుంటే పో–పో లేకుంటే (గి–సా–27)

అన్న పదం ఉదాహరించవచ్చు. ఇట్లే వృత్త్యనుప్రాస, ఛేకాను ప్రాసాదు లకు సైతం ఎన్నైనా ఉదాహరించవచ్చు.

3.4.7.2 అర్థాలంకారాలు :

ఇంతకంటే అర్థాలంకారాల ప్రయోగం సందర్భశుద్ధిగా చేసినప్పుడు కవి ప్రతిభకు చక్కటి నిదర్శన మవుతుంది. క్షేత్రయ్యలో ఉపమాద్యలంకారాలు కోకొల్లలు.

ఉపమ : అడవిలో ప్రొద్దుగూక – అంధకారమైన వానలో
తడిసి పోవగానని – దానివలెనున్న తనకు॥ (గి–స్వీ–124).

ఇందలి ఔపమ్యమెంత హృదయంగమమో రసజ్ఞుల హృదయాలే సాక్షి. ఇట్లే "కాటుక కన్నులనీరు–ఘనమైన నీలములవలెనే", పై టతడిసి రవికెదూసి గుబ్బలపై నిండెనే" (గి–స్వీ–126). ఈ ఉపమాలంకార ప్రయోగంలో క్షేత్రయ్య ప్రౌఢకవులతో ఉపమించగలదనడంలో సందేహంలేదు. ఇట్లే లక్కవంటి మనసు రాయె' (గి–స్వీ–125) అన్నది చక్కటి ఉపమాలంకారము ఇంకా ఇలాంటివి అనేకం.

రూపకం :

ఇట్లే రూపకాలంకారంసైతం ప్రయుక్తం. "ఏ తీరున రమణిని గెలిచినీ–వెల్లు రూపొదువో" (గి–స్వీ–82) అన్నపదం ఇంతకుముందే ఉదాహరించబడింది. ఈ పదమంతటా రూప కాలంకారానికి ఉదాహరణలుగలవు. ఇంకా "మోహాంబు ధిలోమునిగి యెట్లోట్చుదాన" (గి–స్వీ–1 [illegible]), అన్నవీ, ఇంతకంటె మనోజ్ఞమైనది "విరహసాగరములో దరిదాపులేనపుడు నీయురమను తెప్పపైనుంచి వెరపు తీర్చినం దుకా, (గి–స్వీ–78) అన్నదీ కలవు.

ఇలాగే తక్కిన అలంకారాల్ని క్షేత్రయ్య ప్రయోగించి తన ప్రతిభాసై పుణ్యాన్ని, వ్యుత్పన్నతను ప్రకటించడం మన కవగతమవుతుంది.

3. 5 కంచెర్ల గోపన్న (రామదాసు) :

రామదాసు కీర్తనల్లో కవితా వైభవం కంటె భక్తి, ఆర్తి, మొర, పరివేదన, శరణాగతి మొదలైన వాటికే ప్రాధాన్యం. ఈ చిత్తశుద్ధితో కూడిన వీటిమూలంగా కీర్తన రచన తనకుతానే సహజసుందరంగా గోచరించి, రామదాసు హృదయావిష్కరణ గావించిందని చెప్పవచ్చు.

3. 5 1 రమణీయ రచన :

రమణీయకీర్తన రచన రామదాసులో మనం చూడగలం అనంతానందాన్ని పొందగలం. తానే యశోద అయి చిలిపి బాలకృష్ణుని లాలించిన తీరును పరిశీలిస్తే ఆతనిభక్తి ప్రవత్తి స్పష్టమవుతుంది

పల్లవి ; బూచివాని పిలువబోదునా ఓ గోపాలకృష్ణా ॥బూచి॥

అ ప : బూగివాని పిలువబోతె వద్దువద్దు వద్దనేవు

చ : మత్తగజముతెచ్చి చిన్నతిత్తిలో నమర్చి నాదు
నెత్తి మీదబెట్టి నన్ను ఎత్తుకోమనేవు కృష్ణా ॥బూచి॥

అల్లమూరుగాయ పెరుగు అన్నమారగించ మంటె
తల్లి వెన్నపాలు నాకు తెమ్ముతెమ్ము తెమ్మనేవు ॥బూచి॥

రోటగట్టి వేతు కృష్ణా రామదాస వరదా నీవు
మాటిమాటికిట్లు నన్ను మారాము చేసితేను ॥బూచి॥

(కీ. 105)

ప్రతితల్లి తనఅల్లరి పిల్లవాణ్ణి సముదాయించి నట్లే రామదాసు యశోదామాత అయి లాలించినట్లు అవగత మవుతుంది. భావానికి తగిన భాష మనోహరం. చిలిపి కృష్ణుని మాటలు "వద్దు వద్దు వద్దనేవు, తెమ్ము తెమ్ము తెమ్మనేవు" సహజ సుందరం. అలాగే 'ఆచిచ్చి జోలపాడి', అయి ఊచిన నిదురపోవు" నిజంగానే జోలపాటలాఉంది; హాయిగాఉంది. పాఠకులందరికీ రామదాసుపాట జోలపాట ఇది

ఇలాగే మరోకీర్తనలో రామదాసు మొర మనకు వినిపిస్తుంది. ఇది ప్రసిద్ధ కీర్తన ;

పల్లవి : నన్ను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లి ॥నను॥

చ : నన్ను బ్రోవమని చెప్పవే నారీశిరోమణి
జనకుని కూతుర జనని జానకమ్మ ॥నను॥

ప్రక్కనచేరుక చెక్కిలి నొక్కుచు
చక్కని మరుకేళి సొక్కుచుండెడివేళ ॥నను॥

ఏకాంతరంగుడు శ్రీకాంత నినుగూడి
ఏకాంతమున నేకశయ్యనున్నవేళ ॥నను॥

ఆద్రిజ వినుతుడు భద్రగిరీశుడు
నిద్రమేల్కొనువేళ నెలతరో బోధించి ॥నను॥

(కీ. 112)

రాముడు తన్ననుగ్రహించలేదని, తల్లీ సీతమ్మా నీవైన ఆ రామునకు నన్ను బ్రోవుమని చెప్పుమనీ, ఏకాంతంలో ఏకశయ్యనున్నప్పుడు చెప్పుమనీ సీతా మాతను ప్రార్థిస్తున్నాడు. మొరపెట్టుకొంటున్నాడు. కీర్తన రామదాసు మొరను, ఆర్తిని చక్కగా స్పష్టీకరిస్తుంది.

3. 5. 2 వర్ణనలు :

రామదాసు కీర్తనల్లో అక్కడక్కడా చక్కటి మనోహరమైన వర్ణనలు సైతం ఉండడం గమనించగలం. అవి మనమనస్సుకు హత్తుకొని ఆనందాతిశాయి అవుతాయి.

"మాయింటను జానకీపతి పూజయను పండువాయెను, సకలేంద్రియములార సమయముగాదు, సేయకయిప్పుడుండురే మీరు" అంటూ శ్రీరామచంద్రుని కల్యాణ రూపం వర్ణించి తరించాడు.

"తళుకు తళుకున ముద్దు కులుకు జిగి
పంచవన్నె నిలువుటంగి తొడిగి నే

నలరు ఘుమఘుమ పరిమళించే పన
మాలిక హారములు మెడను వేసి
లలిత కౌస్తుభ దివ్యరత్నాల చౌ
క్కపు తాళి మెడలో వేసియు
అలదయాపర విగ్రహానకు భజకీర్తుల
నిడి యని నపరించు వేళమీరు ||నర||

పదియారువన్నె బంగరు శాలువదట్టి
గట్టి విదియచంద్రుని గేరు
నుదుట కస్తూరి నామమును దిద్ది
తామరలవంటి మృదు పదములందు
కడిసి మువ్వలు పాదరసములందెలు ఘల్లు
ఘల్లుమన ఝాంకముగా నుంచియు
కదిసి వడ్డాణములు మెబలనూలు ఘంటలు
హరికి అలంకరించు వేళమీరు ||నర||

(కీ 86)

ఇది పెద్దకీర్తన. పల్లవి, చరణాలు చాలపెద్దవి. ఇందులో మనోజ్ఞమైన శ్రీరామచంద్రుని స్వరూపవర్ణన మనకన్నులకు కట్టినట్లుంది మన ఆనందానికి ఆటపట్టయింది.

ఇలాగే 'కలియుగ వైకుంఠమైన భద్రాచలాన్ని' మనసారా, తనివితీరా రామదాసు వర్ణించాడు :

"కాంచన సౌధములు మాణికములుమించిన దూలములు
వజ్రములు చెక్కించిన స్తంభములు
పగడములని భ్రమియించు ద్వారములు
అంచయాన మరియొంచ వేరుగదె
మంచి పచ్చలు కూర్చిన వాకిళ్ళు ||కలి||

బంగారు గోపురములు దేవళముల వెలుగు మాణిక్యములు
భేరి మృదంగాది నాదములు
భాగవతుల సంకీర్తనలు
రంగైన కల్యాణ మండపములు
శృంగారమేమని చెలియ విన్నవింతు ॥కలి॥

(కీ. 39)

ఇందులోని వర్ణన సహృదయ రంజకమై ఒప్పుతూంది.

### 3. 5. 3 భావచిత్రాలు :

రామదాసు కీర్తనల్లో చక్కటి శబ్ద, పద, భావచిత్రాలు ఎన్నో ఉన్నాయి. శబ్ద పద చిత్రాలకు;

రాతినాతిగ చేసినావు అజామిళునిపై కృప గలిగి ని
ర్హేతుకంబుగ బ్రోచితివి ప్రహ్లాదు గాచితివట సభను ద్రౌ
పతికి జీరలు నొసగితివి సుందరైన నాపై దయను చూపు॥

(కీ. 68)

ఇలాగే ఒక్కొక్క చరణం ఒక్కొక్క భావచిత్రంగా భాసించే రచన :

"ద్రౌణి బాణ జ్వాల దాకిన బాలునికి
ప్రాణమిచ్చిన జగత్ప్రాణ రక్షకుడు ॥ఏడ॥

పాంచాలి సభలోన భంగమొందిననాడు
వంచనలేకను వలువలిచ్చిన తండ్రి ॥ఏడ॥

దుర్వాసుడుగ్రమున ధర్మసుతుని జూడ
నిర్వహించిన నవనీత చోరకుడు ॥ఏడ॥

(కీ. 99)

ఇలాంటి వెన్నైనా ఉదాహరించవచ్చు.

### 3.5.4 అలంకారాలు :

అలంకారాలు సైతం రామదాసు కీర్తనల్లో ఎడనెడ కుదురుకొని కీర్తనలోని భావాన్ని మనోహరం చేస్తున్నాయి.

3.5.4.1 శబ్దాలంకారాలు :

ప్రాసాంత్యప్రాసానుప్రాసలకు కొదవలేదు. వృత్త్యనుప్రాసకో చక్కటి ఉదాహరణ :

పల్లవి : రామ దైవశిఖామణి సురరాజమహోజ్వల భూమణి ॥రామ॥

అ.ప : తామరసాక్షి సుధీమణి భవ్యతారక భక్తచింతామణి ॥రామ॥

చ : నాదే మిమ్మ వేడికొంటిగా శరణాగత బిరుదని వింటిగా
వేడుకై మిముపొగడగంటిగా నన్నుదిగవిడనాడ వద్దంటిగా ॥రామ॥
చింతసేయగానేమి లేదుగా ముందుచేసిన గతి తప్పబోదుగా
ఇంతకు మిక్కిలి రాబోదుగా నే యితరుల గొలిచేదిలేదుగా ॥రామ॥
(కీ. 1)

ఇలాంటి వెన్నో ఉన్నాయి.

3.5.4.2 అర్థాలంకారాలు :

శబ్దాలంకారాలతోపాటు అర్థాలంకారాలు సైతం అత్యంత మనోహరంగా ఈ కీర్తనల్లో ఉన్నాయి

రూపకం :

పల్లవి : రామజోగి మందు కొనరే ఓ జనులారా ॥రామ॥
అ ప : రామజోగి మందుకొని-ప్రేమతో భజియించుడన్న
కామక్రోధలోభమోహ-ఘనమైన రోగాలకు మందు ॥రామ॥
ఉపమ : చ. కాటుక కొండలవంటి-కర్మములెడబాపే మందు
సాటిలేని జగమునందు-స్వామి రామజోగి మందు ॥రామ॥
(కీ-64)

నిందాస్తుతి :

"పరమద్రోహిని నిన్ను పతితపావనుడని
ప్రహ్లాదుడెటువలె తలచెనో

పరమపావన సతి నడవికే పంపిన
పాపకర్మునకెటు దయవచ్చునో" ॥రామ॥

"ఎన్నగ శబరి యెంగిలి భక్షించిన
తిన్నని నడత లేనివాడవు
నిన్ను నమ్మరాదు నిన్ను దైవమన
రాదు నిజము నామాట రామా" (కీ-111)

ఇంకా ఇతర అలంకారాలు సైతం ప్రయుక్తమయ్యాయి.

ఇలాగే రామదాసు కీర్తనల్లోను కమనీయ కవితా వైభవం రమణీయ రచనతో నిమిడి ఉండడం స్పష్టమవుతుంది.

### 3.6 సారంగపాణి పదాల్లోని కవిత :

సారంగపాణి పదాల్లోను మనోజ్ఞమైన కవితాశిల్పం సహృదయ రంజకమై ఒప్పుతూంది.

#### 3.6.1 పదప్రయోగ దక్షత ;

పదప్రయోగంలో సమర్థుడు సారంగపాణి. ప్రతిపద సార్థక్యం సారంగపాణి పదాల్లో స్పష్టంగా గోచరిస్తుంది. అంటే తెలుగు భాషపై చక్కటి అధికారం సారంగపాణికి కలదన్న విషయం స్పష్టం. అది అన్ని పదాల్లోను మనం చూడవచ్చు. ఒక ఉదాహరణ :

పల్లవి : రమ్మనే సామిని రమ్మనే

అనుప : కొమ్మ నీవే నామనవిగా
కొమ్మని వేణుగోపాలుని ॥రమ్మనే॥

మచ్చుమీద నేనుండగ-
మచ్చుమీద జల్లినవాని ॥రమ్మనే॥

ఇందుకాక కోర్వదంటె-
ఇందుకా కనరిందీవేళ" ॥రమ్మనే॥

అల నీమాటతో రేయెల్ల
అలసి మాటాడకున్నాడు ||రమ్మనే||

కూడిన సామిని నీతో
కూడిన నాపై దయయుంచి ||రమ్మనే||
(ప-23)

ఈ పదంలో పద ప్రయోగ దక్షత స్పష్టమవుతుంది. పదమాచిన్నది. భావము నంతం. పరిమిత పదాలతో ఈ పదరచనచే అల్పాక్షరాలతో అనల్పార్థ రచనని సాధించాడు సారగంపాణి.

3. 6. 2 శ్లేష వైభవం :

ఈ శ్లేషని తనపదాల్లో సారంగపాణి రెండువిధాలుగా సాధించినట్లు తెలుస్తుంది. ఆయాపదాలకు స్వతస్సిద్ధంగా రెండర్థాలుండడం వల్ల శ్లేషను సాధించడం మొదటిది. పదాల విరుపులవల్ల గలిగే అర్థద్వయ స్ఫురణ చేత కలిగే శ్లేష రెండోది. పదాల విరుపువల్ల కలిగే శ్లేష కుదాహరణ.

పల్లవి : పడతి నే స్తముపేణుగో - పాలమాను

అను పల్లవి : తడబడక నీనికను - దానిచింతమాను ||పడతి||

పంతమున అటు దిక్కు పదినాళ్ళ పోకమాను
యింతికిచ్చేవు సుమీ ఈతమాను
సుంతమనను ఘట్టిచేసి - సుదతికె మ్మోవిమాను
చెంతదీయకది మహా - జగడగొండి మానును ||పడతి||

సతతమదినితోనీకు - బైలాయవేగిమాను
మతియింతలేదు ఛద్ద - మద్దిమాను
హితవుగా నావద్ది కీసుద్ది - తేకుమాను
తతిగా దిపుడు నీవా - సతిని బిల్వమాను ||పడతి||

చెలిని గూడినది మొదలు - చేతికాసు వొడిశమాను
అలివేణి నిన్నునేను - లడుగుమాను

నలితిండి బెడితివా — నాకు సింగిరేకుమాను
పొలతి కొసగకు చేతి — పూలగుత్తిమాను ॥పడతి॥

(పదం—5)

ఇందులో మానులర్థపే కవిపొందు పరచాడు. "తడఁదక నీవికను - దాని చింతమాను" ఇందులో చింతమాను — అంటే చింతచెట్టు, దాని చింతమాను - దాని ఆలోచన మానుమని రెండుర్థాలు పదాల విరుపువల్ల వ్యక్తమవుతున్నాయి. ఇలాగే తక్కిన "పోకమాను, ఈ తమాను, వేగిమాను, మద్దిమాను తేకుమాను, బిల్వమాను" మొదలైన వన్నింటా ఈ శ్లేషస్పష్టమవుతుంది. అలవోకగా ఆయాపదాలు వచ్చి సారంగపాణి పదాల్లో చోటుచేసుకొన్నాయి. వాటికి ఆతడు యత్నించినట్లు లేనేలేదు. ఇది నిజమైన సహజమైన నిసరమనోజ్ఞ కవిత ఇలాగే పూర్వోక్తమైన "రమ్మమిని రనేమ్మనే" (పదం—23) లోను పదచ్ఛేదంవల్ల కలిసాగే శ్లేష సహజ సుందరమై ఒప్పుతూంది.

### 3. 6. 3 వర్ణనలు :

వర్ణనలు కవిప్రతిభకు చక్కటి నిదర్శనాలు. ప్రబంధకవుల ప్రతిభ అంతా వాళ్ళుచేసే అష్టాదశ వర్ణనలు, అలంకారికశైలీ విన్యాసంమీద ఆధారపడి ఉంటుంది. సారంగపాణి పదకవితలోను వర్ణనా వైదగ్ధ్యంతో తన ప్రతిభను చాటుకొన్నాడు. వర్ణనలో దృశ్యసాక్షాత్కారమై మనఃఫలకంపై చెరగని ముద్ర వేయగలిగితే అది ఉత్తమవర్ణన. అందులో కవిభావన, కల్పన స్పష్టమవుతాయి. ఇలాంటి వర్ణనలకు సారంగపాణి పదాల్లో కొదవలేదు శృంగారపదాల్లో స్త్రీ పురుష విరహాన్ని చాల చక్కగా చిత్రించాడు సారంగపాణి. స్త్రీ పురుష వర్ణనలే కాక ఇతర స్వాభావిక వర్ణనలు సైతం ఇందులో ఉన్నాయి. ఒక చెలి నాయిక స్వభావాన్ని యథాతథంగా వర్ణించి చెబుతుంది.

పల్లవి : ఎంతయే బ్రాశైతేనేమి-హితవే గద నీకుయా

అను : చింతజూపె నవ్వరివారెవ్వరు—వేణుగోపాలరాయ మొన్నటి ॥దెంత॥

పడకటిల్లు వకనాడు కనువూర్వదు
పట్టిమంచ మెన్నడు కదిలించదు
వడిగె మెపుడు పైటబెట్టి కడగదు
పరుపు దుప్పటైనా విడిలించదు ॥ఎంత॥

ఏడజూచినా తల వెంట్రుకలు
ఎదురుగానె యెంగిలి పొగచుట్టలు
గోడమీద విపరీతపు నల్లులు
కొమ్మ పెదవిపై సున్నపు గురుతులు ॥ఎంత॥

పల్లుకత్తుని వేసిన పుడకలు
పెటకొంగు కడవెళ్లా మరకలు
తెల్లవార్లు వింటివిగా గురకలు
చెల్లగడితివి యాభై కరుకులు ॥ఎంత॥

వారానికి పందులు సాకింది
వల్లమాల్ని కోళ్ళను పెంచింది
నీరాకకు దోమలు గాచింది
నిన్నుగూడి గర్వమునిమించింది. ॥ఎంత॥

(ప-119)

ఇది ద్వితీయభాగం దేశీయపదాల్లో ఒకటి. ఇందులోని వర్ణన అంతా జుగుప్సావహమే. కాని స్వాభావిక వర్ణన చేయడంలో కవి ప్రతిభ గోచరిస్తుంది. ఆతనికి గల లోకజ్ఞత గోచరిస్తుంది.

ఇంతకంటె తృతీయభాగం జాతీయపదాల్లో 'కరువు'ని వర్ణించడంలో కవి తన ప్రతిభా నైపుణ్యాన్నంతా ఉపయోగించాడు.

పల్లవి : అచ్చయ బుట్టింది భూమికి బలుశబ్బ
రైణా దానమ్మ నోణీదీ సూడెం

అను పల్లవి : పచ్చినూకలు నేలా-బడితె యిదీ నేబ్బదేలు
బిచ్చగాల్ల శేరిడిశ-బిరుదుబంట్ల సీతూరి ॥అచ్చయ॥

మందలు గదిలె పడమటిశీమ కెగబడి
కందులేశిరిగా శెక్క్ర ప్రాక్క్ర
పందేశి అందులో సాంకోలే కమ్మెశిరే బిడల
కుందనంబుపై బడి కూట్నేల కిలబోయె ॥అచ్చయ॥

కెట్టమీది పచ్చులట్టు తలేవేశె
మట్టదొంగలు వగతట్టగి దేర
గట్టిగా పిదొల్లకు కలబందేగా కూడు
బట్టపరకేడ దిప్పటి యాడమాసులకు ||అచ్చయ||

అలుమొగడు గూడెదదివో రొబగురేగిచం
సాలాబ్రద కాడించె సప్పంసారాగాలు
యీాలో నాయేనుగోపాలుని దయసేత
కాలువరసము గురిశ కరువు దెలిసి గాక ||అచ్చయ||
(ప-142)

జానపదుల మాటల్లో కరువునిగూర్చి కడురమ్యంగా స్వభావోక్తిలో వర్ణించాడు సారంగపాణి. ఇలాగా వర్ణనా వైదగ్ధ్యాన్ని పలువిధాలుగా ప్రకటించి తన ప్రతిభా నైపుణ్యాన్ని వ్యక్తంచేశాడు సారంగపాణి.

3. 6. 4 భావచిత్రాలు :

వర్ణనా వైవిధ్యంలో చూపిన మరోవిశిష్ట లక్షణం భావచిత్ర రచన. శబ్ద చిత్రాలతోపాటు భావచిత్రాలు ఈతని పదాల్లో ఉన్నాయి. వాటిని మనం చదువు టున్నప్పుడు ఆయా భావాలతో కవికి గల ఆత్మీయత స్పష్టమవుతుంది. ఆత్మీ యంగా లేకపోతే అలాంటి రచన చేయడం సాధ్యపడదు. ఈ భావచిత్రాలు పదాలకు పదాలు, చరణాలకు చరణాలు, పంక్తులకు పంక్తులుగా ఉండడం గమ నించవచ్చు. పూర్వోదాహృతమైన పదాలు వేటికవే చక్కటి చిత్రాల్లా ఉండడం గమనించవచ్చు. పోతే ఒక పదంలోని చరణాలు మనోజ్ఞమైన భావచిత్రాల్లా ఉండడం మనం చూడవచ్చు.

పల్లవి : నిన్నుదైవమనుచు యెట్లానమ్ముదునయ్య
యిన్నాళ్ళవలె యికను - మదిలో

అను : ఉన్న సంశయమె విన్నవించెదనిపుడె
వెన్నముచ్చుడి విన్న వేణుగోపాలదేవ ||నిన్ను||

చెల్లబోజసుదగ్ని చెప్పిన నెపమున
యెల్ల భూతమ్ములు తల్లడమందగ
నుల్లము చెదర కత్యుగ్ర కోపమున
తల్లిని ఖడ్గమున తలద్రుంచి తకటా ॥నిన్ను॥

వేద శాస్త్రముల ప్రవీణుడై యరుదెంచి
వేద వటుడై బలిని ప్రార్థించి వేడగ
పాద త్రయంబుర్వి పాత్రుడని యర్పించ
నాదట పాతాళమణగబెట్టితివయ్యా ॥నిన్ను॥

యే లోకముననైన యిట్టి వింతలు గలవా ?
యీలాగు సుగ్రీవుడితవు బల్కగానె
నీలావు దెలియుటకై నిరపరాధియైన
వాలి నొక్కమ్మున వసుధ గూల్చితి వహహా ॥నిన్ను॥

(కీర్తన–161)

ఇందులోని మూడు చరణాల్లోని పరశురామ, వామన, శ్రీరామావతారాల్ని ఎంతో మనోజ్ఞంగా భావచిత్రాలుగా చిత్రించాడు సారంగపాణి.

### 3.6 5 అలంకారాలు :

వర్ణనాత్మక శైలితోపాటు ఆలంకారికశైలిని సమాదరించినవాడు సారంగపాణి. శబ్దార్థాలంకారాలు సముచితంగా ఇతని పదాల్లో చోటు చేసుకొన్నాయి.

### 3.6.5.1 శబ్దాలంకారాలు :

సారంగపాణి పదాలన్నీ ప్రాసానుప్రాసాంత్య ప్రాసలకు ఉదాహరణలే.

### 3.6.5.2 అర్థాలంకారాలు :

శబ్దాలంకారాలతోపాటు వివిధార్థాలంకారాల్ని ప్రయోగించి తన పదకవితకు శోభచేకూర్చుకొన్నాడు సారంగపాణి. వాటివలన సహృదయ పాఠకులు ఆనంద పరవశులు కాకపోరు.

ఉపమ : పికోలు మీటుచును-ఒక్కరికొకరు
జాణతనము లాడుచును
మాణిక్యమువంటి-మగువ నిన్నేలిన
వేణుగోపాలుడా-వెలిదిగూడినగాని" (ప-51)

రూపకం : "కరుణచేతను కోరి మోహించి యా
కనకాంగి నినుజేరి మఱిమఱి తమిమీఱి
విరహ భరముచే తరముగాక తారమరులూరి
తరుణి గురుకుచగిరుల నురమున
నొరసి మురిసిన సరసమెల్లను
మరచివత్తురయేర యాదారి ఓరోరి" (ప-62)

స్వభావోక్తి : "తలమొలకడ నెల్ల నరసిపోయె
దగ్గి దగ్గి హీన స్వరమాయె
పిలిచినాను చెవి వినరాదాయె
బలము పుడిగి తప్పటడుగులాయె

రాత్రైతే రేచీకటి గదలడు
రమణి నీ బిగికౌగిలి వదలడు
మూతిమీద బట్ట యేమారడు
ముష్టి వకరికైన వేయనీయడు" (ప-108)

3.6.6 హాస్యం :

సారంగపాణి పదాల్లో హాస్యానికి సైతం స్థానం ఉండడం విశేషమే. 'ఇంత చక్కని అందగత్తె' అంటూ వేశ్యారూపాన్ని అపహాస్యంచేస్తూ హాస్యోత్పత్తికి అవకాశం కల్పించాడు సారంగపాణి ఈ క్రింది పదంలో.

పల్లవి : ఎక్కడ నుండి దాపురమాయెనె
ఇంత చక్కని అందగత్తె లేని

అనుపల్లవి : వెక్కలు పుట్టించి వేణుగోపాలుని
దక్కించుకొని యెవరు తనకెదురులేరని ||ఎక్కడ||

ఆట చదువు సున్న పాటలంజ మందు
బూటకముల కది పుట్టినిల్లు
నీటు యింతనరాదు నిలువెల్ల కపటము
గూటమువలె తిని కూర్చుంటే కలదు ||ఎక్కడ||

లలన పల్వరుస గవ్వలతో వీయములందు
కలబంద వాసన కలికిమేను
చిలుకరౌతు నగరు దలప చీకటికోన
వలపుమందులసంచి ఒకనిమిష మేమరదు ||ఎక్కడ||

మొగ చెంపలదిగాక మోమెల్ల మొటిమలు
దిగబడ్డ చనులు తొత్తైనోరు
వగలాడివయసు యేబదిమీద రెణ్ణెల్లు
యెగతాళిసేయక వాడేలాగు గూడెనో ||ఎక్కడ||
(ప-96)

ఇలాగా చక్కటి కవితావైభవానికి ఆటపట్టులు సారంగపాణి పదాలు.

## 3.7 త్యాగరాజు కవిత :

త్యాగరాజు కృతులలో మాతువుకంటే ధాతువుకే ప్రాధాన్యం. అందులోని సంగీతానికే అత్యంత ప్రాధాన్యం. సంగతులు వేయడంలో సంగీత విద్వాంసుల నైపుణ్యాన్ని పట్టివ్వగలిగిన విశిష్టత ఈ కృతులలోని ప్రధాన విషయం. అయినా అక్కడక్కడా మనోజ్ఞమైన రచన సాగి కవితారీతులు స్పష్టం కాకపోవు. కవితా నైపుణ్యం కంటే నాదోపాసనద్వారా భక్తి వైరాగ్యాల్ని ప్రకటించిన తీరు సర్వ జనాదరణీయమై త్యాగరాజు హృదయం ఆవిష్కృత మవుతుంది.

## 3. 7, 1 చక్కటి కృతిరచన :

సంగీతం వదలివేసినా సహజసుందరమైన భాషా రచనతో కృతి కమనీయమై ఒప్పుతూండడం మనం గమనించగలం. దీని కేకృతి అయినా ఉదాహరణమే అవు తుంది. మచ్చుకు -

"రాకాశశివదన ఇంక పరాకా
నీకా గుణము కారా దవనీ_కాంత కరుణాస్వాంత ॥రా॥

నమ్మియున్న నిజదాసులకు_నమ్మికల నొసఁగి మఱతురా
తమ్మికనుల నొకసారి నను-దయ జూడరాదా మరియాదా ॥రా॥

పారి పారి నిన్ననుదినము - కోరికోరిన వారిని యీ
దారిఁ బ్రోచితివా మాయా - ధారి రారా ఏలుకోరా ॥రా॥

నీవే దెలిసి కొందువనుచును - భావించుచును నేను నీపద
సేవఁజేసితి మహాను - భావ త్యాగరాజునిపై ॥రా॥

(త్యా. కీ. II-350)

ఇందులో భక్తిపూరితమైన ఆర్తి గోచరిస్తుంది. రచన మిక్కిలి మనోహరమై సహృదయ హృదయాల్ని అలరిస్తూంది. పైగా పల్లవి, అనుపల్లవుల పునరావృత్తితో పాడినప్పుడా ఆర్తి మరీమనోహరమై ఉంటుంది. ఇలాగా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

### 3. 7. 2 వర్ణనలు :

సంగీత ప్రాధాన్యమే గాని త్యాగరాజు కృతి రచనాశైలికంత ప్రాధాన్యం లేదని భావించడం కద్దు. కానీ ఆనాదోపసనావ్యగ్రమైన ఆమనోభావాల్ని పరిశీలిస్తే చక్కటి వర్ణనాత్మకశైలి తనంతతానే త్యాగరాజు నోటినుంచి వెలువడినట్లు మనం గ్రహించగలం. అలాంటి వర్ణనాత్మక శైలికి ఒకటి రెండుదాహరణాలు; బాలుడైన శ్రీరాముని దివ్యమోహన రూపాన్ని గాంచి విశ్వామిత్రుడు ముగ్ధుడైన తీరు ఈ క్రింది కృతిలో త్యాగరాజు జగన్మోహనంగా వర్ణించి తరించాడు.

"అలకలల్లాడగ గని ఆ రాణ్మని ఎటుపొంగెనో
చెలువు మీరగను మారీచుని మదమణచేవేళ ॥అ॥

ముని కనుసైగ దెలిసి శివ _ ధనువును విరచేసమయ
మున త్యాగరాజ వినతుని మోమున రంజిల్లు ॥అ॥

(త్యా. కీ I-19)

'మారీచుని సంహారించేప్పుడు, మునికను సైగతో హరవిల్లు విరిచేసమయాన అలకలల్లాడు తూండగా, చెలువుమీరే', ఆ శ్రీరామచంద్రుడు మన కన్నులకు కట్టినట్లు కనిపించక మానడు. ఇది త్యాగరాజు భక్తిపూరితమైన రచనలోని వర్ణనావైదగ్ధ్యం.

ఇలాగే మరో ప్రసిద్ధ కృతిలో శ్రీరామచంద్రుని వర్ణన కమనీయంగా చేశాడు.

"నను పాలింప నడచివచ్చితివో నా ప్రాణనాథ ॥న॥
వనజనయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మముఁదెలిసి ॥న॥
సురపతి నీలమణి నిభతనువుతో
ఉరమున ముత్యపు సరుల చయముతో
కరమున శరకోదండ కాంతితో
ధరణీతనయతో త్యాగరాజార్చిత ॥న॥

ఇందులోని పల్లవి, అంతకంటే అనుపల్లవి, మరి అంతకంటే చరణం ఉత్తరోత్తరం మనోజ్ఞమై త్యాగరాజు హృదయాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

మరో ప్రసిద్ధమైన కృతి త్యాగరాజు వర్ణనాత్మక శైలికి చక్కటి నిదర్శనం.

"దొరకునా ఇటువంటిసేవ ॥దొ॥

దొరకునాల్పతప సొనరించినటూ - సురవరులకైన సురలకైన ॥దొ॥
తుంబుర నారదులు సుగుణకీర్త - నంబుల నాలాపము సేయఁగా
అంబరీషముఖ్యులు నామముసే - యఁగ జాజులు పైచల్లగా
బింబాధరలగు సురవారయువ - వేణులు నాట్యములాడగా
అంబుజభవపాకారు లిరుగడల - నన్వయ బిరుదావళిని పొగడగా
అంబరవాస సతులు కరకంక - ణంబులు ఘల్లనివిసరగ మణిహా
రంబులు కదలగ మాచే ఫణిత - ల్పంబున నెలకొన్న వారిని కనుగొన
॥దొ॥ (త్యా. కీ. II - 84)

ఇలాగే గుక్కతిప్పుకోనంత పెద్ద కృతిచేశాడు త్యాగరాజు సర్వసామాన్యంగా చిన్ని చిన్ని కృతులే అధికం. అందులో ధాతుప్రాధాన్యం ఎక్కువ. ఇక్కడ మాతు ప్రాధాన్యంతో రచన సాగింది. మనోహరంగా కన్నులకు కట్టేవర్ణన ఇది.

### 3. 7. 3 భావ చిత్రాలు

శబ్ద చిత్రాలు, పద చిత్రాలు, భావచిత్రాలకు త్యాగరాజు కృతులలో కొదవ లేదు. ఏ కృతిలోనైనా వీటిని మనం చూడవచ్చు. శబ్ద, పద చిత్రాలకు చక్కటి ఉదాహరణ .

"ఏల నీ దయరాదు పరాకు జేసేవేల సమయముగాదు ॥ఏ॥

బాల కనకమయ చేల సుజన పరి
పాల శ్రీరమాలోల విధృత శర
జాల శుభద కరుణాలవాల ఘన
నీల నవ్యవనమాలికాభరణ ॥ఏ॥

....  ....  ....  (త్యా. కీ-I-7)

ఒక్కొక్క పాదంలో సగం ఒక్కొక్క భావచిత్రంగా చిత్రించడం గమనించగలం.

"సొగసుగా జూడ దరమా నీ ॥సొ॥
నిగనిగమనుచుఁగపోల యుగము చే మెరయు మోము ॥సొ॥

అమరార్చిత పదయుగమో అభయప్రద కరయుగమో
కమనీయ తనునిందిత కామ కామరిపునుత నీ ॥సొ॥

వరబింబ సమాధరమో వకుళ సుమంబుల యురమో
కరధృత శరకోదండ మరకతాంగ వరమైన ॥సొ॥

చిరునవ్వో ముంగురులో మఱికన్నులతేటో
వరత్యాగ రాజార్చిత వందనీయ ఇటువంటి ॥సొ॥

(త్యా. కీ. II-476)

ఒక్కొక్క పాదం ఒక్కొక్క భావచిత్రం :

"మరిమరి నిన్నే మొరలిడ నీ-మనసున దయరాదు ॥మ॥

కరిమొరవిని సరగున చనినీకు-కారణమేమి సర్వాంతర్యామి ॥మ॥

కరుణతో ధృవునికెదుట నిల్చిన-కథ విన్నానయ్యా
సురరిపు తనయునికై నరమృగమౌ-సూచనలేమయ్యా
మరచియున్న వనచరుని బ్రోచిన-మహిమఁ దెలుపవయ్యా ।
ధరను వెలయు త్యాగరాజ సన్నుత-తరముగాదిక నే విననయ్యా" ॥మ॥
(త్యా. కీ. - II-312)

ఇలాగా శబ్ద, పద, భావ చిత్రాలు త్యాగరాజు కృతులన్నింటా కోకొల్లలు.

### 3.7.4 జానపద గేయ రీతులు :

అన్నమాచార్యుని పదాల్లో జానపద గేయ రీతులున్నట్లు పూర్వోక్తం. అదే రీతిని త్యాగరాజు కృతులలోను జానపద గేయరీతులున్నట్లు స్పష్టం. ఉత్సవ సంప్రదాయ కీర్తనల్లో (త్యా. కీ. పు-19 -224) లాలి, జోల, నలుగుపాటలు, మేలుకొలుపు, హెచ్చరిక, శోభానే, మంగళం, పవ్వళింపు మొదలైన జానపద గేయ బాణీలు పుష్కలంగా ఉన్నాయి.

### 3. 7. 5 అలంకారాలు ;

త్యాగరాజు కృతులలో శబ్దార్థాలంకారాలు సైతం సమకూరి కృతిని సుకృతిని జేశాయి.

### 3. 7. 5 శబ్దాలంకారాలు :

త్యాగరాజు కృతులందు ప్రాసానుప్రాసాంత్య ప్రాసలకు కొదవలేదు. వృత్త్యనుప్రాస కో చక్కటి ఉదాహరణ ;

"వందనము రఘునందన సేతు
బంధన భక్తచందన రామ ॥వం॥

శ్రీదమా నాతో వాదమా నే
భేదమా ఇది మోదమా రామ ॥వం॥

శ్రీరమా హృచ్చారమా బ్రోవ
భారమా రాయబారమా రామ ॥వం॥

24)

వింటిని నమ్మకొంటిని శర
ణంటిని రమ్మంటిని రామ ॥వం॥

ఓడను భక్తిపీడను నొరుల
వేడను నీ వాడను రామ ॥వం॥"

(తా. కీ-I-48)

3. 7. 5. 2 అర్థాలంకారాలు :

ఉపమా రూపకాలం కారా లీ కింది ప్రసిద్ధ కృతిలో చూడవచ్చు.

"తెరతీయగరాదా లోని
తిరుపతి వేంకటరమణ మచ్చరమను ॥తె॥

పరమ పురుష ధర్మాది మోక్షముల
పారఁదోలుచున్నది నాలోని ॥తె॥

ఇరవొందగ భుజియించు సమయమున
ఈగ తగులు రీతియున్నది

* * * * *

వాగురయని తెలియక మృగ గణములు
వచ్చి తగులు రీతియున్నది
వేగమే నీమతము ననుసరించిన
త్యాగరాజనుత మదమత్సరమను ॥తె॥

(త్యా కీ-I-171)

ఇలాగే తక్కిన అలంకారాలు అంటే ప్రధానంగా శ్లేష, నిందాస్తుతి, దృష్టాంతం మొదలైనవి అనేకం త్యాగరాజు పదాల్లో ఉన్నాయి.

ఇలాగా పదకవితా వైభవం స్థూలంగా పరిశీలించడం జరిగింది. ఈ ప్రకరణం తరువాత ప్రకరణాల్లో వివరించే విషయావగాహనకు ఉపకరించగలదు.

# 4.0 భాషా విశేషాలు

4.1 పద్యకవుల కంటే పదకవుల భాష సరళమూ, లలితమూనై సామాన్య జనావగాహన కుపకరించేలా ఉండడం ఒక విశేషం. కొందరు ప్రముఖ పదకవుల భాషా విశేషాల్ని పరిశీలించడమే ఈ ప్రకరణోద్దేశం. తన్మూలంగా పదకవుల భాషనంతటిని స్థాలీపులాక న్యాయంగా పరిశీలించినట్లవుతుంది.

## 4.2 అన్నమాచార్యుల సంకీర్తనలు-భాషా విశేషాలు :

అన్నమాచార్యుల సంకీర్తనల్లో ధాతువుకంటే మాతువునకు అంటే సాహిత్యానికే అధిక ప్రాధాన్యమిచ్చినట్లు విమర్శకుల అభిప్రాయం. అయినప్పటికీ ఆతడు పండితులనేగాక పామరులను సైతం మురిపించే భాషనే ప్రయోగించినట్లు స్పష్టమవుతుంది.

### 4.2.1 సామాన్య ప్రజల భాష :

ఏది యేమైనా అన్నమాచార్యుని సంకీర్తనల్లోని భాష సామాన్య ప్రజల భాష అనడంలో సందేహంలేదు ఇందుకు ఓ ఉదాహరణ ;

"కాలమెల్లా మోసపోవు(ము?) కానియ్యరా కల
రాలమెల్లా జరపేవు కానియ్యరా ॥పల్లవి॥

ఎడపుల జవ్వనప్పటింతి నొకతెఁగూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టుకొకతెకు మేలు వాఁడవై నీవు
కడవ బొంకేవు నాతో కానియ్యరా ॥కాల॥

బంగారు మెఱుఁగుచాయ పడఁతినొకతె గూడి
కంగనాడేవు నాతో కానియ్యరా
అంగన నొకతె వెనకమర దాఁచుకొని చొ
క్కాంగఁజేసి ముద్దాడేవు కానియ్యరా ॥కాల॥

సంపద గలాపెఁగూడి సరసములాడుచు
కంపులే పూసేవు కానియ్యరా
వెంపరలాడుచు నీ వెంట నొకతెరాఁగా
కంపించక వేంకటేశ కానియ్యరా" ॥కాల॥

(XII-31)

ఇఁదులో నాయిక శ్రీవేంకటేశ్వరుని దక్షిణ నాయకత్వాన్ని నిందిస్తూంది. ఇందులోని భాష సర్వసామాన్యమై ఒప్పుతూంది.

4.2.2 అన్నమాచార్యుని సంకీర్తనల్లోని భాషలో ప్రత్యేకత ఉంది. ఏ ఒక్కపదం మనం చదివినా ఈ విషయం మనకు స్పష్టమవుతుంది. అన్నమాచార్యుని భాషా ప్రత్యేకత అవగతమవుతుంది. ఆయా ప్రత్యేకతల్ని క్రమంగా పరిశీలిద్దాం.

4 2.2.1 తరచు ప్రయోగించే పదాలు, పదబంధాలు:

4.2 2.2 సంబోధనలో—'అర' బదులు–అల.

అమ్మలాల (XII-32), కాంతలాల (XII-42), తమ్ములాల, అన్నలాల, తల్లులాల, కొమ్మలాల, అక్కలాల (XII-99), తొయ్యలులాల (XXII-172), తరుణులాల (XXII-273), పొలతులాల (XXII-273), నాతులాల, పడతులాల (XXII-38).

4.2.2.3 కొన్ని పదాలు, పదబంధాలు.

అదివో (XII-14), ఇద్దివో (XII-19, 44), అల్లదివో (XXII-134), అద్దో (XXV-467).

దేవులమ్మ (XII-8), ఉద్దండాన (III-563), ఉద్దండీడవు (XXII-2), ఆగడీడవు (XXV-12), నాటకీడవు (XXV-474).

వెంగేలు (XXII-1, 4), యేకతానకు (XXII-3), కమ్మటిదాన (XXII-40), తారుకానాలెల్ల (XXII-33), పూడిగెపు వారము (XXII-37), వుందానను (XXII-38), విందానను (విప్పదానను) (XXVI-128), మోవి

పండు (XXII-81), మోనము (XXII-149), మంచి జానకాదవు (XXII-219), నిచ్చనిచ్చ (XXII440), ఆసోదాన (XXII -528), ఆసోదకాదవు (XXII -558) ఎంత యాకోదకత్తైవే (XXIV-13), జాణకత్తె (XXV-25), తట్టుపుణుగు (XXV -91), విడేలు (XXIV-226), పుందణము (XXIV-422), అచ్చెనలు (XXIV-496), సేనాసేనా (II-48), ఆతుమ (ఆత్మ) (II-242), అచ్చుత (II-242), బాయట (X-284).

4.2.2.3 కొన్ని క్రియాపదాలు :

గుంపించెనా (XXII-1), కాగరించు (XXII-1, 4, 8), అముకొన్న (22-19), ఆడుతాను, చల్లుతాను (22-5), వచ్చితేను (22-14), దగ్గరితే (దగ్గరికి వస్తే) (25-502), మోహాము గల్తే (గలిగితే) (26-44), కూరిమి గలితే (గలిగితే) (26-93), ఆసగల్తే (గలిగితే) (25-127), ఆడకువే, చల్లకువే, కసరకువే (22-409), వినేరు, చూచేరు, నోరూరేరు, కూడేరు (25-32).

ఇలాగే ఇంకా ఎన్నో పదాలు తరచుగా తన సాహిత్యమంతటా ప్రయోగించాడు అన్నమాచార్యుడు.

4. 2. 3 పలుకుబళ్లు :

పలుకుబళ్లు, నుడికారాలు, జాతీయాలు, సామెతలు అన్నవి ఏ భాషకైనా ప్రముఖమైన అంశాలు. వీటి మీదనే ఆ భాషా వైశిష్ట్యం ఆధారపడి ఉంటుంది. అలాంటి చక్కటి పలుకుబళ్లను ప్రయోగించిన రచయితకు ఆ భాషపైగల అధికారాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. అన్నమాచార్యుడు తన సంకీర్తనల్లో ప్రయోగించిన పలుకుబళ్లను పరికిస్తే అతనికి తెలుగు భాషాస్వభావం ఎంతగా తెలుసునో స్పష్టమవుతుంది. కొన్ని ఉదాహరణలు.

అంగడిబెట్టు (III-108), ఇంటిలోని పోరు (XII-199), ఒడి గట్టుకొన్నందుకు (XVV-160), కన్నులపండుగ (XXVI-303), కనులెల్లా యట్టునాయె (III-504), కన్నువేసినాడు (III-66), కాయో పండో (XII-341), కానుసేయని (III-633), తెగిన గాలిపడగపై (III-563), వంచనైతిమి (XII-364), రాతి

గుండె (XII-9), రొమ్ముననకుంపటియైతే (III-181), సంతలబెట్టితివి (XXV-271), సూదివెంటదారమై (III-139). ఇలాగా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

4 2. 4 సామెతలు :

రసగ్రహణ పారీణులైన పాఠకుల మనఃకుక్షికి సాహిత్యంలోని సామెతలు చక్కటి ఆమెతలు. పైపెచ్చు ఆ కవికి భాషపైగల అధికారాన్ని బట్టి ఇవ్వగలవు. కొన్ని చక్కటి సామెతలు.

అమ్మెటి దొకటియు నసిమిలోని దొకటి (XXII-327)

ఊరుదీయఁబేనువచ్చి నిక నేలమాటలు (XII-111)

కాంతుని నీమొలఁగుచ్చికట్టుకొనఁగదవే (XXIV-525)

కుట్టి చూడ దోసపిండ (III-204)

గోరబొయ్యే దానికి గా గొడ్డలేల (XXII-124)

గోడుచుట్టుపై రోకటి పోటాయగదమ్మ (XII-238)

జలజాక్షి మోవితేనె చందమామ గుటకలు (XXII-77)

పిలువని పేరటమై పిరిగొనవేడుక (24-276)

పూచిన తంగేడువలె పొదలీ మావలపు (22-511)

శిరసుండ మోకాల శేసయేటికే (25-441)

ఇలాంటి సామెతలు అన్నమాచార్యుని సంకీర్తనలన్నిటా కోకొల్లలు. పైగా అవి సందర్భోచితమై సహృదయులని సంతసింప జేస్తూంటాయి.

3. 2. 5 సంధి :

సలక్షణమైన సంధికార్యం అన్నమాచార్యుల సంకీర్తనలన్నిటా ఉంది. అయితే అపురూపమైన సంధికార్యాలు ఎడనెడ కనిపిస్తాయి.

4. 2. 5. 1 క్త్వార్థ కేకారసంధులు :

ఒకపదమిచ్చేటి (22-263), కలసిమెలఉండగా (25-13), కూడుందేము (22-71), చెల్లుండగా, (22-112), పవ్వళించుండగా (22-21).

4. 2. 5. 2 విచిత్రమైన సంధి :

అపెలిగితే < అపె + ఆలిగితే (22-274)

ఎవ్వతెకో < ఎవ్వతె+ఒకో (25-82)

4. 2. 5. 3 త్రికసంధిలాంటి సంధి :

ఒబ్బుద్ధి < ఓ + బుద్ధి < ఒక + బుద్ధి (25-529)

నియ్యాన < నీ + యాన < నీ + ఆన (25- 88)

నియ్యిచ్చ < నీ + యిచ్చ < నీ + ఇచ్చ (25-497)

4. 2. 5. 4 ద్రుతంమీద యడాగమం :

చలము యెందాకా (25-19)

పరాకునీకు యేమి సేసేవు (22-509)

సుద్దులు యడుగవలెనా (22-494)

4. 2. 5. 5 యడాగమం రాలేదు, సంధి కలుగలేదు.

వెలఇంచ వచ్చునా (25-320)

నా ఇంపుసొంపులు (25-476)

4. 2. 5. 6 యడాగమానికి బదులు 'వ' డాగమం:

మరచి వూరకుండితే (24-189)

4. 2. 5. 7 దీర్ఘమున్నా ద్రుతకార్యం ;

నీవాఁబుట్టుమవాడవు (24-241)

కేవలం విలక్షణమైన సంధులు కొన్నింటిని మాత్రమే ఇచట దిక్ప్రదర్శనగా చూపించడం జరిగింది.

4 2. 6 సమాసాలు :

సలక్షణమైన సమాసాలు అన్నమాచార్యుల సంకీర్తనల్లో సామాన్యమే. అయితే చాలవరకు ఈ సమాస కల్పనలో బహురీతుల పోయినట్లు స్పష్టమవుతుంది పరిశీలనవల్ల. విలక్షణమూ, అపురూపమూ అయిన సమాసాలను చూద్దాం.

4. 2. 6. 1 తెలుగులో చక్కటి సమాసాలు :

చెందమ్మి పూవుదండలు (25-136) నిలువుఁగొలువెల్లా (26-328)
పెక్కు పనులవాఁడవు (24-3) మొగమిచ్చ చెలులము (22-33)
వాడుమోవి (24-12), సందడి కొలువు (24-3)

4. 2. 6. 2 వైరి సమాసాలు:

వైరి సమాసాల్ని చాలా విరివిగా అన్నమాచార్యుడు ప్రయోగించాడు. మచ్చుకు కొన్ని.

అతివేడుక (25-298), అనేక పంతగాడవు (24-136),
ఘన జవ్వనము (26-262), తన నిజబాసలు (22-266),
నానా జాతిపండ్లు (25-91), నానా సొమ్ములు (3-125),
ప్రాణ ప్రాణనేస్తమైనచోట (26-241),
ప్రేమ జవ్వన మదపు పెండ్లికొడుకవు (22-548),
భారీతనము (3-197), సురత చిన్నెలు (24-243).

4.2.6.3 విలక్షణ సమాసాలు ;

కంచపుమోవి (మోవికంచము) (26-414),
కూపనరకమున (నరకకూపమున) (2-3),
పండుమోవితేనె (మోవిపండుతేనె) (26-79),
పడగవాతెరయెత్తి (వాతెరపడగయెత్తి) (25-550),

4.2.6.4 వింతగా మరోరీతిని సమాసాలు కల్పించడం చూపవచ్చు. వీటిలో సంబంధ వాచకాన్ని పదబంధ మధ్యంలో ఉంచడం వీటిలోని విశేషం.

తమ్మిదల బెదరని గుంపులు (బెదరని తమ్మిదల గుంపులు) (24–239)' దొంతుల నాయాసలకు (నాయాసల దొంతులకు) (25–447), మెచ్చితి నిన్నప్పటి మేలుమేలు (అప్పటి నిన్ను మెచ్చితి మేలుమేలు) (224-570): రెప్పలనీలోని చూపే (నీ రెప్పలలోనిచూపే (225-373), విమలపు నీపతికి (నీ విమలపుపతికి) (224-36).

4. 2. 7 విభక్తులు :

ప్రథమకు బదులు షష్ఠి :

జారిమితో మీకు మీకె కొలిచేవారా (మీకుమీరే) (II–167)

మనరాదు నీ కింక మమ్ముంగావ వలెను (నీ వింక) (II–365)

ద్వితీయకు బదులు షష్ఠి :

ఇంతికి నీవు వలచు టెందరము నెఱుఁగుదుము (ఇంతిని) (222–22)

ద్వితీయకు బదులు తృతీయ :

చేసుకోవయ్య పెండ్లి చెలితోను (చెలిని) (223-513)

తృతీయకు పదులు ద్వితీయ :

లంకె లూడుచు మేలుయీ

కింకరులను నలంగెండి కంచెను (కింకరులచేత) (2–186). ఇలాగే తక్కిన విభక్తులకుసైతం ఉదాహరణ లివ్వవచ్చు.

4. 2. 8 రాయలసీమ మాండలికాలు :

4. 2. 8. 1 పదాలు :

అప్పా (తండ్రీ) (II—11),

అసిమి (అమ్మేటి దొకటియు నసిమిలోని దొకటి) (22-327)

ఒడ్డారాలు (ఒయ్యారము) (24-170)

ఒప్పిదిగా (నిశ్చింతగా, హాయిగా, ప్రత్యేకంగా) (24-278)

కణజాలు (పాతరలు) (24-235)

కిమ్మల (కిమ్మల్లేపే) (రహస్యంగా) (22-220)

మరవలు (చెరుపుల మరవలు) (-47)

ఓగ్గె (బిగ్గరగా-గట్టిగా-ఉచ్చారణ) (24-429)

(సారంగపాణి-ఓగ్గెకయ్యేవద్దు-194)

మంప (మూర్ఖత్వం) (24-425)

(మంప : మంటిలోన దామమంకుజీవి-వేమన (22-148)

సరాకా (సరాకా-తమాషా) (32-314)

సైకమే (సన్నని, సూక్ష్మం, ఇంకా తేలిక, చులకన అనిగూడా) (12-304)

4. 2. 8. 2 పదబంధాలు :

అపసోపము (22-198)

ఉద్దు వుద్దులై జతలు జతలై 2-74

[ఇలాంటిదే వేమన ప్రయోగం-ఉద్ది గూడి

"ఉద్దిగూడి బ్రతుక చంద్రుమేమ" (140-67)]

నెల్లిచెట్టు (ఉసిరిక చెట్టు) (25-435)

4. 2. 8. 3 క్రియాపదాలు :

అగదైతిమి (పలచనైతిమి, నిందమోస్తిమి 24-271)

ఎగబోసి (సన్నల యెగపోసి) (25-368)

(క్షేత్రయ్య-ఏమేమో విభునితో ఎగబోసిరే- స్వీ. 98)

ఏకారేపు (225-34)

చౌకళించి (కుప్పించి) (224-138)

పంగించు (ఎత్తిపోడుచు) (22-120)

వెంపరలాడు (ఆత్రంగా వెదకు) (12-51)

4. 2. 8. 4 వాక్యాలు :

ఆకుమడ చిచ్చేను (తమలపాకులు చిలకలు కట్టిఇచ్చేను) (3-187)

ఉపద్రా రాదుకదే (ఉపద్రవం) (3-190)

ఎగదిగ పోతలైతే నేడచొచ్చేదే (224-271)

నీవుగన ఆదరించితే (25-256)

పూచుకునే మాటాడితి (22-544)

ముయికి ముయాయే (3-203) 'మయ్యకిముయ్యి ఆయితు' (పురందరదాసు)

4. 2. 8. 5 పై పరిశీలనవల్ల అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయల సీమ మాండలిక పదజాలం, దానిస్వరూప స్వభావాలు, సూక్ష్మాతి సూక్ష్మమైన అర్థభేదాలు మొదలైన అంశాలన్నీ మనకు స్పష్టమవుతాయి. దీనికి అనుబంధంగా మరికొన్ని అంశాలు సైతం మన మిక్కడ పరిశీలించడం అవసరం. వింత ప్రయోగాలు, అన్యదేశ్యాల్ని గూర్చి స్థూలంగా చూద్దాం.

4. 2. 9 వింత ప్రయోగాలు :

అన్నమాచార్యుని సంకీర్తనల్లోని ధ్వనులలో, పదాల్లో, పదబంధాల్లో, క్రియల్లో, వాక్యాల్లో ఈ పెక్కు వింతలు మనం చూడగలం.

4. 2. 9. 1 ధ్వనుల మార్పులు :

4. 2. 9. 1. 1 'గ' కు బదులు 'వ'

అదివో (< అదిగో) (12-14)

తల్లదివో (< అల్లదిగో) (22-134)

ఇదివో (< ఇదిగో) (12-19, 44)

'జ' కు బదులు 'చ'

చింక చందురుడు (< జింక చందురుడు) (12-261)

చింక చూపులది (< జింక చూపులది) (24-166)

చింక బెదురులాడి (< జింక బెదురులాడి) (12-261)

'జ' కు బదులు 'స'

సింక సూపునాపై సూపడుగా (జింక) 12-32)

4.2.9.1.3 "ట" కు బదులు "త"

తక్కులుమాను (< టక్కులుమాను) (12-151)

తెంకి (< టెంకి) (26-27)

తక్కరి (< టక్కరి) (26-27)

తక్కరీడు (< టక్కరీడు) (25-204)

నగుతగాక (< నగుటగాక) (25-213)

దూరతగాక (< దూరుటగాక) (25-461)

జోడా తెరుగవా (< జోడా టెరుగవా) (25-523)

4.2.9.1.4 "డ" కు బదులు "ర/ఱ"

జరసేరా (< జడసేరా) (25-189)

జఱియుచు (< జడియుచు) (25-199)

4.2.9.1.5 'ణ' కు బదులు 'డ'

సుగుడవన్నిటా (< సుగుణవన్నిటా) (22–506)

4.2.9.1.6 'ద' కు బదులు 'త'

తిట్టపై (< దిట్టపై) (9–64)

4.2.9.1.7 'న' కు బదులు 'ణ'

తట్టుపుణుగు (< తట్టుపునుగు) (2–198)

కుందణము (< కుందనము) (24-422)

అయిరాణి (< అయిరేని) (12–189)

యోగిణి (< యోగిని) (22–537)

'న' కు బదులు 'ర'

చిరుకులు (< చినుకులు) (24–73)

4.2.9.1.8 "హ్రస్వాని"కి బదులు "దీర్ఘం"

తోఁగిచూచి (< తొంగిచూచి) (24-73)

పానిపట్టి (< పనిపట్టి) (25–265)

బాయిటవేయగనేల (< బయటవేయగనేల) (25-252)

4.2.9.1.9 "దీర్ఘం" మీద "పూర్ణానుస్వారం"

ఏంటిమాటలు (< ఏఁటిమాటలు) (3–223)

గాంటపు (< గాటపు) (3–214)

పైండి (< పైడి) (3–585)

4.2.9.1.10 అద్విరుక్తత :

నీ సుదులెల్ల (< నీ సుద్దులెల్ల) (3–514)

ముగురెరిగిన (< ముగ్గురెరిగిన) (25–507)

పూనిపటి (<పూనిపట్టి) (26–89)

మక్కువచలితి (< మక్కువచల్లితి) (26–90)

పానిపటి (< ప్రానిపట్టి) (26–121)

4. 2.9.1.11 లేని ద్విరుక్తత :

అద్దలింపుచు (< అదలించుచు) (12–242)

అద్దలించు (< అదలించు) (3–115)

అద్దిగో (< అదిగో) (3–213)

అద్దరిపాటుండగాను (< అదరిపాటుండగాను) (26–176)

4.2.9.1.12 అక్షరలోపం :

ఉపారము (< ఉపాహారము) (22–537)

దాకొని (< దాగికొని) (25–32)

చిత్తరున (< చిత్తరువున) (25–330)

తనుపై జేయివేసి (< తనువుపై జేయివేసి) (26–75)

తిరుగుకంటె (< తిరుగుట కంటె) (2–3)

మోహము గత్తే (< మోహము గలిగితే) (26–44)

4 2 9 2 పదాలు :

ఘనురాలు (25–26), జాణడు (12–201)

నావొళ్లి (నావల్ల) (2–4), భ్రమత (భ్రమ) (22—277)

సంగతాలు (స్నేహితులు) (సంగాతో–ఒరియాభాషలో) (24—119)

భాగ్యమంతులు (భాగ్యవంతులు) (24—399)

లేసుగా (లెస్సగా) (25—33)

సంతము (సొంతము) (25-119)

4 2.9.3 పదబంధాలు :

ఊడిగమాపె (దాసి, పనిమనిషి, పనికత్తె) (22-5)

జంపుల సిగ్గులు (జంపు-పొడవు-సిగ్గులయొక్క జంపులు) (22-544)

(c/ జంపునీచనులు (24-190)

సిగ్గరి పెండ్లి కొడుకు
సిగ్గరి పెండ్లి కూతురు } (24—76)

అంటురాయి (అయస్కాంతం) (24—20)

వాలుకచూపులు (వాలుచూపులు) (22—478)

పొరుగిరుగువారు (ఇరుగుపొరుగువారు) (24—373)

పూతసిగ్గు (24—561), ఊత చెక్కు చేతులతో (24—561)

4.2 9. 4 క్రియా పదాలు :

ఆసలాసలు పుట్టించు (మిక్కిలి ఆశ పుట్టించు) (24—50)

యాల దగ్గరేవు (ఎందుకు దగ్గరకువస్తావు) (12—69)

ఆతడెవ్వరౌతా (ఆతడు నాకేమవుతాడు) (12—69)

గయ్యాళించు (గయ్యాళిమీద ఇంచుక్క) (24—342)

శోకింపించు (శోకించి ప్రేరణ రహితంగా) (25—205)

నవ్వింపించి (నవ్వించి ,, ) (25—208)

ఊదింపించరాదా (ఊదించరాదా ప్రేరణ రహితంగా) (25—205)

4.2.9.5 వాక్యాలు :

అక్కరగలవు నీవు (అక్కర గలిగిన నీవు) (24—443)

చేసినదోసము వాసు (చేసిన దోషము వాయు) (22-2)

సిగ్గువడకువయ్యా (సిగ్గు పడకుమయ్యా) (22-2)

నిజమీయవయ్యా (నిజం చెప్పవయ్యా) (22--2)

వారనేల వేసేవు (ఏలపారేశేవు) (22—192)

దయగల దాతఁడు (అతడు దయగలవాడు) (22—217)

అపె పైబత్తిగలవు (అపె పై బత్తిగలవాడవు) (222—423)

నీ చక్రము అతిప్రతాపి (నీ చక్రము అతి ప్రతాపము గలది) (24—246)

నీ పాదములు గుద్దగరాదా (నీపాదములు పట్టగ (పిసుగగ)రాదా) (24-280)

పాయపు మదాన నన్నే పలుకరాదా (పలుకరించరాదా) (25—5)

మనసేల కరగవురా (నీ మనసేల కరగదురా) (224—90)

4.2.9.5. వచనం :

ఏకవచనానికి బదులు బహువచనం.

"మాకు నీవులోగుదురా (లోగుదువా) (24-74)

బహువచనానికి బదులు ఏకవచనం.

"నీకు బాజై కాచుకొన్నది (కాచుకొన్నవి) (24—86)

ఇలాగా వివిధ విధాల వింత ప్రయోగాలు చేయడం అన్నమాచార్యుని స్వాతంత్ర్యాన్ని, గడుసుదనాన్ని, అంతకంటే పదకవితాపితామహునిగా అతనికి భాషపైగల అధికారాన్ని స్పష్టం చేస్తున్నాయి.

4. 2. 10. అన్యదేశ్యాలు :

అరబ్బీ, ఉర్దూ, హిందీ: కన్నడం, తమిళం మొదలైన అన్యదేశ్యాలు సైతం అన్నమయ్య సాహిత్యంలో కనిపిస్తాయి.

4.2.10.1 అరబ్బీ, హిందీ, ఉర్దూపదాలు } జగడాలు (123). జగడించె (12—26; వాపురే (12—147, 115)

సెభా సందురశె (XII–153), జూటరి (XXIV–173), జూటు (XXIV-230), కుల్లాయి (XXIII-521), కబురులే (II–123), పైజాలు (X–241).

4.2.10 2 కన్నడ పదాలు :

బెళకకేపొద్దు (XXIV-280), బెళుకు (II–173),

బెళక (XXII-363), అప్పణి (య్యాజాలవలెగా) (XXII–227),

అప్పణ (నీకిచ్చెనో) (XII–390),

4.2.10.3 తమిళపదాలు :

ఉడయవరులో (II–229), తిరుమంత్రము (IX-242), తిరువాముడి (IX–195), (సేనా) మొదలారి (వద్ద) (IX-242), తిరుమణి (X-245), పల్లాండు పల్లాండు, పెరుమాళ్లు (X–132), తిరువేంగళప్పడు (XXII–365), విజ్ఞాపజి (వారు) (XXIV-281), అళగిరి (XXU–457)

ఇలాగా ఆనాడు ప్రచారములోఉన్న అన్యదేశ్యాలు సైతం అన్నమాచార్యుని సంకీర్తనల్లో చోటు చేసుకొన్నాయంటే భాషమీద అన్నమాచార్యునికి అధికారమూ, ఆనాటి ఆ భాషాబలమూ స్పష్టమవుతాయి.

4.2.11 ఇదికేవలం అన్నమాచార్యుని సంకీర్తనల్లోని మాండలిక పద ప్రయోగానికి సంబంధించిన దిఙ్మాత్ర ప్రదర్శన మాత్రమే. ఇంకా లోతుగా పరిశీలించి, సూక్ష్మాతి సూక్ష్మమైన అన్నమాచార్యుని భాషారీతుల్ని ప్రత్యేకించి అన్నమాచార్యుని మాండలిక పదప్రయోగాన్ని గూర్చి పరిశోధన చేయవలసిన అవసర మెంతైనావుంది. దానివల్ల అన్నమాచార్యుని హృదయావిష్కారణకు సంబంధించిన తీరుతెన్నులను స్పష్టం చేయడమే గాక కొంతవరకైనా మనం ఋణ విముక్తులం కాగలమని భావిస్తాను.

### 4.3 క్షేత్రయ్య పదాలు - భాష :

అన్నమాచార్యులు తనపదాల్లో ధాతుమాతువుల్లో మాతువుకే ప్రాధాన్యమిచ్చి నాడన్నది పూర్వోక్తం. కాని క్షేత్రయ్య అలాకాక తనపదాల్లో ధాతు మాతువులకు అనగా సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమిచ్చి, దానికి అభినయం జోడించిన వాగ్గేయకారుడని విజ్ఞులకు తెలిసిందే. పైపెచ్చు తెలుగులో తిక్కన తరువాత తేటతెలుగు నుడులను, పలుకుబళ్లను ప్రయోగించిన జాతీయకవి క్షేత్రయ్య.

#### 4.3.1 జాను తెనుగు :

తెలుగు నుడికారంతో సర్వశోభాయమానంగా జానుతెనుగులో రచించడమే క్షేత్రయ్య విశిష్టత.

పల్లవి : వేళకాదుర గడియ—తాళరసామి।

అ. ప : చాలు చాలు పది—వేలకైన నిధి ॥వేళ॥
ఊరక నాపై నీ—నేరమెంచక
పోరుచు మాబావ—గారున్నారోయి
ఓరిమి నాతోడి—కోడలి పడకింట
చేరక యందుండ—మేరకాదోయి ॥వేళ॥

ఒద్దికతో మన—మిద్దరము కూడి
సుద్దులాడుట కిది—ప్రొద్దుకాదోయి
పద్దుమీరగ నా—పగవారి వద్దనే
సుద్దివిన్నంత—కొద్దికాదోయి ॥వేళ॥

(సీ.గి.వేం.వ. 86)

ఇందులో 'వేళ' అన్న శబ్దం తప్పిస్తే, సంస్కృత శబ్దాల ప్రసక్తిలేక తేట తెలుగు మాటలతో క్షేత్రయ్య ఎంత చక్కటి పదరచన చేశాడో గమనించవచ్చు. "ఊరక, నేరమెంచక, పోరుచు, ఒద్దికతో సుద్దులాడుటకు, పగవారివద్దనే సుద్ది విన్నంత, కొద్దికాదోయి" మొదలైన పలుకుబళ్ళ బలమూ, సొగసూ తెలుగు భాష తెలిసిన ఎవరికైనా అవగతమవుతుంది.

4.3.2 సామెతలు :

ఏ భాషకైనా సామెతలు, లోకోక్తులే జీవగర్రలు. ఆ భాషాతత్త్వాన్ని ఎంతగా ఒక కవి గుర్తించగలిగిందీ, అతడువాడే లోకోక్తులు, సామెతలనుబట్టి ఉంటుంది. అతికినట్లు, సందర్భోచితంగా లోకోక్తులను తెలుగులోవాడిన కవి చేమకూర వేంకటకవి అనీ, "అప్పటికున్న సాహిత్యాన్నంతటిని చాల సున్నితమైన విమర్శతో పరిశీలించిన కుశాగ్రబుద్ధి" అనీ తాపీ ధర్మారావు గారంటారు. నిజమే. చేమకూర సమకాలికుడైన క్షేత్రయ్యసైతం ఆనాటి భాషామర్మం బాగా తెలిసిన వాడే. అందుకాతడు వాడిన సామెతలే పరమ నిదర్శనాలు. "విప్రలబ్ధ"న్న నాయికను సఖి పరిహసిస్తూన్న "ఎన్ని పోకిళ్ల జోయేవే" (సీ.గి.వేం.సా. 27) అన్న పదంలో క్షేత్రయ్య మూడు సామెతలు ప్రయోగించాడు. ఇవి సహజ సిద్ధంగా, సందర్భోచితంగా వాటికవి వచ్చి ఆ పదంలో చోటు చేసుకొన్నాయి. 'అల్పం పటాభిక్షం' అన్న సంస్కృతంలోని సామెతను వాడాడు కవి "అల్పునికి ధరనైశ్వర్యము వచ్చితే అరదరాతిరి గొడుగు బట్టుకొన్నట్లు", 'ఎన్నడెక్కనివాడు గుర్రమెక్కితే ముందు వెనుకైనట్లు" అన్న సామెతలు సహజంగా నిత్య జీవితంలో తెలుగు వాడు వాడడం కద్దు. ఇది క్షేత్రయ్య తెలుగుభాషా జీవతత్త్వాన్ని గుర్తించిన విధం. ఇది మహాకవి లక్షణం. ఇట్లే మరికొన్ని సామెతలు మనం ప్రతిదినం వాడేవే కనిపిస్తాయి.

"అరటాకు సామెతయాట్లు (సీ. గి. వేం.స్వీ-128)

ఇంటగెలిచి రచ్చగెలువ వలెనను (సీ. గి. వేం.స్వీ-82)

ఈనిన పులివంటి కోపమెందు పోయెనో (సీ. గి. వేం. స్వీ. 48)

ఏ పుట్టలో ఏ మున్నదో ఎరుగనైతిని ( ,, ,, 84)

కలిమిలేములనగ కావడికుండలు ( ,, సా. 63)

కాలముపోవును కడకు మాట నిలుచును ( ,, ,, 15)

చలియించని నిండుకుండవలె నుండునమ్మ ( ,, ,, 97)

చిలుక బూరుగమాను ఫలము కాసించి

చింతించి నట్లాయనే ( ,, ,, 64)

చెరకు తీపని వేరుతో పెకలించేస్తి ( ,, ప. 13)
తనయ కేనొకటి తలంచితే దైవమొకటి
తలచినందుకు ( ,, స్వీ -49)
తలవ్రాతెవరికీ తప్పించవశమె ( ,, ప -31)
తెల్లనివెల్ల పాలు నల్లనివి నీళ్లనుచు ( ,, స్వీ -84)
నాపై గల ప్రేమ నీటిపై వ్రాలాయెనేమో ( ,, ,, -54)
పాముడి జోగివలె పాయెనా బ్రతుకు ( ,, ,, -35)
మక్కువ వాక్కున నొకటి మదినొకటి ( ,, ,, 131)
మేకవన్నె పులివంటి చెలులే ( ,, ,, -98)
వాసిగ నేరు గడచితే పుట్టివానికే బొమ్మన్నమాట
నిజమాయె (సీ-గి-వేం-స్వీ-173)
సౌరిది వ్రతముచెడిన సుఖము లేదాయెగదా ( ,, ప -84)

ఇట్లా సామెతలు సందర్భోచితంగా వాడి తెలుగులో తన పదకవితకు ఎంతో విశిష్టతని కొనితెచ్చాడు క్షేత్రయ్య.

4.3.3 పలుకుబళ్లు :

సామెతలలాగే పలుకుబళ్లు సైతం ఆభాషా జీవతత్త్వాన్ని బట్టివ్వ గలవన్న విషయం పూర్వోక్తం. సర్వజన విదితం. పలుకుబళ్లు లేదా నుడికారాలు అన్నవి ప్రతి భాషలోనూ ఉంటాయి. అవి దాని సొంతం. వీటిని సమంగా ఒక భాషలో నుంచి మరో భాషలోనికి అనువదించడం చిక్కైన సంగతి. ఇదే ఆ భాష గొప్ప దనానికీ కారణభూతం. క్షేత్రయ్య తన పదాల్లో తెలుగు పలుకుబళ్లను కోకొల్లలుగా వాడుకొన్నాడు అనడం కంటే అవి ఆయాపదాల్లో వచ్చిచేరాయి అనడమే సముచితం. "బాగాయె నీవగలెల్లమా – బాగాయె" (స్వీ-గీ. వేం-స్వీ. 1) అనే పల్లవిఉంది. ఇందులో పదంలోని ప్రధానభావం ఇమిడిఉంది. నాయకుడుచేసిన వగలను నాయిక దూషతూంది. "బాగాయె" అన్నది తెలుగు పలుకుబడి ఈనాడు గూడ రాయలసీమ పల్లెపట్టులలో 'బాగాయ, మాబాగాయ' అన్నమాటలు విని

పిస్తూనే ఉంటాయి. పల్లవి, అనుపల్లవి, తరువాత చరణాంతాల్లో పునరుక్తి చేయడంలో నాయకుని చేష్టలకు నాయిక ఎంతగా నిందిస్తూందో – ఆభావ సాంద్రతను, గాఢతను, స్ఫూర్తిని స్పష్టం చేస్తూంది. ఇదే ఆ పలుకుబడిలోని గొప్పదనం. అంతేగాక ఆయా పలుకుబళ్లకు, తెలుగుదనాన్ని, జాతీయతను స్పష్టంచేసే సామర్థ్యం ఉంది. అది కవియొక్క భాషామర్మజ్ఞతపై ఆధారపడి ఉంటుంది. తెలుగుభాషా స్వభావాన్ని పట్టి ఇచ్చిన తిక్కన తరువాత క్షేత్రయ్యనే పేర్కొనవలసి ఉంది. క్షేత్రయ్య పలుకుబళ్ల నన్నిటిని ఏర్చి కూర్చడం ఇచట సాధ్యమయ్యే పనికాదు. అందుకై ప్రత్యేకమైన కృషీ, పరిశోధనా అవసరం. అదే ఒక సిద్ధాంతవ్యాసం అవుతుంది. కొన్నింటిని మాత్రమే నేనిక్కడ పేర్కొంటున్నాను. అంగడిబెట్టకుము, అడుగులకు మడుగులొత్తిన, అదురు బెదురు లేక, అపురూప దర్శనం బాయె, అరటాకు సామెత, అసురు సురన్నది, అడితప్పకు దోసము, అనబెట్టి, అపదలేమైన కాపురము చేసేనా; ఆరుదూరు చేసెనే, ఇంతింత అనరాదమ్మా, ఇందు పిన్న పెద్దలెవ్వరు లేర, ఇరుచెవినెరుగనీక, ఇసుమంతయిన తెలియదాయె, ఈ రాయబార మెంతదాక నడిపెదవే, ఉట్టిపడట్టు, ఉన్నదా నామీద ఉల్లమునదయ, ఊరక అలిగినానటరే, ఎక్కడిజోలి, ఎన్నాళ్ల కెన్నాళ్లకు, ఏ పుట్టలో ఏ మున్నదో, ఏ మందుబెట్టిరో చెలులు, ఏమో నాటికాయెపోయె, ఐరాదేనేస్తము, కనులపండుగగాను, కనులార, కన్నీరు కావేరి కాలువసుమీ, కన్నుల గట్టినట్టుండు, కన్నుల నొత్తుక, కన్నెత్తి చూడదమ్మా కలనైనాగాని, కలకలమని నవ్వి, కాళ్లవేళ్ల బెనగుచు, కాళ్లుచేతులు తడబడు, కొండంత కాపురమే, కోపము ముక్కున నున్నది, గుత్తకానివలె, గుసగుసమని, చలించని నిండుకుండవలె, చేతిలో చేయివేసిన, చొక్కుపడి చల్లినట్లాయే, తగవుమాలిన దైవము, తలవాకిలి ఇల్లుసుమీ" ఇవి కొన్ని మచ్చునకు మాత్రమే. ఆయా సందర్భాల్లో ఆ పలుకుబళ్లను పరిశీలించినపుడే నిజస్థితి, స్వస్వరూపం స్పష్టం కాగలవు.

## 4.3.4 రాయలసీమ భాష :

క్షేత్రయ్య పదాల్లో రాయలసీమ వాడుకలోని భాషాపదాలు ఎడనెడ కనిపిస్తాయి.

"నామీద నెనరుగల్గి—నావారివలె నుండీ
యేమేమో విభునితో—నెగబోసిరే
ఆమాట నిజముచేసి—యతడిందు రాకున్నాడు
వామాక్షిరో। మేక—వన్నె పులివంటి చెలులే" (సీ-గి-వేం-స్వ్-98)

ఇందులో 'విభునితో నెగబోసిరే' అన్నది ఈనాడుగూడ రాయలసీమ పల్లెలలో వినిపించే మాట. "మేకవన్నె పులివంటి చెలులు" లేనిపోని కల్లబొల్లి మాటలుచెప్పి "విభుని" తనకు కాకుండా చేశారట. మొదటే కొంత అనుమానం గల నాయకునకు మరికొన్ని చాడిమాటలు చెప్పి, విభుని అనుమానాన్ని మరింత అధికం చేశారన్న అర్థాన్నిస్తుంది ప్రయోగం. "అడిగితే మీరేమైన నార్చేరో తీర్చేరో; అరులు మరులుచేసి, అనుగుసురు మనెను, ఆకడ జారుకొన్నాడు, ఆడాడ దిరుగుచు, ఆవేళ తెలియ కేమారితి, ఇదెక్కడి జోలి, ఈడకు, ఈప్రొద్దు మంచి దినము, ఎంతట ప్రొద్దుగూకదు, ఎదురెదురు చూచేవు, ఏమో నాటికాయె పోయె, కద్దోలేదో, కలకలనగుతూ (కలకలనవ్వుతూ), కావలెనమ్మా వానికట్ల, కుయ్యకు మని, గదిమి, గ్రక్కున దానింటికేగిన తడవ, చులకగా జూచెదవు, చులకన జేసి చూచేపట్ల, చౌక చేసినాడిక, తప్పు మ్రొక్కులు మ్రొక్కుచు, తాళగలదు, దేవు నాన, నన్నుంచు కొమ్మని, నీ కోపము కొల్ల పోవద్దా, నేడడి చెప్పసక్కము గాదు, వద్దులేని, పుణ్యమయ్యీని, పైనింద (ఒళ్లంతా) అలది, ఫలమేమి కద్దు, మందు బెట్టి, మందులమారిది, మగవాడు పాలుమాలివ గాని, మొన్నటాళనుండి, యాడైనా (ఎక్కడైనా), వంతులువేసి, వల్లెవాటువేసి, వాడీడకు వచ్చే మనసులేదు, వాని కోసరమై సందె జాముపేళ, సరిప్రొద్దు వేళాయె"—ఇవన్నీ ఈ నాటికీ రాయల సీమలో పల్లెప్రజల వాడుకలో మనం వినవచ్చు. ఇలాంటి వాడుకలను, పలుకు బళ్లను, ప్రయోగాలను గాంచిన డా॥ టి. కోదండరామయ్యగారు క్షేత్రయ్య రాయలసీమవాసి గావచ్చునని తలంచుచున్నారు. కాని క్షేత్రయ్య మొవ్వనుంచి మధుర వరకు, కన్యాకుమారినుంచి గోలకొండ వరకు—ఆంధ్రదేశమంతటా యాత్ర చేసినవాడు గనుక అతనిలో ఇలాంటి వాడుక లుండడంలో ఆశ్చర్యం లేదు.

### 4.3.5 కొన్ని వింత ప్రయోగాలు :

క్షేత్రయ్య పదాల్లో కొంతవరకు అపూర్వంగానూ, కొంత వింతగానూ ఉన్న ప్రయోగాలు కొన్ని క్వచిత్తుగా కనిపిస్తున్నాయి.

"వాడి వేడి శరముల వంటి నా చురుకు మాటలకు
వాడుగాగ తాళకొనివచ్చె నావిడిదికి" (సీ-గి-వేం--48)

ఇందు నాయిక అంటూంది నాయకుని సిగ్గుమాలిన తనాన్ని గూర్చి. "వాడి వేడి శరములవంటి చురుకు మాట" లట. వాడి శరముల వంటిమాట"లనడం సామాన్యమే. కానీ వాడితోపాటు "వేడి" సైతం ఉన్నదట. అవి మెుదటే చురుకు మాటలు—వాటికి వాడి, వేడి విశేషణాలను వాడి క్షేత్రయ్య నాయిక మాటల చురుకుదనాన్ని స్పష్టం చేశాడు.

"అసలాడి [అళబెట్టి (సీ-గి-వేం-స్వీ)-140]

కోపము సేయవచ్చునా [కోపగించ వచ్చునా (సీ-గి-వేం-స్వీ —101)]
దయవాడ ననెనట [దయగలిగిన వాడననెనట ( ,, -157)]
దాగియుండుకొని [దాగియుండి ( ,, -37)]
ననువంటిది [నా వంటిది ( ,, సా-37)]
పరవాసేయగ [క్షమింపగ ( ,, స్వీ-154)]
పొంచులువిని [పొంచివినుటలు ( ,, వ-41)]
పొగరుచునున్నారు [పొగరుతో నున్నారు ( ,, స్వీ-9)]

ఇట్లే కొన్ని పదాలు :

ఘట్లు [సా. గి. వేం. -సా-55] ఇవి నాణాలని తలంచారు దేవులపల్లి వారు. కానీ బంగారు ముద్దలు కావచ్చు. "బంగారు ఘట్లు" అన్న ప్రయోగం ఈనాచు రాయలసీమలో ప్రచారంలో ఉంది

తాణన [సీ-గి-వేం-సా-42], బేరా [ ,, సా -155] వీటి అర్థాలు సరిగా తెలియరాలేదు. పెకాసు [ ,, -42] బాగుగా అనుకోవలసి ఉంది.

### 4.3.6 అన్యదేశ్యాలు :

చివరిగా అన్యదేశ్యాల గూర్చి చెప్పడం అవసరం. దీనితోనే క్షేత్రయ్య పదాల్లోని అనంతముఖాలైన భాషా వైభవం సంపూర్ణమైన అవగాహనకు రాగలదు. అన్యభాషా సాహచర్యం వల్ల ఒకభాష ప్రభావితం కావడం, తన్మూలంగా పరిపాలనా విషయంగానూ, సాంస్కృతికంగానూ, అన్యదేశ్య భాషాపదాలు వచ్చి చేరిపోవడం సర్వసామాన్యమే. ఆదేవిధంగానే క్షేత్రయ్యభాషలో అన్యదేశ్యాలు కొన్ని చోటు చేసుకొన్నాయి. క్షేత్రయ్య మధుర, తంజావూరు, గోలకొండలలో ఆశ్రయం పొందినవాడు గనుక ఆనాటి మహమ్మదీయుల సంపర్కంతో ఉర్దూ, పార్సీ మొదలైన భాషాపదాలు క్షేత్రయ్య భాషలో చేరినట్లు స్పష్టం కాగలదు. "కస్తు, జాగా, తంబూర, తురాయి, దట్టి, దాదుఫిర్యాదు, దిమాకు, పటాని, పరవా (పర్వా), రవసెల్లా, రుమాల, వరాలు, సిస్తు, "పావడ, పావాలు, పైఠాణి, బారి, బుక్కా, బుట్టాలు, బురుసు"—ఈ పదాలు క్షేత్రయ్య భాషలో సందు చేసుకొని చేరిపోయి తెలుగు పదాలో అన్నట్లు ఇమిడిపోయాయి.

ఇలాగా క్షేత్రయ్య "పలుకు పలుకుకు తేనెలొలుక బలుకుచు" పదరచన చేసినట్లు, అతని భాషలో తెలుగు పలుకుబళ్ళు, నుడికారాలు, సామెతలు కొల్లలై తెలుగుజాతి జీవనాడిని పట్టించేవిగా ఉన్నట్లు స్పష్టమవుతుంది.

## 4.4 రామదాసు కీర్తనలు-భాష :

రామదాసు కీర్తనల్లోని భాష ప్రత్యేక శ్రద్ధతో ప్రయోగించి నట్లుండదు. అతని కీర్తనల్లో రామదాసు భక్తి, ఆర్తి, మొర మొదలైన భావాలకు తగిన రీతిలోను, భజన కూటములలో పాడుకొనే భక్తితో మై మరచిపోయే తీరులోను భాష ఉండడమే దాని విశిష్టత. ఉభయభాషా పాండిత్యంతో తెలుగులోనే గాక సంస్కృతంలోను కీర్తన రచన చేసినవాడు రామదాసు.

### 4.4.1 భావానికి తగిన భాష :

ఆయా భావాలకు తగిన భాషా ప్రయోగం రామదాసు కీర్తనల్లో ఉంది. రామదాసు యశోద అయి తన ఇష్ట దైవమైన శ్రీరాముని బాలకృష్ణునిగా భావించి జోలపాడి లాలించేరీతిని ఉచితరీతిని సాగిన కీర్తనలోని భాష పేర్కొనదగ్గది.

"పల్లవి : బూచివాలి పిలువ బోదునా ఓ గోపాల కృష్ణా ॥బూచి॥

అ. ప. : బూచివాని పిలువ బోతె వద్దువద్దు వద్దనేవు
ఆ చిచ్చి జోలపాడి అయి ఊచిన నిదురపోవు ॥బూచి॥
(కీ. -105)

ఇలా సముచితంగా కొనసాగుతుంది. ఇది పూర్వోక్తం.

ఇలాంటిదే మరో ఉదాహరణ. ఇందులో రామదాసు హఠం, మొర శ్రీరాము నిపై అంటే భగవంతునిపై భక్తునికుండే అధికారాన్ని ప్రదర్శించిన తీరు, అందు లోని భాష గమనించ దగ్గవి.

"పల్లవి : అడుగుదాటి కదలనియ్యను
నా కభయమియ్యక నిన్ను విడువను ॥అడుగు॥

అ ప : గడియగడియకు తిరిగితిరిగి
యడిగితిని వేసారవచ్చెను
గడువు తప్పిన నేనునిక బహు
దుడుకుతనములు సేయుదును నిను ॥అడుగు॥

చ : కుదురుగా కూర్చుండ నియ్యను
కోపమొచ్చిన భయము చెందను
మది నెరింగీ యుండుమిక మొగ
మాటమేమియు లేదుగద నా
హృదయ కమలమునందు నీ మృదు
పదములను బంధించివేతును ॥అడుగు॥
(కీ. 100)

అని ఈ విధంగా ఉచితంగా భాషను వాడినట్లు తెలుస్తుంది.

27)

4.4.2 పలుకుబళ్లు :

చక్కటి తెలుగు పలుకుబళ్లు సైతం ఉన్నాయి. ఆర్చేర తీర్చేర, రేపు మాపని, తేపతేపకు బ్రతిమాలినను, సాక్షిబెట్టియు, మారుపేరున బిలుపు, మునిగి తేలనాయె, దినదినము, దోసిలొగ్గితి, ఆరడి బెట్టుట, అరమరచేయకు, మూలదూరుక, పెదవులు తడుపుకోను, పిన్నపెద్దలు, కనుల కానుక, దూరభారము తెలియలేక, మేరతప్పు, గొబ్బున-మొదలైన వనేకం ఇందున్నాయి ఇలాగే సామెతలూ కలవు.

4.4.3 అన్యదేశ్యాలు :

కొన్ని అన్యదేశ్య పదాలున్నాయి. కన్నడ, తిరువడిగళె, తురాయి, బడాయి, కాలువా-మొదలైన అన్యదేశ్య పదాలు రామదాసు కీర్తనల్లో ఉన్నాయి.

ఇలాగా రామదాసు పదాల్లోని భాష భావోచితమై ఉందని స్పష్టమవుతుంది.

4.5 సారంగపాణి పదాలు-భాష :

మహాకవి తిక్కన తరువాత తెనుగుతేటని, తియ్యదనాన్ని బలాన్ని, మర్మాన్ని తెలుసుకొన్న పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఈ భాషా విషయంలో క్షేత్రయ్య పక్కనే నిలువగలవాడు సారంగపాణి. క్షేత్రయ్య తనపదాల్లో సందర్భోచితంగ వ్యావహారిక రూపాల్ని వాడడంతో సంతృప్తి పడ్డాడు. కాని సారంగపాణి వ్యావహారిక రూపాల్ని వాడడమేగాక ప్రత్యేకంగా మూడోభాగంలో జాతీయ పదాల్లో పామర ప్రజల వాడుకభాషని ప్రయోగించడం విశేషం. ఇది జానపద గేయాలకి సన్నిహితంగా ఉంది. అందలి భాష జానపదుల వ్యవహారానికి తగిన రీతిలోకూడా ఉంది.

4.5.1 ఉభయభాషా పాండిత్యం :

పల్లవి : అట్లాగె కావలె దానికి-హైశ్యావాసునాడు

అ. ప. : కొట్లాడిం దెరుగవటె వేణు-గోపాలుని పిలువ వద్దంటె ॥అ॥
వడ్డికి వేయమని రూకలు-గుడ్డతో గట్టియ్యగానే
సొడ్డు నెత్తినవేసి యురికె-జిట్టు మొన్నటితోనే విడిచే ॥అ॥

కలభూషణములన్నీ ముడిచీ–తలమాటున వుంచుకుంటె
మెఱుకువగా అంటుకొని జరిగె–చలువు నిన్నటితోనే విడచె ॥అ॥
పండుకునేయుండి పక్కలో–పయిపనులన్ని చక్కబెట్టి
కుండలు చట్లన్ని జల్లగడిగి–వుండింది వండింది వూడ్చుకపోయే ॥అ॥
(ప–140)

ఇలాగే యితని భాష సర్వశోభస్కరంగా ఉంటుంది. సారంగపాణి పదాల్లో చక్కటి తెలుగు పలుకుబళ్లు, సామెతలు, సందర్భోచితంగా ఉండి అతని పదాలకు శోభని చేకూర్చాయి. అన్యదేశ్యాలు సైతం ఈతని పదాల్లో చోటు చేసుకొన్నాయి. సంధి సమాసరీతుల్ని సైతం ఇందులో మనం గమనించవచ్చు

4.5.2 పలుకుబళ్లు :

పలుకుబళ్ళు లేక నుడికారాలు అన్నవి ప్రతిభాషా వైశిష్ట్యాన్ని, స్వభావాన్ని స్వాతంత్ర్యాన్ని ప్రకటించేవిగా ఉంటాయి. తెలుగుభాషా స్వభావాన్ని బాగుగా గుర్తించిన సారంగపాణి తనపదాల్లో పలుకుబళ్లని చక్కగా ప్రయోగించాడు.

అక్కరలేని కాపురమాయె (54), అడుగులకు మడుగులొత్తేనే (50), అడుగులోనే అరవై యారుగుణాలైతే (35), అసురుసు రనుకుంటే (52), ఆర్చేర తీర్చేర (1891), ఇంటింటి చెంద్రుడవు (35), ఇరుచెవ్వోరుగనీక (101), ఏమే మొగబోసిరో (70), కంచి గరుడసేవో (101), కనులెర్ర జేసె (37), కాలికి బొమ్మ గట్టనా (125), కోపేరు బెట్టైట్టు (90), గాంధారి తనాలు (117), గుటు చప్పు మనగ (198), గురకాయించితివో (131), గుసగుసలాడు (56), గోడ మీది పిల్లి (98) చిటుకమంటె కోపమైతే (44), చెయ్యెత్తి మొక్కిన (52), చెవినిల్లుగట్టుకొని చెప్పిన (48), తలదడివి బాసజేసిన (12), తిరుమల కొప్పు బెట్టించిన (92), నామము బెట్టిన (92), నీ పప్పేమి చిమిడిందిప్పుడు (93), నీ వొడ్డు పొడుగేమి (105), నేలమీద బొటనవ్రేలు రాయకే (30), పలుకే బంగార మాయెనా (85), పుడకేల విరిచేవు (30), పూసలలో దారమువలె (57), పెద వులు తడుపుచూ (134), పందాయెనా (10), మనస్సు విరిచె (44), మాటల పందిలి పెట్టకే (40), మీ పీధికి ఒక దండము (120), మూతులు బొడిచేవు (122), మెటుకలు విరిచి (37), మొగమంత కండ్లు జేసుకొనేవు (106),

మొగము చిట్లించగానే (76), రాతిమనసు (44), రావణమాయ (11), వక్కకైనా నాసలేదు (58), వృట్టి పండిందిపుడు (118), వేలు వంచరని (28), శుద్ధమడ్డి సాంబ్రాణి (4), సున్నజుట్టిన (91), హరిసాక్షిగ (55).

4.5.3 సామెతలు :

కవితలోని సామెతలు పాఠకులకు చక్కటి ఆమెతలు. పైగా జాతి స్వభావాన్ని అవి స్పష్టంచేస్తూ కవికి భాషపై గల అధికారాన్ని అభివ్యక్తం చేస్తాయి. ఇలాంటి సామెతలు సారంగపాణి పదకవిత నిండా మనోజ్ఞమై ఆనందాపాదియై ఉన్నాయి.

"అందరాని పండ్ల కాశించి నట్లాయె (177), అద్దెకొంప వంటిది యీ దేహమ్ము నిత్యమే (190). అరవై యేండ్లు జెల్లితే అర్లుమర్లు గాదటవే (124), ఇల్లలికితే పండుగాయెనా (125), ఈనగాచి నక్కకిచ్చినట్లు (79),

ఉడుముబోతే పోయినది, చై మాత్రం విడిచితే చాలుననే కథగా (58),

ఎంచబోతే మంచమెల్ల కంతలు (91), ఓడలు బండ్లౌచ్చు బండ్లునోడల బోవు (59),

కలిమిలేములనగ కావడికుండలు (59) కాలముబోవును కడకు మాట నిలుచును (59) కువ్వలు కాలిచి పెలాలుదినే (193),

కొంచేరాని సొమ్ము కొసరితే వచ్చునా (189),

కొండ కేగేవాని మొలను కొడవలి చెక్కి నట్లాయెనా (36),

కొండ ద్రొవ్వేలుకను బట్టుదురా (38), కోటిపద్యాలు నీ కూటికొరకే గదా! (92) కోతిచేతి మాణిక్యము సామెత కొమ్మమనస్సు (56) గోడమీది పిల్లి వలెనె పొంచి (98) చక్కలిగింతలు చత్రాతికి గలవ (38). తడి బట్టలతో గొంతులు గోసే (193). తిన్నయింటికి రెండుదలచే ద్రోహి (135), నక్షేటికి దోసి పుట్టిముంచె (193), ప్రాణమెక్కువచే మానముకన్న (125), పిల్లి దిన్న కోడిని రా రమ్మని పిలిచితే పలుకునే (79).

పుట్టించినవాడు పూరిమేపున (189). పుట్టినబుద్ధులు పుడకలతోసరి (193),
పెరటిచెట్టు మందుకు గైకోరని పెద్దలనగ వినమా (60),

బలంవత మాఘస్నానమాయె (85) బండెగొడ్ల వంటిది సంసారము (190) బిక్కి కాయదిన్న కోతివలె (191) మిద్దెమీద పరుగుడెణ్ణాళ్ళు సుమీ (190) మెతుకులు జల్లితే క్షితిలో కాకులుబాతె (102),

మొగమాటమున మాటలు తోయజాలక మునుపు యెవతో కడుపాయె నందురు (58), యీ తాకు రాలునా యే ఆకురాలిన (38) యెద్దుపుండు కాకిముద్దౌనా (193) యేతమువంగేది లోతుసీళ్లకే గదా (102) లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి (116) వినయమెల్ల ధూర్తలక్షణమనే విధమాయె గదమ్మా (68),

వుసురువంచేవుప్పమ్మకోగల (56) శివాశివా అతని మోముజూచి సేతు యాత్ర పోయివచ్చిన దీరదు (57).

### 4.5.4 వింత ప్రయోగాలు :

కొన్ని వింత ప్రయోగాలు సారంగపాణి పదాల్లో కనిపిస్తాయి. కోపాలు చేసేనే (10) (కోపగించు కొనెనే)?

చెలులు మందగా గూర్చేవు (తిర్యక్కుల సమూహానికి 'మంద' అని వాడటం కద్దు).

చులకతనము (చులకన), ఎంత ప్రాణదానవే (89),

తుసకారమచే (109) < తిస్కారమచే < తిరస్కారమచే

గాంధారి తనాలు (116)

వారానికి (119) [కోడుకు-కడప, అనంతపురపు వాడుక
కౌలుకి-ఉత్తర సర్కారులోని వాడుక]

తాటాకు వ్రాసేయమని (131) ఉత్తరం రాసేయమనడానికి)

బయిసారి పోయ్యేవు (132) బియిసి < బిగిసి

గర్వితొత్తు (135) (తిట్టు), పొంచులు విని (193) – పొంచి వినడం (ఇది క్షేత్రయ్యలోనూ వుంది)

భీష్మీకరించు (భీష్మించు అనడానికి బదులు)

వినికిచేసే (వినిపించే) బంగరుగెట్లు (15) బంగారు దిమ్మలు (క్షేత్రయ్య వాడాడు)

## 4.5.5 అన్యదేశ్యాలు :

సారంగపాణి పదాల్లోని భాషలో సమకాలికంగా వాడుకలో ఉన్న అన్య దేశ్య పదాల్ని ప్రయోగించడం సహజమే. ఇలాంటి పదాలు అనేకం.

అరబ్బీ, ఉర్దూ, పారశీ, హిందీ :— అత్తరు, అరే, అర్జీ: కరుచూ (<ఖర్చు), కుల్లాయి, కొజ్జ, కొత్వాల్‌గిరి. ఖాసా, ఖుల్‌దార్‌గా, చీటీ, జముఖానా, జాబులు, జేబు, ఝూడజేసి, తాజా, తేవణి, తంబురా, తురుష్కులు, దర్బారు, దివాలెత్తు, ధగిడీ, పక్కా, పాగ/గా, పావడా, బైజారు, బాపురే, బుక్కా, బుటే దారి, మహలు, రాజీ, (నీ యింటికి) రాంరాం, రుమాలు, లష్కరు, వరహా, శాబాసు, శాలువా, శీనా, సదరు, సలాము, సుబేదారుడు, స్వారి.

కన్నడం – బీగ (మాయె), హద్దు, హాయి, హౌసు.

తమిళం – తిరు (వీధి), తిరు (వీసము), నంబి, పిళ్ళ (పిళ్ళారయవలె) సీమాటి.

## 4.5.6 వ్యావహారిక భాష :

సందర్భోచితంగా ఇతఃపూర్వం వ్యావహారిక భాషను స్పృశించడం జరి గింది. సారంగపాణి పదాల్లో వ్యావహారిక భాష ఎలా ఒదిగి, ఆ పదాలకే ఎలా వాసి వన్నెదెచ్చి పెట్టిందో పరిశీలిద్దాం.

సారంగపాణి పదాలు నాలుగు భాగాలుగా ఉన్నాయనీ, అందులో ప్రథమ, చతుర్థ భాగాల్లోని శృంగారపదాలు, కీర్తనలు చాలవరకు లక్షణయుక్తంగాను, ద్వితీయ, తృతీయ భాగాల్లోని దేశీయపదాలు శిష్ట. శిష్టేతర వ్యావహారిక రూపంలో

ఉన్నాయన్న విషయం పూర్వోక్తం. అయినా శృంగారపదాల్లోను, కీర్తనల్లోను వ్యావహారిక రూపాలు లేకపోలేదు. శృంగారపదాలు గ్రామ్యోక్తి యుక్తంగా ఉండవచ్చు.

"పదములు శృంగారవధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంక మెఱిఁగి పలుకఁగ జెల్లున్"

(తాళ్ళపాక చినతిరుమలయ్య ; సంకీర్తన లక్షణము. ప–56)

కానీ వైరాగ్యపదాలు అలాగాక "అగ్రామ్యరమ్య విష్ణుచరితోదారమై" ఉండడం అవసరం. వీటినే ఆధ్యాత్మిక పదాలు అంటారు. అన్నమయ్య ఈ రెండు విధాలైన పదాల్ని రచించాడు. అదేరీతిని సారంగపాణి సైతం ప్రథమ భాగంలో శృంగార పదాల్ని, చతుర్థ భాగంలో కీర్తనల్ని రచించాడు. ఇందులో అక్కడక్కడ వ్యావహారిక రూపాలుండి సహజంగా ఆ పదాలు మనోజ్ఞమై రసభావ పరిపుష్టికి కారణభూతమై ఒప్పుతున్నాయి.

ఇంతకంటె ద్వితీయ భాగంలోని దేశీయపదాలు శృంగారపదాలే అయినా అవి దేశీయ పదాలని నామకరణం చేయబడి ప్రజలకు మరీ సన్నిహితంగా ఉన్నట్లు రచింపబడడంవల్ల వాటిలో శిష్ట వ్యావహారికం కనిపిస్తుంది.

పల్లవి : ఒక ధూపములేదే నీ సాక్షిగ
ఒట్టి పై బూటకమేనే యేమో

అ. ప. : ఇక ముందర ముత్యాల కుళ్ళాయి
యెన్నడో బెట్టేనట యిప్పుడు ॥ఒక॥

కానని నాసవతులు యీ వూళ్ళో
కల్పించేందుకు దొడ్డాశ్చర్యము
కానావున్నది రామాయణ మిది
లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి ॥ఒక॥

గుడుగుడు ఆలోచనలే గాని
కోమలి నేనొక పోడిమి యెఱుగను
అడిగి తెలుసుకొని పిమ్మట కాదను
తడకు దాసరి ప్రతిష్ఠ వంటిది ॥ఒక॥

ఏణాక్షిరో యీ సాంబ్రాజ్యానికి
యేమిటికే గాంధారితనాలు
వేఙుగోపాలుడ ననుగూడి
వేళ్ళ వుంగరాలిచ్చే ననేరు" ॥ఒక॥

(ప-116)

పల్లవిలోని, అనుపల్లవిలోని వాక్యాలు, చరణాల్లోని వాక్యాలు చక్కటి వ్యావహారిక భాషకుదాహరణాలు. నీ సాక్షిగ, ఒట్టి పై బూటకమేనే, కానని నాసవతులు, దోడ్డాళ్ళర్యము, శానావున్నది రామాయణము, లోనిగుట్టు పెరుమాళ్ళకు తెలివిడి_మొదలైన రూపాలు తక్కిన రెండు చరణాల్లోని వాక్యాలు సహజ సుందరమైన వ్యావహారికం. ఇలా ద్వితీయ భాగమంతా కన్పిస్తుంది.

## 4 5.7 రాయలసీమ వ్యావహారికం :

సారంగపాణి పదాల్లోని భాష ప్రధానంగా రాయలసీమ వ్యావహారికమూనూ, ప్రత్యేకించి చిత్తూరు మాండలికమూనూ, అయినా తదితర మాండలికాలు_అంటే రాయలసీమకంతా సమానమైనవి – లేకపోలేదు. పూర్వోక్తమైనట్లు తృతీయభాగం లోని జాతీయపదాలు రాయలసీమకు ముఖ్యంగా చిత్తూరుకు సంబంధించినవి. అంటే పామరజనోచితమైన వాడుక భాషని సారంగపాణి ప్రయోగించాడు. ఒక ఉదాహరణ :

పల్లవి : అగ్గితిరణాలంట అజ్జుని కతలంట
అవురా యెంత సోద్దెమే
బారతకత – బారా యెన్నింతలే

అనుప : సుగ్గీజయము దీనిసుట్టు బలాదూరు
అగ్గురోరపు అయ్యోర్నడిగే నీ సాచ్చిగ (ప–153)

దీనిలో పామర ప్రజలనోళ్లలో నలిగిన సంస్కృత పదాలు వారి వాడుకకు తగినట్లు, అమరినట్లు ఒదిగిపోయాయి. మరొకక్కటి ఉదాహరణ—

పల్లవి : నాన్నారము చంక్లో నానా దించుందెంట
నయముగిచ్చేరంటనె - సూడే

అ. ప. : ఈన్నే పొద్దెక్కనే - యీడేడుండా - దెంటె
కోణ్ణి గొండపోతే - కొందురే నొగుర్లైన" (ప-154)

ఇందులో రాయలసీమలోని సామాన్య జనుల వాడుకరూపాలెన్నో ఉన్నాయి. నానా దించుందెంట, ఈన్నే, పొద్దెక్కనే, యీడే డుండాదెంటే, కోణ్ణి కొండపోతె కొందురే నొగుర్లైన, యీసుల్లెమగ్గవే, మలుగు శాపలాడ మస్తటనె, అలసొచ్చే తల్కడ, పదిదోచలు తినోరెండుకోని, ఆడనిల్లు దాగి అగ్గి లేసురుకెత్తి" — ఇవన్నీ పామరుల వాడుకలో ఈనాడున్నాయంటే ఈ భాష ఎంత బలమైందో స్పష్టమవుతుంది. ఇంకా ఇలాంటి వెన్నో ఉన్నాయి వాడుకరూపాలు.

పై పరిశీలనవల్ల సారంగపాణి పండిత భాషనేగాక పామరుల వ్యావహారిక భాషనుకూడ ప్రయోగించాడని స్పష్టమైంది. తాను ఆస్థాన విద్వాంసుడైనా సామాన్య జన సన్నిహితంగా ఉండినట్లు సువిదిత మైంది. కనుకనే అతని భాష ప్రజలభాష; అతడు ప్రజాకవి :

## 4.6 త్యాగరాజు కృతులు — భాష :

త్యాగరాజు నాదోపాసనతో శ్రీరామభక్తితో ముక్తిపొందిన భక్తాగ్రేసరుడు. అతనికతడే సాటి. అన్నమాచార్యుల సంకీర్తనల్లో ధాతుమాతువుల్లో మాతువుకు ప్రాధాన్య మిచ్చినట్లు, క్షేత్రయ్య ధాతుమాతువులకు సమ ప్రాముఖ్యమిచ్చినట్లు ముందు చెప్పుకొన్నాం. కానీ త్యాగరాజు తన కృతులలో ధాతుమాతువుల్లో ధాతువుకే ప్రముఖ స్థానమిచ్చినట్లు తజ్ఞుల అభిప్రాయం. ఈ విషయాన్ని గురించి సంగీత సాహిత్య వేత్తలైన పెద్దల అభిప్రాయాలిలా ఉన్నాయి.

"గేయ కల్పనలో అపూర్వశక్తి, అసాధారణ ప్రతిభలు గల ధీశాలి అతడు పాటను నేర్చినంత శ్రద్ధతో మాటను నేర్వలేదు. సంగీత భావము ముందర సాహిత్య భావము గౌణముగానే నడుచును ఇట్లగుటకు కారణము — త్యాగయ్యకుం గల అపారమైన గాన విద్యా పాండిత్యమే. నాకు జూడఁగా పాటను నేర్చినంత శ్రద్ధతో అతడు మాటను నేర్వలేదు. మాటయందతనిది ఇంచుమించు పోతన్న వంటి సహజ పాండిత్యము. పాటలో నట్లుగాదు. సుప్రసిద్ధులగు సొంటివారి శిష్యుడు, మీదుమిక్కిలి నారద మహర్షి యనుగ్రహమునకు పాత్రుడు 'రజత గిరీశుడు నగజకు దెల్పు స్వరార్ణవ మర్మములు విజయముగల త్యాగరాజు కెరుకే' అనుగొప్ప ఆత్మ ప్రత్యయముగల ప్రౌఢమైన పండితుడు కనుకనే అతని సాహిత్యము మూడుపాళ్లు సంగీతము నాశ్రయించి ఆ కుమరుఁగు పిందెవలె నున్నది. సంగీత భావము ముందర సాహిత్యభావము గౌణముగానే నడుచును"[1] అని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి తీర్మానం.

"సాహిత్య శృంఖలాబద్ధమైన సంగీతమును విడిపించి త్యాగరాజస్వామి సాహిత్యము నప్రధానము చేసి, సంగీతము స్వేచ్ఛావిహార మొనర్పుటకై నూతనములు, సుందరములునైన కృతులను దివ్యభవనరాజములను నిర్మించినాడు"[2] — అని విస్సా అప్పారావుగారి భావం.

"త్యాగరాజు తనకృతులలో బొత్తిగా గ్రామ్యముగాని, వీర గ్రాంథికమునుగాని వాడక, శిష్ట వ్యావహారికమునే వాడినాడు త్యాగయ్య శ్లేషార్థముల పొంతకు పోలేదు. ఏకపత్నీవ్రతుడే, పలువిధాలైన చెడు దుర్విషయములవంటి వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు చేశాడుగాని, సంగీత విషయంలో ఆ మాత్రం స్వాతంత్ర్యం ఉండవచ్చునని పెద్దల అభిప్రాయం. ఈయన కీర్తనలలో వ్యావహారిక సంభాషణలలో దొర్లే లోకోక్తులూ, జాను తెలుగు పలుకుబళ్లూ కుప్పలుతిప్పలు,[3] — అని బాలాంత్రపు రజనీకాంతరావుగారి అభిప్రాయం. ఇలాంటి త్యాగరాజు కృతులలోని భాషను ఆస్వాదిద్దాం.

4.6.1 తేటతెలుగు :

త్యాగరాజు చక్కటి తేటతెలుగునే ముద్దులొలికేట్టు వాడిన పట్టులున్నాయి. ఓ చక్కటి ఉదాహరణ :

కద్దనువారికి కద్దుకద్దని మొరలిడు
పెద్దల మాటలు నేడబద్ధమాను ॥కద్దను॥

అద్దంపు చెక్కిళ్ళచే, ముద్దుగారు మోముఁజూడ
బుద్ధి గలిగినట్టి మావద్ద రావదేమిరా ॥కద్దను॥

నిద్దుర నిరాకరించి ముద్దుగా తంబురబట్టి
శుద్ధమైన మనసుచే సుస్వరముతో
పద్దుతప్పక భజియించె భక్తపాలనము చేయు
తద్దయశాలివి నీవే త్యాగరాజ సన్నుత ॥కదను"॥

(త్యా. కీ-I-71)

ఇలాగే మరో చక్కటి కృతి సరళమైన తెలుగునుడులతో రచన సాగింది.

"ఘుని దాసుడనే పేరాశచే
బొంకులాడితిని నా బుధమనోహరా ॥ఘు॥

అవివేక మానవుల (గోరికోరి
అడ్డత్రోవఁ దొక్కితినా (బ్రోవవే ॥ఘు॥

చాలు సౌఖ్యమో కష్టమో నేను
జాలి చెందితినా సరి వారిలో ॥ఘు॥

పాలముంచిన నీటముంచిన
పదములేగతి త్యాగరాజనుత ॥ఘు॥

(త్యా. కీ-I-94)

ఇలాగా అన్నీ భావాలకు తగినరీతిలో భాష తనకుతాను వొదిగి ఉండడం గమనించవచ్చు. కారణం త్యాగరాజు సహజకవి.

4.6.2 సామెతలు :

త్యాగరాజు కృతులలో సామెతలలాంటి సూక్తులు కోకొల్లలు

"వృషభములు అటుకుల రుచియెరుగునా,

కాలముపోను మాట నిలుచును,

పాలముంచిన నీటముంచిన నీవేగతి"

"రూకలుపదివేలున్న చేరెడు నూకలు గాని ఓ మనసా !

కోకలు వేయున్న కట్టుకొనుట ఒకటేగాని,

ఏరునిండి పారిన పాత్రకు తగునీరు వచ్చుగాని,

సారమౌ కవితల విని వెర్రివాడు సంతోషపడియేమి పడకేమి,

ఇరవందగ భుజియించు సమయమున ఈగతగులు రీతినున్నది,

సోమిదమ్మ సొగసుగాండ్ర కోరిన సోమయాజి స్వర్గార్హుడగునో"

ఇలాంటి వెన్నో సూక్తులు, సామెతలు త్యాగరాజ కృతులలో గమనించగలం.

ఇలాగా పదకవుల పదాల్లోని భాషా విశేషాలు మనకు స్పష్టమై ఆయాకవుల హృదయాలను ఆవిష్కరిస్తున్నట్లు విదితమవుతుంది.

## సూచికలు :

1. రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ – త్యాగరాజయ్య సాహిత్యము.
ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక – 1965-పు-246-247.

2. విస్సా అప్పారావు - త్యాగరాజస్వామి – విజ్ఞాన సర్వస్వము.
సం-3. పు-1076-1077.

3. బాలాంత్రపు రజనీకాంతరావు - ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము. పు-336.

# 5.0 శృంగారం, భక్తి, నీతి, వైరాగ్యాలు

పూర్వ ప్రకరణాల్లో పదకవుల కవితా వైభవం, భాషా విశేషాల్ని చవి చూశాం. పదకవులు పోషించిన శృంగారరసం, మధురభక్తి, భక్తి, అనేవాటిని వివరించి, వారు గానించిన నీతి, వైరాగ్య బోధనల్ని స్థాలీపులాక న్యాయంగ తెలుపడం ఈ ప్రకరణోద్దేశ్యం. ప్రముఖ పదకవులను మాత్రం ప్రతినిధులుగా గ్రహించివారి పదాల్లోని పై అంశాల్ని వివరించడమే ప్రస్తుత ప్రయత్నం.

## 5.1 శృంగారం :

అన్నమాచార్యులు, క్షేత్రయ్య, సారంగపాణి, ఇతర పదకవూలూ, జావళీలు, సల్లాములు రచించిన పదకారులూ ఈ శృంగార పూరితమైన పదరచన చేశారు

### 5.1.1 అన్నమాచార్యులు - శృంగారం :

అన్నమాచార్యులు శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలు అని రెండు విధాల పదాలు రచించాడు. అందులోని పదాలు —

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమవీధులై వివిధ మంత్రార్థములై నీతులై
కృతులై వేంకట శైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ (య) (ల) పాకయన్నయవచో నూత్న క్రియల్
చెన్నగున్ ॥[1]

అంటే శృంగార సంకీర్తనలు "వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యంబులు". ఈ శృంగార పదాల్లో గ్రామ్యోక్తులుండవచ్చునట

"పదములు శృంగారవధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంకి మెఱిఁగి పలుకఁగ జెల్లున్"[2]

"విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః"[3] అని భరతముని రససూత్రం. అంటే విభావానుభావ వ్యభిచారి భావాల సంయోగంవల్ల రస నిష్పన్న మవుతుంది. ఇలాగే దశరూపకంలో—

"విభావై రను భావైశ్చ సాత్త్వి కైర్వ్యభి చారిభిః

ఆనీయమానః స్వాదుత్వం స్థాయిభావో రసస్మృతః"[4]—అని ధనంజయుని నిర్వచనం. అంటే విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావాలచేత ఆస్వాద్య మాన మైన స్థాయి భావమే రసమని అర్థం. స్థాయి అంటే స్థిరంగా ఉండేది. స్థాయి భావమంటే రసస్ఫూర్తి వరకు సహృదయ హృదయాల్లో నిలిచిఉండేది. కావ్యపఠనం వల్ల సహృదయుల హృదయాల్లో కలిగే ఆనందమే రసం. నవరసాల్లో రసరాట్టు శృంగార రసం. నాయికా నాయకుల హృదయాల్లో పుట్టే సంభోగ సంబంధమైన కామం అంటే అభిలాషను రతి అంటారు. స్త్రీ పురుషులు అన్యోన్యాలంబనం గల ప్రేమాఖ్యమైన చిత్తవృత్తి విశేషం రతి అని రసగంగాధరం. ఈ రతి అంకుర, పల్లవ, కలికా, ప్రసూన, ఫలభోగావస్థలలో ప్రేమ, మానప్రణయ, స్నేహ, రా, గాను రాగాలనే పేర్లతో పేర్కొన బడుతుంది. ఈ ఆరవస్థల్లో మొదటి అయిదూ పూర్వ రాగంలోనూ, ఆరవదైన భోగం సంభోగంలోను కలుగుతాయి ఈ శృంగార రసం—సంభోగ శృంగారం, విప్రలంభ శృంగారం అని రెండువిధాలు. సంభోగ శృంగారం కేవలసురత రూపంలోనే గాక దర్శనం. ఆలింగనం, చుంబనం మొదలైన అనేక విధాలుగా ఉన్నా వీటన్నింటినీ కలిపి సంభోగ శృంగారమన్నారు. విప్రలంభ మంటే వియోగం. ఇది అభిలాష (అయోగలేక పూర్వరాగ) విప్రలంభం, మాన (ఈర్ష్యా) విప్రలంభం, విరహ విప్రలంభం, ప్రవాస విప్రలంభం అని నాల్గు విధాలు. మానవిప్రలంభం—ప్రణయ మానమూ, ఈర్ష్యా మానమూనని రెండు విధాలు. ఇలా శృంగారమిన్ని రీతులుగా ఉంది.

అన్నమాచార్యుడు స్వీయ నాయికా శృంగారమే అధికంగా వర్ణించాడు. శృంగార పరమార్థాన్ని "ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపము మరి యిదిగాక వైభవంబిక నొకటి గలదా" అనీ, "అదిగాక సౌభాగ్యమదిగాక వలపు అదిగాక సుఖమిక నందరికి కలదా ?" అంటూ వివరించాడు.

అన్నమాచార్యుడు శృంగారాన్ని కేవలం సురత రూపంలోనేగాక, పరస్పర దర్శన, ఆలింగన, చుంబనాదుల రూపంలో వర్ణించాడు. ఇందుకు ఔచితీ సహమైన ఉదాహరణ :

"లలిత లావణ్య విలాసముతోడ
నెలత ధన్యత గలిగి నేటితోడ ॥పల్లవి॥

కుప్పలుగా నై నసలుకొన్న కస్తూరితోడ
దొప్పదోగేటి చెమటతోడ
అప్పుడటు శశిరేఖనైన చనుగవతోడ
చప్పిదేరేటి మోము దమ్మితోడ ॥లలిత॥

కులుకు గబరీభరము కుంతలంబులతోడ
తొలగ దోయని ప్రేమతోడ
మొలక నవ్వులు దొరుకు ముద్దు జూపులతోడ
పులకలు పొడవైన పొలుపుతోడ ॥లలిత॥

తిరు వేంకటాచలాధిపుని పన్ననతోడ
సరిలేని దివ్య వాసనలతోడ
వరికించరాని అరి విరి భావముతోడ
సిరిదేల (లం) కెడి చిన్ని సిగ్గుతోడ ॥లలిత॥ (12–130)"

సంభోగశృంగార వర్ణనకు చక్కటి ఉదాహరణ :
"ఏమొకొ చిగురుటధరమున – యెడనెడ గస్తురినిండెను

భామిని విభునకు వ్రాసిన – పత్రిక కాదుగదా"—అనే పదంలో చమత్కార యుతమైన రచన చేసినట్లు స్పష్టమవుతుంది.

అన్నమాచార్యుడు వర్ణించిన నిర్మల ప్రేమకుదాహరణ :

"కలలోనే యిరవురము నలిగివేగ
కలయనుచు దెలిసి నిను గౌగలించితిరా ॥పల్లవి" (12-21)

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాలుగు విధాల విప్రలంభ శృంగారాన్ని అభివర్ణించాడు. విరహ విప్రలంభ శృంగారం :

"చెలియకు విరహపువేదన సేయని సింగారంబిది
పొలవక వలపుల ముద్రల చొప్పులు మాపకుడీ ॥పల్లవి॥

కిక్కిరిసిన చనుగుబ్బలు గీటినబగిలెడినయ్యో
పక్కన గనుకలిదాకీ బయ్యెద దెరవకుడీ
వెక్కసమగు ముఖకాంతికి వెద వెడ మరుగై తోచెడి
చెక్కుల చెమటలు గందెకి చేతులు వెట్టకుడీ ॥చెలియ॥

అంగనమేనికి బులకలు అడ్డము దోచెడినయ్యో
బంగరు మొలకలవంటివి పై పై దడువకుడీ
తొంగలి రెప్పల కెలకుల తొరిగెడు కన్నుల మెరగుల
ముంగిటవేసిన చూపుల మురిపెము మానుపుడీ ॥చెలియ॥

తిరువేంకటపతి నింతికి దెచ్చేదమనగా నయ్యో
కరుణించిన వాడాతని కళవళ మందకుడీ
తరుణీమణి మాదేవుని దగగౌగిట సౌఖ్యంబుల
పరవశమందినదేమో పలువురు బిలువకుడీ ॥చెలియ॥ (12-80)

ఏ ప్రౌఢ ప్రబంధకవికీ తీసిపోని రీతిని శృంగార భావోపపన్నంగా పద రచనచేసి అనన్య సామాన్యంగా తన ప్రతిభా నైపుణ్యాల్ని చాటిన వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు. అందుకీ కింది పదమే ఉదాహరణ :

"సొంపుల నీ వదనపు సోమశిల కనుమ
యింపులెల్ల జేకొనగ నిల్లు నీపతికి ॥పల్లవి॥

కలికి నీపిరుదనే గద్దె రాతికనుమ
మొలనూళ్ళ లతలనే ముంచుకొన్నది
కలయ బోకముడినే కట్లు వడ్డది
అలరు విలుతు దాడి కడ్డము నీపతికి ॥సొంపు॥

ఇదివో నీకెమ్మోవి యెఱ్ఱ శిలకనుమ
కదిసి లేజిగురుల గప్పుకొన్నది
వదల కింతేకు దలవాకిలైనది
మదనుని బారికి మాటువో నీపతికి ॥సొంపు॥

కొంత నీ చిత్తమే దొంగలసాని కనుమ
యింతటి వేంకటపతి కిరవైనది
పంతపు నీ గుబ్బలే గుబ్బలి కొండకనుమ
మంతనాల కనుమాయె మగువ నీపతికి ॥సొంపు॥

ఇంత మనోహరంగా చెప్పిన పదకవిత తెలుగు కవితకే తలమానిక మంటే అత్యుక్తి కాదు.

ఇలాగా మనోహరంగా శృంగారవర్ణన గావించి తరించినవాడు అన్నమాచార్యుడు.

### 5.1.4 క్షేత్రయ్య-శృంగారం :

శృంగార రసాధి దేవతను సర్వవిధాల దర్శనం గావించుకొని అభివర్ణించి తరించిన వాడు క్షేత్రయ్య. అతని పలువిధాలైన శృంగార రసావిష్కరణను పరిశీలిద్దాం.

ఉదాత్తాన్విత భావస్ఫోరకమైన నిర్మల ప్రేమతో గూడిన శృంగారం ఈ పదాల్లో మనం చూడగలం. దీన్నే మనం అమలిన శృంగారం అనవచ్చు. ఒక నాయిక నాయకుని ఉత్తమ గుణాల్ని తెలుపుతూంది.

29)

"పల్లవి. దూరమెంచక యిటుల సామిపై-దూరు లేల బలికేరే?

అ.ప. తారుమారు మాటలేల నాడేరే? తరుణులార!

తాళరెఇక చాలును ||దూర||

ఎన్నదగిన చెలులతోడ జెలిమిగ-నెన్నడైన బలికినా?
కన్నెలెందరెన్ని వగలు చేసిన-కన్నులెత్తి చూచినా?
వన్నెమీర నెవరేమి పల్కిన-విన్న విననిరీతి నుండుసామి
చెన్నుమీర నా చెలిని కూడెనని-చిన్న మాటలేల నాడేరే? ||దూర||

వారియిండ్లకెల్ల నాసామి-వలసిపోయినాడా?
కోరికోరి భేదనములొసంగి-వారి వేడుకొన్నాడా?
వారిజాక్షి తా పద్దకిరమ్మని-వలసి సొలసి చొక్కితినని పిలువగ
చేరబోయి దాని జూచినేనని-మీరి భ్రమిసి కూడెనేమొ తెలియదు ||దూర||

కంతు జనకు మువ్వగోపాలు దే-కాంతమునను మునునన్నుగూడి
కంతుకేళి లోపల బిగికౌగిట-గళలంటి మెలగుచును
వింతవింతవగ కుల్కు స్వామి యే-యింతికైన, దక్కునా? యూరకె
రంతులేల జేసేరే! మిక్కిలి రమణులార? వానిమనసు తెలియక ||దూర||
(సీ-గి-వేం-సా-61)

ఇందులో నాయిక నాయకుని సుగుణాల్ని ఏకరువుపెట్టి చెలికత్తెలను మందలిస్తూంది. మరోనాయిక "అక్కరో! యెవ్వనివారు సరసుడుగాడని ఆడుకొంటే-ఆడుకొనేరు "(సీ-గి-వేం-1) అన్నపదంలో నాయకస్మరణ, కీర్తన దర్శనాలవల్ల ఎంతో సంతోషం కలుగుతుందనిచెప్పి అమేయమైన ఆనందాన్ని ప్రకటిస్తూంది. ఇంతకంటే నిర్మలమైన శృంగారం ఎక్కడుంటుంది? "నా మనసువంటిదే" (సీ-గి-వేం-సా-62) పదంలో నాయకునిపై గల నిర్మలఅనురాగం, "తెలిసి తెలియలేక పలికేరు చెలులు" (సీ-గి-వేం-స్వో-115) అనేపదంలో చెలులను మందలించడంవల్ల నాయకుని పైగల ప్రేమా, 'ఇద్దరివలనేగూడి" (సీ-గి-వేం-స్వో-65) పదంలో ఇద్దరిబద్ధికా వర్ణించబడ్డాయి. ఇక్కడ నాయకుడు నిర్మల ప్రేమానురాగాలు గలవాడుగా కనిపిస్తాడు.

"అలిగి ఏలయిందు వచ్చితి", "ఎటువంటి స్త్రీల పొందైన హితివైయుండునా" "ఏమిసేయుదు మోహమెటువలెదీరును." (సీ-గి-వేం-స్వీ-155,165,168) మొదలైన పదాల్లో నాయకుని నిర్మలమైన ప్రేమ అభివ్యక్తమవుతుంది. శారీరకమైన కాముక శృంగారం కంటే ఇందులో వ్యక్తమైన నిర్మలప్రేమ మహత్తరమైంది.

అయితే కేవల శృంగారం—సంభోగశృంగారం—వర్ణితమైన పదాలు అనేకం ఉన్నాయి. "నిదురవచ్చునా కంటికి చక్కనిసామి", "నేరమా కొమ్మా! వాడెందుకే చేరరాడమ్మా" "ఎన్నటికో నాకొమ్మను జూచేది" (సీ-గి-వేం-స్వీ-12?,179,77) ఈ మొదలైన పదాల్లో సంభోగశృంగారం వర్ణించబడ్డది. వీటిలో ఆలింగనం, చుంబనం, కుచగ్రహణం, రతి మొదలైనవన్ని వర్ణించబడ్డాయి. "మగువతన కేళికా మందిరము వెడలెన్" (సీ-గి-వేం--వ-19) పదంలో రత్యనంతరం నాయికా స్వరూపమూ, "ఒక్క ఘడియకే యిలాగైతే యిదేటి ఘనమే" (సీ-గి-వేం-స్వీ-99) పదంలో శృంగారసాత్విక భావాలు చక్కగా అభివ్యక్తం చేయడం జరిగింది. ఇలాగా సంభోగ శృంగారపదాలు ఎన్నైనా ఉదాహరించవచ్చు.

నాల్గు విధాల విప్రలంభ శృంగారమూ క్షేత్రయ్య పదాల్లో ఉంది. "వినా విప్రలంభేన సంయోగః పుష్టిమశ్నుతే" అని లాక్షణికమతం. అంటే విప్రలంభం లేకుంటే సంయోగం పుష్టి, తుష్టి—పొందదని అర్థం. ఈ విప్రలంభ శృంగారం సంయోగ శృంగారం కంటే ఉదాత్తమైంది. కారణం సంయోగ శృంగారంలో అసభ్యత కవకాశముంటుందేమో కానీ ఇందులో దానికి వీలులేదు. కనుకనే ఇది ఉదాత్తం. మహాకవులీ విప్రలంభ శృంగారాన్ని ఉదాత్తంగా పోషించి అనౌచిత్యాన్ని పరిహరించడం జరిగింది. అదేవిధంగా క్షేత్రయ్య సైతం మనోజ్ఞంగా ఈ విప్రలంభ శృంగారం పోషించినట్లు వ్యక్తమవుతుంది.

### ?.1.3 సారంగపాణి—శృంగారం :

సారంగపాణి పదాల్లోని ప్రథమ, ద్వితీయ భాగాలైన పదాలు శృంగార పదాలు. ఇవి శృంగారరస నిర్భరమై ఒప్పుతున్నాయి. శృంగార నాయకులు స్వీయ, పరకీయ, సామాన్య అని మూడు విధాలు. ఈ త్రివిధ నాయికా శృంగారం మొదటి భాగంలోను, రెండో భాగంలోని దేశీయ పదాల్లో కేవలం పరకీయ శృంగారాన్ని అభివర్ణించాడు సారంగపాణి.

ఇట్లే శృంగారం ఇన్ని విధాలుగా విస్తరించింది. ఇన్ని విధాలైన శృంగారాన్ని తనపదాల్లో అభివర్ణించి తరించిన ఉత్తమ వాగ్గేయకారులు క్షేత్రయ్య, సారంగపాణి, సభాపతి, పరిమళ రంగపతి మొదలైనవారు. క్షేత్రయ్య ఎక్కువగా స్వీయ నాయికలా ఆ తరువాత పరకీయ నాయికలా శృంగారాన్ని, తక్కువగా సామాన్య నాయికా శృంగారాన్ని అభివర్ణించాడు. ఇతడు ఎన్నికచేసిన స్వీయ నాయికా శృంగారాన్ని బట్టి ఆతని పదాలకు ఉదాత్తత చేకూరింది. సారంగపాణి సామాన్య శృంగారం ఎక్కువగా వర్ణించాడు. పరకీయ శృంగారాన్ని వర్ణించినా దాన్నితడు గర్హించాడు. కానీ సామాన్యనాయికా శంగార వర్ణనలో క్షేత్రయ్యకంటె గూడ సారంగపాణి వాస్తవ జీవితానికి సన్నిహితంగా ఉన్నట్లు తోస్తాడు. కారణం సామాన్యజన జీవన విధానాన్ని చక్కగా సారంగపాణి పదాల్లో అభివర్ణించిన సంగతి, ప్రజాభాషని ప్రయోగించిన విషయమూ పూర్వోక్తం. క్షేత్రయ్యలాగానే సారంగపాణి తనపదాల్ని శృంగారరస నిర్భరంగా రచించాడు. ఈ శృంగారపదం ఒకొక్కటీ ఒకొక్క ముక్తకం; దేనికదే స్వయం సంపూర్ణమై రసభావాదుల పరిపోషకమై ఉంటుంది. ఇందులో నాయకుడు వేణుగోపాలుడు; దక్షిణనాయకుడు. నాయికలు అనేకులు. నాయకునిపై ఆయా పదాల్లోని నాయికలకు అనురాగముంది నాయికయందు నాయకుడు రతిచిత్తం గలవాడు. కాబట్టి ఆ నాయికా నాయకులరతి స్థిరమైనది. అది స్థాయిత్వత మవుతుంది. భావోద్దీపకమైన సామగ్రి ప్రతి పదంలోను ఉంది. నాయికకు నాయకుడు, నాయకునికి నాయిక పరస్పరం ఆలంబనం. ఆయా నాయికల హావభావాది శృంగార విలాసాదులు అనుభావాలు, నాయికస్థాయి రతి సాగరంలో అసూయాదులు, శంకాదులు, ఉత్సాహాదులులీనమై అనితర శోభని చేకూరుస్తూంటాయి. ప్రియదర్శనాదులవల్ల కలిగే నాయిక సాత్వికస్థితి పదాల్లోఉంది. విభావాదుల సంయోగంవల్ల రతి స్థాయి శృంగారరస పర్యవసాయి అయి ప్రతిపదం సహృదయ హృదయంగమమై ఉంటుంది. ఈ వివరణకు ప్రతిపదమూ ఉదాహరణమే. పైని పేర్కొన్న పలురకాల శృంగార రీతులకు చక్కటి ఉదాహరణలు చూపించవచ్చు. నాయికా నాయకుల ఉత్తమగుణ వర్ణనగల పదాలున్నాయి. ఒకచెలి నాయికా గుణాల్ని వర్ణిస్తూంది. పూర్వోక్తమైన ఈ పదంలో "వరకన్యా – రతిని"(7); నాయకుడు నాయికా సంశయ విచ్ఛేదం చేస్తున్నాడీ పదంలో. "ఏమిటికే – కొందురే" (9) ఇదీ పూర్వోక్తమే. ఇందులో నాయికా నాయకుల గుణాలు

వర్ణితం. ఇది నిర్మలమైన నాయికా నాయకుల చక్కటి ప్రేమకు నిదర్శనం.

పల్లవి : "నేను నీవు కనుగొన్న వేళే మొగ
నేస్తము బాయదుగా మరిమరి
నెమ్మది గలిగెను గా (ప-67)"

కానీ కేవలం సంభోగ శృంగార వర్ణితమైన పదాలనేకం ఉన్నాయి.

పల్లవి : "ఎంతదుడుకు జేసెనే-ఓ భామా న
న్నెంత దుడుకు జేసెనే
.... .... .... (ప-14)"

"కుటిల కుంతలి విను నిన్నటిరేయి విరితోటా
కటుల రమ్మోనెనట విటరాయడిటుల ఆ
.... .... .... (ప-64)"

ఈ పదాల్లో ఆలింగనం, చుంబనం, కుచగ్రహణం, సురతం మొదలైన వాటితోపాటు సంభోగ శృంగారం వర్ణితం. ఇలాగే ద్వితీయ భాగంలోని దేశీయ పదాలన్నింటా ఈ సంభోగ శృంగారం వివిధరీతుల వర్ణించబడింది.

### 5.1.4 రామదాసు-శృంగారం :

రామదాసు కీర్తనల్లో భక్తియేగాని శృంగారానికి తావులేదు. అయినా భగవత్పరమైన శృంగార విషయస్పర్శ ఆతని కీర్తనల్లో లేకపోలేదు. "నను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లి" అనే కీర్తనలో

"ప్రక్కన చేరుక చెక్కిలి నొక్కుచు
చక్కగ మరుకేళి సొక్కుచుండెడి వేళ ॥నను॥

ఏకాంత రంగుడు శ్రీకాంత నినుగూడి
ఏకాంతమున నేకశయ్యనున్నవేళ ॥నను॥ (కీ-112)

అని సురత విషయ వర్ణనవుంది. ఇంతే తప్ప ఇతరపట్టుల శృంగారం వర్ణితం కాలేదు.

### 5.1.5 త్యాగరాజు-శృంగారం :

నాదోపాసనాపరుడు త్యాగరాజు. ఆనాదయోగి కృతులన్నింటా భక్తి ప్రపత్తులు నిండి నిబిడీ కృతమై ఉన్నాయి. శృంగార ప్రాధాన్యం తక్కువ. ఎక్కడైనా కృష్ణుని శృంగారం వర్ణన చేసినా ఎంతో ఔచిత్యంతో ఒప్పుతుంది. చక్కటి ఉదాహరణ :

"తనయందే ప్రేమయనుచు విరుభోణులు
తల తెలియక నాడెదరు ॥త॥

అనయము మోహము మీఱఁగ కృష్ణుడు
అందరికన్ని రూపములెత్తి యాడగ ॥త॥

కొందరి బంగారు కొంగులు బట్ట
కొందరి పదములు బాగుగనొట్ట
కొందరి సొగసును గనులార జూడ
కొందరి మనసుఁదెలిసి మాటలాడ ॥త॥

కొందరి యంకమునను బవ్వళింప
కొందరి పెదవులఁబలు కెంపులుంచ
కొందరి తనువుల కగలీల సేయ
కొందరి వెనకనిలిచి జడవేయ ॥త॥

కొందరి నుదుటఁ గస్తూరి బొట్టువెట్ట
కొందరి తళుకు చెక్కుల ముద్దుబెట్ట
కొందరి బాలిండ్లఁ బన్నీరు జిల్క
కొందరితో త్యాగరాజ నుతుడుబల్క ॥త॥
(II-40)

గోపికా కృష్ణుల లీలా విలాసాన్ని అత్యంత మనోహరంగా వర్ణించాడు త్యాగరాజు.

ఇలాగా పదకవుల పదాల్లో శృంగారం మనోహరంగా అభివర్ణితమైందని స్పష్ట మవుతుంది.

## 5.2 మధుర భక్తి :

భక్తి, మధురభక్తులకు లాక్షణికులిచ్చిన నిర్వచనా లేమిటో తెలుసుకోవడం అవసరం. 'భక్తి' అన్నది 'భజ్' ధాతువునుంచి పుట్టినది. అంటే భజించడం. భగవద్భజనమన్నమాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదారవిందాల కడకుపోవడాన్నే 'భక్తి' అంటాడు శంకరాచార్యులు.[5] నారద భక్తి సూత్రాలలో "సాతస్మిన్ పర(మ) ప్రేమరూపా" (సూ-2) (ఆ భక్తి పరమేశ్వరుని యెడల పరమ ప్రేమరూపంగా ఉంది) అనికలదు. అంటే" ఈశ్వరుని యెడలగల యుత్తమమగు ప్రేమ యేదియో అదియే భక్తి యనబడును"[6] అట్లే శాండిల్య భక్తి సూత్రాలలోను "రసా పరాను రక్తిరీశ్వరే" (సూ-2) అంటే భగవంతుని యెడగల పరమప్రీతి (గాఢాను రాగం) భక్తి అని చెప్పబడింది. పరమ పూజ్యమైన ప్రీతియే భక్తి–భగవంతుని ఎడగల ఆ పరమ పూజ్యభావమే భక్తి. ఇదితొమ్మిది విధాలు.[7] అందులో మధురభక్తి పరమ శ్రేష్ఠమైంది. ఈ భక్తిని రసమని నిరూపించినవాడు రూపగోస్వామి. "భరతుని రస సిద్ధాంతమును ఆధారముగ జేసికొని రాధామాధవుల నాలంబనముగా జేసి రాధకుఁ గృష్ణునిపైఁగల శృంగారరూప భక్తి, రస స్వరూపమైనదని యా రసజనక ప్రక్రియ నంతటిని సాంగోపాంగముగ నిరూపించుచు రూపగోస్వామి వ్రాసిన గ్రన్థమే ఉజ్జ్వల నీలమణి". "నవరసములకును మూలము మాత్రము భక్తిరసమే యని రూపగోస్వామి యభిప్రాయము"[8] మధురరతియే భక్తిరసమని రూపగోస్వామి సిద్ధాంతం. తరువాత మధుసూదన సరస్వతి తన భగవద్భక్తి రసాయనంలో సముచితంగా భక్తికి రసత్వాన్ని స్థాపించాడు. ఈ ఇద్దరి సిద్ధాంతం ప్రకారం "ఈ భక్తి రసమునకు నాలంబన విభావము భగవంతుడు; తచ్చరిత్రలు విభావములు; భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావము. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁ బుట్టిన నేత్రాది వికారములు. వ్యభిచారులు నిర్వేద శంకాహర్షాదులు. ఇది పరమానంద స్వరూపమగు భక్తిరసముగాఁ బరిణమించును."[9]

### 5.2.1 అన్నమాచార్యుని మధురభక్తి :

అన్నమాచార్యుని పదాల్లో మధురభక్తి మనోహరమై ఒప్పుతుంది. భగవంతుడు శ్రీ వేంకటేశ్వరస్వామి నాయకుడు. భక్తుడైన అన్నమాచార్యులు నాయిక. వేంకటేశ్వరుడు తానొక్కడే పురుషుడు. భక్తుడైన మానవకోటి స్త్రీ సమూహం. ఆ స్త్రీ పురుషుల అనంత శృంగారలీలయే విశ్వం ఇలాంటి అలౌకిక మధుర భావం అన్నమయ్య శృంగార సంకీర్తనలకు బీజం. ఏ తద్భావస్ఫూర్తితో అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర లీలలను అనంతరంగా శృంగార సంకీర్తనల్లో కీర్తించి తరించాడు. అందుకే అతని పదాలు "వేంకటశైల వల్లభ రతిక్రీడా రహస్యాల్ని" వెల్లడిస్తాయి.

ఒకచక్కటి ఉదాహరణ : అన్నమయ్య నాయికఅయి చెలికత్తెను బోధిస్తుంది కింది పదంలో ;

"తారుకాణ సేసుకొంటే తానే నేను
యీ రీతినే నవ్వుగా నీ ఇంటికి రమ్మనవే" ॥పల్లవి॥

చెక్కులివె చెమరించె చిత్తమెల్లాఁ జిగురించె
కుక్కినట్లు కోరికలు కొనసాగెను
తొక్కినాడు నాపాదము తొలుతే సందడిలోన
యెక్కడ పరాకుసేసీ నింటికి రమ్మనవే ॥తారు॥

దప్పిదీరె పెదవుల తమకము దైవార
కొప్పువీడి చన్నులపై కుప్పలాయను
ముప్పిరిగాఁ గట్టినాఁడు ముంజేత కంకణము
యిప్పుడేల నించీ సిగ్గులు యింటికి రమ్మనవే ॥తారు॥

ఆయాలంటి నన్నుఁగూడె అంగమెల్లా బులకించె
చేయి చేయి సోకి యాస చిమ్మిరేగెను
చాయలా సన్నలా సేసచల్లె శ్రీ వెంకటేశుఁడు
యీ యెడ వన్ను మన్నించీ యింటికి రమ్మనవే ॥తారు॥
(25-239)

ఇలాగా నాయిక తానే అయి భగవంతుడైన వేంకటేశ్వరస్వామిని తన ప్రియునిగా భావించి, శృంగార లీలా విలాసాలను భావించి, తన్మాలంగా మధుర భక్తిని ప్రకటించాడు అన్నమయ్య. ఇంకా అనేకరీతుల అన్నమాచార్యుడు మధురభక్తిని వివిధ పదాల్లో ప్రదర్శించి తరించాడు.

5.2.2 క్షేత్రయ్య—మధురభక్తి :

క్షేత్రయ్య నాయికగా, మువ్వగోపాలుడు పరమపురుషుడుగా అత్యంత మనోజ్ఞమైన భావావేశంతో మధురభక్తికి లోనైన సమయంలో ప్రప్రథమంగా ఆతని నోటినుంచి వెలువడిందీ క్రిందిపదం. క్షేత్రయ్య మధురభక్తికీ, ఆ ప్రారంభ దశకూ ఈ పదం ఎంతో సహజమై ఒప్పారుతూంది.

"శ్రీపతి సుతు బారికి నే—నోపలేక నినువేడితే—
కోపాలా ? మువ్వ గోపాలా :
ఏ ప్రొద్దుదానింటిలోనే—కాపై యుండి నీ సరస స—
ల్లాపాలా ? మువ్వ గోపాలా : ॥శ్రీపతి॥
.... .... .... (సీ–గి–వేం–వ–87)

ఇందులో పరమాత్మయందు ఆత్మ తల్లీనం కావడానికై పడే మధురవేదన వ్యక్తమవుతుంది. క్షేత్రయ్య నాయికయై ఆ భగవంతుని పొందు అంటే ఐక్య సంధానంకోసం—అనుభవించే విరహం సుస్పష్టం.

క్షేత్రయ్య నాయికఅయి సర్వమూ తన కా పరమాత్మ దేనని స్పష్టం చేస్తున్నా డీ క్రింది పదంలో—

"ఇంత తెలిసియుండి—యీ గుణమేలరా
పంతమా ? మువ్వగో—పాల : నా సామిగ" "ఇంత"
... .... .... (సీ–గి–వేం–స్వీ–47)

ఇందులో క్షేత్రయ్య నాయికఅయి పరమాత్మానుసంధానం పొందేవిధం స్పష్టం. తాను నాయికగాను, భగవంతుని చెలికత్తెగాను, చెలువుడుగాను, తన పాలి దైవంగాను తలంచాడు. 'నా జీవస్వామివి నీవే' అనడంలో జీవాత్మ

పరమాత్మల ప్రసక్తి వాటి సమైక్యం సూచించడం జరిగింది. 'నా ఆనందమైన నీవే' అనడంలో పరమానందం అంటే మధురభక్తివల్ల కల్గిన మహదానందం స్పష్టమవుతుంది.

5.2.3 సారంగపాణి—మధురభక్తి :

భాగవతంలోని భక్తి మధురభక్తి. భాగవతభక్తి సంప్రదాయం శ్రీకృష్ణ సంబంధి భక్తిమార్గాల్లో శ్రేష్ఠమైంది. భాగవతంలోని మధురభక్తి రసావలంబను లైన గోపికాకృష్ణులు ఆలంబనగా వెలసింది వల్లభాచార్యుని పుష్టిమార్గం. ఇది చైతన్యస్వామి మధురభక్తి. భగవంతుడనే నాయకుడొక్కడే పురుషుడు. మానవ కోటి స్త్రీ సమూహం. ఈ స్త్రీ పురుషుల అనంతశృంగార లీలయే విశ్వం. ఇలాంటి అలౌకిక మధురభావంగల మధుర భక్త్యుపాసకులు జయదేవుడు, విద్యాపతి, మీరా, అన్నమయ్య, క్షేత్రయ్యలు. కానీ అన్నమయ్య క్షేత్రయ్యల మధుర భక్తి సారంగపాణిలో కనిపించడంలేదు. శృంగారపదాల్లో లౌకిక శృంగారాన్నీ, కీర్తనల్లో భక్తినీ ప్రకటించాడన్న విషయం పూర్వోక్తం. అయినా

"పల్లవి : కులకాంతలు విడిబడి నలుదిక్కుల
చెలరేగి రిదేటి పాపమో అయితే

అను : వెలయాండ్లకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలా సంకరమై ॥కుల॥
.... .... ....
(ప-138)"

అనే పదంలో లౌకిక శృంగారం కనిపించిలా, భాగవతగోపికా మధురభక్తి చ్ఛాయలు కనిపిస్తున్నాయి. ఇంతేగాక ఈ పదం క్షేత్రయ్య మధురభక్తి ప్రాధాన్యం గల ప్రసిద్ధ పదం—

"చూడరె అది నడిచే హొయలు
.... .... ....
కూడునటె అది మనిషామాకా" — ను గుర్తుకుతెస్తుంది. కొంతవరకు సారంగపాణి పదం దీనిలోని మధురభక్తిచ్ఛాయల్ని తెలుపుతుంది.

ఇలాగా మధురభక్తి పూరితమైన పదరచన చేసి తరించిన నాయికలు అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి అనే పదకర్తలు. ఇలానే తక్కిన

పదకర్తల్లోను ఈ మధురభక్తి ప్రపూరితమైన రచనా వైవిధ్యం మనం చూడ గలం.

## 5.3 భక్తి :

భక్తినిగూర్చి మనం ఇతఃపూర్వమే స్పష్టంగా తెలుసుకొన్నాము. ఇది తొమ్మిది విధాలన్నది పూర్వోక్తం.

"శ్రవణం, కీర్తనం, విష్ణోః—స్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం—సఖ్యమాత్మ నివేదనమ్॥"

అని శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనాలని భక్తి తొమ్మిది రీతులని భాగవతం సప్తమస్కంధంలో ఉంది.

### 5.3.1 అన్నమాచార్యుని భక్తి :

అన్నమాచార్యుడు శృంగార సంకీర్తనలతోపాటు అధ్యాత్మ సంకీర్తనలు రచించి తరించాడు. నవవిధ భక్తిరీతుల్ని తనపదాల్లో వర్ణించి తనభక్తి ప్రవృత్తిని ప్రకటించిన మహాభక్తాగ్రేసరుడు అన్నమయ్య.

భక్తి ప్రధానమంటాడు అన్నమయ్య. నవవిధ భక్తిరీతులు ఒకేపదంలో వర్ణించాడు అన్నమయ్య.

"నిత్యసుఖా నందమిదె నీ దాస్యము
సత్యము సుఖాలుచాలుఁ జాలునయ్యా ॥పల్లవి॥

కన్నుచూపుల సుఖము కడునీ చక్కనిరూపె
యెన్నగ వీనుల సుఖమిదె నీపేరు
పన్ని నాలుకసుఖము పాదపు నీ తులసి
వున్న సుఖముల తెరువాడఁ బడమయ్యా ॥నిత్య॥

తనువుతోడి సుఖము తగు నీ కైంకర్యము
మనసులో సుఖము నీమంచి ధ్యానము
పనివి నీ యూర్పు సుఖము పాదపద్మమువాసన
యెనయని పెరసుఖమేమి నేసినయ్యా ॥నిత్య॥

పుట్టుకకెల్ల సుఖము పొల్లులేని నీభక్తి
తొట్టికాళ్ల సుఖము పాతర లాడుట
జట్టి శ్రీ వెంకటేశ మాచనవోలి చెన్నుఁడవై
వొట్టుకొని మమ్మేలితి వోహో మేలయ్యా ॥నిత్య॥"
(10-78)

అన్నమయ్య చెప్పినట్లు ఇందలి భాష లక్షణ బద్ధమై ఒప్పుతూంది. శృంగార పదాల్లో గ్రామ్యోక్తులుండవచ్చు. కాని అధ్యాత్మపదాల్లో అలాకాదు.

"వైరాగ్య వృద్ధికర గం
భీరపదశ్రేణి పొసఁగఁబెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణుచరితో
దారములై యున్నఁ జాలుధరణిన్ వెలయున్"

అని చెప్పడం గమనించవచ్చు. ఈ లక్షణాన్ననుసరించే గంభీరపద సమ్మిళితమై ఈ భాష ఒప్పుతూంది.

ఇక అన్నమయ్యలోని నవవిధ భక్తిరీతులు :

కీర్తనం : "ఎన్నడుఁజెడని యీవులిచ్చీని మాధవుడు
పన్నిన యాసలితని పైపై నిలుపవో" (10-14)

అర్చనం : "అతని భజియించరో ఆతుమలాల శ్రీ
పతి యితని కరుణే ఫలమింతే కాని॥" (10-108)

శ్రవణం : "వినరో భాగ్యము విష్ణుకథ
వెనుబలమిదివో విష్ణుకథ" (9-66)

పాదసేవనం : "విడువ విడువనింక విష్ణుఁడ నీపాదములు
కడిగి సంసార వార్ధి కడు ముంచుకొనిన" (9-206)

వందనం : "పరమ వైష్ణవుల భాగ్యంబిదివో
నిరతి వారలకె నే మొక్కెదను"॥ (10-88)

స్మరణం : "ఎందుకుఁబని గొందము యేమిసేత మివియెల్లా
చెందిన మాకిక బుద్ధిచెప్పవే నారాయణా॥" (9-8)

దాస్యం : "కాను స్వతంత్రుడ ననగాదని తలగలేను
నేను నీ కింకరుఁడ నీ రచనలే" (9-194)

సఖ్యం : "ఎన్నఁడుఁజెడని యీవులిచ్చిని మాధవుడు
పన్నిన యాస లితని పైపై నిలుపవో॥" (10-14)

ఆత్మ నివేదనం : అన్నమాచార్యుని భక్తి ప్రపత్తి శరణాగతి ప్రధానమైందన్న సంగతి అతని అధ్యాత్మ సంకీర్తనలన్నింటా మనకు స్పష్టం. అన్ని అధ్యాత్మ సంకీర్తనలు దీనికుదాహరణమే.

మచ్చుకు : "ఘనుఁడా తఁడె మముఁగాచుఁగాక హరి
అనిశము నేమిక నతనికె శరణు" (10-22)

ఇలాగా అన్నమాచార్యుని అధ్యాత్మ సంకీర్తనల్లో నవవిధ భక్తిరీతులు అభివర్ణితం.

5.3.2 సారంగపాణి - భక్తి :

"గేయ రచనలో సామ్రాజ్య పట్టాభిషిక్తులగు త్యాగయ్యగారిని విడిచితే భక్తి వైరాగ్య రచనలో రెండవస్థానం గోపన్నగారికే ఈయవలసి ఉంది ఆయన తాను రచించిన కీర్తనలలో యెదుటి వారిని పరవశముచేసి తాను పరవశమగును. సకలేంద్రియము లారా ! యిపుడు సమయముకాదు. సద్దుసేయకయుండరే' అని గోపన్నగారు అంటూఉంటే ఇంద్రియములకు ఏకాగ్రత గోపన్నగారికే కలుగు తుందో మనకే కలుగుతుందో చెప్పలేను.... త్యాగయ్యగారి కుండే సర్వతోముఖ ప్రతిభగాని, గోపన్నగారికుండే భక్తి తాదాత్మ్యముగాని, సారంగపాణిగారికి లేక పోయినా, భక్తికితగిన భావన, భావనకుతగిన భాష ఒకదానికొకటి తులతూగుతూ సారంగపాణిగారి భక్తి వైరాగ్యకీర్తనలు చాల హృదయంగమములుగా ఉంటాయి"- అని మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు అభిప్రాయ పడ్డారు. కానీ మనం ఇక్కడ ఓ విషయం గమనించాలి. భక్తి భావనలో త్యాగయ్య, రామదాసులతో ఇతర వాగ్గేయకారులను పోల్చడానికి వీల్లేదని నా అభిప్రాయం. వీరిద్దరు ఆజన్మ శ్రీరామభక్తాగ్రేసరులు సారంగపాణి క్షేత్రయ్యలాగా మొదట రక్తిగలిగి ఆ వెనుక భక్తి వైరాగ్యాల్ని ప్రకటించాడు. అంతేగాక సారంగపాణి కీర్తనల్లో తాదాత్మ్యం

లేదంటే, త్యాగయ్య కృతులకు, రామదాసు కీర్తనలకు ఉన్నంత ప్రచారం సారంగపాణి కీర్తనలకు లేకపోవడమేనని భావించవచ్చు. అయినా నవవిధభక్తుల్ని, వైరాగ్య కీర్తనల్లో ప్రకటించాడు సారంగపాణి. ఇష్టదైవం వేణుగోపాలుడు.

"వేణుగోపాలుని విడువము-మరి
వేరే వక్కరిపేరు నుడువము
.... .... ....
పతితపావనుడే మాకు చుట్టము
గోపబాలుని భజనే దిట్టము
.... .... ....
హరిని వినా వేరేపాడము
.... .... పరం
ధాముని మదిలో బంధింతుము
నారాయణ దివ్య నామము యె
న్నటికీ మరవ మీ నీమము
తారకమిది మాకుక్షేమము శ్రీ
ధరుని సేవే పూర్ణకామము" (కీ. 158)

అని విష్ణుభక్తి, కీర్తన, స్మరణ, సేవనాదుల్ని ప్రకటించాడు.

ఇలాగే "అన్నిటికిది సులభమార్గము సుమీ
హరినామ స్మరణా
పన్నగశయనుడైన వేణు గో
పాలుని సన్నిధికి జేరేటందుకు" (కీ-183)

అని తెలిపి, జపతపాలు, యజ్ఞయాగాలు, వేదవాదాలు, వ్రతతీర్థయాత్రలు, దానధర్మాలు అవసరంలేదనీ వివరించి, చివరికి తాపసియై గుహలజేరడాన్ని ఖండించాడు. అదే విధంగా వేణుగోపాలుని పాదభక్తి ప్రధానమని "భక్తిలేని వ్రతములెన్ని జేసిన ఫలములేదు సుమ్మీ" (కీ. 184) అనిచాటి, పైఆడంబరాల్ని ఖండించాడు.

### 5.3.3 రామదాసు భక్తి :

రామదాసు కీర్తనల ప్రధాన లక్షణం భక్తి. అదిగూడా భజనకూటముల్లో పాడుకోడానికి వీలుగా భక్తిభావ పురస్సరంగా ఈ కీర్తనలు రచితం. తన ఉద్యోగ ధర్మాన్ని విస్మరించి శ్రీరామభద్రుని ఆలయ నిర్మాణం కోసం సర్కారుపైకాన్ని వెచ్చించి ఇక్కట్టులపాలై, బందిఖానాలో ఘోర నరకమనుభవించి, చివరికి తనదైవం శ్రీరాముని కరుణా కటాక్షానికి పాత్రుడైన భక్తాగ్రేసరుడు రామదాసు. ఏ కీర్తన పరిశీలించినా అందులో నిండి నిబిడీ కృతమైన అపారభక్తి, మొర, ఆర్తి, స్పష్టమవుతాయి. శ్రీరామ భక్తుడాతడు. రామదాసుకు సమస్తమూ రామ మయంగా గోచరించింది.

పల్లవి : అంతా రామమయం బీజగమంతా రామమయం ॥అంతా॥

చ : అంతరంగమున ఆత్మారాముడు
నంత రూపమున వింతలు సలుపగ ॥అంతా॥

సోమ సూర్యులును సురలు తారలును
ఆమహాంబుధులు నఖిల జగంబులు ॥అంతా॥

అండాండంబులు పిండాండంబులు
బ్రహ్మాండంబులు బ్రహ్మమొదలుగ ॥అంతా॥

నదులు వనంబులు నానా మృగములు
విదిత కర్మములు వేద శాస్త్రములు ॥అంతా॥

అష్టదిక్కులును ఆదిశేషుడును
అష్టవసువులును అరిషడ్వర్గము ॥అంతా॥

ధీరుడు భద్రాచల రామదాసుని
కోరిక లొసగెడి తారకనామము ॥అంతా॥ (కీ - 101)

ఇంతేగాక నవవిధ భక్తిరీతులు ఈ క్రింది కీర్తనలో—

"రామ రామ శ్రీరామ రామ
రామ యనరాదా మనసా
కామిత ఫలదుడగు శ్రీసీతా
కాంతుని గనరాదా మనసా॥" (కీ-63) వర్ణించాడు.

ఇలాగే "శరణాగత రక్షణ బిరుదనినే - శరణంటి గదయ్యా" (కీ - 110) లో శరణాగతి, "ఓ రామ నీ నామమేమి రుచిరా" (కీ - 108) లో నామ స్మరణం, కీర్తనం;" శ్రీరామ నామమే జిహ్వకు స్థిరమై యున్నది" (కీ-97)లో భజనం, పూజనం," రామ నీదయ రాదుగా పతితపావన" (కీ-69) లో పాద సేవనం, "బూచి వానివిలువ బోదునా ఓ గోపాలకృష్ణా" (కీ - 105) లో వాత్సల్యభక్తి - రామదాసు మనోజ్ఞంగా అభివర్ణించి తరించాడు. భక్తకోటికి తరణో పాయం చూపించాడు.

## 5.3.4 త్యాగరాజు-భక్తి :

నాదోపాసకుడైన మహాయోగి త్యాగరాజు గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, ఉంఛవృత్తితో సంసారం కొనసాగించిన నిరాడంబరజీవి. పరమపావనమైన శ్రీరామ భక్తియే ప్రధానం తదితరం ఉపాధేయాలు కావు. పారలౌకికానందమే ముఖ్యం, ఇహలోక సంబంధి సుఖాలకై ప్రయత్నించలేదు, తృణీకరించాడు. అందువల్లనే ఏరాజును గూడా ఆశ్రయించడానికి మనస్కరించనివాడు.

ఇలాంటి త్యాగికృతులు నాదయోగ ప్రధానాలు. ఆ నాదోపాసనంలో ముక్తి పొందిన మహాపురుషుడు. త్యాగరాజు నాదసుధారసం గోలిన అమృతుడు. ఇందుకు "నాదసుధారసం బిలను నరావతానూ యమనసా" (1-82) కృతి నిదర్శనం అందుకే "సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదె మనసా" (1-49) అనీ, "స్వరరాగ సుధారసయుత భక్తి-స్వర్గాపవర్గమురా ఓ మనసా" (1-51) అనీ—

"రాగసుధారసపానము చేసి - రాజిల్లవె ఓ మనసా ॥రా॥
యాగయోగ త్యాగ - భోగ ఫలమొసంగే ॥రా॥
సదాశివమయమగు - నాదోంకార స్వర
విదులు జీవన్ముక్తులని - త్యాగరాజు తెలియు ॥రా॥ (కీ-40)

అనీ తన నాదయోగ ప్రాధాన్యాన్ని చాటిచెప్పిన నాదోపాసకుడు.

భక్తి ప్రధానం. అందులోను రామభక్తి మరీముఖ్య మంటాడు త్యాగరాజు-

"రామభక్తి సామ్రాజ్య - మేమానవుల కబ్బెనో మనసా ॥రా॥
ఆ మానవుల సందర్శన - మత్యంత బ్రహ్మానందమే ॥రా॥

ఈలాగని వివరింపలేను - చాలా స్వానుభవ వేద్యమే
లీలాసృష్టి జగత్త్రియమనే - కోలాహల త్యాగరాజనుతుఁడగు" ॥౨॥
(కీ-41)

కాగా త్యాగరాజు కృతులలో నవవిధ భక్తిరీతులు వివరించ బడ్డాయి. కొన్నింటిని చవిచూద్దాం.

స్మరణం : "వరనారద నారాయణ స్మరణానందానుభవముగల" ॥౨॥ (కీ1-91)
అర్చనం : "రారా మాయింటిదాక రఘువీర సుకుమార మ్రొక్కేరా॥"
(కీ-1-97)

భజనం : భజరే రఘువీరంశర - భరిత దశరథకుమారం" (1-103)

దాస్యం : "భువిని దాసుడనే పేరాసచే శొంకులాడితివా బుధమనోహర" (1-94)
ఇలాగా త్యాగరాజు తనభక్తితత్వాన్ని విపులీకరించినట్లు స్పష్టమౌతుంది.

## 5.4 నీతి, వైరాగ్యాలు :

పదకవులు నీతిని తెలిపి, వైరాగ్యాన్ని ప్రబోధించారు. ప్రవృత్తి భోగాలెంత అవసరమో అంతకంటే గూడా నివృత్తి భోగాలవసరమని వారిలక్ష్యం. తదుచితరీతిని భగవత్సేవలో నిమగ్నులై తరించాలని వారిధ్యేయం. ఆమార్గాలను సారంగానే పదరచన చేసిన మహానుభావులీ పదకవులు.

### 5.4.1 అన్నమాచార్యుని ఆధ్యాత్మికత, వైరాగ్యం :

అన్నమాచార్యుని సంకీర్తనల్లో శృంగార సంకీర్తనలతోపాటు, ఆధ్యాత్మ సంకీర్తనలు రచించి తన ఆధ్యాత్మిక చింతనా పరినిష్ఠమైన హృదయాన్ని ఆవిష్కరించాడు.

నీతిని తెలిపి, తన ఆధ్యాత్మిక తత్త్వాన్ని అన్నమయ్య ఈ క్రింది ప్రసిద్ధ పదంలో వివరించాడు.

"నానాటి బతుకు నాటకము
కానక కన్నది కైవల్యము ॥పల్లవి॥

పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాటకము
యెట్టయెదుటగలదీ ప్రపంచమును
కట్టకడపటిది కైవల్యము ॥నానా॥

కుడిచేదన్నము కోకచుట్టెడిది
నడుమంత్రపు పని నాటకము
వొడిగట్టుకొనిన వుభయ కర్మములు
గడి దాటినపుడె కైవల్యము ॥నానా॥

తెగదు పాపము తీరదు పుణ్యము
నగినగి కాలము నాటకము
యెగువనె శ్రీ వేంకటేశ్వరుఁడేలిక
గగనము మీదిది కైవల్యము ॥నానా॥ (9–281)

ఇందులో వైరాగ్య స్వరూప నిరూపణముంది. ఈ ప్రపంచం అనిత్యం. మోక్షమే ముఖ్యం. అందుకై యత్నించడం అవసరమన్న ప్రబోధముంది. కాగా, ఆధ్యాత్మిక తత్త్వాన్ని ఇంకా—

"హరి దగ్గరనే వున్నాఁడండాకా బారనీదు
కురుచలోనేమడుగు గోవిందుడు"। (9–14)

"హరిహరియని వెరగందుటగాక
సిరివర మాకు బుద్ధిచెప్పుమయ్యా" (9–175)

"నారాయణుడ నీ నామము మంత్రించివేసి
పారేటి యీ జంతువుల భ్రమ విడిపించవే" (9–205)

—అని విపులీకరించి వివరించాడు.

సామాన్యులకు సైతం తెలిసిన అతిసామాన్య విషయాలను చెబుతూ వాటికి తగినరీతిలో పదప్రయోగంచేస్తూనే, ఆలంకారిక రీతిలో అన్నమాచార్యులు వైరాగ్య ప్రబోధం చేయడం అతని ప్రతిభానైపుణ్యాలకు చక్కటి నిదర్శనం ఈ క్రిందిపదం—

"పంటలభాగ్యులు వీరా బహువ్యవసాయులు
అంటి ముట్టి యిట్లఁగాపాడుదురు ఘనులు ॥పల్లవి॥

పొత్తుల పాపమనేటి పోదు నఱికివేసి
చిత్తమనియెడు చేనుచేనుగా దున్ని
మత్తిలి శాంతమనే మంచివాన పదనున
విత్తుదురు హరిభక్తి వివేకులు ॥పండి॥

కామక్రోధాదులనే కలుపు దవ్వివేసి
వేమరు వైరాగ్యమనే వెలుగువెట్టి
దోమటి నాచార విధుల యెరువులునేసి
నోముచున్నారు జ్ఞానపుఁబైరు దద్యోగ జనులు ॥పంట॥

యెందు చూచిన శ్రీ వేంకటేశుఁడున్నాడనియెడి
అందినచేని పంటలనుభవించి
సందడించి తమవంటి శరణాగతులఁ దాము
గొందినిముడు కొందురు గురుకృప జనులు ॥పంట॥ (9-70)

ఇంత మనోహరంగా తన కవిత్వపు సొంపుల వయ్యారంతో ముద్దుగులుకు రీతిని వైరాగ్య ప్రబోధం చేసిన తాత్వికులులేరంటే మనం అబ్బురపడవవసరంలేదు.

5.4.2 రామదాసు నీతివైరాగ్యాలు :

రామదాసు కీర్తనలు భక్తి ప్రధానమై, వైరాగ్యనీతి ప్రబోధాత్మకాలై ఉన్నాయి. హరి నామస్మరణమే ముఖ్యమనీ, ఇతరం అప్రధానమనీ నీతిబోధ చేస్తాడు.

పల్లవి : నరహరి నమ్మక నరులను నమ్మితె
నరజన్మ మీడేరునా ఓ మనసా ॥నరహరి॥

అ ప : చెరకులుండగ వెఱ్ఱిచెరకులు నమిలితే
తిహ్యాకు రుచిపుట్టునా ఓ మనసా ॥నరహరి॥

చ : కొమ్మయుండగ కొయ్యబొమ్మను కలిసితె
కోరిక కొనసాగునా ఓ మనసా
అమ్మయుండగ పెద్దమ్మను యడిగితె
నర్థము చేకూరునా ఓ మనసా ||నరహరి||
అన్నముండగ గుల్ల సున్నముతింటె
యాకలి వెత తీరునా ఓ మనసా
కన్నెలుండగ చిత్ర కన్నెలగలిసిన
కామపువ్యథ తీరునా ఓ మనసా ||నరహరి||
(కీ–78)

ఇలాగే వైరాగ్య ప్రబోధం గమనించదగ్గది.

పల్లవి : భళివైరాగ్యంబెంతో బాగైయున్నది, చం
చలమైన నామస్మరణ నిశ్చలమై యున్నది ||భళి||
చ : అరిషడ్వర్గములునన్నంటకున్నవి శ్రీ
హరినామస్మరణ జిహ్వకు అనువైయున్నది ||భళి||
గురుధ్యానమున మనసు కుదురైయున్నది చిత్త
మిరువది యారింటిమీద నిరవైయున్నది ||భళి||
పరమశాంత మెన్నగను బాగైయున్నది మాకు
పరతత్వమందే మాబుద్ధి పట్టియున్నది ||భళి||
విరసము పోరులేనివిధమై యున్నది మాకు
ప్రకృతి యెడబాసి మోక్షమున కిరవైయున్నది ||భళి||
గురి భద్రాద్రీశునందే గురువైయున్నది యిప్పుడు
అరమరలేక రామదాసుడన దగియున్నది ||భళి|| (కీ–27)

ఇలాగా రామదాసు నీతి వైరాగ్యరీతులు స్పష్టమవుతాయి.

### 5.4.3 పోతులూరి వీరబ్రహ్మం–నీతి, వైరాగ్యాలు :

పోతులూరి వీరబ్రహ్మం తన తత్వాల ద్వారా ఉపనిషత్సారాన్ని పామర ప్రజలకు ప్రబోధించాడు. ఆ తత్వాలకు అత్యంత ప్రచారం కలిగింది.

"చెప్పలేదంటనక పొయ్యేరు నరులారగురునిచేరి మ్రొక్కితే బ్రతుక నేర్చేరు" అని పరమగురుడైన భగవంతుని స్మరించుమని ప్రబోధించాడు.

"ఇల్లు వాకిలినాది యిల్లాలు నాదనుచు యేల భ్రమసితివయ్యో మనసా"– అనివైరాగ్య బోధన చేశాడు. వీరబ్రహ్మం ప్రియశిష్యుడు దూదేకులసిద్ధయ్య సైతం తత్త్వాలు రచించాడు తత్త్వబోధ చేశాడు.

> "చిల్లర రాళ్లకు మొక్కుచు నుంటే చిత్తము చెడిపో నోరేవారే
> చిత్తమునందున చిన్మయరూపుని జూచుచుండుట సరేసరే॥

–అని విగ్రహారాధనను ఖండించి చిన్మయరూపుడైన భగవంతుని చూడు మన్నాడు.

"ఏకులసుని నను వివరమడిగితే యేమని దెల్పుదు లోకులకూ పలుగాకులకూ దుర్మార్గులకూ, యీదుష్టులకు,"– అనికులానికి ప్రాముఖ్యమిచ్చిన వారిని తిరస్కరించాడు.

5.4.4 సారంగపాణి-నీతిబోధ :

అన్నమయ్య శృంగార సంకీర్తనలతోపాటు అధ్యాత్మ సంకీర్తనలు రచించి తరించాడు క్షేత్రయ్యవి కేవలం శృంగార పదాలుమాత్రమే, సారంగపాణి శృంగార పదాలతోపాటు కీర్తన రచనచేసి, అందులో భక్తి, వైరాగ్యం, వేదాంతం, ఆధ్యాత్మిక చింతన, తాత్వికచింతన మొదలైన విషయాల్ని వివరించి, లౌకిక విషయాల్ని తెలిపి మంచిని పెంచుకోవాలని, మానవాళికి నీతి ప్రబోధంచేశాడు. సారంగపాణి లోకరీతుల్ని, వ్యక్తుల తత్వాల్ని బాగా గుర్తించినవాడు కావడంవల్ల భక్తిలేనిపూజ అనవసరమని, "జీతము ముట్టని కొలువేమిటికి" (180) అని అనేకవిషయాల్ని, "గుత్తలంజలను మరగినవారికి" (191) కలిగే పర్యవసానాన్ని పోరాని తావులకు పోరాదు బుద్ధిమంతుడైతే (181) అనిచెప్పి, కడుపా నీవంత ఘనమైతివా.... కోటి విద్యలు నీకొరకేగదవే (192) అని అనేక జీవిత సత్యాల్ని వివిధరీతుల వివరించాడు. పాపాత్ముల కెక్కడిదీ కాలము (193) అంటూ పాపాత్ముల పాపపు కార్యాల్ని తెలిపి, దాతను వాజులుజరిపే దబ్బలి తలమీదనే పొడ్డు (167) అంటూ ఏదోవంక జూపి తప్పించుకోవడం ఉత్తమ లక్షణం కాదని నిరూపించి మంచివాడనుచు కీర్తివహించే మానవుడే ఘనుడు (171),

అని మంచివాడుగా మనడానికి వలసిన సమస్తవిషయాలు వివరించి భక్తితో పిలచి పెట్టిన యన్నము పట్టెడైనచాలు (176) అంటూ అంతశ్శుద్ధి, ఆత్మసంతృప్తి ప్రధానమని ప్రబోధించాడు.

అక్షయ పాత్రకుపోతే కలదని వొకభిక్షవేయరయ్యా (194) అనే పదంలో అక్షయ పాత్రతో భిక్షమెత్తుకొని జీవించే సర్వసంగ పరిత్యాగుల్ని లెక్కచేయని దుష్టుల దౌష్ట్యాన్ని మిక్కిలి గర్హించాడు సారంగపాణి. ఇలాగే ఉంఛవృత్తితో బ్రతికే వారికి (195) కోపమనవసరమనీ,

"అమ్మా ! అక్కా ! అయ్యా ! యనవలె
పొమ్మంటే తలవంచుక పోవలె
రొమ్మున తంబురమీటుచు బాడుచు
రోసముపడక యిల్లిల్లు దిరుగవలె" — అంటూ

ఎంతోచక్కగా ప్రబోధించాడు.

భక్తి, వేదాంతం, వైరాగ్యం, అధ్యాత్మికచింతన, తాత్వికచింతనలని చక్కగావివరించాడు సారంగపాణి. హరి తానేవున్నాడన్నింటికి యేవెరపు లేదిక మాకు (189) అని అంతటికీ పరమాత్ముడని వివరించాడు. ఇంకా—

పల్లవి ; అద్దెకొంపవంటి యీదేహ
మనిత్యమే మనసా
.... .... .... .... (ప-190) -అని శరీర

మనిత్యమన్న సత్యాన్ని హృదయానికి హత్తుకొనేట్లు నీతిని ప్రబోధించాడు సారంగపాణి.

ఇలాగా సారంగపాణి శృంగార, భక్తి, వైరాగ్యాల్ని సముచితరీతిని వర్ణించాడు.

5.4 5 త్యాగరాజు-నీతివైరాగ్యాలు :

త్యాగరాజు ఎంతో అనుభవపూర్వకంగా లోక న్యాయాలుతెలిపి, నీతి ప్రబోధం చేశాడు. ఆనాటి ప్రజల్లోఉన్న మౌఢ్యాన్ని నిరసించాడు.

"మనసు నిల్పశక్తి లేకపోతే
మధుర ఘంట విరుల పూజేమి జేయును ॥మ॥

ఘనదుర్మదుఁడై తామునిగితే
కావేరి మందాకిని యెటు బ్రోచును ॥మ॥

సోమిదమ్మ సొగసు గాండ్రఁ గోరితే
సోమయాజి స్వర్గార్హుడౌనో
కామక్రోధుడు తపం బొనర్చితే
గాచిరక్షించునో త్యాగరాజనుత ॥మ॥ (II-71)

ఇందులో 'సోమిదమ్మ సొగసుగాండ్రఁ గోరితే-సోమయాజి స్వర్గార్హుడౌనో' అని ఎంతోచక్కగా వివరించాడు.

ఇలాగే ఈ క్రింది కృతిలో—
"సమయముఁదెలిసి పుణ్యములార్జించని కుమతి యుండి యేమి పొయ్యేమి" (II-102) అని నీతిని బోధించాడు ఇంకా ఇదేరీతిగా ఆత్మప్రబోధం-

"కోటి నదులు ధనుష్కోటిలోనుండగా
ఏటికి తిరిగేవే ఓ మనసా" ॥కో॥" (1-7౦)

అనీ "ఉండేది రాముఁడొకడు ఊరక చెడిపోకుమనసా" (1-65)

అనీ కృతులలోగావించు కొన్నాడు. అది అందరి ఆత్మలకు ప్రబోధమనే విషయం మనం మరవకూడదు.

ఇంకా చక్కటి వైరాగ్యబోధ-
"భజరే రఘువీరంశర - భరిత దశరథ కుమారం ॥భ॥"

"శివశివ యనరాదా ? ఓరీ" — అనీ కృతులలో ఎంతో మనోహరంగా చేశారు.

ఇలాగా పదకవులు శృంగారం, మధురభక్తి, భక్తి, నీతివైరాగ్యాల్ని తమ పదకవితా శిల్పంలో మనోరంజకమై ఒప్పునట్లు చిత్రించి అనన్య సామాన్యంగా కటుతిక్తమైన గుళికల్ని చక్కెర బూసి, హృదయాల కందించారు. పద్య కవులకు వీరేమాత్రం తీసిపోరని దీనివల్ల సైతం స్పష్టమవుతుంది.

# సూచికలు

1, 2. తాళ్లపాక చినతిరుమలాచార్యులు : సంకీర్తన లక్షణము–
Vol I– Minor works of Tallapakam Poets పు 139, 147

3. భరతముని – నాట్యశాస్త్రం.

4. ధనంజయుడు – దశరూపకం.

5. అంకోలం నిజ బీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్।
ప్రాప్నోతీహ యథాతథా పశుపతేః పాదారవిందద్వయమ్
చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదాభక్తిరిత్యుచ్యతే॥"
(శివానందలహరి–శ్లో–61)

6. రామసుబ్బయ్య : మల్రిబోయిన బ్రహ్మజిజ్ఞాస–పు–219

7 'శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥
(భాగవతం–సప్తమస్కంధము)

8. సాహిత్య వాల్లభ్యము (ముళ్లపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి : )
పు–453, 457

9. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి; కావ్యాలంకారసంగ్రహము. పు–306

# 6.0 సంగీతం - అభినయం :

## 6.1 సంగీతం :

పూర్వ ప్రకరణాల్లో పదకవితావిర్భావ వికాసాలతోపాటు, పదకవుల చరిత్ర, కవితాకామనీయకత, భాషావిశేషాలు, ఆయా పదకవులు ప్రదర్శించిన శృంగార, భక్తి, నీతివైరాగ్యాలు మొదలైన విషయాలను తెలుసు కొన్నాము. ఇకపోతే ఆయాపదకవుల సంగీతాభినయాల్నిసైతం గ్రహించినపుడే తెలుగులోని పదకవితా వైశిష్ట్యాన్ని పరిపూర్ణంగా గ్రహించినట్లు అవుతుంది

సంగీతాభినయజ్ఞుణ్ణి కానునేను. అందుచేత ఆయా వాగ్గేయ కారుల సంగీతాభినయాల గూర్చి తజ్ఞులు వివరించిన తీరు తెన్నుల్ని సంగ్రహంగా చెప్పి సంపూర్ణతను సాధించటానికి ఈ ప్రకరణంలో ప్రయత్నిస్తాను. ఆయా విషయాలలో అభినివేశమూ, ఆసక్తివున్న వారికి తప్పక వుపకరించి మిక్కిలి సంతోషాన్ని కూరుస్తుందని ఆశిస్తున్నాను.

### 6.1.1 అన్నమాచార్యుల సంగీతం :

అన్నమాచార్యుని పదాల్లో సంగీతం కంటె సాహిత్యానికే ప్రాధాన్యమన్న విషయం తజ్ఞుల అభిప్రాయమన్నది పూర్వోక్తం. అయినా అయన వాడిన అపూర్వ రాగాలు వాటి విశిష్టతనుగూర్చి శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు పేర్కొన్న తీరును వివరించడమే ఇక్కడ నేను చేసే పని.

''సంకీర్తనలు లిఖితములైన రాగిరేకులపైని ప్రతికీర్తనకును మొదట దాని రాగం సూచతమైఉంది. ఈ రాగాల పేర్లుతప్ప వాటిగాన పద్ధతి మనకు తెలియగల మరొక ఆధారమేది లేదు. తాళ్ళపాక సంకీర్తనములలో ఇప్పటికి లభించిన 14వేల కీర్తనలలోను ఉపయుక్తములైన రాగాల సంఖ్య 89 మాత్రమే అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు వ్రాశారు. ఆ 89లోను మరీఎక్కువగా ప్రయోగించిన రాగాలు 25 మాత్రమేనట. అయితే లభించిన త్యాగరాజు కీర్తనలు 7 వందలకు 250కి మించి రాగాలు ఉపయుక్తాలైనాయట. దీనిని బట్టి, వారి

తానాడు సంగీత ప్రయోగ దృష్టి అప్రధానము, సాహిత్యభావ ప్రదర్శనము ప్రధానముగా కనబడుతుంది. తాళాల పేర్లు రాగిరేకులలో లేనేలేవు. పాటల అక్షర ప్రమాణమును యతి ప్రాసలను పరిశీలించి, ఆది, రూపకము, జంపె, అట్ట, మిశ్రచాపు, త్రిపుట మొదలగు సుప్రసిద్ధ తాళాలన్నీ, ప్రయుక్తములైనాయని శ్రీ శర్మగారు వ్రాశారు అంతేకాక 'భావము భాషా రూపముగా మనస్సులో స్ఫురించిన వెంటనే తత్కాలమునకు స్ఫురణకు వచ్చిన ఏ సిద్ధమైన వర్ణమెట్టునో గ్రహించి రచన సాగించినట్లే కానవచ్చునే తప్ప నూతన నాదశరీర కల్పనకై (అనగా కొత్త సంగీతపు వరుసల కల్పనకై) ప్రత్యేకముగా వారు పరిశ్రమించినట్లు తోచదు' అనికూడ వ్రాశారు. అంటే, ఆనాటి పండిత జనాదరణం, సమాజ గౌరవం, లేని జక్కులవారి యక్షగాన ప్రదర్శనాలలోనో, ఇతర జానపద గీతనృత్య ప్రదర్శనాలలోనో కర్ణాకర్ణిగా వినిపించే దరువులను, పదాలను వరవడులుగా పెట్టుకొని, వాటికి వాడుకలో ఉన్న ఆ రాగ తాళాలలోనే తాళ్ళపాక కవులు తమకు తోచిన సంకీర్తనములన్నీ పాడి ఉంటారని మనం శ్రీ శర్మగారి ఊహకు వ్యాఖ్యానముచేసు కోవచ్చును. భరతముని ధృవాధ్యాయంలోను ఇతర లక్షణకర్తలు ప్రబంధాది అధ్యాయాలలోను ఆయాదేశిపద రచనా రీతులకు లక్షణము నిర్వచించి ఉండడంచేత, అన్నమాచార్యులు పండితులకు తాముచేస్తున్న సంకీర్తన రచనలు ప్రామాణికమే అని చెప్పడానికే సంకీర్తన లక్షణం సంస్కృతంలోనే రచించాడని ముందేచెప్పుకొన్నాము. అలాగే వీరువాడిన రాగాలుకూడ లనాటికి లక్షణకర్తలు నిర్వచిస్తూ వచ్చిన దేశీయరాగాల లక్షణాన్ని అనుసరించే ప్రామాణికములే అయి ఉంటాయి. వానిలో 21 రాగాలకు శ్రీ అనంత కృష్ణశర్మగారు చారిత్రక పౌర్వాపౌర్యం పరిశోధిస్తూ, ఆనాటి స్వరూపాన్ని స్థూలంగా నిర్ణయించ డానికి ప్రయత్నించారు.

'13వ శతాబ్దపు వాడైన పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో పేర్కొన్న 108 రాగాలలో సుమారు 20 కి మించిన రాగాలు తాళ్ళపాక కవుల సంకీర్తనములలో కనిపిస్తాయి. అవియివి : కన్నడగౌళ, గుండక్రియ, కాంభోజి, దేశాక్షి, దేశి, దేసాళం, ధన్యాసి, నాట, భూపాళం, భైరవి, బౌళి, మలహరి మాళవి, మాళవగౌళ, మాళవశ్రీ, రామక్రియ, లలిత, వసంత, శంకరాభరణం, శ్రీరాగం, సామంగనాట, సౌరాష్ట్ర, గుజ్జరి.

"పాల్కురికి సోమనాథుడు పేర్కొననివీ, ఆతని తర్వాత రెండు వందల ఏళ్ళలో ప్రచారానికి వచ్చినవీ అయిన రాగాలలో తాళ్ళపాక వారు పాడినవి : సామంతం, ముఖారి, వరాళి-మంగళకైశికి, నాదనామక్రియ, దేవగాంధారి, పాడి, మధ్యమావతి, కేదారగౌళ, ఆహిరి.

"వారు వాడిన అపూర్వ రాగాలు ఇవి : ఆహిరి, అమరసింధు, కొండ మలహరి, (కొండజాతివారు పాడుకొనే మలహరి భేదం) తెలుగు కాంభోజి, (ఇప్పుడు ఎరుకల కాంభోజి అనీ; యదుకుల కాంభోజి, అనీ పిలువబడుతున్న రాగం) దీనికే చెంచు కాంభోజి అనికూడా వ్యవహారం వుంది. దేసాళం, నారణి (నారాయణి) నారణి దేసాక్షి, మేంచబౌళి, మేసబౌళి, (ఈ రెండు ఒకేరాగపు నామాంతరములేమో) ముఖారివంతు, రాయగౌళ, గీతనాట, బౌళి రామక్రియ.

"వారు వాడిన యితర ప్రసిద్ధ రాగాలలో కొన్ని : కన్నడగౌళ, కన్నడ బంగాళ, కేదారగౌళ, గుండక్రియ, గౌళ, దేవగాంధారి, దేశాక్షి, ధన్యాసి, నాట, నాదనామక్రియ, భలమంజరి, మాళవిగౌళ, మాళవిశ్రీ, రీతిగౌళ, లలిత, వసంతం, వసంతవరాళి, శుద్ధదేశి, శుద్ధరామక్రియ, శుద్ధవసంతం, సావేరి, సాళంగం, సౌరాష్ట్రం; సౌరాష్ట్రగుజ్జరి, హిజ్జిజి, హిందోళ వసంతం, కుంతలవరాళి, ఛాయనాట, దేశి బంగాళం"[1]

## 6.1.1 క్షేత్రయ్య సంగీతం :

అన్నమాచార్యుని తరువాత పదరచనలో సంగీత సాహిత్యాలకు సమాన గౌరవం ఇచ్చి అభినయం జోడించిన పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. క్షేత్రయ్య సంగీతాన్ని గూర్చి వాడిన రాగాలను గూర్చి తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

క్షేత్రయ్య సంగీత విశిష్టతను గూర్చి రజనీకాంతరావు గారిలా వివరించారు. "17వ శ. లో నారాయణ తీర్థులు, రామదాసు, క్షేత్రయ్య ఈ ముగ్గురి చేతులలోను మన సంగీతము మూడు మార్గములను తొక్కినది. నారాయణతీర్థులు కృషితో సంకీర్తనము ప్రధానముగా ఆధ్యాత్మిక బోధకు ఆదర్శముగా ఉంచుకొని శృంగారము ఔపచారికము చేసికొని, ఒక ప్రక్క నాట్యాభినయ యుక్తములైన యక్షగానమునకు ఉపాంగమౌతూ, ఇంకొక ప్రక్క భజన పద్ధతి ప్రాచుర్యానికి

దారితీసింది. రామదాసు కీర్తనలు భక్తిరస పరమావధినిపొంది, పామరజనం కూడ భక్తి మార్గాన సాధన చేయడానికనువైన భజన గోష్ఠుల వ్యాప్తికి కారణ మైనాయి. క్షేత్రయ్య మార్గము శృంగారమును ప్రధానముగా స్వీకరించి ఆధ్యాత్మ బోధ అంతర్గర్భితముగా సాగుతూ నాట్యమునకు, అభినయమునకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. క్షేత్రయ్య మిగిలిన వారికంటె ఒక అడుగు ముందుకు వేసినది ధాతు కల్పనములో. అంటే సంగీత రచనలో; ఇది తరువాతి వాగ్గేయ కారులకెందరికో క్షేత్రయ్యను మార్గదర్శిని చేసింది నేటి కర్ణాటక సంగీతపు రాగాల స్పష్టరూపం కావలెనంటే మనకు తొట్ట తొలుతగా క్షేత్రయ్య పదాలలో దొరుకుతుంది."[2] ఇలాగా సంగీతరచనలో విశిష్టస్థానంగల క్షేత్రయ్య వాడిన రాగాలు అపూర్వం. గిడుగు వారి ప్రతిలో పొందుపరచిన ప్రకారం అత్యధిక పదాల్లో కాంభోజిరాగం వాడబడింది. కాంభోజి-42, భైరవి-40, ముఖారి-27, కల్యాణి-26, సావేరి-17, తోడి, యదుకుల కాంభోజి-16, పంతువరాళి, కేదార గౌళ, ఆనందభైరవి-13, మోహన, మధ్యమావతి, బిలహరి-11, శంకరాభరణం, ఆహిరి, ఘంటారావం-10, పున్నాగవరాళి-9, సౌరాష్ట్రి, ఉసేని-8, బేగడ-6, సురట, నవరోజ, అఠాణా, సైంధవి. సారంగ-5, కన్నడ, ధన్యాసి, ఘంట, అసావేరి, నీలాంబరి-4, కాఫీ-3, నాదనామక్రియ, శ్రీరాగం, మారువ, శహాన-2 పదాలలో వాడబడ్డాయి. వసంతభైరవి, నాగగాంధారి, వరాళి, ఖండె, గౌళిపంతు, ఫరజు, గౌరి, భూపాల, మంగళకైశికి, దర్బారు, పున్నాగ, రేగుప్తి, బేహాగ్, కేదార- అనేరాగాలొక్కొకటి ఒక్కొక్క పదానికి వాడబడ్డాయి. వీటితోపాటు "సింధు పదం, లలిత పంచమం" అనే రెండు ప్రయుక్తమయ్యాయి. మొత్తం మీద 49 రాగాలు క్షేత్రయ్య వాడినట్లు తెలుస్తుంది.[3] విస్సావారు క్షేత్రయ్య 39 రాగాలు వాడినట్లు చూపించారు.[4] అప్పటికి వారికి లభించిన పదాలకు వాడబడిన రాగాలు వారిచ్చారు. క్షేత్రయ్య రాగాల మహాత్వాన్ని గూర్చి చెప్పిన మంచాళవారి మాటలు ఉట్టంకించ దగ్గవి. "క్షేత్రజ్ఞులు నలభై తొమ్మిదో, యాభయ్యో రాగాలనే వాడారు. అందులో కాంభోజి రాగంలో ఎక్కువ పదా లున్నాయి. తరువాత శంకరాభరణం, భైరవి, తోడి, ముఖారి, ధన్యాసి, ఘంటా పున్నాగవరాళి, ఆహిరి అంటే సున్నితములైన స్వర సందర్భాలు, గమక వరి కాదులున్న రాగాలలో మధురమైన భావాలు వ్యక్తీకరించటానికి ఎక్కువ అవకాశం ఉంటుందో ఏమోనని అందుకే ఈ రాగాలు వాడిఉండవచ్చు. ప్రతి

మధ్యరాగాలలో కల్యాణి, వరాళి, సారంగ ఈ మూడు రాగాలే ఎక్కువగా కన బడతాయి. ఇవ్వట్లు ఇక్కడ ఒకముఖ్యమైన సంగతి చెప్పాలి. క్షేత్రజ్ఞుల యాభై రాగాలలోను సుమారు 35పైగా భాషాంగ రాగాలే"[5] క్షేత్రయ్య అపూర్వ రాగాలలో ఆహిరి, గౌరిపంతు, ఘంటారాగాలు లక్షణ కారులు చెప్పిన లక్షణాల కంటే విలక్షణంగాను, సామంతం, ఉసేని, సైంధవి, నవ రోజులు లక్షణాన్వి తంగాను ఉన్నాయనీ, ఖండె, సింధూర తిలక మొదలైన వాటికి లక్షణాలు చెప్పనే లేదనీ మంచాళవారు తెల్పుతున్నారు[6]

### 6.1.3 రామదాసు సంగీతం :

రామదాసు భజన కీర్తనా పరుడన్న సంగతి మనకు తెలుసు.

"ఆహిరి, వరాళి, ధన్యాసి, సౌరాష్ట్రి, యదుకులకాంభోజి, కాంభోజి, సైంధవి, సురటి, నాదనామక్రియ, కళ్యాణి, శంకరాభరణం, పున్నాగవరాళి, పంతువరాళి, గౌళిపంతు, బిళహరి, ముఖారి, సావేరి, అసావేరి, నవరోజు, నీలాంబరి మొదలయిన రాగాలలో రామదాసు కీర్తనలు రచించాడు ప్రాచీన దాక్షిణాత్య రాగాలలో మాత్రమేకాక, కాపీ, కమాసు, దర్బారు, బేగడ, కానడ, యమునా కళ్యాణి వంటి ఉత్తరాదిరాగాలు, రామదాసునాటి గోల్కొండ రాజ్యానికి ఉత్తరాదినుండి వస్తూ పోతూ ఉండే గాయకుల ద్వారా తెలుగుదేశానికి దిగుమతి అయి ఉంటాయి. అకుంఠిత భక్తి దీక్షకలవాడూ, అనర్గళ కవితాధార కలవాడు అయిన రామదాసుకు సంగీతాభినివేశము, అప్రయత్నంగా ఔపచారికంగా వచ్చి నది గాని, ప్రత్యేకముగా అతడు సంగీతవిద్వత్తు కోసం ప్రయత్నించి కృషి చెయ్య లేదని కొందరు నేటి సంగీత విద్వాంసు లనుకొనవచ్చును. అతని కీర్తనలు సంస్కృతాంధ్ర భాషలు రెండింటిలోను కూడా వేర్వేరురాగాలలో త్రిపుట, ఆది, చాపు, రూపక, ఆట, ఏక, జంపె తాళాలలో కనబడుతూవుంటే అతడు సంగీతంలో పాండిత్యం సంపాదించలేదని చెప్పడం సాహసమే. కానీ, అతని సంగీత రచనలను బట్టి, అతని ఆశయం పాండిత్య ప్రకర్ష కాదనీ, సంగీతం అతని భక్తిసాధనకు ఉపకరణ మాత్రమనీ చెప్పాలి. అతని కీర్తన లందుకే సహజ భక్తి భావావేశంలో, తన్మయత్వంలో అప్రయత్నంగా సం కీర్తన భావానుగుణంగా వచ్చిన సరళమైన రచనలు. అందుకే ఒకేసారి అన్ని గొంతుకలు చేరి పాడినా, శ్రావ్యమైన మేళంలో వినిపించే బృందగీతులవి. రక్తికి

భజన గోష్ఠులలో రామదాసు కీర్తనల తర్వాతనే మిగిలినవారి కీర్తనలకు పేరు. ఆంధ్రదేశంలో గ్రామగ్రామమునా వెలసిన ప్రతిరామమందిరంలోనూ నాటినుండి నేటివరకు శ్రీరామనవమి ఉత్సవములలో ఎక్కువగానూ, ఏడాదిలో మిగిలిన నాళ్ళలో నిత్యమూ సాయంకాలాల్లోను శాఖోపశాఖల దీపపు సెమ్మెలను నడుమ నుంచుకొని తంబురా, చిరతలతో తాళజాలములతో కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్న గ్రామీణ భక్త బృందం రామదాసు కీర్తనలను గానంచేస్తూ వుంటారు. పామర జనానికింతగా ప్రమోదదాయకమైన ఈ కీర్తనలలోని సంగీతాన్ని ఆంధ్రులు పునరుద్ధరించుకొని త్యాగరాజు సంగీతంలాగ స్వరనిబద్ధంచేసి, సంగీత సభలకు తీసుకొనిరాకపోతే ఇప్పటికే నష్టపడి లుప్తమైపోతున్న తెలుగుకళలకు మరింత ద్రోహం చేసుకున్న వారమవుతాము."[7]

### 6.1.4 మునిపల్లె సుబ్రహ్మణ్యకవి :

మునిపల్లె సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మరామాయణ కీర్తనల్లో అత్యధిక సంఖ్యలో రాగాలను వాడినట్లు తెలుస్తుంది.

"రామాయణ కీర్తనలు నూటనాలుగింటికి దాదాపు 58 రాగాలు వాడబడ్డాయి. లభించిన క్షేత్రయ్య పదాలలో మున్నూటికి 36 రాగాలే వాడబడ్డాయి. క్షేత్రయ్యనాటి మోహన, ఈ కీర్తన రాగాలలో కనబడదు. అన్నమాచార్యుల నాటి కర్ణాట సారంగ, మంగళ కైశిక, లలిత పంచమం, గౌరి, కన్నడ గౌళ వంటి ప్రాచీనరాగాలలో కీర్తనలున్నాయి. ఇందువల్ల సుబ్రహ్మణ్యకవి క్షేత్రయ్యకు ఇంకా దగ్గరవాడు మాత్రమే కాక కించిత్పూర్వుడు కాగలడా అనికూడ అని పిస్తుంది. ఏమంటే, ఈ రాగాలలో గౌరిని తప్ప మిగిలిన వాటిని వేటినీ క్షేత్రయ్య వాడలేదు. క్షేత్రయ్యనాడే బహుశా ప్రచారంలోకి వచ్చి ఉంటాయని ఇంతవరకూ విద్వాంసు లనుకొంటూవున్న ఉసేనీ, కాపీ, ఆనందభైరవీ సుబ్రహ్మణ్యకవి కూడా వాడాడు మాంజిరాగంలో ఒక కీర్తన అధ్యాత్మంలో ఉంది. గుమ్మకాంభోజి, హిందూఘంటా అనే అపూర్వరాగాలూ, ఆహిరి, రేగుప్తి, భైరవి, ధన్యాసి, కాంభోజి, కన్నడ, గౌళిపంతు, శంకరాభరణం, నాదనామక్రియ, సౌరాష్ట్రి కళ్యాణి, సురటి, పూర్వికళ్యాణి, యదుకులకాంభోజి, ఘంటా, మారువ, నవరోజు, జుజావంతి, పూరి, సారంగ, నాట, ఆరభి, శ్రీ, వసంత, పున్నాగవరాళి, సైంధవి, ముఖారి, బేగడ, బిళహరి, సావేరి, శహన, అఠాణ, ఖరజు, తోడి,

దేవగాంధారి, దేశీయ దేవగాంధారి, కేదారగౌళ–సుబ్రహ్మణ్యకవి వాడిన ఇతర రాగాలలో కొన్ని. వాడిన తాళాలు: త్రిపుట, ఆది, రూపక, ఝంపె, చాపు."8

### 6.1.5 సారంగపాణి సంగీతం :

సారంగపాణి పదాల్లో అక్కడక్కడ పదం పాడడం, ఆడడం, వీణ, కిన్నెర, తంబుర మొదలైన వాద్యాలతోపాటు అనేక రాగాల పేర్లు పేర్కొనడం జరిగింది.

"ఈ సీమల హరిణాక్షులవలె గాదీ మోహనాంగి"

"కన్నతల్లి కరుణించ బ్రోవుమిక"–

–ఈ రెండు పదాల్లోను అనేక రాగాలపేర్లు పేర్కొన్నాడు సారంగపాణి. మోహన, కళ్యాణి, కన్నడ, దరబారు, తోడి, గుజ్జరి, సారంగ, గౌరి, వరాళి, శ్రీ, అసావేరి, భైరవి, పంతువరాళి, ఆనందభైరవి, సురటి, బిలహరి, శంకరాభరణం, మధ్యమావతి,– అనేరాగాల్ని పేర్కొన్నాడు. ఇంతేగాక– 'దాని ప్రాయము పదారేండ్లు నీదాని నేలుకోరా"– ఈ పదంలో స్వర స్థానాల్ని వివరించాడు. సారంగపాణి తన పదాలకు వాడిన రాగాలు మొత్తం 42 అన్నిటికంటె అధికంగా వాడబడిన రాగం పంతువరాళి. ఆ వెనుక గౌళిపంతు, భైరవి, ఆనంద భైరవి, ముఖారి, మోహన, శంకరాభరణం, మధ్యమావతి, రాగాలు. కొంత తక్కువగా కళ్యాణి, సావేరి, సౌరాష్ట్రి, కాపి, తోడి, బిలహరి, ఆరభి, సారంగ, నాదనామక్రియ, పున్నాగవరాళి, బేగడ, హుసేని, కన్నడ, పరజు, నవరోజు, సురటి, కేదారగౌళ, యదుకుల కాంభోజి, అనే అపురూపరాగాలు ప్రయుక్తమయ్యాయి. ఒక్కసారి మాత్రం శుద్ధసావేరి, ఘంటారాగం, నాటకురంజి, గౌరి, అఠాణా, రేగుప్తి, శ్రీ, అహిరి, నీలాంబరి, శహన, ధ్వజావంతి, కర్ణాట సారంగ–రాగాలు వాడబడ్డాయి. అపురూపరాగమైన "అపరూప" అనే రాగాన్ని వాడడం సారంగపాణి విశిష్టత క్షేత్రయ్య 380 పదాల్లో 49 రాగాలు వాడగా, సారంగపాణి 201 పదాల్లో మొత్తం 42 రాగాలు ప్రయోగించాడు.

ఇక సారంగపాణి వాడిన తాళాలు తెలుసుకొందాం సారంగపాణి పదాల్ని సగానికి సగం ఆదితాళంలోనూ, నాల్గోవంతు చాపుతాళంలోనూ, ఒక్కొక్కటి అట, ఏక, ద్విజాతి లఘుపు తాళాల్లోనూ రచించాడు. ఇలాగా సారంగపాణి తన పదాల్లో రాగతాళ ప్రయోగం చేశాడు.

6.1.6 త్యాగరాజు సంగీతం :

త్యాగరాజు పేరు విన్న వెంటనే సంగీతానికి ఆయన చేసినసేవ గుర్తుకు వస్తుంది. అతనితో పాటు శ్యామశాస్త్రులు, ముత్తుస్వామి దీక్షితులు కలసి సంగీత త్రిమూర్తులుగా ప్రఖ్యాతిపొందారు. వీరు ముగ్గురు ధాతు కల్పనా దక్షులు.

"ఒక దక్షిణ భారత సంగీతచరిత్రలోనే కాకుండా, ప్రపంచ సంగీత చరిత్రలోకూడ 1750 నుంచి 1850 వరకూ అత్యంత ప్రధానమైన యుగం. రెండు చరిత్రలలోనూ ఈ యుగాన్ని స్వతంత్ర ధాతుకల్పనా యుగమని తెలుప వచ్చును యూరప్‌లో ఆనాడు బీతోవెన్, మోజార్ట్, మెండల్‌సొన్, షోపైన్ షూబెర్ట్, వీబర్ అను గొప్ప సంగీత కర్తలందరూ వెలిశారు. వారందరూ సోనాటా, సింఫొని ఇత్యాదిగా (ఆర్కెస్ట్రా) వాద్యమేళములపైనీ, ప్రత్యేక వాద్యములపైనీ ప్రయోగింపదగిన సంగీత రచనలను, అపూర్వమైన ధాతుకల్పనా చాతుర్యముతో వెలువరించి యశోధనులైనారు. ఇదేయుగంలో తమ స్వతంత్ర ధాతు కల్పనాత్మకములయిన కీర్తనలతో దక్షిణ భారత సంగీతానికి అఖండ పరి వ్యాప్తిని చేకూర్చిన అవతారమూర్తులయిన వాగ్గేయకారులు త్యాగరాజు, శ్యామ శాస్త్రి,ముత్తుస్వామి దీక్షితులు. కర్ణాటక సంగీత చరిత్రకారులు వీరు మువ్వురిని సంగీత త్రిమూర్తులనీ, రత్నత్రయమనీ పిలుస్తారు.

"ముగ్గురూ తంజావూరు జిల్లాలోని తిరువాయూరుకు సంబంధించిన వారే. సమకాలికులే. వారి రచనలో రాగ స్వరూపము పరిపూర్ణమై సర్వ కళలతోను స్పష్టముగా స్ఫురిస్తూ ఉంటుంది. మృదువైన భాషా శిల్పానికిగాని, నవ్య కల్పనతో నిత్యసుందరమయిన సంగీత శిల్పానికి గాని, ముందు వీరిని స్మరించి మిగిలిన వారిని స్మరించాలి అతి సునాయాసంగా చెప్పిన కీర్తనలూ, ఒకేరాగంలో వేర్వేరు ప్రత్యేక వ్యక్తిత్వాలు కనిపించే వేర్వేరు కీర్తనలూ, ఆ కీర్తనల ఔన్నత్యమూ, వాటి సంగీత రచనలో ఆత్మోత్తేజకమయిన ఉదాత్తతా, ఈ ముగ్గురు మహనీయులకూ సంగీత రత్నత్రయ పదవిని పట్టముగట్టిన ప్రధాన లక్షణములని శ్రీ సాంబమూర్తిగారు తమవాగ్గేయకార చరిత్రలో వ్రాశారు.

"అంతేకాదు ముగ్గురూ వేదశాస్త్ర పురాణవేత్తలు : జ్యోతిశ్శాస్త్ర మంత్ర శాస్త్రాలలో మునిగితేలిన వారు.ముగ్గురి జన్మస్థానమూ తిరువారూరే. ముగ్గురూ

వరప్రసాదులైన కారణ జన్ములే. త్యాగరాజుకు నారదుడూ, దీక్షితులకు చిదంబర నాదయోగీ, శ్యామశాస్త్రిలకు సంగీతస్వామీ ముగ్గురు దేవతాచోదితులైన యోగివర్యుల సంబంధమే ముగ్గురకూ సంగీత రచనా ప్రాదుర్భావ కారణమయింది రామబ్రహ్మపుత్రులలో కనిష్ఠుడు త్యాగరాజు సాహిత్యశైలి ద్రాక్షాపాకముగాను, శ్యామశాస్త్రిలది కదళీపాకముగాను, దీక్షితులది నారికేళ పాకముగాను, సంగీత రచన త్యాగరాజుది గోదావరివలె విస్తృతమై, శ్యామశాస్త్రిలది కృష్ణవలె గంభీరమై, దీక్షితులది ఉభయధోరణులతోను త్రివేణి ప్రవాహమై సాగింది. ఆధునిక సంగీతానికి వీరి రచనల కంటె స్పష్టతరమైన లక్ష్యాలులేవు. దేశంలోని ప్రసిద్ధ క్షేత్రములను, దైవతములను ముగ్గురు సేవించి కీర్తనలు చేశారు. పంచరత్నములు, నవరత్న కృతులు, నవరత్న మాలికలు మున్నగు రచనలు ముగ్గురూ చేశారు. ముగ్గురూ ఆధ్యాత్మిక తత్వవేత్తలు. అంతర్దృష్టి కల యోగిపుంగవులు లోకోజ్జీవన కరులయిన ఉపదేశికులు, ముగ్గురూ ముందుగా తమ మరణ కాలమును తెలిసికొని, ప్రకటించి, ఇచ్ఛా మోక్షమును చెందిన తపస్విద్ధులు. జయదేవ, లీలాశుక, అన్నమాచార్యుల కోవకుజెందిన అవతార మూర్తులు."9

త్యాగరాజు సంగీత శిల్పంలోని ప్రత్యేకత :

"అచ్చయి లభిస్తూన్న ఐదారు వందల కృతులలోను సుమారు 200 రాగాలను త్యాగరాజుగారుపయోగించినట్లు తెలుస్తుంది. ఈయన రచించారని ప్రతీతిలో ఉన్న 72 మేళకర్తరాగ కీర్తనలలోను సుమారు 40 మాత్రమే ప్రచారంలో కనిపిస్తున్నవి.

"త్యాగరాజు శతవార్షికసంచికలో శ్రీమతి కన్నమ్మగారు పరిశోధించి వ్రాసిన కొన్ని అంశములను యిక్కడ ఉద్ధరిస్తాము.

"ఆనాటికే ప్రచారంలో ఉన్న శంకరాభరణం, తోడి, కళ్యాణి, భైరవి, మొదలయిన ఘనరాగములలో ఒక్కొక దానిలో సుమారు 80 కీర్తనల వరకూ దొరికాయి. తరువాతి మెట్టులోని ధన్యాసి, సావేరి, రీతిగౌళ, దర్బారు, కేదారగౌళ, అఠాణా, ఆరభి. దేవగాంధారి, బిలహరి, బేగడ మొదలైన రాగా

లలో పది మొదలు ఇరవై కీర్తనల వరకు రాగానికి ఒకటి కనిపిస్తాయి. లలిత ముల్లై ఛాయ భేదమే ప్రత్యేకముగా కలిగి సున్నిత రాగములయిన నాయకి, సారంగశహన, హంస్వని, జయమనోహరి, శ్రీరంజనీ, నీలాంబరి, బలహంస, యదుకులకాంభోజి మొదలయిన రాగాలలో కూడా ఒక్కొక్కంటికి అయిదారు కృతులు కనిపిస్తున్నాయి.

"ఇవిగాక ఆనాడు ప్రస్తారక్రమంలో నామమాత్రాలుగానే ఉన్నకొన్ని రాగాలకు జీవంయిచ్చి, ప్రచారానికి తెచ్చారు త్యాగయ్య. ముఖ్యంగా ఈ సందర్భంలో ఖరహర ప్రియ, హరికాంభోజి రాగాలను పేర్కొనాలి ఆరోహణా వరోహణ స్వరసంపుటిగా మాత్రం ఉన్న యీ రాగాలను పెంపొందించి యీనాటి రాగవిస్తరణకు పల్లవి వాడుకొనుటకు అనుగుణ్యములుగా చేసినది త్యాగయ్యే. ఈ రాగములలోనే ప్రతిస్వర స్థానమును ఆరంభస్వరంగా తీసుకొని ఆ రాగ క్రమాన్ని, రాగ గతిని నిరూపిస్తూ కృతులు రచించాడు"[10]

పదం లేక సంకీర్తనగా అన్నమాచార్యునితో ఆరంభమై క్షేత్రయ్యలో శృంగార రసఘుటికగామారి, రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవుల రచనల్లో కీర్తనగా రూపుదిద్దుకొని, త్యాగబ్రహ్మలో కృతిగాఎదిగి సంగీత పరిమళాలు వెదజల్లే రాగ పుష్పాలుఎన్నో వెలశాయి తెలుగుదేశంలో. ఇవి కర్ణాటక సంగీతానికి మకుటాయమానమై ప్రసిద్ధిని సంతరించిపెట్టాయి. సంగీతంతోపాటు అభినయాన్ని గూర్చి క్లుప్తంగా తెలుసుకొందాము.

## 6.2 అభినయం :

అభినయం పట్టే పద్ధతి క్షేత్రయ్యతో ఆరంభమైందనే చెప్పాలి. అనాటి నుంచి అది పదాభినయం అయింది. శృంగార పదాభినయం అది వాస్తవానికి క్షేత్రయ్య సమకాలికుడైన కూచిపూడి నివాసి సిద్ధేంద్రయోగి భామాకలాపంతో ప్రారంభమై ఈ అభినయానికి విశిష్టత చేకూరిందని చెప్పడం సముచితం. కాని అంతకుపూర్వం అన్నమాచార్యుని కాలంనుంచే పదాభినయం ఉండంటున్నారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు. "అన్నమయ్యపదాలను వెలుగులోకి తెచ్చిన నాటినుండి శంకరాభరణ రాగంలో అనంత కృష్ణులు సుపరిచితం చేసిన 'అలరులు చరియగ నాడెనదే' అనే ప్రసిద్ధపదం రెండక్షరాల జాగాతోనే పాడాలికదా? ఈ

పల్లవిలోని భావం సిద్ధేంద్రయోగి భామాకలాపంలోని సత్యభామ రంగ ప్రవే శానికి ముందు జరిగే 'జడవట్టు' అనేఘట్టాన్ని స్ఫురింప జేస్తుంది. ఆ తర్వాత చరణంలోని 'అరతెర మరగుననాడె నదే' భామానాట్యంలో తెరను అడుగుభాగం సగంపైకెత్తి చేసేపాదవిన్యాసాన్ని సూచిస్తుంది. ఆ వెనుకవచ్చే అపూర్వ దువాళప్పు తిరుపులు, మట్టపు మలపులు, మద్దెల కెలుపులు, వాగ్గేయకారుని నాట్యప్రయోగ దక్షతను వెల్లడి చేస్తాయి..... వాటిని అన్నమాచార్యుల కాలమునాడే రాజనర్తకులు, దేవదాసీలు రాజులకొలువుల్లోను, దేవరకోవెలల్లోను, నాట్య ప్రయోగం ద్వారా ప్రదర్శించేవారు"[11]

## 6.2.1 క్షేత్రయ్య పదాభినయం :

నటరాజ రామకృష్ణగారు క్షేత్రయ్య పదాభినయాన్ని గూర్చి చెప్పిన వాటిని సంక్షిప్తంగా స్పృశించి ముగించటం సముచితం. అభినయం – ఆహార్యం, వాచికం, ఆంగికం, సాత్వికమూ నని నాలుగు విధాలు. ఆహార్యం :- "ఒక్కొక్క పదములోని భావమునకు, నాయికకు సరిపడినట్లు ఆభరణములు, వస్త్రములు, కేశాలంకారములు, ముఖమునకురంగు, రంగాలంకారము మొదలైన విషయాలలో శ్రద్ధవహించనిచో ఆ నాయికయొక్క వాతావరణమును సృజింప లేము. కనుక ఆహార్యము నాయికాభినయమునందు ముఖ్యము" వాచికం : "పదములను భావపూరితంగా అభినయించుటకు వాచికము చాలముఖ్యము. పాటకుడు పాడునప్పుడు రాగతాళములకే ప్రాధాన్యము యివ్వక, ఆపదములోని భావమునకు తగినట్లు కంఠమును హెచ్చు, తగ్గులు సవరించుచు, ధ్వనిలోని మాధుర్యమును కనబరచుచు, పదములోని భాష ప్రేక్షకులకు అర్థమగునట్లు [Emotional type of music]" పాడవలెను. వీటికంటె గూడా ఆంగిక, సాత్వికాభినయాలు చాలా ప్రధానం. "పదములు కొన్ని అంగిక ప్రధానమైనవిగా నున్నవి." ఆంగిక ప్రధానమైన పదము–

"ఏ తీరున రమణిని గెలిచి నీ – వెట్లు రాపోదువో ?
చూతము రారా! మదన నీ
చేతి బలిమి మా చెలియ బలిమి ॥ఏతీరున॥

ఇందు సాత్త్వికముకన్నా ఆంగిక భావమే (హస్తాభినయమే) ప్రాధాన్యం వహించునని పదము చదివినంతనే తెలియుచున్నది. సర్వోత్తమమైనది పదాభినయంలో సాత్త్వికాభినయమే. "సాత్త్విక ప్రధానమైన పదరచనలు.

"అక్కరో! యెవ్వనివారు సరసుడుగాడని
యాడుకొంటే యాడుకొనేరు"—

ఈ పదాభినయమందు సంచారులయొక్క, అంగికముయొక్క అవసర మెక్కువగా ఉండదు. సాత్త్వికభావము (స్తంభము, స్వేదము, రోమాంచము) మొదలైన వానిపై ఈ నాయిక అభినయమాధారపడి యుండును. "రామ వాని దలచినపుడే"— ఇచ్చట అభినయము ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములతో ప్రారంభమైనను శరీరముయొక్క పొంగును ప్రదర్శించుటకు సాత్త్వికమే శరణ్యము. అట్లే పదమంతయు సాత్త్విక భావములయొక్క ప్రదర్శనపై నాధారపడి యున్నది."

"కేవలము సాత్త్విక సంచారులయొక్క సహాయముతోనే ప్రదర్శించుటకు చక్కని అవకాశమున్న పదములు మరికొన్ని—

"ఎందు దాచుకొందు నిన్ను – ఏమిసేతు నేను ?
అందమైన నీమోము – అయ్యలూ ! ముద్దుగుల్కు చున్నది."—

ఈ పదములో ఎందుదాచుకొందునిన్ను అన్నప్పటికి ఆతురత, అసహాయత, కంగారు మొదలైనవి ప్రదర్శించినపుడును, "అందమైన నీమోము అయ్యలూ ! ముద్దుగుల్కుచున్నది" ఇందుప్రదర్శించునట్టి 'ఆనందమునకు ఆంగికముయొక్క అవసరము ఎంతమాత్రమునుండదు. ఆనందము, ఆతురత, కంగారు నేత్రముల యొక్కగతి ద్వారా ప్రదర్శించును." ఇలాగా అనుభవపూర్వకముగా రామకృష్ణ గారు వివరించారు. ఇంక "శ్రీపతిసుతు బారికి"— అన్నపదానికి, అంతకంటే ముందటివలెనాపై" అన్నపదానికి రామకృష్ణగారు చేసిన అభినయ వ్యాఖ్యానం అనన్యసామాన్యం. ఈ సందర్భంలో "ఇటువంటి వ్యాఖ్యలను వ్రాయు వారు తాము స్వయముగా పాడి అభినయించగల శక్తి సంపన్నులై వుండవలె.... అటువంటిస్థాయికి చెందే రచనగా రూపొందించాలని కృషి సల్పినాను. రచన సాగించి నాకృషి ఫలించిందని ఆశిస్తున్నాను", అన్న వారి మాటల్లో సత్యముంది సంగీత సాహిత్యాభినయాలకు పట్టుగొమ్మలు క్షేత్రయ్య పదాలు. ఆ మహాత్మ్యాన్ని

గూర్చి రామకృష్ణగారిలా పేర్కొన్నారు. "పాట సులభశైలిలో నడవాలి. పదాడంబరముండకూడదు.... భాష భావగర్భితమై యుండవలె; మాటలు తక్కువగా ఉండాలి. రాగములో మిళితమైపోయే రీతిని అక్షరముల కూర్పు వుండవలె. ధ్వని ప్రాధాన్యం కల్గివుండవలె. ఇన్నింటిని ఒప్పించ గల్గిన రచనయే సాత్విక భావ ప్రకటనకు ఉపకరించును. అట్టి వాని యొక్క అభినయమే పండిత జనరంజకం, పామరజన ప్రబోధకముగా నుండి రసభావముల జిప్పిలజేయును. ఇవన్నీ గూడిన రచనచేయగలువాడు, తాను స్వయముగా గాయకుడు, నర్తకుడునై యుండి కావ్యరచన చేయగల్గువాడై యుండవలె. అట్టిమహనీయుడే క్షేత్రయ్య."[12]

6.2.2 సారంగపాణి పదాభినయం :

పదం అనగానే క్షేత్రయ్య గుర్తుకువస్తాడు. పదాభినయం క్షేత్రయ్యసొత్తు. వాటికి వివరణలు వ్రాసిన వారున్నారు. కూచిపూడి వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, దేవులపల్లి వీరరాఘవ మూర్తిగారు, వేదాల తిరువెంగళాచార్యులు గారు, నటరాజ రామకృష్ణగారు. పదాభినయాన్ని గూర్చి రచించిన వారిలోకొందరు. వేదాంతం లక్ష్మీనారాయణగారు, తాండవకృష్ణగారు, నటరాజరామకృష్ణగారు ప్రభృతులు పదాభినయ వేత్తలున్నారు.

కానీ సారంగపాణి పదాభినయం ఈనాడు చేసేవారు లేరనే చెప్పవచ్చు. ఈ పదాలు అభినయం పట్టిన వారుకూడా వుండే వుంటారనవలసివుంది. ఇందుకు నిదర్శనాలున్నాయి. పదమనగానే అభినయోద్దిష్ట మన్న విషయం మనం మరవరాదు. కాబట్టి సంగీత సాహిత్యాలతోపాటు అభినయానికి ప్రాధాన్యం ఇవ్వబడడం మూలాన్నే పదరచన చేయడం జరిగింది. లేకపోతే పదరచన చేయవలసిన పనిలేదని అర్థం. ఈ విషయంలో బాలాంత్రపు రజనీకాంతరావుగారి మాటల్ని ఉల్లేఖించడంతప్ప మార్గాంతరంలేదు. సారంగపాణి సమకాలికులు కార్వేటినగర ఆస్థానంలో ఉండిన వాగ్గేయకారులు ఇంకా యిద్దరు గోవిందసామయ్య, అతని తమ్ముడు కూవనసామయ్య. "కార్వేటినగరాన్ని అప్పుడు ఏలుతూండిన మాకరాజు వేంకట పెరుమాళ్ళాజు ఇతనిని (గోవింద సామయ్యను) బహూకరించి సన్మానించాడు. ఒకసారి రాజు వెంకటగిరి వారి కుమార్తె అయిన తన రాణిపైన కోపించి ఆమెను కాపురానికి తెచ్చుకోక బాధపెట్టినట్లు గోవిందసామికి తెలిసిందట. బహుశా గోవిందసామి స్వస్థలం వెంకటగిరియే యేమో. గోవిందసామి రాజుకు తెలియకుండా

వెంకటగిరికి వెళ్ళి ఆమెకు సంగీతమూ నాట్యమునేర్పి పురుషవేషం వేయించి రాజు గారి ఎదుట ఆమె సంగీత నాట్యములను ప్రదర్శింపజేసి, రాజు మెప్పుపొంది తిరిగి ఆమెను స్వీకరించు కొనేటట్లు చేసినాడట. మోహన రాగంలో "సరిగా దాని" అని స్వర సాహిత్యం వచ్చునట్లు రచించిన పదవర్ణం ఈసందర్భంలో పాడినదే కావచ్చును. ఇంకా అతడు కేదారగౌళ, నవరోజు, ముఖారి రాగాలలో పద వర్ణాలు రచించాడు. ఇవన్నీ నృత్యాభినయానికి ఎంతోఅనుకూలమైన జాతి భేదాలనుకలిగి వుంటాయి." "సారంగపాణి క్షేత్రయ్యవలే భరతశాస్త్ర లక్షణానికి ఉదాహృతులుగా పదాలు రచించడమే కాకుండా గోవింద సామయ్యవలే ఇతరు లకు వేషాలువేసి నాట్యాభినయాలలో శిక్షణ ఇచ్చి పదాలను నాట్యాభినయ యుక్తంగా ప్రదర్శింపజేశారట. అంతేకాదు తానుకూడా ఒకసారి స్త్రీ వేషంవేసి సభాధ్యక్షుడైన రాజునే గాక సభాసదులయిన తనమిత్రులను కూడా నిజమైన స్త్రీ మూర్తిగా నమ్మించినాడట"[13] కాబట్టి క్షేత్రయ్య పదాల లాగానే సారంగపాణి పదాలు గూడా అభినయానుకూల్యమై ఉన్నాయని, ఈనాడు విరివిగా అభినయం పట్టకపోయినా, ఒకనాడు సారంగపాణి పదాలు అభినయం పట్టేవారని స్పష్ట మౌతుంది.

ఇంతేగాక పదకవుల పదాలు, జావళీలు, సల్లాములు మొదలైన వాటిని అభినయించినప్పుడే వాటికి ప్రాణప్రతిష్ఠ. లేనిపక్షంలో వాటికి న్యాయం చేకూర్చడం కష్టం.

ఇలాగ పదకవుల సంగీతాభినయాలు మనకు స్పష్టమవుతున్నాయి.

# సూచికలు


1. బాలాంత్రపు రజనీకాంతరావు : ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము–పు–137–149
2 బాలాంత్రపు రజనీకాంతరావు : క్షేత్రయ్య పదసాహిత్యము : సాహిత్యోపన్యాసములు–3, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి–పు–61
3. మంచాళ జగన్నాథరావు : నాట్యకళ– జనవరి 1973. పు–52
4. విస్సా అప్పారావు : క్షేత్రయ్య పదములు– పు–65
5. పై 3 సూచికలోనిదే
6. పైదే. పు–51, 52
7. పై 1. సూచికలోనిదే. పు–202
8. పైదే. పు–251
9. పైదే. పు-314, 315
10 పైదే. పు–331, 332
11. The Brochure on Annamacharya–sept, 1981–AIR VIJAYAWADA – పు-21
12. నాట్యకళ : నవంబరు, డిశంబరు 1967, మార్చి 1968
13. పై 1 సూచికలోనిదే. పు–126–137

# 7.0 పదకవుల-సేవ

పదకవులు చేసిన సేవ అమూల్యమైనది. పద్య కవిత పండితులకు మాత్రమే పరిమితమై వుండగా పామరుల కోసం పద రచన చేసినవారు పద కవులు. జానపద సాహిత్యాన్ని పండితులు పరిగ్రహించ నందున, దానికి నిబద్ధతను చేకూర్చి, అనిబద్ధతను తొలగించి, చివరికి పండితులకు సైతం కను విప్పుకలిగించి వారిమెప్పుకు పాత్రమయ్యేట్లు చేసిన వారు పదకవులు. ఆవిధంగా పండితులకేగాక పామరులకుసైతం సాహిత్యానందాన్ని పంచిపెట్టిన వారు పద కవులు.

కేవలం సాహిత్యమే అయితే ప్రజలకు దగ్గరగా వెళ్ళదు. కనుకనే పదాల్ని పట్టుకొన్నారు పదకవులు. పామరులు ఆడి పాడుకొనే పదాన్నే స్వీక రించి, దాన్ని నానా రీతుల ముస్తాబు చేశారు. దానిలోని గీతి ప్రాధాన్యమే మామూలు ప్రజల హృదయాలను అలరించింది. ఆకట్టుకొంది. అంటే ధాతు మాతు సమ్మేళనమే దాని ప్రాధాన్యం. అంతేగాదు సంగీత ప్రాధాన్యం అంద రికీ తెలిసిందే.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్ ।
ఏక మాపాతమధురం అన్య దాలోచనామృతమ్॥"

"పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ" — అనిగదా ఆభాణకాలు।

పదాల్లోని భాషసరళమై తెలుగు నుడికారాలు, పలుకుబళ్లు, సామెతలు మొద లైన వాటి సొంపులతో. సొగసులతో ఆనంద నిష్యంది కావడం మరో విశేషం.

సంగీత సాహిత్యాలకు అభినయం జోడించి శ్రుతిపేయమై వుండడంతో పాటు, చక్షురింద్రియానికి సైతం విందుచేసి హృదయాల్లోదాన్ని యిబ్బడిగ, ముబ్బడిగా చేయడం ఈపదకవుల సేవకు మరోనిదర్శనం.

కొన్నిపదాలు శృంగార రసఘుటికలైతే, మరికొన్ని అధ్యాత్మ, భక్తి వైరాగ్య ప్రధానాలై అత్యుత్తమ నీతిబోధకమై ఒప్పుతూ వచ్చాయి. సర్వ ప్రజానీకానికి హాయిని, ఆనందాన్ని, పారలౌకిక చింతనని ప్రసాదించాయి.

అన్నమాచార్యునిలోని శృంగారం క్షేత్రయ్యలోను, ఆధ్యాత్మిక తత్త్వం త్యాగయ్యలోను ఫలించింది. అంతేగాదు భక్తి భావనాత్మకమై ఆధ్యాత్మికతత్త్వం రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగయ్యలలో సంపూర్ణత్వం చెందింది. ఇందులోని భాగమైన వైరాగ్యతత్త్వం వీరబ్రహ్మం మొదలైన తత్త్వకర్తల్లో మరో విధంగా పల్లవించి అదో శాఖగా బలపడింది. అనంతముఖాలైన అన్నమాచార్యుల పదాల్లోని శృంగారం, మధురభక్తితో క్షేత్రయ్యలో సంపూర్ణత్వం, వాస్తవ శృంగారరీతి సారంగపాణిలో స్పష్టరూపం దాల్చి, తక్కిన పదకర్తల పదాల్లోను, జావళీలలోను మరింత శారీరక శృంగారరూపం ధరించిందని చెప్పవచ్చు.

ఏది ఏమైన వీటన్నింటి అంతర్యం ఒక్కటే. భక్తి వైరాగ్యాలు వీటిలో అంతర్లీనమై మానవాళి మనుగడకు, తరణోపాయానికి వుపకరిస్తూనే వచ్చాయి.

ఇలాగా పరివ్యాప్తమైన ఈ పరిశీలనలో పదకవిత పుట్టు పూర్వోత్తరాలు, పదకవుల చరిత్ర, వారిసేవ మొదలైనవి ఒక్కొక్కటి ప్రత్యేకమైన కొన్ని సంపుటాలుగా వెలువరించ వలసిన అవసరముందని స్పష్టమవుతుంది. ఆసక్తిగల పరిశోధకులు ప్రయత్నిస్తారనీ, వారికి అండదండగా నిలచి, ప్రభుత్వమూ, సాహిత్య సంస్థలు సహాయ సహకారాలు అందిస్తాయని ఆశిస్తున్నాను.



# ఉపయుక్త గ్రంథాలు

తెలుగు గ్రంథాలు :


1. అక్షరార్చన : డా. పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తిసమ్మాన సంచిక.
2. అనంత కృష్ణశర్మ, రాళ్ళపల్లి : వేమన-1945
3. ,, : సారస్వతావలోకనము-1956
4. అప్పారావు, పోణంగి, శ్రీరామ : నాట్యశాస్త్రము-1959
5. ,, : తెలుగునాటక వికాసము-1967
6. అప్పారావు, విస్సా : క్షేత్రయ్యపదములు-1950
7. ,, : వ్యాసావళి-1956
8. ,, : నృత్య, సంగీత వ్యాసరత్నావళి 1966
9. ఆరుద్ర : సమగ్ర ఆంధ్రసాహిత్యం-సం. 6, 10, 11
10. ఆంధ్రగాన కళాపరిషత్ : రాజమండ్రి : త్యాగరాజు కీర్తనలు-1948
11. ,, : సారంగపాణిపదాలు
12. ఆంధ్ర చంద్రాలోకము
13. ఆంధ్ర పత్రిక-1940-65
14. ఆంధ్రప్రభ-
15. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక-1922-38
16. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ : సాహిత్యోపన్యాసములు-
క్షేత్రయ్య పదసాహిత్యము-1963
17. ,, : దక్షిణ భారత సాహిత్యములు-1962
18. , : సారస్వత వ్యాసములు-సం. 1-1969
19. ,, : ,, సం 3-1969
20. ,, : ,, సం. 4-1971

21. ఆంధ్రసారస్వత పరిషత్తు : తెలుగులో పదకవిత-1973

22. ఏకాంబరేశ్వరరావు : క్షేత్రయ్య-నవల 1771

23. కిన్నెర – 1949-54

24. కుమారస్వామి, బి : క్షేత్రయ్యపదములు-స్వరసాహిత్యములు-1968

25, గురుబాల ప్రబోధిక-1953

26. గోపాలకృష్ణయ్య, వడ్లమూడి : శృంగారపదాలు-1982

27. ,, ,, : శ్రీ గీత గోవిందము,
: శ్రీ గీత శంకరము-1942

28. ,, ,, : జాను తెనుగు-1972

29. గోపాలస్వామి, కూర్మా, వేణు, : తెలుగు వాఙ్మయము-సంగ్రహ చరిత్ర
1960

30. జగన్నాథరావు, మంచాళ : స్వరకల్పన-క్షేత్రయ్య పదములు
[ఆం. గా. ప] 1954

31. ,, : క్షేత్రయ్య పదములు [ఆం. సం. నా. అ]

32. జోగారావు. యస్వీ : ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర 1961

33 తిరుమలయ్య, తాళ్లపాక, చిన ; సంకీర్తన లక్షణము-1935

34. ధర్మారావు, తాపీ : సాహిత్య మొర్మొరాలు-1971

34 A నన్నెచోడుడు : కుమారసంభవము-1968

35. నరసయ్య, కుందుర్తి, వేంకట : నవవిధ భక్తులు-1962

36. నరసింహం, కాకర్ల, వేంకటరామ : దక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర-
1955

37. నాగేశ్వరరావు, కాశీనాథుని : ఆంధ్రవాఙ్మయ సూచిక-1926

38. నాట్యకళ : 1967, '68, '73, '74

39. నారాయణాచార్యులు, పుట్టపర్తి ; ప్రబంధనాయికలు 1944

40 నారాయణరెడ్డి, సి ; ఆధునికాంధ్ర కవిత్వము

41. పోతన : శ్రీ మదాంధ్ర మహాభాగవతము–సప్తమ, దశమస్కంధాలు-1968

42 ప్రభాకరశాస్త్రి, వేటూరి : తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర-1914

43. ,, : చాటుపద్య మణిమంజరి-1922

44. ,, : మీగడ తఱకలు-1951

45. ,, : సింహావలోకనము

46. ,, : అన్నమాచార్య చరిత్ర పీఠిక–1966

47. ,, : సుభద్రా కల్యాణము

48. బాపిరాజు, అడవి : నారాయణరావు (నవల) 1967

49. భద్రాచల రామదాసు చరిత్ర

50. భారతి–1949, '64–'73

51. మాణిక్య మొదలారి ప్రతి–క్షేత్రయ్య పదములు-1886.

52. యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ షష్ట్యబ్ద పూర్తి సమ్మానసంచిక-1966

53. రజనీ కాంతరావు, బాలాంత్రపు : ఆంధ్రవాగ్గేయ చరిత్రము-1958.

54. రామకృష్ణ, నటరాజు; ఆంధ్రులు–నాట్యకళ.

55. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని; ఆంధ్ర నాటకరంగ చరిత్ర-1969

56. రామానుజరావు, దేవులపల్లి - సారస్వత నవనీతము.

57. రామరాజు, బిరుదురాజు; తెలుగు జానపదగేయ సాహిత్యము-1958

58. రామరాజ భూషణుడు; వసుచరిత్ర-1954

59. రామసుబ్బయ్య, మట్టిబోయిన : బ్రహ్మజిజ్ఞాస : 1969

60. లక్ష్మీకాంతం, పింగళి : పల్నాటి వీరచరిత్ర-1961

61. ,, : గౌతమ వ్యాసములు-1966

62. ,, : సాహిత్య శిల్పసమీక్ష-1966

63. ,, : ద్విపద భారతము

64. లక్ష్మీరంజనం, ఖండవల్లి : ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము 1965

65. వరదాచార్యులు, ధనకుధరం : ఆళ్వారుల దివ్య ప్రబంధములు

66. వసుంధర, మల్లాది : తంజావూరు పతనము.

67. వావిళ్ళప్రతి : క్షేత్రయ్య పదాలు-1950

68. విజ్ఞాన సర్వస్వము : తెలుగు సంస్కృతి-సంపుటి 3-1959

69. వేంకటకవి, చేమకూర : విజయ విలాసము-1966

70. వేంకటరమణయ్య, నేలటూరి : మధుర తంజావూరి నాయక రాజులనాటి దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్ర

71. వేంకటరమణయ్య, నేలటూరి : వాఙ్మయ వ్యాసమంజరి-1967

72 వేంకటావధాని, దివాకర్ల : ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము-1967

73. ,, : సాహిత్య సోపానాలు-1970

74 ,, : ప్రాఙ్నన్నయ యుగము

75 వేంకటేశ్వరరావు, కాటూరి : మువ్వగోపాల నాటిక-1961

76. వేంకటరావు, నిడదవోలు : రాజగోపాల విలాసము

77. ,, : దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము-1960

78. ,, : ఉదాహరణ వాఙ్మయ చరిత్ర-1968

79. శేషయ్య, చాగంటి : ఆంధ్రకవి తరంగిణీ-సం. 6, 7, 8, 1961

80. శ్రీనాథుడు : క్రీడాభిరామము-1953

81. ,, : భీమ ఖండము-1958

82. శ్రీనివాస చక్రవర్తి ; క్షేత్రయ్యపదాలు -1966

83. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము-సం. - 3

84 సత్యవతి, కొక్కొండ : తంజాపురాంధ్ర సాహిత్యచరిత్ర-1965

85. సత్యనారాయణ, యండమూరి 'శ్రీవాత్సవ' : శారదాధ్వజము-1965

86 సాహిత్య వాల్లభ్యము ; ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన సంపుటి-1968

87. సీతారామయ్య, కురుగంటి : తంజావూరు ఆంధ్రనాయక రాజులచరిత్ర-1932

88. సీతాపతి, గిడుగు : క్షేత్రయ్య పదములు-1952
89. సీతారామరావు, తుమ్మలపల్లి : దక్షిణదేశములో నాట్యము -1956
90. సీతారామాచార్యులు, బహుజనపల్లి, శబ్దరత్నాకరము-1956
91. సుందరం ఆర్. వి. ఎస్. : తెలుగుసాహిత్యంలో దేశికవిత-1956
92. సుబ్బరామ దీక్షితులు, సంగీత సంప్రదాయ ప్రదర్శిని- 1973,
ప్రథమ ముద్రణ-1904
93. సుబ్రహ్మణ్యకవి, మునిపల్లె : అధ్యాత్మ రామాయణ కీర్తనలు-1962
94. సూర్యనారాయణ మూర్తి, జోస్యుల : క్షేత్రయ్య-1968
95. ,, ; అన్నమయ్య ,,
96. ,, : త్యాగయ్య ,,
97. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం : కావ్యాలంకార సంగ్రహము-1959
98. సోమనాథుడు, పాల్కురికి : బసవపురాణము-1952
99. ,, : పండితారాధ్య చరిత్రము.
100. సోమశేఖరశర్మ, మల్లంపల్లి : రఘునాథ నాయకాభ్యుదయము
101. స్రవంతి-1958
102 హనుమంతరావు, పిల్లలమర్రి, వేంకట : సాహిత్యసమాలోచనము-1946
103. అన్నమాచార్యుడు, తాళ్ళపాక : అధ్యాత్మ సంకీర్తనలు Vol. I, II, V-X
104. ,, శృంగార సంకీర్తనలు-
Vol. III, IV, XII, XXIII, XXIV-XXVI,
105. పెద తిరుమలాచార్యుడు, తాళ్ళపాక, శృంగార సంకీర్తనలు,
Vol. XXIII '76
106. అన్నమాచార్యుడు, తాళ్ళపాక, శృంగార సంకీర్తనలు Vol XXIV 1977
107. శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి (కూర్పు) అన్నమాచార్యుల సంకీర్తనలు
1977
108. చిన తిరుమల వేంగళనాథుడు, తాళ్లపాక : శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల
జీవిత చరిత్రము-1978

109. డా॥ వేటూరి ఆనందమూర్తి : తాళ్లపాక కవుల కృతులు-వివిధ సాహితీ ప్రక్రియలు Part - I-'74

110. ,, : తాళ్ళపాక కవుల పదకవితలు భాషాప్రయోగ విశేషాలు-Part II-'76

111. ,, తొలిసంకీర్తన కవులు-1975

112. కల్లూరి వీరభద్రశాస్త్రి (సం.) : త్యాగరాజకీర్తనలు-విశేష వివరణము Part I-1975

113. ,, : త్యాగరాజ కీర్తనలు-విశేష వివరణము Part II-1978

114. టి. వి. సుబ్బారావు (సం) ; త్యాగరాజ కీర్తనలు-1954

115. భావరాజు నరసింహారావు (సంకలనం) ; శ్రీ త్యాగరాజ కీర్తనలు Vol I-1981

116. ,, (సంకలనం) : శ్రీ త్యాగరాజ కీర్తనలు Vol. II-1981

టి. ఎస్. పార్థసారథి

117. తిరుపతి అనంత పద్మనాభరావు : సద్గురు త్యాగరాజు 1979

118. తిరుమూరు సుధాకరరెడ్డి : నాదయోగి త్యాగయ్య 1987

119. మంచాళ జగన్నాథరావు (సం) : రామదాసు కీర్తనలు, 1975

120. రామదాసు చరిత్రము 1979

121. పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు : భక్తకవి పుంగవులు 1981

122. డా. ఎస్. గంగప్ప : క్షేత్రయ్య పద సాహిత్యం 1974

123. ,, : సారంగపాణి పద సాహిత్యం 1980

124. ,, : తెలుగుదేశపు జానపద గీతాలు 1976

125. ,, : క్షేత్రయ్య

126. ,, : పురందరదాసు

127. కె. అప్పణాచార్య, వేదవ్యాస-శ్రీరంగరాజ సుదర్శన్ భట్టాచార్య : శ్రీవ్యాసరాయలు 1980

128. వడ్డాది వీరరాజు సిద్ధాంతి : శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర 1975

129. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ : వేమన-1945

130. ,, : సారస్వతావలోకనము-1965

131. ధనకుదరం వరదాచార్యులు (సం) : శ్రీ రామానుజకీర్తి కౌముది-మొదటి భాగము-1972

132 ,, : రెండవభాగము-1981

133. మంగళంపల్లి సూర్యనారాయణ : సప్తస్వరాలు 1971

134. డా॥ చల్లా రాధాకృష్ణశర్మ : తెలుగు దాక్షిణాత్య సాహిత్యాలు-1975

135. శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞానతత్వములు 1965

136. మంగళగిరి ప్రమీలాదేవి : తెలుగు పద్య గేయ నాటికలు 1974

137. ,, : భారతీకళా తరంగిణి-1982

138. శేషము వేంకటపతి-శశాంక విజయము-1971

139. కృష్ణమాచార్య ప్రణీతము-సింహగిరివచనములు-1980

140. సాహిత్యోపన్యాసములు-XI వసుచరిత్ర-సంగీత సాహిత్యములు - 1974

141. ఆంధ్రపత్రిక-స్వర్ణోత్సవసంచిక-19‌65

142. ఆచార్య తూమాటిదోణప్ప : తెలుగు హరికథా సర్వస్వం-1988

143. ,, : భాషాచారిత్రక వ్యాసావళి-1972

144. ప్రొ. ఎమ్ వి. రామశర్మ : క్షేత్రయ్య-1979

సంస్కృత గ్రంథాలు :

145. జయదేవుడు : గీతగోవిందము

146. నారాయణ తీర్థులు_కృష్ణలీలా తరంగిణి

147. భగవద్గీత-1967

149 లీలాశుకుడు - శ్రీకృష్ణ కర్ణామృతము

150. శార్ఙ్గదేవుడు - సంగీత రత్నాకరము

ఆంగ్ల గ్రంథాలు :

151. An Alphabetical Index of Telugu Manuscripts in the Oriental Manuscripts Library, Madras - 1932.

162. Annals of Oriental Research, University of Madras - 1941

153. Aurobindo : The Foundations of Indian Culture

154. A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjore Surphoji's Saraswati Mahal Library - 1933

155. Goswamy, Bhagavat Kumar - Bhakti cult in Ancient India - 1922

156. Goswamy, O. - The story of Indian Music - 1961

157. Journal of Andhra Hirtorical Research Society, Rajahmundry -

158. Journal of the Music Academy of Madras - 1955-'68

159. Journal of Venkateswara Oriental Research Institute, Tirupati - 1950

160. Prof. K. V. Ramaswamy Ayyangar Commemoration Volume - 1940

161. List of Villages of Madras Presidency - 1924

162. Moulton, R.G : Methods and Materials of Literary Criticism.

163 Moulton, R. G. : The Modern Study of Literature - 1913

164. Proceedings of Indian Philosophical Congress – 1953

165. Rangaswamy Ayyangar Commemoration Volume – 1949

166. Raghavan, V : The Great Integrators – Saint singers of India – 1966

167. Srinivasachari, C.S. : History of Gingi and its rulers.

168. Sitapati, G.V. : History of Telugu Literature – 1968

169. Sambamurthy, P. : South Indian Mnsic - Parts 1, 2. 3, 4 1935

170. Syamasastry and other famous figures of South Indian Music – 1934

171. Vridhagirisan, V : The Nayaks of Tanjore – 1942

172. Varadachari, K.C. : Alwars of South India

173. Bhakti cult in South India – 1957

174. Dr. M.V. Krishna Rao : Purandra and The Haridasa Movement – 1966

175. Prof. M V. Rama Sarma : The Bliss of Life – 1979

176. Balantrapu Rajanikantha Rao : Kshetrayya – 1981

కన్నడ గ్రంథాలు :

177. ప్రబుద్ధ కర్ణాటక : 1952, 1964-1965

178. బేలూరు కేశవదాసరు : శ్రీ కర్ణాటక భక్తవిజయ-1963

179. ,, : శ్రీ హరిదాస సాహిత్య–1980

180. హరిహర ప్రియ : కన్నడ తెలుగు సాహిత్యవినిమయ-1980

181. ఎం. మరియప్ప భట్ట : సంక్షిప్త కన్నడ సాహిత్యచరిత్రె 1960

182. పురందర దాసర పదగళు-1979

183. పురందర దాసర పదగళు-1958

184. శ్రీ పురందర దాసర కీర్తనగళు-1956

185. శ్రీ పురందర దాసర కీర్తనగళు మత్తు త్యాగరాజ కృతిగళు-1954

186. వి. సీతారామయ్య ; శ్రీ పురందర దాసరు-1971

187. భక్త కనక దాసర పదగళు (చరిత్ర సహిత)-1976


హిందీ గ్రంథాలు :


188. రామస్వార్థచౌధరి : మధుర రస్_స్వరూప్ ఔర్ వికాస్

189. విద్యాపతి పదావళీ_ఏక్ అధ్యయన్

190. డా॥ ఎస్. గంగప్ప,<br>
అనువాదం :<br>
కుమారి మంగళగిరి ప్రమీలాదేవి, ఎం.ఏ., ఎం.ఫిల్.<br>
డా॥ టి ఎన్. మురళీకృష్ణమ్మ<br>
} సారంగపాణికా పద సాహిత్య

# సవరణలు :

| ఉన్నది | ఉండవలసింది | పుట | పంక్తి |
|---|---|---|---|
| పాడిబడే | పాదబడే | 8 | 13 |
| meading | meaning | 16 | 35 |
| soug | song | 19 | 13 |
| జన్మస్థాన యొక్కటియే | జన్మస్థాన మొక్కటియే | 21 | 5 |
| భక్తి పారవశ్యరలో | భక్తి పారవశ్యంలో | 22 | 22 |
| consummase | consummate | 24 | 2 |
| (క్రీ॥ శ॥ 50) | (క్రీ॥ శ॥ 1150) | 28 | 27 |
| ఖిలయైపోగా | ఖిలమైపోగా | 29 | 22 |
| పాలూరికి | పాల్కురికి | 44 | 17 |
| నవచనసైక | వచనరచనైక | 52 | 21 |
| చిన్న | చిన్నన్న | 55 | 22 |
| ఏకోటీ | ఏకోజీ | 87 | 24 |
| ఉపనిద్రహ్మయోగి | ఉపనిషద్రహ్మయోగి | 98 | 5 |
| పఠనశాయశే | పఠనశాయపే | 116 | 10 |
| విచ్చేయనమ్మా | విచ్చేయవమ్మా | 142 | 1 |
| ఆలంకారాలు | అలంకారాలు | 166 | 22 |
| 6.1.1 | 6.1.2 | 251 | 17 |
| 7.0 పదకవుల–సేవ | 7.0 పదకవుల సేవ | 264 | 1 |



# ఇతర రచనలు

అచ్చయినవి - విమర్శలు :

కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య సమాలోచనము (పిహెచ్.డి. గ్రంథం)

క్షేత్రయ్య పదసాహిత్యం (ఆ. ప్ర. సాహిత్య అకాడమి అవార్డు పొందిన గ్రంథం]

సారంగపాణి పదసాహిత్యం [తి. తి. దేవస్థానం ఆర్థిక సహాయంతో ప్రకటితం)

ప్రసంగ సాహితి [రేడియో ప్రసంగ వ్యాసాలు]

తెలుగు దేశపు జానపద గీతాలు [ఆం ప్ర సమాచార, పౌరసంబంధ శాఖ ప్రచురణ)

కోలాచలం శ్రీనివాసరావు [ఆం.ప్ర. సంగీత నాటక అకాడమీ ప్రచురణ]

సాహిత్యోపన్యాసములు ఉన్నవ లక్ష్మినారాయణ శతజయంతి ప్రసంగం (ఆం ప్ర సాహిత్య అకాడమి ప్రచురణ)

సాహిత్యసుధ [వ్యాససంపుటి]

జానపద గేయరామాయణం [రామాయణ గేయాల సంపుటి]

సారంగపాణికా పదసాహిత్య [హిందీ అనువాదం)



తెలుగు వాగ్గేయ కారులు [హైదరాబాదు యువ భారతి ప్రచురణ)

చిన్నపుస్తకాలు :

క్షేత్రయ్య [ఆం. ప్ర సమాచార పౌరసంబంధశాఖ ప్రచురణ) పురందరదాసు [తి. తి. దేవస్థానము ప్రచురణ] నాగార్జునుడు (తి తి దేవస్థానము ప్రచురణ)

పాఠ్యపుస్తకాలు :

కమర్షియల్ ప్రాక్టీస్, సెక్రెటేరియల్ కోర్సు భాగాలు I, II (ఇంటర్మీడియేట్ పాఠ్యపుస్తకం) తెలుగు అకాడమి ప్రచురణ

8వ 9వ తరగతి ఉపవాచకములు [ఆం. ప్ర ప్రభుత్వ ప్రచురణలు]

కవితలు :

బాల గేయాలు, నవోదయం (కవితలు)

నవలలు : సుహాసిని హాసం (సాంఘికం)

రాజరాజప్రశస్తి (చారిత్రికం)

ముద్రణలో : 10వతరగతి ఉపవాచకము (ఆం. ప్ర. ప్రభుత్వ ప్రచురణ)

జానపదగేయాలు [జానపదగేయసంకలనం

జానపద సాహిత్యసుధ (వ్యాససంపుటి)

నాటకసాహిత్యసుధ [వ్యాససంపుటి]

విశ్వనాథవారి నాటకాలు-విశ్లేషణ [విమర్శనాత్మక గ్రంథం]

గురుపూజ [వయోజన విద్య]



COVER PAGE
PRINTED AT SRI BALANJANEYA
PRINTING WORKS MANGALAGIRI